# భాగవత విషసర్పం
## దేవతల రహస్యాలు

రేగులపాటి కిషన్‌రావు

సోల్ డిస్ట్రిబ్యూటర్సు :




న్యూస్టూడెంట్సుబుక్‌సెంటర్
ఏలూరురోడ్, విజయవాడ-2
ఫోన్సు: 74677 * 62222

అమ్మకూ
నాన్నకూ
ప్రేమతో
సమర్పితం.

# రంగనాయకమ్మ గారి

## అభిప్రాయం

కిషన్‌రావు గారికి...

మీ 'విషసర్పం' చదివాను.

పుస్తకం మొత్తంగా 'నాస్తిక దృక్పథం' తో వుంది. వర్గాలూ, దోపిడీ అనే మాటలు మీరు వాడినప్పటికీ వర్గ దోపిడీకి సాహిత్యానికీ వున్న లింకని మీరు స్పష్టంగా వివరించలేరు. ఫ్యూడల్ సమాజంలో ఫ్యూడల్ దోపిడీ వర్గాలకు అనుకూలమైన సాహిత్యం పుట్టుకొచ్చింది. కావ్యాలూ, పురాణాలూ అన్నీ అలాంటివే. ఒక వేపు ఫ్యూడల్ సమాజంలో ప్రకృతి జ్ఞానం అతి తక్కువగా వుంటుంది రెండో వేపు ఫ్యూడల్ నీతులు దోచుకోబడే వర్గాల్నీ, స్త్రీలనీ అణచి పెట్టి వుంచుతాయి. ఈ ఎనాలిసిస్ లేకుండా కేవలం నాస్తిక దృక్పథంతో ఆర్గ్యూ చేస్తే అది ఫ్యూడల్ సాహిత్యం మీద సరైన విమర్శ అవదు. మీరు రచనలో చాలాసార్లు "రేగులపాటి కిషన్‌రావూ!..." అంటూ సంబోధించుకోవడం స్వంత పొగడ్తగా వుంటుంది గానీ హాంబుల్‌గా వుండదు.

మీ పుస్తకాన్ని నేను మెచ్చుకోనందుకు మీరు నన్ను అపార్థం చేసుకోవచ్చు. నా జడ్జిమెంట్ కన్నా పాఠకుల జడ్జిమెంట్ చాలా విలువైనది. వీలైనంత తొందరలో పాఠకుల ముందు మీ పుస్తకాన్ని వుంచుతారు కదా? వారి అభిప్రాయాలు సేకరించండి.

హైదరాబాద్-44

తేది 17-10-79

రంగనాయకమ్మ

# కొంచెం ఆగండి!

రంగనాయకమ్మ గారి రామాయణ విషవృక్షం-1 చదివిన తర్వాత నాకు భాగవత విషసర్పం వ్రాయాలన్న కాంక్ష కలిగింది.

రామాయణ విషవృక్షం వ్రాసేనాటికి రంగనాయకమ్మ గారికి రచయిత్రిగా చాలా అనుభవం వుంది, ప్రతిభవుంది, శాస్త్రీయ అవగాహన వుంది. ఆ ప్రతిభావంతురాలు రాసిన రామాయణ విషవృక్షం చదువగా కలిగిన అపారమైన ఉత్సాహంతో, కొద్దిపాటి అనుభవంతో వ్రాసిన ఈ పుస్తకాన్ని రంగనాయకమ్మ గారి అభిప్రాయం కోసమే ఎందుకు పంపాను? రచయిత్రిగా రంగనాయకమ్మ లాంటి ప్రతిభావంతుల మెప్పు పొందగలిగే ఉన్నతస్థాయిలోకి ఎదగాలనీ, అలా ఎదగడానికి ఉపకరించే అభిప్రాయాలు వారు అందిస్తారనీ

రంగనాయకమ్మ గారు చాలాకాలం నుండి చాలా నవలలు వ్రాసి ఉత్తమ రచయిత్రిగా ప్రసిద్ధిపొందారు. తర్వాత కాలంలో మరో మెట్టెక్కి మార్క్సిజం దృక్పథంతో రామాయణ విషవృక్షం రాశారు. అదే దృక్పథంతో వారు అంతకుపూర్వం వ్రాసిన బలిపీఠం, రచయిత్రి మొదలగు నవలలకు ముందుమాటలు (అభిప్రాయాలు) వ్రాసుకున్నారు. ఆ నవలలలో తాను చేసిన పొరపాట్లను విమర్శించుకున్నారు. ఆ నవలలలో తాను వ్రాసిన తప్పుడు అభిప్రాయాలను ఖండించుకున్నారు. ఆ ముందు మాటలు చాలా విజ్ఞానదాయకంగా ఆసక్తిదాయకంగా వున్నాయి. అందుకే నాపుస్తకానికి రంగనాయకమ్మ గారి అభిప్రాయం కోరాను. అదే విధంగా నా పుస్తకానికి అభిప్రాయం వ్రాస్తారని ఆశించాను.

ఆశించిన విధంగా అభిప్రాయం సమగ్రంగా వ్రాయక పోయినా, సంక్షిప్తంగానైనా వ్రాసినందుకు సంతోషిస్తున్నాను. అపార్థం చేసుకోకుండా కృతజ్ఞతలు అర్పించుకొంటున్నాను. వారి జడ్జిమెంట్ విలువైనదిగా భావిస్తున్నాను

పుస్తకములో జరిగిన పొరపాటును క్రింద ఇస్తున్నాను.

198వ పేజీలో 12వ లైనులో—చంపబడ్డావు. తర్వాత ఇలా వుండాలి.— శూర్పణఖను అమానుషంగా అవమానించిన రాముణ్ణి, కసాయివానికంటె హీనంగా శూర్పణఖ ముక్కు-చెవులు కోసిన లక్ష్మణుణ్ణి చంపే శక్తిసామర్థ్యాలు నీకు లేనందుకు విచారిస్తున్నాను —

మన సాహిత్యంలో ప్రతిభావంతులు మెచ్చుకునే స్థాయిలో వున్న రచనలు చాలా తక్కువ. అందులో శాస్త్రీయ దృక్పథంతో వ్రాయబడిన పుస్తకాలు మరీ తక్కువ.

శాస్త్రీయ దృక్పథంతో వ్రాసే కొత్త రచయి (త్రు) తల పుస్తకాలు, శాస్త్రీయ అవగాహనలో ప్రతిభావంతులైన రచయి (త్రు) తల మెప్పును సంపాదించుకునే స్థాయిలో సాధారణంగా వుండవు. వాటిలో ఏవో పొరపాట్లు జరుగుతూ వుంటాయి. అయితే ప్రతిభావంతులు ఆ పొరపాట్లు ఏవో ఎత్తిచూపిస్తే ఆ రచయిత తర్వాత చేసే రచనల్లో చాలా జాగ్రత్తలు తీసుకొని మంచి రచనలు చేయగల అవకాశము టుంది.

ప్రతిభావంతులైన పాఠకుల నుండి శాస్త్రీయ దృక్పథం గల అభిప్రాయాలను ఆహ్వానిస్తున్నాను. ఇక ముందుకు సాగండి.

**రేగులపాటి కిషన్‌రావు**

తేది 25-10-79

# దేవతల రహస్యాలు

దేవుడెలా పుట్టాడు?

దేవుడనే భావం అనాది మానవుని ఊహ. మానవుని అజ్ఞానమే దేవుడనే భావంగా ఏర్పడింది.

మొదట్లో నీడను, ఆహార పదార్థాలను అందించే చెట్టు గొప్పదని భావించి పూజించాడు అదే వృక్ష దేవత

విషసర్పాలకు నిలయమైన పుట్టను చూచి భయపడ్డాడు. అందుకే పుట్టను పూజించాడు. అంటే దానిలో నివసించే విషసర్పాన్ని పూజించాడన్నమాట. పామును నాగ దేవతగా భావించాడు

వాన, మెరుపులు, ఉరుములు మొదలగువాని యథార్థ జ్ఞానం తెలియక అనాది మానవుడు భయపడ్డాడు. బలవంతులైన తనలాంటి మనుషులే మేఘాల్లో కూర్చుండి మెరుపులు, ఉరుములు సృష్టిస్తున్నారని, వర్షం కురిపిస్తున్నారని అనుకున్నాడు. ఈవిషయంలో వాన దేవుడనేభావం ఏర్పరచుకున్నాడు.

వాన. మెరుపు, ఉరుములను ఆపే శక్తి మానవునికి లేనందున మేఘాల్లో మనుషులున్నారనీ, వారు తనకంటే బలవంతులనీ భావించి తనకు కష్ట నష్టములు కలిగించవద్దని ప్రార్థించాడు-పూజించాడు

ఈ విధంగా మానవుడు అజ్ఞానదశలో దేవుడనే భావం ఏర్పరచుకున్నాడు. మానవుని అజ్ఞానం వల్ల ఏర్పడిన భావమే–దేవుడు.

గాలి, అగ్ని, సూర్యుడు, చంద్రుడు మొదలగు వానిని దేవుళ్ళుగా భావించి మానవుడు వాటిని పూజించాడు.

ఒక్కొక్క దేవునికి ఒక్కొక్క స్వరూపం ఊహించాడు.

కలరా, మశూచి రావడానికి కారణాలు తెలియక కలరా దేవత కోపించడం వల్ల కలరా రోగం, మశూచి దేవత కోపించడం వల్ల మశూచి రోగం వస్తుందని మానవుడు ఊహించాడు. మానవుడు అజ్ఞానంతో ఏర్పరచుకున్న దేవతలే కలరా దేవత, మశూచి దేవత ఇలాంటి అనేక దేవతలు. ఇలా ఒక్కో దేవతకు ఒక్కో ఆకారం ఊహించి భయంతోనూ, మూఢవిశ్వాసంతోనూ ప్రార్థించాడు, పూజించాడు

దేవతల వలన, దయ్యాల వలన రోగాలు వస్తాయని-దేవతలకు జంతువులను బలి ఇవ్వడం వలన, మొక్కడం వలన అవి తొలగిపోతాయని ప్రజలలో ఒక మూఢ నమ్మకం వుండేది. వైద్యం వలన రోగాలు నయమవుతాయని ఈనాడు చాలా మందికి తెలిసిపోయింది. మశూచి దేవత, కలరా దేవత ఇంకా ఇలాంటి అనేక దేవతల ప్రాముఖ్యత తగ్గిపోయింది. విజ్ఞానాభివృద్ధి జరిగిన కొలది దేవతలు అసత్యమని ఋజువవుతూవుంది.

మశూచి అంటే అదొక వ్యాధి అని ఈరోజున తెలిసినా కొందరు ఒక వైపు వైద్యంచేయించుకొంటూనే మూఢ నమ్మకంతో మరొక వైపు దేవతలను కొలుస్తున్నారు—ఇప్పటికీ దేవతల పేరిట జాతరలు జరుగుతున్నాయి.

వేదాలలోనూ, పురాణాలలోనూ, ఇంకా అనేక పురాతన గ్రంథాలలోనూ ఇలాంటి దేవతల గురించి, వారినిపూజించే విధానం గురించి వివరించబడింది

అనాది కాలం నుండి మానవుడు తనకు తెలియని దానిని అర్థం చేసుకోవడానికి ప్రయత్నిస్తూనే వున్నాడు. తన జ్ఞానమునకు అంతు పట్టని విషయాలను దేవుళ్లుగా భావించి పూజిస్తూనే వున్నాడు మానవుని విజ్ఞానం పెరిగిన కొలది దేవుని రూపం, గుణం మారుతూ వచ్చాయి

మానవుడు దేవుణ్ని పుట్టించడానికి కారణాలు.

విజ్ఞానం అభివృద్ధి చెందుతున్న తరుణ లో దైవభావం ఉప

యోగ పడిన విధానం కొంత తెలుసుకుందాం.

మానవుడు సంఘజీవి. సంఘజీవితమునకు అలవాటు పడిన మానవుడు తన అవసరాలను నలుగురి సహాయంతో తీర్చుకోవడం, తాను నలుగురికి సహాయం చేయడం అవసరమైంది. సంఘములో నున్న ప్రతి వ్యక్తి తోటి వ్యక్తికి కష్టనష్టములు కలుగకుండా వ్యవహరించాలి కదా! ఆసందర్భములో ఏవోకొన్ని భయభక్తులు లేక పోతే నీతివుండదని భావించి దైవభావాన్ని ఆధారంగా తీసుకున్నారు

నీతి పరులను దైవము రక్షిస్తాడనియూ, అవినీతి పరులను దైవము శిక్షిస్తాడనియూ ఒక సిద్ధాంతము తయారుచేసి ప్రచారం చేయడం వలన ప్రజలు నీతివంతులుగా వుండడం జరిగింది. ఈవిధంగా దైవ విశ్వాసం కొన్నాళ్లు ఉపయోగపడింది

అవినీతి పరులను దేవుడు శిక్షిస్తాడనే భయంవల్ల కొందరు నీతిగా వుండవచ్చు. కాని దేవుడనేవాడు నిజంగా లేడు కనుక అవినీతి తల యెత్తింది.

దైవము సర్వము అయితే అంతా దైవసంకల్పమవుతుంది.

దేవుడు అవినీతి పరులను శిక్షిస్తాడని చెప్పినదానికి, అంతా దైవసంకల్పం అనడానికి పొత్తుకుదురదు. అంతా దైవసంకల్పమయినప్పుడు అనినీతి కూడా దైవసంకల్పమే అనవలసివస్తుంది కదా! అయితే మానవుడు సజ్జనుడు కావడానికైనా, దుర్మార్గుడు కావడానికైనా దేవుడేకారణమా?

ప్రతివ్యక్తి బాధ్యతాయుతంగా పనులు చేస్తేనే సమాజంలో నీతి వుంటుంది. కాని కొందరు బాధ్యతా రహితంగా ప్రవర్తిస్తూ తోటివాణ్ణి దోపిడీచేస్తూ—దేవుని దయవలన ధన ధాన్యాలను సంపాదిస్తున్నాము, సర్వసౌఖ్యాలు అనుభవిస్తున్నాము, అని చెప్పుకోవడం జరుగుతుంది—అవినీతిపనులు చేస్తూ దైవభావంతో తమను తాము సమర్థించుకోవడం కాదా ఇది?

దైవ విశ్వాసం వల్ల ఏర్పడిన ప్రవర్తనను మతం అంటారు

మొట్టమొదట మానవులందరూ దైవం వున్నాడనీ, అతడు

అవినీతిపరులను శిక్షిస్తాడనీ నమ్మడంవలన మతం నీతివంతంగా వుండేది. ప్రజలందరికీ శాంతి సౌఖ్యాలు లభించేవి

వాన, గాలి, మెరుపు, ఉరుము మొదలగునవి దేవతలనే నమ్మకం తగ్గిపోతూ వుంటే ప్రజలు అవినీతిగా ప్రవర్తించడానికి జంకలేదు.

అప్పుడు మత రక్షకులు దేవుడు ఒక్కడేఅని, అతడు ప్రేమ మూర్తి అని, న్యాయమూర్తి అని, ధర్మమూర్తి అని, సర్వవ్యాప్తి అని, సర్వ సృష్టికర్త అని దేవుని నిర్వచనాలను రకరకాలుగా మారుస్తూ వచ్చారు.

ప్రజలలో దైవభావం రక్షించడానికి స్వర్గనరకాలు, పాప పుణ్యాలు అనేవి ఊహించి మతరక్షకులు ప్రజలలో ప్రచారంచేశారు.

దైవాన్ని కొందరు నమ్మడం, కొందరు నమ్మకపోవడం వలన అవినీతి మానవ సమాజంలో ఎలా ప్రవేశించిందో తెలుసుకుందాం.

దేవునికి ఎన్నిరూపాలు ఇచ్చినా, ఎన్నినిర్వచనాలు ఇచ్చినా, దైవమున్నాడని ప్రజలలో కొందరు నమ్మలేకపోయారు. దైవము అసత్యం కనుక ప్రజలకు నమ్మకం కలుగలేదు. దైవాన్ని నమ్మని వారిలో కొందరు స్వార్థబుద్ధితో అవినీతిపనులు చేయడం మొదలు పెట్టారు. తర్వాత దైవాన్ని నమ్మినవారు కూడా అవినీతి పనులు చేయడానికి జంకలేదు.

ప్రజలలో దైవవిశ్వాసం తగ్గిపోతూవుంటే సమాజంలో నీతిని నిలబెట్టడానికి మరొక ఆధారం కావలసి వచ్చింది. అదే ప్రభుత్వం.

ప్రభుత్వం ప్రారంభమైన మొదటి రోజుల్లో మతనాయకుడే ప్రభుత్వాధికారిగా వుండేవాడు, తర్వాత కాలంలో రాజు ప్రభుత్వాధికారి అయ్యాడు ప్రభుత్వంలో నీతిని పోషించడం కంటే అవినీతిని శిక్షించడం ఎక్కువుగా వుండేది.

నీతికి స్వర్గం, అవినీతికి నరకం వెళ్ళవలసివస్తుందని మత నమ్మకం, ఇది మతపెద్దలు ఊహించి ప్రజలను నీతివంతులుగా వుంచుటకుగాను ప్రచారం చేయబడింది.

మతపెద్దలకు, రాజులకు స్వర్గనరకములు అసత్యమని తెలుసు. ఎందుకంటే అవి వారు ఊహించి ప్రచారం చేసినవి కనుక, వారిలో దైవవిశ్వాసం కూడా తగ్గిపోయింది. వారిని శిక్షించడానికి పైన ఎవ్వరూ లేరు. కనుక మతపెద్దలు, రాజులు అవినీతిగా ప్రవర్తించుటకు వెనుదీయలేదు. సామాన్య ప్రజలు నీతితో ప్రవర్తించుట వలన, మతపెద్దలు రాజులు అవినీతిగా ప్రవర్తించుట వలన సమాజంలో దోపిడీ విధానం ప్రవేశించింది. మానవులలో ఎక్కువ తక్కువలు ఏర్పడ్డాయి.

మతపెద్దలు, రాజులు, వారి ఆశ్రితజనులు—కష్టపడి పనిచేయకుండానే—కష్టపడి పనిచేసేవారి శ్రమశక్తిని దోచుకొని—సుఖమనుభవించారు.

మతాధికారులు, ప్రభుత్వాధికారులు సమాజంలో అధికారులుగా చలామణి అయ్యారు.

వారు తమ అధికారాన్ని దుర్వినియోగం చేయడం వలన, వారి నిరంకుశత్వం క్రింద సామాన్య ప్రజలు అణగద్రొక్కబడి, దోపిడీ చేయబడి—బానిసత్వంలోనూ, దారిద్ర్యంలోనూ పడిపోయారు.

దైవ నమ్మకం వలన సామాన్య ప్రజలు—ఇది మా కర్మ, దేవుడు మమ్మల్నిలా పుట్టించాడు, పూర్వజన్మలో పాపం చేయడం వలన ఈ జన్మలో ఈ కష్టాలు వచ్చాయి, ఈ జన్మలోనైనా పుణ్యం చేసుకుంటే వచ్చేజన్మలోనైనా సుఖపడవచ్చు-అనుకుంటూరు.

మతాధికారులు, ప్రభుత్వాధికారులు వారి ఆశ్రిత జనులు తమను ఏవిధంగా దోపిడీ చేస్తున్నారో సామాన్య ప్రజలు తెలుసుకోనంతవరకు, అవినీతి పరులమీద, దోపిడీదారులమీద, అసత్యం మీద, అన్యాయం మీద వారు తిరుగుబాటు చేయ ప్రయత్నించరు.

దేవుడు, కర్మసిద్ధాంతము, స్వర్గనరకాలు మొదలగునవి అసత్యం.. అసత్యం మీద ఆధారపడిన విషయాలు ఎంత ప్రచారం చేయబడినా అవి అసత్యాలని చివరికి రుజువు కాక తప్పదు

ఆస్తిక నాగరికత వలన నీతిమంతులు కష్టపడడం, అవినీతి

పరులు సుఖపడడం జరుగుచున్నది.

ఆస్తిక నాగరికతలో దోపిడీ, దొంగతనం, మోసం, లంచగొండి తనం, దౌర్జన్యం, నియంతృత్వం పెరిగిపోవుచున్నవి. ఇవి సర్వమానవ సౌఖ్యానికి అటంకాలు కల్పిస్తున్నాయి.

దోపిడీ విధానం మోసం వలన కొనసాగుచున్నది.

దోపిడీ విధానాన్ని ప్రతిఘటించి నీతిని స్థాపించడానికి ప్రయత్నాలు జరిగినప్పుడు సర్వ మానవులు సుఖపడడానికి అవకాశం లభిస్తుంది.

ఆచరణలోవున్న ఆస్తికత్వాన్ని వ్యతిరేకించడంవలన రష్యా, చైనా దేశాలలోవున్న దోపిడీ విధానం తొలగిపోయింది. ఆచరణలో వున్న ఆస్తికత్వాన్ని వ్యతిరేకించడం వల్లనే హిందూదేశం స్వాతంత్ర్యం సంపాదించగలిగినది, ఈ జానిసత్వం మా పూర్వ జన్మకర్మ ఫలమని కూర్చుంటే భారతీయులకు స్వాతంత్ర్యం వచ్చేది కాదు.

నీతిస్థాపకులని—నేటి సమాజంలో—చలామణియగుచున్న బుద్ధుడు, జీసస్, మహమ్మద్, లెనిన్, గాంధీ మొదలగువారు, వారు జీవించివున్న కాలంలో నాస్తికులుగానో, మత వ్యతిరేకులుగానో ప్రచారం చేయబడ్డారు, నిందించబడ్డారు, శిక్షించబడ్డారు.

మానవునిలోని జానిస గుణమే ఆస్తికత్వం. జానిస ఎల్లప్పుడూ ఇతరులకు లొంగివుంటాడు. ఆస్తికుడు తన కష్టసుఖములకు కారణమును దైవమునకు, పూర్వజన్మకర్మ ఫలమునకు అంటగడుతాడు.

మానవుడు ఆస్తిక బుద్ధితో సర్వం దైవాధీనం అన్నప్పటికీ తన జీవిత అవసరాలకు, సౌఖ్య సంపాదనకు ప్రయత్నం కొనసాగిస్తున్నాడు. సౌఖ్య సంపాదనకు చేసే ప్రయత్నానికి, సర్వం దైవాధీనం అనే నమ్మకకు వైరుధ్యం వుంది.

శక్తి సామర్థ్యాలలోనూ, ఆకలిదప్పులలోనూ, అవసరాలలోనూ మానవులందరూ సాధారణంగా సమానులే. కాని ప్రజలలో చాలామంది కర్మసిద్ధాంతాన్ని నమ్మడం చేత కొందరు దోపిడీ చేస్తున్నారు కొందరు దోపిడీ చేయబడుతున్నారు. దోపిడీ చేసేవారు

ధనవంతులుగానూ, దోపిడీ చేయబడేవారు నిరుపేదలుగానూ వుంటు న్నారు. కర్మసిద్ధాంతం మీద నమ్మకం తొలగిపోతే మానవుల మధ్య వున్న ఎక్కువ తక్కువలను సమర్థించుటకు అవకాశముండదు. అందరూ సమానత్వంతో జీవించడానికి ప్రయత్నం చేస్తారు, అప్పుడు దోపిడీ చేసేవారు, దోపిడీ చేయబడేవారు వుండరు.

సమానత్వం స్థాపించుటకు సరియైననీతులు, సరియైన సిద్ధాంతాలు ప్రచారంలోనికి వచ్చిననాడు—పాతనీతులకు, పాతసిద్ధాంతాలకు విలువ వుండదు—సమానత్వం సిద్ధిస్తుంది.

మానవులు స్వతంత్రులుగానూ, సమానత్వంతోనూ జీవించాలంటే కర్మసిద్ధాంతం, దైవవిశ్వాసం పనికిరావు

పూజలు, నైవేద్యాలు స్వీకరించి దేవుడు ప్రతిఫలం ఇస్తాడని చాలామంది విశ్వసిస్తారు కాని నమస్కారాలు, పూజలు, నైవేద్యాలు స్వీకరించి ప్రతిఫలాలు ఇచ్చే దైవాన్ని ఆలోచనా పరులెవ్వరూ సమర్థించలేరు.

రాజకీయ రంగములో కూడా రాజు దైవాంశ సంభూతుడని అనాదికాలంలో ప్రజలు నమ్మేవారు. దైవనమ్మిక వలన రాజకీయ రంగములో శాంతి, సామరస్యం, అభివృద్ధి సాధించడం జరుగలేదు. రాజులు సాధారణంగా నిరంకుశులుగా పరిపాలించేవారు. సమాజంలో దోపిడీ విధానం కొనసాగుతూ వుండేది. అందువలన ప్రజలలో ఆర్థిక, సాంఘిక అసమానతలు ప్రబలి కొందరు సర్వ సౌఖ్యాలు అనుభవిస్తుండగా కొందరు దారిద్ర్యంతో, అవమానంతో జీవిస్తుండేవారు

దైవాంశసంభూతుడని పేర్కొనబడ్డ రాజును ప్రభుత్వాధికారం నుండి తొలగించి ప్రజాస్వామిక ప్రభుత్వ విధానం ఆచరణలోనికి వచ్చిన తర్వాతనే ప్రెంచి ప్రజలు కొంతలో కొంత సుఖపడడానికి అవకాశం లభించింది.

రెండు వందల సంవత్సరములకు పూర్వము ప్రజాస్వామికాన్ని మొట్టమొదట ప్రవేశపెట్టిన ఫ్రెంచి విప్లవం నాస్తిక ఉద్యమంగా ఆకాలంలో అనుకోవడం జరిగింది. ఆర్థిక సమానత్వం సాధిం

చుటకై కొన్ని సంవత్సరాల క్రితం రష్యాలో వచ్చిన ఉద్యమాన్ని కూడా నాస్తిక ఉద్యమంగా పేర్కొనబడింది.

దైవేచ్ఛ ననుసరించి ప్రజలకు కష్టసుఖాలు కలుగుతుంటాయని వారు నమ్మి వుంటే వారు సమానత్వం సాధించేవారు కాదు.

"దైవేచ్ఛ ననుసరించి కొందరు ధనికులుగానూ, కొందరు నిరుపేదలుగానూ ఉండుట జరుగదు. దోపిడీ విధానం వల్లనే సంఘములో ఎక్కువ తక్కువలున్నవి ఈ అసమానతలను తొలగించాలంటే దోపిడీ విధానాన్ని అరికట్టాలి'' అని వారు గ్రహించి తగిన ప్రయత్నం చేశారు కనుకనే వారు సమానత్వం సాధించ గలిగారు.

దైవేచ్ఛ అసత్యం, ప్రయత్నం సత్యం

ప్రజా ప్రభుత్వాలను గురించి కొంత తెలుసుకుందాం.

ప్రపంచములోని చాలా ప్రభుత్వాలు పేరుకు ప్రజాస్వామికాలైనా పార్టీస్వామికాలుగానే పరిపాలన చేస్తున్నాయి. ప్రజాప్రతినిధులు తమ కర్తవ్యమును విస్మరించి తమ స్వార్థములను తాము చూసుకొంటున్నారు. సామాన్య ప్రజలు తమ కష్టనష్టములకు కారణం పూర్వ జన్మ కర్మ ఫలమని ఇప్పటికీ నమ్ముతున్నారు. పాలకులు న్యాయబుద్ధితో, సమతాభావంతో పరిపాలించిన నాడు తమకీ కష్టములుండవని వారు తెలుసుకోవడం లేదు. తమ కష్టములు నివారించుకోవడానికి తగిన ప్రయత్నం చేయాలని వారు గ్రహించాలి.

ప్రజాస్వామ్య దేశాలని చెప్పబడే అనేక దేశాలలో బలవంతుల నియంతృత్వం క్రింద బలహీనులు నలిగిపోతున్నారు. ఆర్థిక సమానత్వం వుంది అని చెప్పబడే అనేక దేశాలలో అవకాశాలు చాలాకొద్ది మంది చేతుల్లో వున్నాయి. వారి యిష్టాయిష్టాల మీద ఇతరుల జీవితాలు ఆధారపడి వున్నాయి.

ప్రభుత్వ పరిపాలనకు ఉద్యోగుల సిబ్బంది, సైనికబలం, జైళ్లు, జరిమానాలు మొదలగు శిక్షాధికారాలు తమ చేతుల్లో వుండుట చేత పెట్టుబడి దారులు కోట్లాది ప్రజలను తమ చెప్పుచేతుల్లో వుంచుకొంటున్నారు. ప్రజలు ఆర్థిక, సాంఘిక, రాజకీయ దోపిడికి గురయ్యే

బానిసలుగా బ్రతుకుతూ అనేక అవమానాలు భరిస్తూ జీవిస్తున్నారు.

ఈ అవమానాలు తొలగి పోవాలంటే కర్మసిద్ధాంతాన్ని నమ్మడం మానుకొని సమానత్వం సాధించడానికి కృషిచెయ్యాలి.

ఇచ్చట మార్క్స్ గురించి, మార్క్స్ సిద్ధాంతాన్ని గురించి కొంత వివరిస్తాను.

జర్మనీ దేశములో 1818లో మార్క్స్ జన్మించాడు. అతడు పేద ప్రజల కష్టాలకు కారణం యోచించాడు. దారిద్ర్య నిర్మూల నకై ఆయన కొన్ని సిద్ధాంతాలు తయారు చేశాడు అతని సిద్ధాంతాలు విప్లవ భావాలతో కూడినవి. అవి ఆనాటి ధనిక తత్వ ప్రభుత్వాలకు ఆందోళన కలిగించాయి జర్మనీ ప్రభుత్వం అతనిని దేశం నుండి బహిష్కరించింది. తర్వాత అతడు ఫ్రాన్సు దేశానికి వెళ్ళాడు. అక్కడి ధనికులు కూడా అతనిని తమ దేశం నుండి వెళ్లగొట్టారు ఆ తర్వాత అతడు బెల్జియం వెళ్లాడు. ఆ దేశస్థులు కూడా అతనిని తమ దేశం నుండి వెళ్లగొట్టారు. అతడు 1845లో ఇంగ్లాండు వెళ్ళి చని పోయే వరకు అనగా 1883 వరకు అక్కడే తన జీవితాన్ని గడిపాడు

మార్క్స్ సిద్ధాంతములో 'అదనపు విలువ' అను విషయము ముఖ్యమైనది.

వ్యక్తిగత ఆస్తివున్న దేశంలో పెట్టుబడిదారు అదనపు విలువ అనుభవిస్తున్నాడు,

ఉదాహరణకు.- ఒక మిల్లుయజమాని తన మిల్లులో తానే పని చేసినట్లయితే తన పని వలన ఉత్పత్తి అయిన ఫలితమ తా తానే అనుభవించవచ్చును. ఇందులో దోపిడీ విధానం లేదు. కాని మిల్లు యజమాని కొందరు కూలీలను వినియోగించి వారు ఉత్పత్తి చేసిన వస్తువు విలువలో కొంత భాగం వారికి కూలీ క్రింద ఇచ్చి మిగిలిన భాగాన్ని మిల్లు యజమాని తీసుకొంటున్నాడు. కూలీల శ్రమ వల్ల వచ్చిన ఫలితంలో నుండి యజమాని తీసుకునేభాగాన్ని అదనపు విలువ అంటారు.

వస్తువుల ఉత్పత్తికి ఉత్పత్తిసాధనం, మానవుని శ్రమ రెండూ అవసరమే. కాని ఇందులో ఉత్పత్తి సాధనము యొక్క యజమాని

కూలీల శ్రమ ఫలితాన్ని దోచుకొని అంతకంతకు ధనవంతుడవుతూ వుంటాడు కాయకష్టం చేసే కూలీలు దోపిడీ చేయబడి అంతకంతకు నిరుపేదలుగా మారుతుంటారు.

పేదరికం పోయి సమసమాజం రావాలంటే వ్యక్తిగత ఆస్తి లేకుండా పోవాలి. ఉత్పత్తి సాధనాలు, ఆస్తులన్నీ జాతీయం కావాలి ఇటువంటి ప్రయత్నానికి ఆర్థిక సమానత్వం కోరువారంతా పూనుకుంటారు. ఇటువంటి ఆర్థిక మార్పుకై పూనుకొను వారికి ఈ మార్పును నిరాకరించి ప్రస్తుత ఆర్థిక అసమానతలను నిలుపగోరు వారు వ్యతిరేకులవుతారు.

దోపిడీని అరికట్టి ఆర్థిక సమానత్వం సాధించాలంటే మార్క్సు సూచించిన అదనపు విలువ నిర్మూలన సిద్ధాంతాన్ని ఆచరించడం తప్ప మరోమార్గం లేదు

మార్క్సు సిద్ధాంతాన్ని ఆచరణలో పెట్టి లెనిన్ రష్యాలోనూ, మావో చైనాలోనూ అనేక మార్పులు తీసుకొనివచ్చారు.

వ్యక్తిగత ఆస్తులను సంఘపరము చేయుటకు దోపిడీ చేయబడే వారంతా కృషి చేయాలి.

పూర్వకాలంలో నాస్తికులు –

పూర్వం చార్వాకుడు హేతువాదంతో మనదేశంలో ప్రచారంలోవున్న కర్మసిద్ధాంతాన్ని ఖండించాడు. దేవుడు, స్వర్గనరకాలు మోక్షం అనుభవాలన్నీ అసత్యమనీ, యజ్ఞయాగాదులు మూఢ ప్రజలను దోపిడీ చేయుట కొఱకు స్వార్థపరులైన అర్చకులచేత నిర్మింపబడినవనీ చార్వాకుడు స్పష్టంగా చెప్పేశాడు.

యజ్ఞపశువు స్వర్గం చేరినట్లయితే, స్వర్గం వెళ్ళాలన్న ఉద్దేశముతో యజ్ఞంచేసేవాడు, తన్ను తాను బలి ఇచ్చుకుంటే సరిపోతుంది. కాని స్వర్గం అసత్యం, యజ్ఞపశువు స్వర్గం వెళ్ళడం అసత్యం. అమాయక ప్రజలను తప్పుదారి పట్టించి వాళ్ళను దోపిడీ చేయుటకు స్వార్థపరులు వేసిన ఎత్తు ఇది.

చచ్చిపోయిన వారికి శ్రాద్ధపిండాలు పెడితే అవి వారికి చేరి

నట్లయితే, పర గ్రామంలో వున్నవారికి ఇంటి వద్ద అన్నం పెడితే అందాలికదా! అలా అందుతుందా? లేదే! కనుక ఈ సిద్ధాంతం అసత్యం. పిండాలు పెట్టే సమయములో బ్రాహ్మణులకు కొంత ధనం, ధాన్యం లభిస్తాయి కనుక ఈ సిద్ధాంతాన్ని వారు సమర్థిస్తారు. శ్రాద్ధాల పేరిట బ్రాహ్మణులు అమాయక ప్రజలను దోపిడీ చేస్తుంటారు.

పూర్వం బ్రాహ్మణాధిక్యత అధికంగా వుండేది. నాస్తికత్వం ప్రచారంలోకి వస్తే తమ దోపిడీవిధానం కొనసాగదని గ్రహించి వారు చార్వాకుడు ప్రవేశపెట్టిన నాస్తికత్వాన్ని అణచి వేయడానికి అనేక విధాల ప్రయత్నించారు. వారు నాస్తికత్వాన్ని తిట్టేవారు. నాస్తికులతో మాట్లాడేవారు కాదు.

శ్రీరాముని కాలంలో జాబాలి కూడా నాస్తికభావాలు కల వాడే కాని, ఆనాడు నాస్తికులు రాజదండనకు గురి అవుతూ ఉండడం వలన, అతడు నాస్తిక ప్రచారం కొనసాగించలేదు.

350 సంవత్సరాలకు పూర్వం బ్రూనో అను వైజ్ఞానికుడు సూర్యుడు కూడా ఒక నక్షత్రమని గ్రహించి వెల్లడించాడు. అప్పుడు ఇటలీలోని మతగురువులు మత న్యాయస్థానంలో అతనిని విచారించి నేరస్థుడని తీర్పుచెప్పి నిప్పుల్లో కాల్చి చంపవలెనని శిక్షవిధించి అమలు జరిపారు.

సంఘ సంస్కరణకు మహాపురుషులు చేసిన పని:—

దేవుళ్ల యందలి మూఢవిశ్వాసాల వలన అనేక మంది కష్టాలకు గురి అవుతున్నారని బుద్ధుడు, జీసస్, మహమ్మద్ గ్రహించారు. మూఢవిశ్వాసాలు నశిస్తే ప్రజలు సుఖపడడానికి, నీతిగా బ్రతకడానికి వీలుంటుందని భావించి ప్రవక్తలు ఆయా సంఘాచారాలను, దేవుళ్లను ఖండించారు. ప్రజలు ఆరాధిస్తున్న దేవుళ్లు పూర్తిగా అబద్ధమని చెప్పారు. కాని నాటి విజ్ఞానాన్ని బట్టి దేవుడను భావాన్ని పూర్తిగా తొలగించ లేకపోయారు.

ఈ ప్రవక్తలు ఆనాడు అమలులోవున్న దైవవిశ్వాసాన్ని

ధిక్కరించి నూతన మతములు నెలకొల్పారు. అందుచేతనే వారు, వారి అనుయాయులు నాస్తికులుగా, మత ద్రోహులుగా పరిగణింప బడి హింసింపబడ్డారు.

కష్టాలలో వున్న ప్రజలకు క్రొత్తభావాలు కల్పించి తిరిగి సౌఖ్యాన్ని కలిగించుట వలన బుద్ధుడు, జీసస్, మహమ్మద్ మొదలగు వారు ప్రవక్తలుగా పరిగణింపబడ్డారు. వారు ఆనాటి సమాజానికి చేసిన మేలు అమూల్యమైనది.

దైవ విశ్వాసం —

దైవవిశ్వాసం గల నిరుపేదలు కష్టాలు తమ పూర్వ జన్మకర్మ ఫలమని భావిస్తున్నారు.

సమాజ ప్రగతికి పాటుబడకుండా కూర్చుండి తినేవారిని— దైవవిశ్వాసం కల ప్రజలు–గౌరవిస్తున్నారు. స్వర్గం మీద కాంక్షతో, ఆకలి వేసినప్పుడు అడుక్కతింటూ, ముక్కుమూసుకొని మూలకు కూర్చుండే మునులను శిక్షించుటకు బదులు పూజించారు లోగడ— సమాజ ప్రగతికి ఏ మాత్రం ఉపయోగపడని బాబాలు కూడా నేటికి పూజింప బడుతున్నారు.

ధనికులు దైవవిశ్వాసాన్ని నిలబెట్టుటకు కారణాలు:—

మానవులందరూ సాధారణంగా శక్తిసామర్థ్యాలలో సమానులు. కాని దోపిడీ చేసేవారు ధనవంతులుగానూ, దోపిడీ చేయబడే వారు నిరుపేదలుగానూ వుంటారు.

ప్రజలలో దైవవిశ్వాసం వుంచేనే ధనికులు తమ ఆధిక్యతను సమర్థించుకోవడానికి వీలుంటుంది. అందుచేత తాము ధనికుల్లాగా వుండుటకు కారణం పూర్వజన్మ పుణ్యఫలమని సమర్థించు కొంటూరు. ప్రజలలో మత విశ్వాసం, దైవవిశ్వాసం పోషించుటకు దేవాలయాలను, యోగులను ఆధారం చేసుకుంటూరు.

దేవాలయాలు కట్టించడంలోనూ, విగ్రహాలను ప్రతిష్టించడం లోనూ పడిపోతున్న దేవాలయాలను బాగుచేయించడంలోనూ, మునులకు ఆశ్రమాలు కట్టించడంలోనూ మతప్రచారం చేయడంలోనూ

ధనవంతులు అనేక విధాల పాటుబడుతుంటారు

వాస్తవం చెప్పాలంటే యోగులు, ధనవంతులు తోడు దొంగలు.

మత గ్రంథాలు:—

మత గ్రంథాలలో కొన్ని సాదారణ నీతులు, కొన్ని ప్రత్యేక నీతులు వున్నాయి. ప్రత్యేక నీతుల వల్లనే ఆకాలంలో ఆ గ్రంథాల మీద గౌరవం ఏర్పడ్డది. ఆ గౌరవభావం వారసత్వంగా వస్తున్నది. ఆ నీతులే ఆచరణలో ఆచారాలైనవి. ఆ గ్రంథాల మీద విశ్వాసం ఏర్పడి మార్పునకు తావు ఇవ్వకుండా స్థిరపడినవి. ఆ కాలంలో ఆ నీతులు శాంతి సౌఖ్యాలను కలిగించాయి. ఆనాటికి ఈనాటికి అనేక రంగాలలో అనేక మార్పులు వచ్చాయి.

క్రొత్త పరిస్థితులలో పాత ధర్మాలు పనికిరావు. హిందూ మతంలో పూర్వకాలంలో వర్ణాశ్రమ ధర్మాలు వుపయోగపడినవి. కాని ఆధునిక యుగంలో అవి ప్రజల సౌఖ్యాభివృద్ధికి అడ్డుపడుతున్నాయి పాత గ్రంథాల మీద గౌరవం చేత పాత నీతులను, ఆచారాలను పాటిస్తూవుంటే ప్రగతి వుండదు. (నేను భాగవతంలోని అనేక విషయాలను ఈనాటి సమాజానికి వుపయోగపడే విధంగా నాకున్న జ్ఞానంతో విమర్శించాను) గ్రంథాలు మన అనుభవాల మీద ఆధారపడివున్నాయి కాని గ్రంథాల ననుసరించి మన అనుభవాలు లేవు. మన అనుభవానికి గ్రంథములోని విషయానికి తేడా వస్తే అనుభవం నిజమనీ, గ్రంథములోని సిద్ధాంతం అసత్యమని గ్రహించాలి.

ఈనాడు విజ్ఞానవంతులకు మత గ్రంథాలపై విశ్వాసం తగ్గిపోయింది.

సామాన్య ప్రజలలో ఆవిశ్వాసం తొలగిపోవడం లేదు.

మత గ్రంథాలలో దేవుణ్ణి గురించి, అతని మహిమలను గురించి చెప్పబడినవన్నీ సత్యమైనవేనని భావిస్తున్నారు. ఆ గ్రంథాలు అపౌరుషేయాలని కొందరు ఇప్పటికీ నమ్ముతున్నారు.

సాధారణంగా చాలామంది మత గ్రంథాలలోని విషయాలను

అర్థం చేసుకొనకుండానే కంఠస్తం చేస్తారు. విషయాన్ని అర్థం చేసుకొనని మొదల అందులోనున్న సత్యాసత్యములు గుర్తించుట జరుగదు. చాలామంది తమ మత గ్రంథాలను మాత్రమే చదివి సంకుచిత దృక్పథం ఏర్పరచుకొని తమ తమ మత గ్రంథమే అన్ని మత గ్రంథాల కంటే గొప్పదని భావిస్తారు. ఇతర మత గ్రంథాలను కూడా చదివితే అప్పటి అభిప్రాయాలు వేరుగా వుంటాయి

ఏ గ్రంథమూ అపౌరుషేయం కానేరదు. ప్రతి గ్రంథమునందు ఆ కాలం నాటి ఆచారాలు, ఆ గ్రంథకర్త అభిప్రాయాలు వుంటాయి.

ప్రాచీనకాలంలో ఎవరూ మత గ్రంథాలు వ్రాయలేదు. అప్పటికి వ్రాత పరికరాలు కనుగొనబడలేదు.

మహాపురుషులు చెప్పిన విషయాలను ప్రజలు వల్లించుకుంటూ వంశపారంపర్యంగా ఆచరిస్తూవుండేవారు. ఆ విషయాలను తరువాత కొన్ని వందల ఏండ్లకు క్రోడీకరించారు. అవే మత గ్రంథాలు.

మత గ్రంథాలలో ఆనాటి ప్రజల భావాలు, ఆచారాలు ఉండుట చేతనే చరిత్ర పరిశోధకులకు ఉపయోగపడుతున్నాయి.

పరలోకం —

పరలోకమనగా శరీరాన్ని విడిచి జీవుల్లు నివసించే ప్రదేశమని భావం. పరలోకమనునది నమ్మికతో కూడినదేకాని రుజువయ్యేది కాదు.

దేవునికారోపించిన గుణాలకు, ప్రత్యక్షమైన జీవితానుభవాలకు, సంబంధం లేకపోవుటవలన దేవుని యందు నమ్మకం తగ్గిపోయే అవకాశాలు ఎక్కువగా వున్నాయి. అందుచేత దేవుని యందు విశ్వాసం పోషిద్దామని ప్రయత్నించే ఆస్తికులు దేవుడు పరలోకమునందే తన అధికారమంతా వినియోగిస్తాడని చెప్పుతారు.

ఉదా — అవినీతి పనులు చేసేవారు నరకం వెళ్తారని అక్కడ యమభటులు వారిని అనేక విధాల శిక్షిస్తారని చెప్పుతారు.

భాగవతంలో కవిగారు యమలోకం 99 వేల యోజనాల దూరంలో వుందని తెలియజేశారు (99 వేల యోజనాలు 99000 × 8

మైళ్ళు=792000 మైళ్ళు. )

ఈనాడు శాస్త్ర జ్ఞానంతో 9 కోట్ల మైళ్ల దూరంలో వున్న సూర్యునిలో జరుగుచున్న మార్పులను మానవుడు గ్రహిస్తున్నాడు 458 కోట్ల మైళ్ల దూరంలోవున్న ఫ్లూటో గ్రహాన్ని గురించి కూడా తెలుసుకోవడం జరుగుచున్నది.

శాస్త్రజ్ఞుల పరిశోధనల వలన యమలోకమనేదే లేదని రుజువయ్యింది. యమలోకం, స్వర్గలోకం మతగురువులు ఊహించి చెప్పినవే కాని సత్యం కాదు. ఈ విషయం ఇప్పటికీ చాలా మందికి తెలియదు

మతగురువులు చెప్పిన స్వర్గనరకాలను, కర్మ సిద్ధాంతాన్ని ఇంకా అనేక ఆస్తికభావాలను ప్రజలు నమ్మడం వలన—దోపిడీ చేయబడుతూకూడా—గొర్రెల్లాగా తలవంచుక పోతున్నారు. చైతన్యం లేక తిరుగుబాటు స్వభావం లేక పడివుంటున్నారు. బానిసల్లాగా బ్రతుకు భారాన్ని మోస్తున్నారు.

స్వార్థపరులు తోటి మానవుల శ్రమ ఫలితాన్ని దోపిడీ చేసి సుఖాలనుభవిస్తున్నారు.

అనేక లోపాలతో కూడిన ఆస్తికత్వం ప్రచారంలో ఉండడం వలన సమాజంలో ఒకవంక స్వార్థానికి, మోసానికి స్థానం వుండగా ఒకవంక పిరికితనానికి స్థానం వుంది. అందువల్లనే కొందరు శ్రమ పడకుండా, అవినీతి పనులు చేస్తూ, సుఖాలనుభవిస్తుంగా, కొందరు నీతిపరులు కష్టాలకు గురియగు చున్నారు.

దైవవిశ్వాసాన్ని ధిక్కరించి సంఘసంస్కర్తలు సాధించిన పనులు.

సమాజంలో వున్న అన్యాయాలను తొలగించుటకు సంఘ సంస్కర్తలు ఆయాకాలంలో అమలులోవున్న దైవభావాన్ని ఖండించి ప్రజల కష్టాలను నిర్మూలించారు.

సంఘ సంస్కర్తలలో రాజారామ్‌మోహన్‌రాయ్ ఒకడు, ఇతని కాలం నాటికి సతీసహగమనము, యజ్ఞయాగాదులు, బలులు.

బాల్య వివాహాలు, బహు భార్యాత్వము మొదలగు దురాచారాలుం డేవి. ప్రజలు కర్మ సిద్ధాంతాన్ని నమ్ముతూవుండేవారు.

పూర్వజన్మకర్మ ఫలితంగా తన భర్త చనిపోయాడని స్త్రీ అను కునేది. స్వార్థపరులు, మూర్ఖ ఆచారపరాయణులు భర్త చనిపోయిన ఆ స్త్రీని బలవంతంగా చితిలోపెట్టి కాల్చిచంపేవారు.

సతీసహగమనాన్ని, బహుభార్యాత్వాన్ని ఇంకా అనేక దురా చారాలను కర్మ సిద్ధాంతము ననుసరించి సమర్థించడం జరిగేది.

రాజారామ్‌మోహన్‌రాయ్ ప్రజలలోనున్న మూఢవిశ్వాసా లను ఛేదించడానికి పూనుకున్నాడు.

విగ్రహారాధన ఖండించాడు. దేవతామూర్తులను, చిత్ర పట ములను తాను స్థాపించిన సమాజం నుండి నిషేధించాడు. యజ్ఞ యాగాదులను, బలులను తిరస్కరించాడు. భార్య బ్రతికుండగా మరొక స్త్రీని వివాహం చేసుకునే అధికారం పురుషునికి లేదన్నాడు. కులతత్వాన్ని ఖండించాడు. స్త్రీ విద్యను ప్రోత్సహించాడు.

ఆనాడు ప్రచారంలో వున్న ఆస్తిక సిద్ధాంతాలను ఖండిం చడం వలననే అతడనేక సంస్కరణలు చేయగలిగినాడు.

రాజారామ్‌మోహన్‌రాయ్ ప్రవేశపెట్టిన సంస్కరణలన్నీ ఆనాటి ఆస్తిక సిద్ధాంతాలకు వ్యతిరేకమే, అందుకే భారతీయ సనాతన ఆచారపరాయణులు సతీసహగమనము అలాగే కొనసాగాలనీ, మా హిందూ విధవలు భర్త శవంతో సజీవంగా కాలిచావడానికే ఇష్టపడు తారనీ, అలా చావడం మా హైందవ మత ధర్మమని బ్రిటిష్ ప్రభు త్వానికి దరఖాస్తులు పెట్టుకొన్నారు

రాజారామ్‌మోహన్‌రాయ్, బెంటింగు ప్రభువు కృషిఫలితంగా స్వార్థపరుల, మూర్ఖ ఆచార పరాయణుల కోరికను నిర్దాక్షిణ్యంగా అణచి వేయడం, స్త్రీ జాతికి మేలుచేయడం జరిగింది, సతీసహగమ నాన్ని తలచుకుంటే హృదయమున్న వానికెవనికైనా కన్నీరు కారక మానదు.

ఆనాటి సంఘములో నున్న మరొక దురాచారం బాల్య

వివాహాలు చేయడం, ఆడ పిల్లలకు బాల్యదశలో అంటే 8 సంవత్స రాల వయస్సులో పెళ్ళి చేసే ఆచారం భారతదేశంలో చాలా ప్రాంతాలలో వుండేది.

వైద్యశాస్త్రం ఎక్కువగా అభివృద్ధి చెందనందున ఆకాలంలో బాల్య మరణాలు కూడా ఎక్కువగా వుండేవి. భార్య చనిపోతే పురుషుడు తర్వాత మరో స్త్రీని వివాహం చేసుకునే వాడు. దానిని సంఘం సమర్థించేది. భర్త చనిపోయిన స్త్రీ మళ్ళీ పెళ్ళి చేసుకునే ఆచారం ఆనాటి సమాజంలో లేదు. ఆ పిల్ల జన్మంతా వైధవ్యంతో గడుపవలసివచ్చేది. అది ఆస్త్రీ పూర్వజన్మకర్మ ఫలమనే వారు విధవ పాటించవలసిన కఠినమైన నియమాలు చాలా వుండేవి. అలంకరణ చేసుకోకూడదని, రంగు బట్టలు ధరించ కూడదని, ఒకపూట భోజనం చేయవలెనని, పరపురుషుణ్ణి చూడకూడదని, గడపదాటి బయటకు వెళ్లకూడదని ఇలా ఎన్నో నియమాలు వుండేవి. కొన్ని ప్రాంతాలలో తలవెంట్రుకలు తీయించే ఆచారం కూడా వుండేది.

భర్త చనిపోయిన స్త్రీని అంత క్రూరంగా చూడకూడదని, అటు వంటి స్త్రీకి మళ్ళీ పెళ్ళిచేసి ఆమె సుఖంగా జీవించడానికి అవకాశాలు కల్పించాలని అతడు వాదించాడు వితంతు పునర్వివాహం గురించి ప్రచారం చేశాడు వితంతు పునర్వివాహం చట్టరీత్యా ఆమోదం పొందింది.

భారతదేశంలో ఆంగ్లభాషను ప్రవేశ పెట్టినప్పుడు.......వంతి పద్ధతి ప్రవేశ పెట్టినప్పుడు కూడా భారతీయులలో కొందరు వ్యతి రేకించారు. మార్పును వ్యతిరేకించడం కొందరికి అలవాటు.

ఆంధ్రప్రాంతములో కందుకూరి వీరేశలింగం గారు వితంతు వివాహాలకు ఎంతో కృషి చేశాడు. మూర్ఖ ఆచారపరాయణులు వీరేశ లింగం గారి అభిప్రాయాలను ఖండించారు. అయినా వీరేశలింగం గారు భయపడలేదు. అతడు స్వయంగా ఎన్నో పెళ్ళిళ్లు జరిపించాడు రాజమండ్రిలో వితంతు శరణాలయం కట్టించాడు. స్త్రీ విద్యను ప్రోత్సహించాడు.

ఈశ్వరచంద్ర విద్యాసాగర్ కూడా వితంతు వివాహాలు జరిపించుటకు కృషిచేసి సంఘ పెద్దలచేత తిట్టబడ్డాడు.

ఒకనాడు అనేక మంది చేత తిరస్కరించబడిన ఈ సంస్కరణలే ఈనాడు అనేక మందిచేత సమర్థించబడుచున్నవి.

దయానంద సరస్వతి ఆస్తిక సిద్ధాంతములలో ఒకటైన కర్మ సిద్ధాంతమును సమర్థించిననూ, ఆస్తికులుచేసే విగ్రహ పూజలను ఖండించాడు, అతడు విగ్రహారాధనను ఖండించుటకు కారణమొకటున్నది.

అతడు ఒక శివరాత్రినాడు రాత్రంతా పూజచేస్తూ మెలకువగా వుండుటకై నిశ్చయించుకొని తండ్రితో దేవాలయానికి వెళ్లాడు. అర్ధరాత్రి కాగానే తండ్రి, పూజారి నిద్రపోయారు. దయానందుడు దేవుని విగ్రహము వైపు చూస్తూ కూర్చున్నాడు.

ఆసందర్భములోనే ఒక చుంచు దేవునికి పెట్టిన ప్రసాదాన్ని తినిపోయింది. తన కర్పించిన ప్రసాదాన్ని దేవుడు చుంచు నుండి కాపాడుకోలేకపోయాడు

ఆనాటినుండి దయానందుడు విగ్రహారాధన చేయుట మానుకున్నాడు

విగ్రహాలే దేవుళ్లనీ, వానికి మహిమలు కలవనీ, మొక్కినచో కోరికలు నెరవేరుననీ, ఈనాటికీ కొందరు భావిస్తున్నారు కొందరు దేవాలయాలను కట్టించి అందులో విగ్రహాలను ప్రతిష్టించి, ఆ విగ్రహాలే దేవుళ్ళని భావించి భయభక్తులతో పూజిస్తున్నారు విగ్రహానికి మహిమ వుండదు కనుకనే చుంచు నైవేద్యం తిన్ననూ విగ్రహమేమీ చేయలేదు విగ్రహాలను పూజించుట వ్యర్థము

మనోవాక్కాయ కర్మలను పాటించుటే ధర్మమని, ధర్మ మార్గములో ధనమార్జించవలెనని, అధర్మంగా ధనమార్జించ కూడదని దయానందుడు ప్రజలకు బోధించాడు అతడు సమర్థించిన కర్మసిద్ధాంతానికి, అతడు బోధించిన ఈ ధర్మాలు వ్యతిరేకంగా వున్నాయి.

అతడు సమర్థించిన కర్మసిద్ధాంతము అనేక లోపములతో

కూడివున్నది. ధర్మమార్గములో ధనమార్జించవలెనని అతడు చెప్పిన మాటలు సమర్థించతగినవి.

అందరూ ధర్మమార్గములో ధనమార్జించిన మొదల ఒకనికి ఆకాశమునంటే మేడలుండగా ఒకడు చెట్టు క్రింద కాపురం చేసే గతి పట్టదు. దోపిడీకి అవకాశమున్న సమాజంలోనే ఎక్కువతక్కువ లుండడానికి అవకాశమున్నది.

కర్మసిద్ధాంతమును సమర్థించే సమాజంలో దోపిడీ విధానాని ఎక్కువతక్కువలుండడానికి అవకాశాలున్నాయి. అందరూ ధర్మ మార్గములో ధనమార్జించిననాడు ఈనాడున్న అసమానతలు చాలా వరకు తగ్గిపోతాయి.

సంకుచిత మత దృక్పథం వల్ల కలిగే కష్టనష్టాలు:—

ఉదా.— ఇస్లాం మతవ్యాప్తికోసం గజనీ మహమ్మద్ చేసిన ఘోరాలు.

11వ శతాబ్దంలో ఉత్తర భారతదేశములో సోమనాథ దేవాలయం పవిత్ర దేవాలయంగా భావించబడేది. ఈ స్వామిపైన హిందువులకు ఎనలేని నమ్మకం వుండేది. ఆ ఆలయంలో పూజలు నిర్వహించడానికి వెయ్యి మంది పూజారులుండేవారు. ఆలయంలో బంగారముతో చేయించబడిన అనేక వస్తువులుండేవి. స్వామి దగ్గర 200 మణుగుల (192000 తులాలు) బరువు గల బంగారు గొలుసుండేది. ఆ గొలుసు సహాయంతో భక్తులు గంటలు వాయించేవారు.

గజనీ మహమ్మద్ సోమనాథ దేవాలయాన్ని నాశనం చేసి, విగ్రహాన్ని బద్దలు కొట్టి ధనాన్ని తీసుకపోయాడు. అతడు తన ఇస్లాం మతాన్ని వ్యాప్తి చేయడం కోసం క్రూరంగా నిరంకుశంగా ప్రవర్తించాడు. ఇతర మతాల వారిని చాలా నీచంగా చూశాడు.

భగవంతుడు సర్వశక్తిసంపన్నుడైతే, సర్వవ్యాప్తి అయితే తన పేరిట స్థాపించబడిన విగ్రహాన్ని ముక్కలు చేసిన దుర్మార్గుణ్ణి అప్పటికప్పుడే చంపివేసి వుండేవాడు. తనను నమ్ముకున్న వేలాది భక్తులను రక్షించుకునేవాడు. తనకు కేటాయించిన బంగారాన్ని

కాపాడుకునే వాడు.

దేవుడు సత్యమైతే గజనీ మహమ్మద్‌కు సోమనాథ దేవాలయాన్ని నాశనం చేయాలన్న ఊహ కూడా వచ్చేది కాదు.

దేవుడనేది మానవుని విశ్వాసం మాత్రమే కాని సత్యం కాదు. దేవుడనేది నమ్మిక కనుక బలవంతుల దేవుడు బలవంతుడుగానూ, బలహీనుల దేవుడు బలహీనుడుగానూ యెంచబడ్డాడు. ఇది చరిత్ర తిరగేస్తే తెలిసే నగ్న సత్యం.

హిందూదేశంలో జరిగిన మత యుద్ధాలకొక ఉదాహరణ:—

బసవేశ్వరుడు కన్నడదేశం నుండి వీరశైవ సిద్ధాంతము ప్రచారం చేయుచుండగా రామానుజుడు దక్షిణదేశం నుండి వైష్ణవ మతాధిక్యతను ప్రచారం చేస్తుండేవాడు ఈ రెండు మతాలు కూడా వర్ణభేదము రూపు మాపుటకు ప్రయత్నం చేసినట్టివే కాని ఈ రెండు మతాలను అనుసరించే వారు తమ సిద్ధాంతమే సత్యమైనదవి తక్కిన మతములు పాషండ మతములని తలచారు. ఇరువర్గాలలో అసహనము ప్రబలిపోయి మత యుద్ధాలు జరిగాయి. మతాలపేరిట అనేక మంది చనిపోయారు.

ఇరువురి లక్ష్యం ఒక్కటే అయినప్పటికీ మతాధిక్యత సంపాదించాలన్న స్వార్థబుద్ధితో యుద్ధాలు చేశారు.

ఇంతటి సంకుచిత దృక్పథం కలవారు మతకర్తలైతే ఆ మతాలెంత సంకుచితంగా వుంటాయో, ఎంతలోపభూయిష్టంగా వుంటాయో సులభంగానే గ్రహించవచ్చు.

సూఫీఉద్యమం:— సూఫీఉద్యమ కారులు భగవత్ప్రార్థనను ఖండించారు. ఉపవాసములుండుట. నోములు నోచుట ముఖ్యమైనవి కావనియూ, మానవత్వం కలిగి వుండుటయే ముఖ్యమనియూ బోధించారు

భగవత్ప్రార్థన చేస్తూ కూర్చుండేవాడు సాధారణంగా కష్టపడి పని చేయడు. శ్రమపడి పని చేయడం ఇష్టంలేనివాడు, తగని వాడు, సామర్థ్యం లేని వాడు తాను సుఖంగా వుండాలని భగవ

త్ప్రార్థన చేస్తాడు. కష్టపడి పనిచేసేవానికి భగవత్ప్రార్థన చేయాలన్న ధ్యాస సాధారణంగా రాదు. కష్టపడి పని చేసేవాడు భగవత్ప్రార్థన చేయవలసిన అవసరం కూడా లేదు. భగవత్ప్రార్థన చేయకున్ననూ కష్టపడి పనిచేసేవాడు దోపిడీ చేయబడనిచో సుఖపడుతాడు. కాని దోపిడీ చేయబడకుండా చూచుకునే బాధ్యత అతనిమీదే వుంది.

పని చేయనివాడు దోపిడీ చేస్తూ బ్రతికినప్పుడు పని చేసేవాడు దోపిడీ చేయబడుతాడు.

భగవత్ప్రార్థన పేరిట సమాజ ప్రగతికి పాటుబడకుండా వుండి పోవడం సూఫీఉద్యమకారులకు ఇష్టంలేదేమో. అందుకే వారు భగవత్ ప్రార్థనను ఖండించియుండవచ్చు.

భక్తి ఉద్యమం:—

భక్తిఉద్యమ కారులు కూడా కర్మకాండలను ఖండించారు. వర్ణభేదము, అస్పృశ్యత ఉండకూడదని వాదించారు. వారుకూడా ఆనాటి ఆస్తిక సిద్ధాంతాలను కొన్నింటిని ఖండించి దోపిడీ విధానాన్ని కొంతవరకు అరికట్ట గలిగారు.

మానవత్వం కలిగివున్నవాడు ఇతరులను దోపిడీ చేయడు. దోపిడీ చేసేవానికి మానవత్వం వుందనడానికి వీలులేదు. మానవత్వం లేనివాడు భగవద్భక్తుడైననూ నిందార్హుడే. తప్పు చేసిన దేవుళ్ళను కూడా నిందించ వలసిందే, శిక్షించవలసిందే.

మానవత్వానికి హానికలిగించే మత విశ్వాసాలను ప్రతిఘటించి తీరాలి.

ఇతర మతాలను నీచంగా చూడడంగానీ, స్వమతములోనున్న లోపాలను సమర్థించడం గానీ కూడదు. లోపాలు ఎక్కడవున్నా ఎత్తి చూపవలసిందే. సర్వమానవ క్షేమము కాంక్షించ వలసిందే. ఇదే ఉత్తమ ధర్మమని నా వాదన.

సాహిత్యం :—

దోపిడీ దారులను విమర్శించే కవితలను, వ్యాసాలను ఇంకా ఏ రచనలనైనా దోపిడీదారులు నిషేధిస్తారు.

బ్రిటిష్ వారు భారతదేశాన్ని పరిపాలించిన సందర్భమున 'వందేమాతరం' అనే గీతాన్ని ఎవరూ ఎక్కడ చదవడానికి వీల్లేదని బ్రిటిష్ ప్రభుత్వం ఆజ్ఞ జారీచేసింది. దానిని ధిక్కరించినవారికి కఠినమైన శిక్షలు విధించింది.

స్వార్థపరులు తమ ఆధిక్యతను దెబ్బతీసే ఏ శక్తినైనా నిరంకుశంగా అణచివేస్తారు. ఇది చరిత్ర తెలియజేసే నగ్న సత్యం.

దోపిడీ దారులకు, దోపిడీ చేయబడే వారికి ఎప్పుడూ ఏదో ఒక విధంగా పోరాటం జరుగుతూనే వుంటుంది.

దోపిడీ చేయబడేవారికి పవిత్రమైన "విషయం" దోపిడీ దారులకు అపవిత్రమవుతుంది.

సృష్టిపరిణామక్రమము—మానవుడు.

శాస్త్రజ్ఞులు ప్రతిపాదించిన నెబ్యులా సిద్ధాంతము ప్రకారం మొట్టమొదట విశ్వమంతా వేడివాయువు ఆవరించి వుండేది. అలాంటి వేడి వాయువుకు నెబ్యులా అని పేరు పెట్టారు. లక్షలాది సంవత్సరాల తర్వాత నెబ్యులా ఉండవలె తయారయ్యింది. అలాతయారైన ఉండలే నక్షత్రాలు. వేడి వాయువుతో తయారైన నక్షత్రాల నుండి వేడి, వెలుతురు చుట్టుప్రక్కలకు వ్యాపిస్తూవుంటాయి. ఒక నక్షత్రానికి మరొక నక్షత్రానికి మధ్య కోటానుకోట్ల మైళ్ళ దూరం వుంటుంది.

మన భూమికి దగ్గరగా వున్న నక్షత్రాన్ని "సూర్యుడు" అని పిలుస్తాము. సూర్యుడు మనకు తొమ్మిది కోట్ల మైళ్ళ దూరంలో వుంది.

నెబ్యులా నుండి నక్షత్రాలు ఏర్పడినట్లే సూర్యునిలో నుండి వేడి వాయువు గోళాలు విడిపోయి 9 గ్రహాలు ఏర్పడ్డాయి. అవి సూర్యుని చుట్టూ తిరుగుతుంటాయి.

మొదటిది మెర్క్యూరీ (బుధుడు) ఇది సూర్యునికి 3 కోట్ల మైళ్ల దూరంలో వుంది ఇది సూర్యుని చుట్టూ తిరగడానికి 28 రోజులు పడుతుంది.

రెండవది వీనస్సు (శుక్రుడు) ఇది సూర్యునికి 7 కోట్ల మైళ్ళ దూరంలోవుంది. ఇది సూర్యుని చుట్టూ తిరగడానికి 225 రోజులు

పడుతుంది.

మూడవది భూమి. ఇది సూర్యునికి 9 కోట్ల మైళ్ళ దూరంలో వుండి 24 గంటలలో తనచుట్టు తాను తిరుగుతూ 365 దినములలో సూర్యునిచుట్టు తిరుగుతుంది. సూర్యుని వెలుతురు భూమిని చేరడానికి 8 నిమిషాలు పడుతుంది. భూమిచుట్టు కొలత 25 వేల మైళ్ళు. సూర్యుని నుండి భూమి విడిపోయి 15 వందల కోట్ల సంవత్సరాలు అయిందని అంచనా. సూర్యునిలో నుండి భూమి విడిపోయినట్లే భూమిలో నుండి ఒక ఉపగ్రహం (చంద్రుడు) విడిపోయి $2\frac{1}{2}$ లక్షల మైళ్ళ దూరంలో వుంది ఇది భూమి చుట్టు తిరగడానికి $29\frac{1}{2}$ రోజులు పడుతుంది. నెబ్యులా నుండి చంద్రుని వరకు మార్పు చెందుటకు కోటానుకోట్ల సంవత్సరాలు పట్టింది.

నాలుగవది మార్స (అంగారకుడు) ఇది సూర్యునికి 14 కోట్ల మైళ్ళ దూరంలోవుంది. ఇది సూర్యుని చుట్టు తిరగడానికి 687 రోజులు పడుతుంది. దీనికి రెండు ఉపగ్రహాలున్నాయి.

అంగారక గ్రహం తర్వాత చిన్న గ్రహాలున్నాయి. ఇవి నవ గ్రహాలలో లెక్కించడం లేను.

అయిదవది జ్యూపిటర్ (గురుడు) ఇది సూర్యునికి 47 కోట్ల మైళ్ళ దూరంలో వుంది. ఇది సూర్యుని చుట్టు తిరగడానికి 12 సంవత్సరాల కాలం పడుతుంది దీనికి 12 ఉపగ్రహాలున్నాయి.

ఆరవది శాటర్న (శని) ఇది సూర్యునికి 68 కోట్ల మైళ్ళ దూరంలో వుంది. ఇది సూర్యుని చుట్టు తిరిగి రావడానికి 30 సంవత్సరాల కాలం పడుతుంది దీనికి 9 ఉపగ్రహాలున్నాయి

ఏడవది యురానస్ (వరుణుడు) ఇది సూర్యునికి 180 కోట్ల మైళ్ళ దూరంలోవుంది ఇది సూర్యుని చుట్టు తిరగడానికి 84 సంవత్సరాలు పడుతుంది. దీనికి 5 ఉపగ్రహాలున్నాయి.

ఎనిమిదవది నెప్ట్యూన్ (ఇంద్రుడు) ఇది సూర్యునికి 350 కోట్ల మైళ్ళ దూరంలోవుంది. సూర్యుని చుట్టు తిరిగిరావడానికి 165 సంవత్సరాలు పడుతాయి దీనికి 2 ఉపగ్రహాలున్నాయి.

తొమ్మిదవది ప్లూటో (యముడు) ఇది సూర్యునికి 453 కోట్ల మైళ్ల దూరంలోవుంది ఇది సూర్యుని చుట్టు తిరిగిరావడానికి 248 సంవత్సరాల కాలం పడుతుంది. ప్లూటో గ్రహాన్ని 1930 లో అమెరికా భూగోళ శాస్త్రవేత్త కెడ్‌తోంబాగ్ కనుగొన్నాడు.

సూర్యగోళం నుండి ఎనభై వేల మైళ్ల ఎత్తువరకు గంటకు రెండు లక్షల మైళ్ల వేగంతో మంటలు లేస్తూ వుంటాయి. అణువులు విచ్ఛిన్నం కావడం వలన ఈ మంటలు బయలు దేరుతాయి.

మన భూమి మీద ప్రాణులు బ్రతకడానికి తగినంత వేడిమి ఇవ్వలేని స్థితిలోనికి సూర్యుడు చల్లారడానికి ఇంకా ముప్పది కోట్ల సంవత్సరాలు పట్టగలదని శాస్త్రజ్ఞుల అంచనా.

సూర్యమండలం గంటకు 20 వేల మైళ్ల వేగంతో " లైరా " అను నక్షత్ర మండలం వైపు పరుగెత్తుచున్నదని శాస్త్ర వేత్తలు కనుకొన్నారు.

సూర్యుని నుండి భూమి విడిపోయినప్పుడు భూమి కూడా సూర్యునంత వేడిగా వుండేది. కాని భూమి చిన్నది కనుక తొందరగా చల్లారింది వేడివాయువు చల్లారి మొదట ద్రవం అయింది. తర్వాత గట్టిపడింది. ఈనాటికీ భూమిపైన సుమారు 15 మైళ్ల దళసరి గట్టి పడింది. మిగిలిన లోపలి భాగం వేడిద్రవ పదార్థంగానే వుంది. ఆ ద్రవ పదార్థం కదిలినప్పుడు పైనున్న గట్టి భూమి కూడా కొంత కదలడం జరుగుతుంది దానినే మనం భూకంపం అంటాం. (పాపుల భారం మోయలేక భూదేవి కదులుతుందని మత విశ్వాసం.)

భూమి చల్లబడుతున్న సమయంలో దాని చుట్టు వున్న గాలులు కూడా చల్లబడి దానిలోని నీటి ఆవిరి కూడా చల్లబడి పెద్ద వర్షంగా కురిసింది ఆ రోజుల్లో కురిసిన నీరు పల్లపు ప్రదేశానికి చేరింది ఆ పల్లపు భాగంలోని నిల్వవున్న నీటినే మనమీనాడు సముద్రాలని పిలుస్తున్నాము.

భూమి చల్లారుతుండగా ఒక దశలో గాలి, నీరు, లవణ పదార్థాలు కలసి జీవపదార్థమగు ప్రోటోప్లాసం ఏర్పడింది. ప్రోటో

ప్లాసం వల్లనే జంతువుల శరీరాలు, చెట్ల శరీరాలు నిర్మింపబడుతాయి.

ఊపిరి పీల్చడం, ఆహారం తీసుకోవడం, ఎదగడం, ఆలోచించడం, సంతానం కనడం, అనారోగ్యం, వృద్ధాప్యము, మరణము ఈ గుణాలన్నీ జంతువులకు, మనుషులకున్నట్లే ప్రోటోప్లాసముకు కూడావున్నాయి ప్రోటోప్లాసమును మనం తయారు చేసుకోగలిగితే జనన మరణాలను మనం అదుపులో పెట్టవచ్చు.

మన ప్రాణం నిలవడానికి నీరు, గాలి కావాలి. గాలిలో ప్రాణవాయువు, బొగ్గు పులుసు వాయువు ఉన్నాయి, చెట్లు బొగ్గుపులుసువాయువును తీసుకొని దానిని నీటితో కలిపి ఆహారం తయారు చేస్తాయి. చెట్లు ఆహారం తయారు చేసుకోవడంలో సూర్యకిరణాలు కూడా ఉపయోగపడుతాయి చెట్లు అలా ఆహారం తయారు చేసుకొని ప్రాణవాయువును వదిలి పెడుతాయి. మానవుడు ప్రాణవాయువు పీల్చుకొంటూ చెట్లు తయారు చేసిన ఆహార పదార్థాలు తింటూ బొగ్గుపులుసు వాయువు విసర్జిస్తున్నాడు. ఎదుగుతున్నాడు, ఆలోచిస్తున్నాడు, సంతానం కంటున్నాడు చనిపోతున్నాడు.

గుండె, మెదడు పనిచేయడం ఆగినప్పుడు మానవుని మిగిలిన అంగాలు కూడా పనిచేయడం మానుకుంటాయి. దానినే మనం మరణం అంటున్నాము.

పుణ్యాత్ముడు సుఖంగా చనిపోతాడు, పాపాత్ముడు కష్టపడుతూ చనిపోతాడు అనేది మత విశ్వాసం. కాని ఈ విశ్వాసం సరియైనది కాదు. దోపిడీ చేసేవారిలో కొందరు సుఖంగానూ, కొందరు కష్టంగానూ, దోపిడీ చేయబడే వారిలో కూడా కొందరు సుఖంగానూ, కొందరు కష్టంగానూ చనిపోవడం జరుగుతూ వుంది.

పుణ్యం చేసిన వారికి ఆరోగ్యం, పాపం చేసిన వారికి అనారోగ్యం సంభవిస్తుందన్నది మత విశ్వాసం. ఇదికూడా సరియైనది కాదు. మురికి వాడలలో నివసించేవారు. పుష్టికరమైన ఆహారం తినని వారు అనారోగ్యానికి గురియవుతారు. పరిశుభ్రమైన వాతావరణంలో.

నివసించేవారు, పుష్టికరమైన ఆహారం తినేవారు ఆరోగ్యంగా వుంటారు.

సమాజంలో నున్న దోపిడీ విధానం అంతమైతే, అందరూ కష్టపడి పనిచేస్తే అందరికీ పుష్టికరమైన ఆహారం లభిస్తుంది. అందరూ పరిశుభ్రమైన వాతావరణంలో నివసించడానికి అవకాశం వుంటుంది. అందరికీ వైద్యం అందుబాటులో వుంటుంది.

సమసమాజంలో ఎక్కువలో ఎక్కువ మంది ఆరోగ్యంగా వుండడానికి అవకాశం వుంటుంది.

గాలిలో పెరుగుచున్న చెడు సూక్ష్మక్రిములు మానవుని శరీరంలోకి ప్రవేశించి అభివృద్ధిచెందినప్పుడు మానవునికి అనారోగ్యం చేకూరుతుంది. మానవునికి హానిచేసే అన్నిరకాల సూక్ష్మ జీవులను నిర్మూలించ గలిగితే మానవునికి అనారోగ్యమనునది సంభవించదు. అది విజ్ఞానశాస్త్రం ఇంకా అభివృద్ధి చెందినప్పుడే సాధ్యమవుతుంది. విజ్ఞానశాస్త్రం అభివృద్ధి చెందాలంటే మూఢవిశ్వాసాలనూ, సోమరితనాన్ని వదిలిపెట్టి అందరూ కష్టపడి పనిచెయ్యాలి సమాజ ప్రగతికి ఏ విధంగా తోడ్పడకుండా కూర్చుండి తినేవారి సంఖ్య ఉండకూడదన్నమాట.

**మానవుని అవసరాలు—జ్ఞానాభివృద్ధి—దోపిడికి అవకాశం:—**

సృష్టిపరిణామక్రమంలో ఒక దశలో మానవుడు పుట్టాడు. మొట్టమొదట మానవులు కూడా జంతువులవలె నగ్నంగా తిరుగుతుండేవారు. శీతోష్ణస్థితులనుండి రక్షణ పొందుట కొఱకు కొండగుహాలలో, చెట్ల తొఱ్ఱలలో నివసించేవారు. చెట్లకు కాసిన కాయలను, పండ్లను, దుంపలను తింటుండేవారు. రాతి ఆయుధాలతో జంతువులను చంపి వాటి పచ్చి మాంసం తినేవారు.

మానవుడు మిగిలిన జంతువులకంటే తెలివికలవాడు మానవుని చేతి బొటనవ్రేలు మిగిలిన వ్రేళ్ళకు ఎదురుగా నిలుపుటకు వీలున్నది. ఈ సౌకర్యం వలన ఏరాయినో పట్టుకొని జంతువులను చంపగలిగేవాడు. మృగముల చర్మములను శరీరంపై ధరించి చలినుండి ఎండ

నుండి రక్షణ పొందేవాడు.

ఆ కాలంలో మానవులకు ఎలాంటి భాష కూడా లేదు. సైగల ద్వారా ఒకరి అభిప్రాయాలను ఒకరికి తెలుపుకొంటుండేవారు.

ఆకలి వేసినప్పుడు కాయోపండో తినడం, అలసట కలిగినప్పుడు నిద్రపోవడం, కామ కోరిక కలిగినప్పుడు అందుబాటులోనున్న స్త్రీతో సంభోగించడం జరుగుతూవుండేది.

ఆలోచనగల మానవుడు ప్రాచీన శిలా యుగంలో పనిముట్లు తయారు చేయుట నేర్చుకున్నాడు శిలలను. కట్టెలను పదునుచేసి వాటి సహాయంతో జంతువులను సులభంగా చంపడం నేర్చుకున్నాడు

వెదుళ్ళువంచి విల్లు తయారు చేసి, బాణాలుపయోగించి జంతువులను చంపడం కూడా తెలుసుకున్నాడు.

శిలల రాపిడిచే నిప్పు పుట్టించగలిగాడు. నిప్పు పుట్టించుట తెలుసుకొన్న తర్వాత మాంసం కాల్చుక తినడం కొనసాగించాడు.

నవీన శిలాయుగంలో ఆయుధాలను నాణ్యంగా తయారు చేసుకోగలిగాడు మానవుడు. కుక్కలను మచ్చిక చేసుకొని వాటిని వేటకై వుపయోగించాడు. కుక్కలను వేటకుపయోగించడం వలన మానవుడు పూర్వంవలె అంతకష్ట పడవలసిన అవసరం కలుగలేదు.

తాటి ఆకులతో వెదురుబొంగుల సహాయంతో గుడిసెలు కట్టుకోవడం తెలుసుకున్నాడు ఆవు, గేదె మొదలగు జంతువులను మచ్చిక చేసుకొని వాటిపాలను ఆహారంగా వుపయోగించడం తెలుసుకున్నాడు

నదీ తీరాలకు వెళ్ళి పశువుల సహాయంతో భూమి సేద్యం చేసి పంటలు పండించడం, పత్తి పండించి బట్టలు నేయడం, మట్టితో కుండలు చేయడం మొదలగునవన్నీ తెలుసుకున్నాడు.

మానవునికి ప్రకృతి రహస్యాలు తెలియనప్పుడు ఉరుములను, మెరుపులను, వర్షాన్ని వరదలను, భూకంపాలను అతీతశక్తులుగా భావించాడు. తనకంటే శక్తిగలవాడు ఇవన్నీ కల్పిస్తున్నాడని అతడే దేవుడని మానవునికి విశ్వాశం ఏర్పడింది.

అప్పుడు మానవులు గుంపులు గుంపులుగా తిరుగుతుండేవారు. స్త్రీ పురుషులందరికీ కామ సంబంధాలుండేవి. అందరూ కష్టపడి పని చేసేవారు, ఫలితాన్ని అందరూ సమానంగా అనుభవించేవారు. అప్పుడు పాతివ్రత్యం గానీ, వేశ్యావృత్తిగానీ, సాంఘిక, రాజకీయ అసమానతలుగానీ కర్మసిద్ధాంతంగానీ, దోపిడీ విధానం గానీ లేవు.

వ్యక్తిగత ఆస్తి విధానం వచ్చిన తర్వాత దోపిడీ విధానం ప్రారంభమైంది. ఆర్థిక, సాంఘిక, రాజకీయ అసమానతలు తల యెత్తాయి. దోపిడీ విధానాన్ని సమర్థించుకోవడానికి దోపిడీదారులు దైవ విశ్వాసాన్ని కర్మసిద్ధాంతాన్ని, అధికారాన్ని, పలుకుబడిని, అంగరక్షకులను, సైన్యాన్ని—శిక్షలు జరిమానాలు, జైళ్లు—ఉప యోగించుకోసాగారు.

ప్రజలు అజ్ఞానంవల్ల, లేని దేవున్ని నమ్మడంవల్ల (అసత్యాన్ని నమ్మడంవల్ల), కర్మసిద్ధాంతాన్ని నమ్మడంవల్ల, మూఢనమ్మకాలవల్ల, హేతువాదజ్ఞానం లేకపోవడంవల్ల దోపిడీ చేయబడడంవల్ల భయంకర మైన కష్టాలకు గురియవుతున్నారు.

ఇప్పటికీ మూఢనమ్మకాలవల్ల ప్రజలు అనేక కష్టాలకు గురియ వుతున్నారు. శాస్త్ర జ్ఞానం, హేతువాదజ్ఞానం విరివిరిగా ప్రచారం చేస్తే ప్రజలలోనున్న మూఢ నమ్మకాలు తొలగిపోతాయి. ప్రజలు కష్టాలనుండి విముక్తి పొందుతారు.

కర్మసిద్ధాంతాన్ని నమ్మడం వల్ల, దేవుణ్ణి నమ్మడం వల్ల— ప్రజలు తమ కష్టాలకు కారణం పూర్వజన్మకర్మఫలమనీ, దేవుడు తమను ఇలాగే పుట్టించాడనీ—చైతన్యరహితులై జీవచ్ఛవజీవితా లను గడుపుతున్నారు.

కర్మసిద్ధాంతాన్ని, దైవాన్ని నమ్మడం మానుకొని ప్రయ త్నలోపం లేకుండా పనులు కొనసాగించినప్పుడు ప్రజల కష్టాలు నిర్మూలమవుతాయి. కష్టాలు తొలగించుకోవడానికి ఇదొక ఆధారం.

మానవుడు పడేకష్టాలకు కారణం పూర్వజన్మకర్మ ఫలమూ కాదు. దైవ నిర్ణయమూ కాదు.

సమాజంలోనున్న దోపిడీ విధానం వల్లనే కొందరు సుఖపడుతున్నారు. కొందరు కష్టపడుతున్నారు.

పెట్టుబడిదారులు శ్రామికుల శ్రమశక్తిని దోపిడీ చేసి ఏమాత్రం శ్రమపడకుండానే సుఖపడుతున్నారు. శ్రమ జీవులు తమ శ్రమ ఫలితంలో కొంత భాగం మాత్రమే పొందగలుగుతున్నారు.

దోపిడీ వ్యవస్థలో కొందరు ధనికులై సర్వసౌఖ్యాలు అనుభవిస్తూవుండగా, కొందరు పేదలుగా, కొందరు నిరుద్యోగులుగా. కొందరు బిచ్చగాళ్లుగా, స్త్రీలలో కొందరు వేశ్యలుగా భయంకరమైన కష్టాలతో జీవితాలు గడుపుతున్నారు.

దోపిడీ చేయబడే వారంతా (నిరుపేదలు) ఒకవర్గంగా ఏర్పడి దోపిడీ చేసేవారిని (పెట్టుబడిదారులను) ఎదుర్కొని దోపిడీ కొనసాగకుండా చేయాలి. అంటే దోపిడీ దారుల స్వేచ్ఛను అరికట్టి దోపిడీ విధానాన్ని అంతంచెయ్యాలి.

అన్నిరకాల వస్తువులను ప్రజలందరికీ సరిపోవునన్ని ఉత్పత్తి చేసి పంపకం సక్రమంగా కొనసాగునట్లు చేస్తే ప్రజలందరూ సుఖపడుతారు.

దోపిడీ విధానం అంతమైతే అన్నిరకాల అసమానతలు అంతమవుతాయి.

సమసమాజ నిర్మాణం కోసం విప్లవం కొనసాగాలి.

సర్వ జనుల సుఖం కోసం సమసమాజం రావాలి.

—o—

V-10

## రేగులపాటి కిషన్‌రావు

రచనలు:

వెలువడినవి :

విషసర్పం.

పతివ్రత ఎవరు? వాణిశ్రీ.

ఆమె వితంతువు కాదు.

త్వరలో :

ప్రేమ పరీక్ష.

విప్లవ పథంలో స్త్రీ.

తెలివికల దొంగలు.

ప్రతులకు :
న్యూ స్టూడెంట్స్ బుక్ సెంటర్
ఏలూర్‌రోడ్, విజయవాడ—2

# విషసర్పం

నైమిషారణ్యంలో శౌనకాది మహామునులు విష్ణులోక ప్రాప్తి కోసం వెయ్యి సంవత్సరాల మహా యజ్ఞం ప్రారంభించిన తర్వాత సూతుడు వచ్చాడు.

మహామునులు సూతుణ్ణి రెండు పేజీల పొడుగున పొగడి "కృష్ణ దేవుని పాద పద్మాల నుండే స్వర్గం పుట్టింది కదా! అతడెన్నో అవతారాలెత్తాడు కదా! కపట మానవుడై అలౌకికమైన కార్యాలు చేశాడు కదా! అవన్నీ మాకు వినిపించవయ్యా!" అన్నారు.

(కృష్ణుని పాదాల నుండి స్వర్గం పుట్టిందంటారేమిటి వీళ్ళు? స్వర్గమంటే ఏమిటి? కృష్ణుడు కపట మానవుడై అలౌకిక కార్యాలు చేశాడట. కృష్ణుడు ఈనాటి కపట రాజకీయ నాయకునిలాంటివాడు. కపట రాజకీయ నాయకుణ్ణి ఆశ్రయించి యుండువారు ఎంతగొప్ప వారో కృష్ణ భక్తులు కూడా అంత గొప్పవారు కావచ్చు.)

సూతుడు భగవత్కథల గురించి చెప్తూ "సరిగా ధర్మం ఆచరించీ కూడా భగవంతుని మీద ప్రీతి కలుగక పోతే ఆ ధర్మాచరణ వ్యర్థ పరిశ్రమే అవుతుందండి" అన్నాడు.

(నేను నా ధర్మాలను సరిగా నిర్వర్తిస్తున్నాను. కాని నాకు భగవంతుని మీద ప్రీతి కలుగడం లేదు. అయితే నా ధర్మాచరణ వ్యర్థమా? అయ్యా! సూతుడా దీనికి సమాధానమేమిటయ్యా?)

మోక్షం కావలసిన వాళ్ళు ఘోర రూపులైన భూతపతి మొదలైన దేవతల్ని ఉపాసించరు. శాంతరూపుడైన నారాయణుణ్ణే, అతని అవతారాలనే ఉపాసిస్తారు. ధనము, సంతానము కోరేవాళ్ళు భూతాలను ప్రజాపతుల్ని ఉపాసిస్తారు.

(సూతుడు చెప్పిన దాంట్లో విశాల భావం ఏమీ లేదు. దేవతల్లో కూడా ఘోరరూపులని, శాంతరూపులని మానవులలో వున్నట్లే రెండు రకాలవాళ్ళు ఉన్నట్టు తెలియజేశారు. సూతుడు నారాయణుణ్ణి గొప్పచేసి భూతపతిని హీనంగా చూశాడు. భూతాలను ఉపాసిస్తే ధనము, సంతానం లభ్యమవుతుందని సూతుడు సెలవిచ్చాడు. అసలు భూతమంటే ఏమిటో సూతుడు చెప్పలేదు. మోక్షం కావలసిన వాళ్ళు కూడా నారాయణుణ్ణే పూజించుమని చెప్పితే డబ్బు, పిల్లలు కావాలనుకునే వాళ్ళు కూడా నారాయణుణ్ణే పూజిస్తున్నారెందుకు? డబ్బు, పిల్లలు సంపాదిస్తే సుఖపడవచ్చుగాని మోక్షము సంపాదిస్తే ఏం సుఖముంటుంది? అసలు మోక్షమంటే ఏమిటి? చాలా మంది మోక్షం, మోక్షం అంటారు గాని దాని అర్థమేమిటో చెప్పరు. దాని ప్రయోజనమేమిటో చెప్పరు.)

భగవంతుడు పశు, పక్షి మనుష్య రూపాలలో పుడుతాడట.

(భగవంతుడే మనిషై పుట్టినప్పుడు మనిషి భగవంతుణ్ణి పూజించుట యెందులకు?)

ఆదిలో దేవుడు మహాసముద్రములో పడుకున్నాడట అతని బొడ్డులో నుండి తామర పువ్వు పుట్టిందట తామర పువ్వులో నుండి బ్రహ్మ పుట్టాడట. విరాట రూపుడైన భగవంతుని అంగప్రత్యంగాల లోనే సమస్త లోకాల కల్పన జరిగిందట. విరాటరూపుడైన దేవునికి కాళ్ళు, చేతులు, కండ్లు, ముక్కులు, చెవులు, ముఖాలు, శిరస్సులు అన్నీ వెయ్యి చొప్పున వున్నాయట. విరాటరూపం సూక్ష్మాంశలోనే దేవతలు, పశువులు, పక్షులు మొదలైనవన్నీ పుడుతాయట.

(దేవుడు మొదట సముద్రములో పడుకున్నాడని చెప్పాడు. సూతుడు. అయితే ఆ సముద్రాన్ని సృష్టించిన వాడెవ్వడు? దేవుని కంటే ముందే సముద్రం సృష్టించబడిందా? లేక దేవుడే సముద్రాన్ని సృష్టించాడా? అసలు దేవున్ని సృష్టించిన వారెవ్వరు? దేవుడు ఎలా సృష్టించ బడ్డాడు? ప్రస్తుతమా దేవుడెక్కడవున్నాడు? దేవుడు నీటి మీద పడుకుంటే మునిగిపోలేదా? దేవుని బొడ్డులో నుండి తామర

పువ్వు పుట్టిందట. ఆయనగారి బొడ్డులో మట్టి ఉందా ఏమిటి కర్మ? తామర పువ్వు తామర తీగకు పుడుతుంది గాని బొడ్డులో పుడుతుందా? ఎంత బుద్ధితక్కువ వాడయినా దీనిని అంగీకరిస్తాడా? తామర పువ్వు కొడుకే బ్రహ్మనట. మనకు రెండు కళ్లు, ఒక ముక్కు ఒక తలకాయ ఉంటుంది. కాని దేవునికి అన్నీ వెయ్యి చొప్పుననే వున్నాయట. జీవశాస్త్రజ్ఞుల పరిశోధన ఫలితాలను పరిశీలిస్తే ఈ విషయం పూర్తిగా అసత్యమని తేలిపోతుంది)

భగవంతుడు లెక్కలేనన్ని అవతారాలెత్తాడట. రాక్షసుల వల్ల లోకులు బాధలనుభవించినప్పుడు అతడు అవతరించి రాక్షసులను చంపి లోకులను రక్షిస్తాడట.

(సర్వసృష్టికి భగవంతుడే కారకుడైనప్పుడు అవతారమెత్త చంపడమెందులకు? భగవంతుడింత బుద్ధితక్కువ పనులు చేస్తాడా? ఇంత నీచపు పనులు చేసే దేవుణ్ణి నాలుగు తన్నాలని బుద్ధి పుట్ట దూ? ఇంత బుద్ధితక్కువ దేవుణ్ణి నమ్ముకుంటే మనకష్టాలెలా నిర్మూలమవుతాయి?)

భాగవత మహాపురాణమును భగవంతుడైన వేదవ్యాసముని రచించాడట.

(ఈ భాగవత మహాపురాణమును సామాజిక స్పృహగల రేగులపాటి కిషన్‌రావు హేతువాద దృక్పథంతో విమర్శ చేస్తున్నాడు)

వ్యాసుని కుమారుడు శుకుడు. అతణ్ణి చాలామంది మూఢుడని భావిస్తారు. అతడు నగ్నంగా వెళ్లుతున్నప్పుడు సరోవరంలో స్నానం చేస్తున్న అప్సరసలు నగ్నంగా వచ్చి నమస్కరించారు.

(శుకుడు పిచ్చివాడా ఏమిటి? బట్టలు లేకుండా తిరగడమెందుకు? అప్సరసలు కూడా నగ్నశుకునికి నగ్నంగానే నమస్కారాలు పెట్టారట. ఆ పిచ్చివానికి ఈ పిచ్చిముండల నమస్కారాలు సరిపోయాయి. ఈ పిచ్చి శుకుడే పరీక్షిత్తుకు భాగవతం వినిపించాడట)

తృతీయ యుగమైన ద్వాపరంలో నారాయణుని అంశలో

పరాశరుని కుమారుడై, వసురాజు కూతురైన సత్యవతి గర్భములో వ్యాసుడు పుట్టాడట. అతడు చాలా పుస్తకాలే వ్రాశాడట.

స్త్రీలకు, శూద్రులకు వేదాలు వినే అధికారంలేదట. కనుక వాళ్ల శ్రేయస్సుకోసం దయతలంచి వ్యాసుడు మహాభారతం వ్రాశాడట.

(స్త్రీలకు, శూద్రులకు వేదాలు వినే అధికారం ఎందుకు లేదు? ఓయీ వ్యాసమునీ! ఈ ప్రశ్నకు సమాధానమివ్వగలవా? నువ్వు స్త్రీల, శూద్రుల శ్రేయస్సు కోరేవాడవే అయితే నా ప్రశ్నకు న్యాయమైన సమాధానం ఇచ్చితీరాలి. నీవు స్త్రీలపై, శూద్రులపై దయతలంచి భారతం వ్రాశావన్న విషయం సత్యమైనదేనా? దీనికి కూడా నీ సమాధానం కావాలి. స్త్రీల కొరకు, శూద్రుల కొరకు వ్రాసిన వెధవ భారతాన్ని బ్రాహ్మణ పండితులు, క్షత్రియ పండితులు, వైశ్య పండితులు చదువ వచ్చునా?)

భారతం వ్రాసిన తర్వాత వ్యాసుడు భాగవతమో ఏదో వ్రాయాలనుకొన్నాడు. నారదుడు వచ్చాడు. (నారదుడు దేవఋషి అట, వ్యాసుడు విప్రఋషిఅట)

(ఋషులలో కూడా తెగలేనా?)

నారదుడు వ్యాసుణ్ణి కొంచెంసేపు పొగిడి చివరికి "నువ్వు మహాభారతం రాసి ధర్మసాధనకోసం కామ్యకర్మే ఉపదేశించి అన్యాయంచేశావు. జీవులు సంసార బంధం నుండి తరించగలుగునట్లు భగవంతుని లీలలు వర్ణించు" అన్నాడు.

పూర్వ జన్మలో నేనొక దాసీ గర్భములో పుట్టాను. బ్రాహ్మణుల ఇంట మా అమ్మ పనిచేస్తుండేది. అక్కడికి యోగులు వచ్చి చాతుర్మాస్య వ్రతం చేశారు. వారి ఆజ్ఞప్రకారం భిక్షాపాత్రలలో మిగిలిన ఎంగిలి అన్నం తినేవాడిని దానితో నా పాపం తొలగి పోయింది" అంటూ చెప్పాడు.

(భాగవతం వ్రాసిన కాలంలోనే పూర్వజన్మ నమ్మకాలు ఉండేవనియూ, కొందరు ఉన్నతులుగానూ, కొందరు హీనులుగానూ

చూడబడే వారనియు, బ్రాహ్మణులకు దాసీలు ఉ దేవారనియు, దాసీలు బ్రాహ్మణులకు సేవలు చేసేవారనియు, వారు పడేసే ఎంగిలి మెతుకులు తినేవారనియు ఈ కథల వలన తెలియుచున్నది దాసీలు బ్రాహ్మణులకు సేవలుచేస్తూ ఎంగిలి కూడు తింటే పాపాలు పోతాయన్న నమ్మకాన్ని కలిగించారు. ఈ కథ విని కొందరు బ్రాహ్మణులకు అణిగిమణిగి ఉండేవారేమో)

"తర్వాత ఘోరారణ్యాలలో ప్రవేశించి ఘోర తపస్సు చేసి భగవంతుణ్ణి చూచి తర్వాత చచ్చిపోయాను. వెయ్యి యుగాల తర్వాత బ్రహ్మదేవునికి నేను పుట్టాను ముల్లోకాలు తిరుగుతున్నాను ఎక్కడా నాకు ఆటంకంలేదు. దేవుడు నాకీవీణనిచ్చాడు దీని మీద పాటలు పాడుకుంటూ తిరుగుతుంటాను."

(మన అనుభవంలోకి వచ్చిన అనేక సంఘటనలు కొన్నాళ్ళ తర్వాత మరచి పోవడం జరుగుతుంది. ఇక గత జన్మలో జరిగిన సంఘటనలు జ్ఞాపకముండడానికి వీలుందా? చనిపోయిన తర్వాత మరో జన్మవుంటుందనడానికి రుజువేది? వెయ్యి యుగాల తర్వాత నారదుడు బ్రహ్మకు పుట్టాడట. కవిగారు దీనిని ఎలా రుజువు చెయ్య గలరు?

భగవంతుడు అంతటా వ్యాపించి వున్నాడని చెప్పిన వారే తపస్సు చేస్తే భగవంతుడు కనిపిస్తాడని చెప్పారు. తపస్సంటే ఏమిటి? అరణ్యాలలో ముక్కుమూసుకొని కూర్చుండి దేవుణ్ణి జ్ఞాపకం చేసుకోవడమేనా? సమాజ శ్రేయస్సు కొరకు పాటుబడకుండా తయారుగావున్న ఏదో ఒక ఆహారం తిని కూర్చుండి వ్యర్థంగా జీవితాన్ని గడపడమే తపస్సు అని దీని వలన తెలియుచున్నది. తపస్సు చేసే వారు సమాజానికి ఏ విధంగానూ ఉపయోగపడకపోగా కష్టపడి పని చేసే వారికి ఉపయోగపడవలసిన ఆహారం తిని సమాజానికి ద్రోహమే చేస్తారు. ఇలాంటి నీచులకేనా భగవంతుడు కనిపించేది?

నారదుడు ముల్లోకాలు తిరుగుతాడట. ఏ ముల్లోకాలో? ఈ మూడులోకాల పేర్లేమిటో? అతడేవాహనం మీద కూర్చుండి

ఈమూడు లోకాలు తిరుగుతాడో? అనే ప్రశ్నలకు సమాధానాలు కావాలి.

దేవునికి వడ్రంగి పని కూడా వస్తుందా ఏమిటి? నారదునికి చక్కని వీణనిచ్చాడట. "వీణ నిచ్చిన దేవుడా! గొప్పవాడవీవురా! అంటూ దేవుణ్ణి గూర్చి తపస్సు చేస్తాడేమో వీడు.)

మహాభారత యుద్ధం జరిగింది. చనిపోయిన వాళ్లు స్వర్గం వెళ్లారు. అశ్వత్థామ దుర్యోధనునికి సంతోషం కలిగించడం కోసం నిద్రలోవున్న ద్రౌపది అయిదుగురు కుమారుల తలలను నరికి దుర్యోధనునికి చూపించాడు. దుర్యోధనుడు అసహ్యపడ్డాడు.

అర్జునుడు ద్రౌపదితో ఓ శపథం చేశాడు. "ఆ బ్రాహ్మణాధముడి తల నరికి తెస్తాను. నీ కుమాళ్ళ అంత్యక్రియలు జరిగిన తర్వాత వాని తలకాయ మీద నిలబడి స్నానం చెయ్యి"

కృష్ణార్జునులు రథంతో సహా వెళ్ళి అశ్వత్థామను రథానికి కట్టేసి తెచ్చాడు.

ద్రౌపది అది చూచి అశ్వత్థామకు నమస్కరించి "ఇతడు బ్రాహ్మణుడు కనుక విడిచి పెట్టండి. ఇతడు గురు పుత్రుడు కనుక విడిచి పెట్టండి" అంది.

(యుద్ధం చేసి చనిపోయిన వాళ్ళు స్వర్గం పోతారని చెప్పితే స్వర్గం వెళ్దామన్న ఆశకలవారు యుద్ధములో పాల్గొంటారు. ఆనాటి కాలంలో స్వర్గం వెళ్దామన్న ఆశ చాలా మందిలో వుంది. ఈనాటికీ ఈభావం కొందరిలో వుండనే వుంది. కాని ఆ స్వర్గం ఎచ్చట వుంది? ఎవరికీ తెలియదు.

ఈ చిన్న కథలో దుర్యోధనుని గొప్పతనం అశ్వత్థామ నీచ బుద్ధి అర్థమవుతుంది. నిద్రపోయిన వారిని చంపిన అశ్వత్థామ ఎంత నీచాతి నీచుడో ఆలోచించండి. అలాంటి నీచుణ్ణి చంపి తెస్తానని ప్రతిజ్ఞచేసిన అర్జునుడు బంధించి తెచ్చాడు. అలాంటి నీచునికి సిగ్గు లేని ద్రౌపది నమస్కారాలు చేసింది.

అర్జునుడు తన ప్రతిజ్ఞను నిలబెట్టుకోలేదు. కనుక అర్జునుడొక

అసత్యవాది అంటున్నాను.

బ్రాహ్మణుడు, గురుపుత్రులు ఎన్ని ఘోరాలు చేసినా క్షమించి విడిచి పెట్టండి. అని ఈ కథలోని నీతి. ఈ కథ చదివిన తర్వాత కొందరు బ్రాహ్మణులు ఎన్ని ఘోరాలైనా చేయడానికి ప్రయత్నం చేయవచ్చు. బ్రాహ్మణేతరులు ఎంత బాధావమానాల కైనా గురికావచ్చు.

ఇలాంటి వెధవ నీతులు రాసిన వ్యాసుడు గొప్పవాడెలా అయ్యాడోమరి)

భారత యుద్ధములో చావగా మిగిలిన ఇరుపక్షాల వారు గంగలో స్నానం చేసి చనిపోయిన బంధువులకు నీళ్లదానం చేశారు.

కృష్ణుడు ద్వారకకు పోతుండగా ఉత్తర పరుగెత్తివచ్చి 'నా గర్భములో నున్న పసివాణ్ణి కాపాడు' అంది. కృష్ణుడు ఉత్తర గర్భములో ప్రవేశించి శిశువును కాపాడాడు.

కుంతి వచ్చి కృష్ణుణ్ణి ఇలా పొగిడింది.

"విషం త్రాగించినప్పుడు, లక్కయిల్లు కాల్చినప్పుడు రక్షించావు, మాయా జూదములో ఓడినప్పుడు రక్షించావు...బ్రాహ్మలకు, దేవతలకూ మేలు చెయ్యడం కోసమే నీవు అవతారమెత్తావు కృష్ణా"

ధర్మరాజు కృష్ణునితో ఇలా అన్నాడు.

"మూర్ఖుణ్ణి నేను, దుర్మార్గున్ని నేను. కుక్కలు, నక్కలు పీక్కుతినే శరీరం కోసం 18 అక్షౌహిణీల సైన్యాన్ని చంపించాను నేను. కోటి సంవత్సరాలు నరకం అనుభవించినా ముక్తి లేదు నాకు"

(చనిపోయిన వారికి నీళ్ళ దానం చేస్తే కలిగేలాభమేమిటి? కృష్ణుడు ఉత్తర గర్భములోకి ఎలా వెళ్ళాడు? శిశువును ఎలా రక్షించాడు?-ఇలాంటి వెధవ ప్రశ్నలు వేయకూడదంటారు మనవాళ్లు-కృష్ణుడు అనేక సందర్భాలలో పాండవులను రక్షించాడట దుర్మార్గుల నుండి. లోకంలో దుర్మార్గులే పుట్టకుండా, పాండవులకు ఆపదలే రాకుండా కృష్ణుడు ఎందుకు చూడలేదు. ఆ శక్తి అతనికి లేదా? అయితే సర్వశక్తి సంపన్నుడెలా అవుతాడు. కృష్ణుడు బ్రాహ్మణు

లను, దేవతలను మాత్రమే కాపాడడానికి పుట్టాడట. సర్వజీవులను రక్షించడానికి కృష్ణుడు పుట్టాడని కవి రాస్తే బాగుండేది. సర్వజీవుల క్షేమం కవికి అవసరం లేదు కనుక రాయలేదు. తను దుర్మార్గుడనని ధర్మరాజు స్వయంగా ఒప్పేసు కున్నాడు. నిజమే మరి)

కురుక్షేత్రంలో బాణాల పరుపు మీద పడుకొని యున్నాడు భీష్ముడు. పాండవులు, నారదుడు, వ్యాసుడు ఇంకా చాలా మంది అచ్చటికి వచ్చారు.

భీష్ముడు పాండవులను చూచి "కృష్ణుని ప్రాపు వున్న మీరు ఎన్నో బాధలు పడ్డారు"అని బాధ పడ్డాడు. భీష్ముడుకూడా కృష్ణుణ్ణి హెచ్చు మోస్తరులోనే పొగిడాడు. (ఈ దొంగ వెధవను పొగడని వారెవ్వరూ లేనట్టుంది రేగులపాటి కిషన్‌రావు లాంటివాళ్ళు తప్ప) కృష్ణుని బుద్ధి తక్కువ పనులన్నీ గొప్పవని పొగిడాడు భీష్ముడు.

భీష్మునికి ఇష్టమున్నప్పుడు చనిపోయేశక్తి ఉందట (ఆత్మ హత్య చేసుకోకుండా ఇష్టమున్నప్పుడు చనిపోయే శక్తి ఎవరికీ వుండదు.) భీష్ముడు చచ్చిపోయిన తర్వాత అతనిని కాలబెట్టి పడ్డా రట ధర్మరాజు మొదలగు వారు (ఇది మామూలుగా జరిగేదే).

ధృతరాష్ట్రుని కొడుకులను చంపిన పాండవులు గాంధారినీ, ధృతరాష్ట్రుణ్ణీ ఊరడించి రాజ్యాన్ని ఆక్రమించారట. (వాళ్లను ఊర డించడ మెందుకో తెలుసా? తమ మీద వున్న కోపం తొలగి పోవాలని తమకు ఎదురు తిరగకుండా ఉండాలని, లేకపోతే రాజ్యం ఎవడు పరి పాలిస్తే ఏమిటి చెప్పండి. పాండవులు తమకు సగ రాజ్యం కావాలనే కోరారు. కాని "మీరు రాజ్యం న్యాయంగా పాలించుట లేదు, మీరు గద్దె దిగండి. మేము న్యాయంగా పరిపాలిస్తాము" అని అన్నారా? రాజ్యం పాలిస్తే సుఖాలనుభవించవచ్చునని పాండవులు ఆరాట పడ్డారు. ఇదే సత్యం. కాని కవిగారు ఈ సత్యాన్ని ఎక్కడా బయట పెట్టలేదు.)

ధర్మరాజు రాజ్యం ఎలా చేశాడు అని శౌనకుడు అడిగిన ప్రశ్నకు సూతుడు చెప్పిన సమాధానం వినండి.

ధర్మరాజు కృష్ణుని మీద భారంవేసి దేవేంద్రునిలాగా రాజ్యం చేశాడు (ఇక్కడ ధర్మరాజు పరిపాలనను దేవేంద్రుని పరిపాలనతో పోలుస్తున్నాడు కవి. దేవేంద్రుని పరిపాలనలో కొందరు సేవకులు గానూ, కొందరు ధనికులుగానూ వుంటారు. సాంఘిక, ఆర్థిక అస మానతలుంటాయి. స్త్రీలలో కొందరు పతివ్రతలు-బానిసలు-గానూ కొందరు వేశ్యలు గానూ వుంటారు. అంటే దేవేంద్రుడు ఎంత నీచంగా, హీనంగా పరిపాలించాడో అలాగే ధర్మరాజు కూడా నీచంగా, హీనంగా పరిపాలించాడని అర్థం) ధర్మరాజు పరిపాలనా కాలంలో వానలు సకాలంలో కురిశాయి (ధర్మరాజుకు ప్రకృతిని శాసించే శక్తి వుందా? ధర్మరాజును గొప్పచేయడం కోసం కవిగారు ఏదేదో వదురుతున్నారు.)

కృష్ణుడు ద్వారకకు పోవుచుండగా చూచిన వాళ్ళంతా మూర్ఛపోయారు. (ఇతడు ద్వారకకు వెళ్లాలని ఎప్పుడో బయలు దేరాడు ఇంకా పోడేమిటి? ఇతడిక్కడ నెలల తరబడి కూర్చుంటే ఆయన రాజ్యపాలన ఎలా కొనసాగుతుంది. కవిగారు కూడా కృష్ణుడు ద్వారకకు పోతుండగా మూర్ఛపోయి ఇదంతా వ్రాశాడేమో)

కౌరవ స్త్రీలు కృష్ణుణ్ణి చూడాలని మేడలెక్కారు. ప్రేమ తోనూ, సిగ్గుతోనూ వోరచూపులు చూశారు. చిరునవ్వులతో పూల వాన కురిపించారు (కౌరవ స్త్రీలు కృష్ణుణ్ణి వోర చూపులు చూడడ మెందుకట? సిగ్గు పడడమెందుకట? కౌరవ స్త్రీలు పతివ్రతలు కాదా? లేకపోతే కృష్ణుని మీద ఓర చూపులు విసరడమేమిటి? నవ్వితే పూల వాన కురుస్తుందా కవిగారూ?)

అర్జునుడు శ్రీకృష్ణునికి రత్నాలు చెక్కిన ముత్యాల తెల్ల గొడుగు పట్టాడు (రత్నాలు చెక్కిన ముత్యాల తెల్లగొడుగు రాజు లకే కాని సామాన్యులకు లభ్యమవుతుందా? ఇలా ఎన్నో సుఖాలను అనుభవించవచ్చునన్న ఉద్దేశముతోనే రాజులు రాజ్యాల కొఱకు యుద్ధాలు చేస్తారు.)

కృష్ణుడు తన లీలలతో జగత్తు సృష్టిస్తాడు, పాలిస్తాడు, సంహా

రిస్తాడు. (మన పిల్లలు బట్టలతో బొమ్మలు చేసి ఆడించి ఆసక్తి తగ్గిన తర్వాత వాటిని చెడగొట్టి నట్టు. కృష్ణదేవుడు మన పిల్ల వెధవల్లాంటి వాడే)

గోపికా స్త్రీలు కృష్ణుని సొల్లు మ్రింగి చాలా అదృష్టవంతుల య్యారట. ఇతడు ఎనమందుగురు భార్యలను పెళ్లాడాడు. (బహు భార్యత్వము ఆ కాలములో ఉండేదని దీని వలన తెలియుచున్నది)

కృష్ణుడు రథములో కూర్చుండి చాలా కష్టపడి ద్వారకకు చేరుకున్నాడు. పాంచజన్యం పూరించాడు. అది విన్న వెంటనే బంధు మిత్రులు, పురజనులు, తింటున్న వాళ్ళు, స్నానం చేస్తున్న వాళ్ళు, ముఖంకడుక్కుంటున్న వాళ్లు......వాళ్లు, వున్న పళాన కృష్ణుని దగ్గఱకు వచ్చారు. నర్తకులు, గాయకులు, పౌరాణికులు, లంజలు ఎంతో మంది వచ్చారు. ప్రజలు అంటే స్త్రీలు, పురుషులు కృష్ణునితో అన్నారు "నీవే మా తండ్రివి, నీవే మా భర్తవి." తర్వాత కృష్ణుడు ఇంట్లోకి వచ్చాడు. అతని తల్లులకు చనుబాలు చేపినవి. పదహారు వేల మంది భార్యలు అతణ్ని కౌగలించుకున్నారు. ఆ భార్యలు కృష్ణుడు వూళ్ళో లేనంత కాలమూ పాటిస్తూవున్న నియమాలు వదిలి పెట్టారు.

(కృష్ణుని మీద ప్రజలందరికీ భక్తి కలదని చెప్పుటకు తింటున్న వాళ్ళు స్నానం చేస్తున్న వాళ్ళు వున్న పళాన వచ్చారని వ్రాశాడు కవి. ఈనాడు కూడా ఎవరైనా మంత్రి వస్తే అనేక మంది చూడడానికి వస్తారు. ఆ మంత్రి ఎలాంటి గుణాలు కలవాడైనా సరే. ఇందులో వ్యక్తిగతంగా కృష్ణుని గొప్పేమీ లేదు. కృష్ణుడు రాజు కనుక ఎంతో మంది చూడడానికి వచ్చారు. కృష్ణుణ్ణి సంతోషపెట్టి బహుమతులు పొందడానికి నర్తకులు, గాయకులు చేసే ప్రయత్నమిది కృష్ణుని కాలంలో లంజలకు కొదవలేదు. ఎంతో మంది లంజలు కృష్ణుణ్ని చూడడానికి వచ్చారు. రాజు అనుగ్రహం సంపాదిస్తే అతనితోనూ, అతనిచ్చే సిరిసంపదలతోనూ, సుఖపడ వచ్చునన్నది వారి ఆశ. ద్వారకలోని మగవాళ్ళు, ఆడవాళ్ళు

కృష్ణునితో నీవే మా భర్తవి, అంటున్నారు. మగవాళ్ళకు కూడా కృష్ణుడే భర్తనట. ఆ స్త్రీలకు కూడా కృష్ణుడే భర్తనట. కృష్ణుడు ఇంట్లోకి రాగానే తల్లుల చన్నులు చేపినవట. ఇలా రాసిన వానికి సందర్భ శుద్ధి ఉన్నట్టేనా? కృష్ణుడు పదహారు వేల మందితో ఎలా కాపురం చేశాడో! వాని బొంద చేశాడు. కవిగారి పైత్యమిదంతా. భర్తలు ఊళ్ళో లేనప్పుడు ఆడుకోకూడదట. స్నానం చేయకూడదట. ముఖం కడుక్కోకూడదట. నవ్వ కూడదట. ఆడదాన్ని అణచి వేయడానికి చెప్పిన నీతులివి. ఇలాంటి పిచ్చి నీతులను ఏ స్త్రీ అంగీకరించ నక్కర లేదు. భాగవతాన్ని ఆరాధ్య గ్రంథంగా భావించే స్త్రీ జనులారా! దానిని ఒక్కసారి విప్పి చూడండి సత్యాసత్యాలు మీకే తెలుస్తాయి.)

ధర్మరాజు భార్య అనుకూలవతి, తమ్ముళ్లు బానిసల్లాగా పడి వుండేవారు. పన్నుల వల్ల, ప్రజలు నేరాలు చేసి ఇచ్చిన జరిమానాల వల్ల డబ్బు సంపాదించి, బలహీనులైన రాజులను బెదిరించి డబ్బు సంపాదించి అనేక సుఖాలు అనుభవిస్తూ, అశ్వమేధ యాగాలు చేస్తూ ప్రజలను పరిపాలించాడు ధర్మరాజు. ఉత్తర గర్భములో చచ్చి మళ్ళీ బ్రతికి పరీక్షిత్తు పుట్టాడు.

జాతకం చూడడంలో ఆరితేరిన బ్రాహ్మణులు, పరీక్షిత్తు పుట్టిన నాటి నుండి చచ్చే వరకు ఏమేమి పనులు చేస్తాడో, ఎవరెవరికి మేలు చేస్తాడో, ఎవరెవరికి కీడు చేస్తాడో, చివరికెలా చస్తాడో అన్నీ చెప్పారు. (రేగులపాటి కిషన్‌రావు భాగవతాణ్ణి ఇలా విమర్శిస్తాడని వాళ్లు చెప్పడం మరిచి పోయినట్టున్నారు.)

(పరీక్షిత్తు బ్రాహ్మణులకు మేలు చేస్తాడట అంటే మిగతా వారికి కీడు చేస్తాడన్న మాటే కదా! బ్రాహ్మణులకు మేలు చేయడమంటే ఏమిటి? దానాలు చేస్తాడని అర్థం. బ్రాహ్మణేతరుల శ్రమశక్తి నిదోచి బ్రాహ్మణులకు పంచి పెడుతాడని, ఆ గడ్డి బ్రాహ్మణులు మేస్తారని అర్థం.)

చివరికి బ్రాహ్మణుని శాపం వల్ల, తక్షకుడనే పాము కాటు

వల్ల, చనిపోతాడని కూడా బ్రాహ్మణులు చెప్పారు.

(భవిష్యత్తు తెలుసుకునే శక్తి బ్రాహ్మణులలో ఉందని గొప్ప చేయడం కోసం కవిగారు వేసిన ఎత్తుఇది.)

విదురుడు తీర్థ యాత్రలు చేసి తిరిగి వచ్చాడు. ధర్మరాజు విదురుని పై అనేక ప్రశ్నలు వేసి సమాధానాలు పొందాడు.

మాండవ్య ముని శాపం వల్ల వందేళ్లు శూద్రుడై విదురుని రూపంలో వున్నాడట. ఈ వందేళ్లు సూర్యుడు యమరాజ్యం పరిపాలించాడట. (ఆనాటి కాలంలో కూడా శూద్రులను హీనంగా చూచే వారని దీనివలన తెలుస్తుంది. సాంఘిక, ఆర్థిక అసమానతలతో కూడివున్న మన సాంప్రదాయాలను మార్చుకోవలసిన అవసరం మనమీదేవుంది. మార్పును అంగీకరించని వాళ్లను ప్రక్కకు నెట్టి ముందుకు సాగాలి మనం.)

విదురుడు తన అన్నగారైన గ్రుడ్డి ధృతరాష్ట్రునికి హితోపదేశం చేశాడు. గ్రుడ్డివాడు భార్యతో సహా ఇల్లువదిలి హిమాలయాలకు వెళ్ళిపోయాడు. గంగానది సప్త ఋషుల ప్రీతి కోసం ఏడు పాయలై ప్రవహించిన చోట గ్రుడ్డివాడు చచ్చిపోయాడు. గాంధారి సహగమనం చేసింది. (ఋషుల ప్రేమ పొందడం కోసం సామాన్య ప్రజలంతా, వాళ్ళు చెప్పిన విధంగా ప్రవర్తించారని బోధించదలచి గంగానది ఋషుల ప్రీతి కొఱకు ఏడు పాయలుగా చీలి ప్రవహిస్తుందని చెప్పారు కవిగారు. ఈ కథ రాయక పూర్వమే, భూమి ఎత్తు పల్లాలననుసరించి గంగానది ఏడు పాయలుగా చీలి ప్రవహించేది. అది చూచి ఈ కథకు అన్వయించాడు కవి.)

అర్జునుడు ద్వారక వెళ్ళి ఏడు మాసాల పాటు అక్కడే వుండి పోయాడు. అప్పుడు హస్తినాపురములో ఎన్నో ఘోరాలు జరిగాయి. తండ్రి కొడుకులకు, భార్యాభర్తలకు, బంధు మిత్రులకు కయ్యాలు జరిగాయి. (అవి ఎందుకు జరిగాయో కవిగారు చెప్పలేదు. బహుషా ధర్మరాజుగారి పరిపాలనలో అనేక లోపాలుండవచ్చు) అప్పుడే ప్రకృతి కూడా ఘోరంగా ఉందని కవిగారు వర్ణించారు.

"కుక్క నన్ను చూచి మొరుగుతుందేమిటి? అంటాడు ధర్మ రాజు మొరిగే కుక్కను చూచి (ధర్మరాజు ఆ కుక్కను ఎప్పుడైనా కొట్టాడేమో) "ఆవులు నాకు ప్రదక్షిణ చేయకుండానే పోతున్నాయేమిటి? గాడిదలు నాకు ప్రదక్షిణలు చేస్తున్నాయేమిటి?" అని భీమునిపై ప్రశ్నల వర్షం కురిపించాడు. భీముడు జవాబులు చెప్ప లేని మొద్దు విద్యార్థిలా నిలబడి పోయాడు. (రాజ్యములో నున్న ఆవులన్నీ ఇంతకు పూర్వం ధర్మరాజుగారికి ప్రదక్షిణలు చేసి వెళ్లేవా ఏమిటి? గాడిదలు ధర్మరాజుగారికి ప్రదక్షిణలు చేసినవట, అది ధర్మ రాజుగారికి ఇష్టంలేదు. పైగా అవమానంగా భావిస్తున్నాడు. ఆవులు ప్రదక్షిణలు చేయిడం ఆయనకు ఇష్టములా వుంది. అది ఆయన గౌరవ ప్రదంగా భావిస్తున్నట్టున్నాడు) ఇంతలో అర్జునుడు వచ్చాడు. అర్జు నుడు రాగానే ధర్మరాజు సమాధానాల కెదిరి చూడకుండా బోలెడు వెధవ ప్రశ్నలు వేశాడు.

చివరికి అర్జునుడు చెప్పాడు "కృష్ణభగవానుడు చచ్చి పోయా డన్నయ్యా!" (దేవుడు కూడా చచ్చి పోయాడేమిటి? మనుషుల్లాగే దేవుళ్లు కూడా చచ్చిపోతే దేవుళ్ళ గొప్పతన మేముంది?)

కృష్ణుని సాయంతో తానేమి సాధించాడో ఏడుస్తూ చెప్పాడు అర్జునుడు. భీష్ముడు, ద్రోణుడు మొదలగు క్రూరులను కృష్ణ సహాయం తోనే చంపడానికి అవకాశం లభించిందని చెప్పాడు (తాతగారి మీద గురువు గారి మీద అర్జునునికి ఎలాంటి అభిప్రాయం ఉందో చూశారా!)

కృష్ణుడు చనిపోవడం వలన "నేను బ్రతికివున్న పీనుగు నయ్యాను. చేతగాని చవటనయ్యాను నేను" అని చెప్పుకున్నాడు అర్జునుడు.

కృష్ణుడు చచ్చిపోయిన తర్వాత యాదవులు బ్రాహ్మణ శాపం వల్ల కల్లు తాగి ఒకళ్ళనొకళ్లు కొట్టుకొని చనిపోయారు. (కృష్ణుడు చచ్చిన తర్వాత ఆ బ్రాహ్మణులు ఎందుకు శాపమిచ్చారో కవిగారు చెప్పలేదు ఇక్కడ అయితే కల్లు తాగి కొట్టుకొని చావండని బ్రాహ్మ ణులు శాపమిచ్చారా? లేక వాళ్ళు కల్లు తాగి కొట్టుకొని చస్తే

బ్రాహ్మణుల శాపం వల్లనే ఇలాంటి ఘోరం జరిగిందని కవిగారు వ్రాశారా? ఏది ఏమైనా కల్లు లాంటి మత్తు పదార్థాలు సేవిస్తే ఎన్నో చెడు కార్యాలు చేస్తారు మానవులు.)

కృష్ణుడు చనిపోయిన వెంటనే అసత్యము, అధర్మము, హింస మొదలగునవి ప్రవేశించినవట. అంటే కృష్ణుని పాలనలో ప్రజలు నైతికంగా ఎదగ లేదనియు, అతడు దండిస్తాడన్న భయంతోనే వాళ్ళు ఇన్నాళ్ళు చెడుపనులు చేయకుండా వున్నారనియు, కృష్ణుని కాలంలో నిరంకుశంగా రాజ్యపాలన జరిగిందనియూ మనం గ్రహించాలి.

ధర్మరాజు మహాప్రస్థానం కోసం సిద్ధపడి పరీక్షిత్తును సింహాసనం మీద కూర్చోబెట్టాడు. (రాజ్యములో అల్లరులు ప్రారంభమైన తర్వాత పంటలు సరిగా పండని సమయములో రాజుకు దొరికే ప్రత్యేక సుఖాలేమీ వుండవు. అలాంటి సమయములో ధర్మరాజు పరీక్షిత్తుకు సింహాసన మిచ్చాడు. రాజ్యములో అల్లరులు ఎప్పుడు ప్రారంభమవుతాయి? ఒక వర్గము వారు ఇంకొక వర్గము వారిని భయంకరంగా అణచి వేయడానికి ప్రయత్నం చేసినప్పుడు అంటే ధర్మరాజు సర్వ జనులు సుఖించే విధంగా పాలించ లేదన్నమాట. అతడు పేరుకే ధర్మరాజు. అతని పరిపాలనలో ప్రజలు సుఖపడ్డారన్నది పచ్చి అబద్ధం. ప్రజలందరికీ సమాన అవకాశాలున్నప్పుడు చెడు అన్న దానిని తలయెత్తకుండా రాజు పాలించినప్పుడు అల్లరులు జరగడ మనేదే జరుగదు. మరొక విషయం ఆనాడు రాజు పదవి వారసత్వపు హక్కుగా వుండేది. అందువలన ప్రజల ఇష్టాయిష్టాలతో నిమిత్తం లేకుండా ధర్మరాజు పరీక్షిత్తును సింహాసనం మీద కూర్చుండ బెట్టాడు )

విష్ణు పాద పద్మాల మీదే ఏకాగ్రభావంతో హృదయం నిల్పి సద్గతి పొందారు పాండవులు (విష్ణు పాదాలు ఎక్కడ ఉంటాయో?) విదురుడు తీర్థ యాత్రలు చేస్తూ, చచ్చిపోయిన కృష్ణుని మీద మనస్సు నిల్పి చచ్చి నరక లోకం వెళ్ళిపోయాడు (ఈ నరకం ఎక్కడ వుందో

ఇంకా అమెరికా వాళ్లు కనుక్కోలేదు. నరకలోకం ఎక్కడ వుందో కవిగారికి తెలుసా?)

పరీక్షిత్తు బ్రాహ్మణుల ఉపదేశం వింటూ రాజ్యం చేశాడు. ఉత్తరుని కూతురు ఇరావతిని పెళ్లి చేసుకున్నాడు. (బ్రాహ్మణులు చెప్పినట్లు వింటూ రాజ్యం చేశాడట పరీక్షిత్తు. ఇతర వర్ణాలవారు చెప్పినట్లు రాజ్యము చేయవలసిన అవసరం లేదా? ఆనాడు కూడా మేనమామల బిడ్డలను పెళ్లి చేసుకునే ఆచారం వుండేదని ఈ కథ వలన మనం గ్రహించవచ్చు) ఆమె గర్భములో జనమేజయుడు జన్మించాడు. పరీక్షిత్తు యజ్ఞాలు చేశాడు, దానాలు చేశాడు. (దానాలు చేశాడంటే రాజ్యాన్ని సమతా భావంతో పాలించలేదని తెలియుచున్నది. యజ్ఞాలలో పశువధ చేసేవారట. ఆ పశువులను వధించడానికి యమధర్మరాజును ఆహ్వానించాడట. యమధర్మరాజును మనం కూడా ఆహ్వానిస్తే వస్తాడా? అయితే వాడెక్కడుంటాడు? కవిగారా రహస్యం చెప్పనేలేదు. ఆ రహస్యం తెలిస్తే యమధర్మరాజును ఆహ్వానించి వానిమీద బాంబువేసి చంపేస్తే ఈ యమధర్మరాజు పీడ విరుగడయ్యేది. మళ్ళీ ఎవడైనా యమ రాజ్యానికి రాజుగా వచ్చినను మానవులను చంపడానికి భయపడేవాడు. ఇక చావనేదే లేకుండా వుండేది. బాగుందా నా ఆలోచన, యమధర్మరాజు గారి ఖచ్చితమైన చిరునామా తెలుపండి. వానిని చంపివేసే పూచీనాది)

పరీక్షిత్తు అనేకమంది రాజులను జయించాడు. ఆ దేశ రాజుల దగ్గఱ పన్నులు పుచ్చుకున్నాడు. (బలము కలవాడు బలహీనుణ్ణి దోచుకునే పద్ధతి ఇది) పరీక్షిత్తు తనకనుకూలంగా వున్నవారికి బహుమానాలిచ్చాడు. (తన రాజ పదవిని కాపాడుకోవడం కోసం ఇదొక ప్రయత్నం.)

సరస్వతి ఒడ్డున కూర్చుండి భూమి (ఆవు రూపంలో) ఏడుస్తుండగా ధర్మము (ఆబోతు రూపంలో) భూమి నుద్దేశించి ఎందుకేడుస్తున్నావని ప్రశ్నించిందట. (భూమికి నోరుందా? అది మాట్లాడగలదా? పోనివ్వండి భూమి ఆవుగా మారిందని కవిగారు రాశారు. అది సాధ్యా

మా? ఇక ధర్మమునకు ఆకారమే ఉండదే అది ఎలా మాట్లాడు తుంది?)

రాజవేషధారి శూద్రుడు ఆవునీ, అంబోతునీ కర్రతో కొడుతూ వుండగా చూచిన పరీక్షిత్తు కోపించాడు. ఆబోతును, ఆవును అనేక ప్రశ్నలడిగాడు పరీక్షిత్తు రాజువేషములో నున్న కలి పరీక్షిత్తునుశరణు చొచ్చాడు. వ్యసనములు కలచోట నీవుండుమని పరీక్షిత్తు కలికి చెప్పాడు.

శ్రీకృష్ణుని నామ సంకీర్తన చేసినవాళ్లకి నీచకులంలో పుట్టిన దుఃఖం వుండదు. (కులాలలో కొన్ని నీచ కులాలని, కొన్ని ఉన్నత కులాలని సాంఘిక అసమానత్వం ఆనాడు కూడా వుంది.)

బ్రహ్మదేవుడు, శివునికి అర్ఘ్యమిచ్చే పవిత్రజలం కృష్ణుని పాదాలనుండే పుడుతున్నది. (శివ మతానికన్న విష్ణు మతమే చాలా గొప్పదని చెప్పుటకు ప్రయత్నమిది. దేవుళ్లను సృష్టించిన మనవాళ్లు వాళ్ల మధ్య కూడా అసమానత్వం సృష్టించారు. అసమానత్వం గల సమాజములోనున్న మానవుని ఊహలు కూడా చాలా వరకు ఇలాగే వుంటాయి )

కృష్ణుడు తప్ప మరొక భగవంతుడులేడు. (రామ భక్తులారా! మీ రాముడు దేవుడు కాదట. శివభక్తులారా! మీ శివుడు దేవుడు కాదట వ్యాసకవి కృష్ణుణ్ణి గొప్పచేయడం కోసం చేసిన ప్రయత్నం గ్రహించండి. కుక్కకన్న తోడేలు గొప్పదని, తోడేలు కన్న సింహము గొప్పదని చెప్పి ఆగిపోతే సింహము గొప్పదని చెప్పుటకు వీలవుతుందా? సింహము కంటే తెలివైన గొప్ప జీవులు కూడా వున్నాయి కదా! అలాగే కృష్ణుడు కూడా)

పరీక్షిత్తు వేటకు వెళ్లాడు. ( పరీక్షిత్తు జీవహింస చేసేవాడు. తోటి జీవుల మీద అతనికి దయ లేదు. ) దాహం వేయగానే శమీక ముని ఆశ్రమములోకి వచ్చాడు. శమీకుడు ధ్యానమగ్నుడై వున్నాడని తెలియక ఆకలితోనూ, దాహంతోనూ బాధ పడుతూ కోపంతో ముని మెడలో చచ్చిన పామును వేసి వెళ్ళిపోయాడు.

"నా తండ్రి మెడలో పాము వేసిన పరీక్షిత్తును ఏడో నాడు తక్షకపాము కాటు వెయ్యాలి" అని శపించాడు శృంగి (పరీక్షిత్తు శమీకుని మెడలో పాము వేసినప్పుడు అక్కడెవ్వరూ లేరు. అయినా ఈ విషయం శమీకుని కుమారుడగు శృంగికెలా తెలిసింది? ఎలా తెలిసిందో కవిగారు చెప్పాలి? మౌనముగా కూర్చున్న వాని మెడలో పాము వేసిన నీచుడు ఇంకా ఏడు రోజులు ఎందుకు బ్రతకాలి? తక్షణమే పాము కాటుతో చనిపోవాలి అని ఎందుకు శపించలేదు శృంగి?) తర్వాత తండ్రి దగ్గరకు వచ్చి ఏడ్చాడు.

శృంగి పరీక్షిత్తును శపించిన విషయం తెలుసుకున్న శమీకుడు 'రాజు అనేవాడు లేకుండాపోతే ఎన్నో అన్యాయాలు జరుగుతాయని కుమారునికి వివరించి చెప్పాడు' పరీక్షిత్తు బాధలో వున్నప్పుడు పొరపాటు చేశాడు అతడు చేసిన తప్పుకు నీవిలా శపించుట తగదని కుమారుణ్ణి మందలించాడు (ఆనాడు ఆకలి, దాహం వేసినప్పుడు పరీక్షిత్తు తప్పు చేశాడు. ప్రతి రోజూ ఎన్నో విధాల బాధలనుభవించే సామాన్య ప్రజలు తప్పులు చేయకుండా ఎలా ఉంటారు?)

పరీక్షిత్తు అప్పుడిలా అనుకున్నాడు "నా రాజ్యమూ, సైన్యమూ, ధనమూ అన్నీ ముని కోపాగ్నిలో దగ్ధమైపోనీ, మునుల మీద ఇలాంటి పాపబుద్ధి కలగకుండా వుండాలి నాకు" (తాను చేసిన తప్పుకు రాజ్యమూ, సైన్యమూ నాశనమైపోనీ అనుకునే రాజు ప్రజలకు చేసే మేలు ఏమీ వుండదు అలాంటి రాజు రాజ్యంలో వుండే ప్రజలు సుఖపడుతారన్నది అసత్యం)

పరీక్షిత్తు రాజ్యాన్ని కుమారునికిచ్చి (మామిడి పండ్లో, అరటి పండ్లో ఇచ్చినట్లు) గంగ దగ్గరకు వెళ్ళాడు. అక్కడకు గొప్ప గొప్ప పేర్లుగల మునులు చాలా మంది వచ్చారు. "మనిషి ఎప్పుడు ఏమి చెయ్యాలి? చచ్చే సమయములో ఏం చెయ్యాలి? అని మునులను అడిగాడు పరీక్షిత్తు. (కోపం వచ్చినప్పుడు మునుల మెడలో చచ్చిన పాములను వెయ్యకూడదు. చచ్చే సమయములో కట్టెలు తయారుగా వుంచుకోవాలి.) మునులు ఆలోచిస్తుండగా శ్రీశుకుడు వచ్చాడు.

వీడు కవిగారి కుమారుడేనట వీనికి తలకాయ లేదు. అంటే మనిషి తలకాయ లేదు. చిలుక తల వీడిది.) శుకుని ప్రతి అవయవాన్ని వర్ణించాడు కవి.

శుకుడు చెప్పడం ప్రారంభించాడు.

ఇంటి పనులలో పడి మనుషులు ఆత్మ తత్వం విచారించరు. వాళ్ల ఆయువు రాత్రిళ్లు నిద్రలోనూ, రతి క్రీడలలోనూ, పగలు ధన చింతలోనూ, కుటుంబ పోషణలోనూ గడచి పోతుంది. ముక్తి కావ లసినవాడు కృష్ణపరమాత్మనే స్మరించాలి. ( మనిషి నిద్రపోకూడ దని, రతిక్రీడలు సలుపకూడదని, పనులు చేయ కూడదని కవిగారి అభిప్రాయమున్నట్లుంది. పుట్టిన వెంటనే దేవుణ్ణి తలుస్తూ కూర్చో వాలా ఏమిటి? అందరూ దేవుణ్ణి తలుస్తూ కూర్చుంటే ఆకలి వెయ్యదా? మనుషులు బతకడమెలా?)

శుకుడు భగవంతుని స్వరూపాన్ని వర్ణించి చెప్పాడు.

" పాదమూలం పాతాలం.........వితలమూ, అతలమూ తొడలు......అగ్నిహోత్రుడు నోరు......వేదాలు బ్రహ్మరంధ్రం, గుఱ్ఱాలు, ఏనుగులు గోళ్లు, సముద్రాలు కడుపు, కొండలు ఎము కలు......(భగవంతుని ఆకారం చాలా గందరగోళంగా వుంది. సర్వ సృష్టే భగవంతుడని కవిగారి ఉద్దేశంలా వుంది. కాని తర్వాత చదవండి ) బ్రాహ్మణులు మొహం, క్షత్రియులు బాహువులు కోమట్లు తొడలు, నల్లటి శూద్రులు పాదాలు, ( బ్రాహ్మణులను ముఖంతోనూ, శూద్రులను పాదాలతోనూ పోల్చిన కవిగారి ఉద్దేశ మేమిటో మనం సులభంగానే గ్రహించవచ్చును )

భగవంతుడు తప్ప తక్కినదంతా అబద్ధం (కవిగారు వర్ణించిన భగవంతుని స్వరూపములో సర్వ సృష్టి వచ్చేసింది. ఇంకా తక్కిన దంతా అబద్ధమంటాడేమిటి?)

పూర్వం ప్రళయం వచ్చాక వెనకటి సృష్టి విషయం మరిచి పోయాడు బ్రహ్మ. ( బ్రహ్మకు కూడా జ్ఞాపక శక్తి నశిస్తుందా?) హరి దయతో మళ్ళీ సృష్టి చేశాడు.

పండితుడైనవాడు సామమాత్రమైన సుఖభోగాలు ఆశించ కూడదు. కేవలం శరీరం నిలువు కోవడం కోసం అవసరమైనవి మాత్రం అనుసరించాలి. (శరీరం నిలుపుకోవడం మాత్రం ఎందుకు?) సుఖువుగా సిద్ధిస్తున్న పనికోసం పరిశ్రమ చెయ్యడం దేనికి? పడుకు నేందుకు నేల వుండనే వుంది. పరుపుల కోసం ప్రయాసఎందుకు? తిండి తినడానికి దోసిలి వున్నప్పుడు పాత్రల కోసం వరుగెత్తడమెందుకు? ఈ విధంగా వ్యాసులవారు అనేకమైన చెత్త ప్రశ్నలు వేశారు. వాటికి సమాధానం చెప్పవలసిన బాధ్యత వ్యాసభక్తుల మీద వుంది. వ్యాసులవారి మాటవిని ఎక్కడికక్కడ సంతృప్తిపడి వుంటే ఈనాడు శాస్త్రవిజ్ఞానం ఇంత అభివృద్ధి చెంది వుండేది కాదు. మనం మిద్దెలు, మేడలు కట్టుకోనక్కరలేదట కొండగుహల్లో నివసించాలట. బట్టలు ధరించనక్కరలేదట, నగ్నంగా తిరుగాలట. చూశారా వ్యాసులవారి అభిప్రాయం.)

అనంత స్వరూపుడైన భగవంతుడు నీ చిత్తంలోనే వున్నాడు. అతడే ఆత్మ. (అయితే తపస్సు, ప్రార్థనలు, పూజలు ఈ వెధవ గోలంతా ఎందుకు? నేనే దేవుణ్ణి. నేనింకా దేవుని కొఱకు వెదకడ మెందుకు?) కర్మ వల్ల జీవులు వైతరణిలో పడి బాధపడుతున్నారు. (వైతరణి ఎక్కడ వచ్చిందో?) తర్వాత కవిగారు దేవుని అందచందా లను రెండు పేజీల పొడుగున పొగిడాడు. (చూచినట్టు) తర్వాత ఉపా సనలు, తపస్సులు, యోగము మొదలగు వానిని గురించి ఏమిటో చెత్తంతా వ్రాశాడు కవి.

చావడానికి సిద్దంగా వున్నవాళ్ళు శ్రీహరి కథలు వినాలి.

వీర్యం కావలసిన వాళ్లు అగ్ని దేవుణ్ణి ఆరాధించాలి...... ఆడది కావలసిన వాళ్ళు ఊర్వశిని సేవించాలి......(ఇంకా నయం అగ్నిలో దూకితే వీర్యాభివృద్ధి జరుగుతుందని చెప్పలేదు కవిగారు. ఆడది కావలసిన వాళ్లు ఊర్వశిని సేవించాలని చెప్పారు కవిగారు. కాని ఊర్వశి కావలసిన వాళ్ళు ఏం చెయ్యాలో కవిగారు చెప్పలేదు. నేను చెప్తున్నాను వినండి. ఊర్వశి ఎక్కడ వుందో తెలుసుకొని

ఆమెకో ప్రేమ లేఖ వ్రాయండి. మీ యిద్దరికీ ఇష్టమైతే పెళ్ళిచేసుకోండి. అప్పుడు మీ కోరిక మన్నించి మీ దగ్గఱ పడుకోవడానికి వస్తుందావిడ. అయితే వేశ్యను పెళ్ళిచేసుకొని ఆమెను హృదయపూర్వకంగా, నిర్మలంగా ప్రేమించ గలిగినప్పుడే ఇదంతా చేయండి. నేనీమాట ఎందుకు చెప్తున్నానంటే ఊర్వశి దేవవేశ్య అని పెద్దలందరూ చెప్పగా విన్నాను.)..........విద్య కావలసిన వాళ్ళు శివుణ్ణి ఆరాధించాలి. (సరస్వతిని పూజించుమని కొందరు, ఆంజనేయుణ్ణి పూజించుమని కొందరు అంటారేమిటి మరి. నాకు తెలిసిన ఒకాయన చిన్ననాటి నుండి తనకు చదువు రావాలని ఆ కోతి వెధవకు-హనుమంతునికి-పూజలు చేసేవాడు, కొబ్బరికాయలు కొట్టేవాడు. కాని మెట్రిక్ లేషన్‌లో ఎనిమిది సార్లు తప్పాడు. మరి ఆంజనేయుడెంత గొప్పవాడో శివుడంత గొప్పవాడు కావచ్చు. ఫేల్ కాదలచుకున్న వాళ్ళు పుస్తకాలు చదువకుండా శివుణ్ణి పూజించండి) కుమాళ్లు కావలసిన వాళ్లు దక్షుణ్ణి......సంతానం కావలసిన వాళ్ళు పితృదేవతల్ని......(ఇచ్చట కవిగారు ఎంత ఆలోచన లేకుండా వ్రాశారో పాఠకులు గ్రహించవచ్చు. కవిగారికి ఏదితోస్తే అదే వ్రాసినట్లున్నారు ఏమిటోనండీ కవిగారూ! మీ పేరును నా పేరుకంటే గొప్పగా చెప్పుకొంటున్నారు పాఠకులు. మీ వ్రాతలేమో ఇలాఏడ్చాయి)

"కృష్ణ కథలు వినని వాడు కుక్కతో, పందితో, గాడిదతో సమానం" అన్నారు కవిగారు. "కృష్ణ నామం పలుకని వానినాలుక కప్పనాలుక. కృష్ణుని మ్రొక్కని చేతులు శవం చేతులు" అన్నారు కవిగారు. (కవిగారూ! జారుడు, చోరుడు అయిన కృష్ణుణ్ణి మ్రొక్కినవాడు కుక్కకంటే, పందికంటే గాడిదకంటే హీనుడంటున్నాను నేను. కృష్ణునికి మ్రొక్కినవాడు బుద్ధి హీనుడంటున్నాను నేను. కుక్కలు, పందులు, గాడిదలు హీనజంతువులని మీరు భావించారేమో! కాని మనిషి కంటే అవి చాలా గొప్పవి. తోటి జంతువులను వంచించడంగాని తోటి జంతువుల శ్రమ శక్తిని దోచుకోవడం గాని, తోటి జంతువులు గొప్పవనిగాని, హీనమైనవనిగాని అవి భావించవు, కృష్ణుని

లాంటి దొంగ వెధవను అవి పూజించవు. వ్యాసకవీ! పక్షపాత బుద్ధితో కృష్ణుణ్ణి గొప్పచేయడం కోసం ప్రతి వస్తువును, ప్రతి జీవిని నీచంగా భావించావేలనోయీ!)

శుకుడు చెప్పిన తత్వజ్ఞానము విని కృష్ణుణ్ణి పూజించాలను కున్నాడు పరీక్షిత్తు (పరీక్షిత్తుకు యుక్తాయుక్త విచక్షణ జ్ఞానం లేన ట్టుంది చచ్చిన పామును ముని మెడలో వేసిన ఇతనికి విచక్షణా జ్ఞానం లేదని ముందే తెలిసింది కదండీ! మళ్ళీ అనుమానమెందుకు?)

నారదుడు సృష్టి ఎలా జరిగిందో సెలవియ్యమని బ్రహ్మనడిగాడు.

ఆకాశం పుట్టిన విధము, వాయువు పుట్టిన విధము, కాళ్లు చేతులు, కళ్ళు చెవులు, ముక్కులు......మట్టిదుబ్బ ఇంకా ఏమేమో పుట్టిన విధము చెప్పాడు బ్రహ్మ.

దేవుని ముఖంలో నుండి బ్రాహ్మణులు, చేతులలో నుండి రాజులు, తొడలలో నుండి కోమట్లూ, పాదాల నుండి శూద్రులు పుట్టారని కవిగారు బ్రహ్మదేవునిచేత చెప్పించారు. (ఇంతకు పూర్వం ఒకచోట దేవుని ముఖమే బ్రాహ్మణులనీ, చేతులే రాజులనీ, తొడలే కోమట్లనీ. పాదాలే శూద్రులనీ చెప్పాడు ఇప్పుడేమో ఇలా చెప్తు న్నాడు ఏదిఏమైనా బ్రాహ్మణులు అధికులని, శూద్రులు హీనులని చెప్పుటకు కవిగారు చాలా యుక్తిగా ప్రయత్నం చేశారు.)

భగవంతుని పాదాలలో భూలోకం......తలకాయలో బ్రహ్మ లోకం......శిరస్సులో స్వర్గలోకమున్నాయి (బ్రాహ్మలోకము. స్వర్గలోకము రెండూ దేవుడిగారి తలకాయలోనే వున్నాయట. అసలు దేవుని తలకాయ ఎక్కడ వుందో? కవిగారూ! ఎక్కడ వుందండీ?......రష్యా వాసులారా! ఈ విషయములో మీరేమైనా పరిశోధనలు చేశారా?)

దేవుడిగారి ఆకారాన్ని గురించి, లోకాల గురించి, వాటి పుట్టుకను గురించి, జీవుల పుట్టుకను గురించి ఒక్కోచోట ఒక్కోవిధంగా శాస్త్రీయ విజ్ఞానానికి సంబంధం లేకుండా రాశాడు కవి )

బ్రహ్మ:— ప్రజాపతుల అధిపతిని నేను వాళ్ళు నాకు వంద

నాలు చేస్తారు (పూర్వాన్నందరు నాకు నమస్కారాలు చేస్తారని ఆఫీసరు గారు చెప్పుకొన్నట్టుందిది.) అయినా నా జన్మదాత భగవంతుణ్ణి పూర్తిగా తెలుసుకోలేకపోయాను. (బ్రహ్మదేవుడు చివరికి తన అసమర్థతను వెల్లడించుకొని భగవంతుని ఔన్నత్యాన్ని మరికొంత పెంచాడు. దేవుడిగారి ఆఫీసులో బ్రహ్మన్న బలే ఉద్యోగం సంపాదించుకొన్నాడు. ఎన్నో రకాల జీవులను ఎన్నో ఆకారాలతో ఈ బ్రహ్మన్న నే తయారు చేస్తాడట. ఇన్ని పనులు చేస్తే బ్రహ్మయ్యకు అలసట కలుగదా? తలకాయ చెడిపోదా?)

దేవుడు పుట్టుకలేనివాడు. అయినా ప్రతి యుగంలోనూ పుడుతాడు. తన్ను తాను రక్షించుకుంటాడు. తన్ను తానే సంహరించుకుంటాడు. (విషం మింగి చస్తాడా? ఉరిపెట్టుకొని చస్తాడా?) నేను, శివుడు, విష్ణువు....రాక్షసులు......భూతాలు...మృగాలు, పక్షులు (చెప్పులు, చీపురు కట్టలు, మసి బట్టలు) అన్నీ భగవంతుని రూపాలే అని చెప్పాడు బ్రహ్మ.

వ్యాసకవి దేవుని అవతారాలను గూర్చి ప్రథమ స్కంధములో వ్రాశాడు. మళ్ళీ ద్వితీయ స్కంధములో వ్రాశాడు. (కవిగారికి మరేమి పని లేనట్టుంది. చెప్పిందానినే తిరిగి చెప్తున్నాడేమిటీయన)

ఈ కథల్లో చాలా విషయాలు అసహజములు, కల్పితములు, శాస్త్ర జ్ఞానానికి విరుద్ధంగా వున్నాయి.

పరీక్షిత్తు శుకదేవుణ్ణి అనేక ప్రశ్నలడిగాడు.

భగవంతుడెక్కడ పడుకుంటాడు? బ్రహ్మదేవుని ఆయువు పరిమాణ మెంత? కర్మగతులు ఎలా వుంటాయి? జీవరాసులు ఎలా పుడుతాయి? భగవంతుణ్ణి ఎలా ఆరాధించాలి?......ప్రాణకోటి ప్రళయంలో నాశమై పోయాక తిరిగి ఎలా పుడుతుంది? ఇంకా ఎన్నో వెదవ ప్రశ్నలడిగాడు.

తపస్యులందరిలో మహా తపస్వి బ్రహ్మ. అతడు వెయ్యి దివ్య సంవత్సరాలు తపస్సు చేశాడు. విష్ణువు ప్రత్యక్షమయ్యాడు. వైకుంఠం అతనికి కనబరిచాడు. వైకుంఠములో వున్న వాళ్ళకు

నాలుగేసి చేతులుంటాయి. వైకుంఠం నాలుగు వైపులా విమానాలు వుంటాయి. మెరుపుల్లాగా దేవకన్యలు తిరుగుతుంటారక్కడ. లక్ష్మి దేవి విష్ణుదేవుని పాదాలు సేవిస్తూవుంటుంది.

భగవంతుడు బ్రహ్మదేవునితో అన్నాడు "సృష్టి చేయాలన్న సంకల్పముతో తపస్సు చేశావు నువ్వు. నేను కూడా తపోబలంతోనే చరాచర సృష్టి చేస్తాను తపస్సేనాశక్తి.

బ్రహ్మదేవుడు:- "ఉత్తమ, మధ్యమ, అధమ భేదాలతో నేను లోక సృష్టి చేసినప్పుడు నా హృదయంలో స్వాభిమానం పుట్టకుండా వరమి" మ్మన్నాడు. (బ్రహ్మ వెయ్యి దివ్య సంవత్సరాలు తపస్సు చేశాడా? అనేక సంవత్సరాలు బ్రతకాలన్న మానవుని కోరిక కథల రూపంలో ఇలా వెలువడిందేమో! వైకుంఠం ఎక్కడ వుంది? ఇది కవిగారి కల్పన మాత్రమే. నాలుగు చేతుల వాళ్ళున్నట్టు జీవశాస్త్ర ములో తెలుపబడలేదు ఇది కూడా కవిగారి కల్పననే. ఆనాటి కాల ములో కూడా స్త్రీ, పురుషుని పాదసేవ చేస్తుందేదని తెలియుచున్నది. విష్ణువు లక్ష్మిదేవి గారి పాదసేవ చేస్తున్నాడని వ్రాయలేదు. ఇక్కడ పురుషాధిక్యత వుంది. ఇక బ్రహ్మదేవుడు ఎలాంటివాడో చూడండి. వాడు సృష్టించడంలో కూడా భేదాలు చూపుతాడట. సమతా దృష్టి బ్రహ్మగారికి ఎందుకు లేదు? ఈనాటి మన పాలకులు భేదభావంతో ఎలా పరిపాలిస్తున్నారో ఆనాడు కూడా అనేక భేదా లతో పరిపాలన కొనసాగుతూ వుండేదని దీని వలన తెలియుచున్నది.)

దేవుని ఒక్కొక్క అంగము ఎలా ఏర్పడిందో కవిగారు వర్ణిం చారు.

ఋషులు చేసేస్తుతి వినాలనుకున్నప్పుడు భగవంతుడు వెంటనే రెండు చెవులు ఏర్పడ్డాయి (భగవంతునికి చెవులు ఏర్పడకముందే ఋషులు పుట్టారట. ఆయన గారిని గురించి స్తుతించారట. కవిగారూ! ఏమిటండీ ఇదంతా)......సంతాన వాంఛా సంభోగ వాంఛా కలు గగానే శిశ్నం ఏర్పడింది......మల విసర్జన వాంఛ కలుగగానే గుదస్థానం ఏర్పడింది......కలుగగానే ఏర్పడింది.

పరీక్షిత్తు అడిగిన ప్రశ్నకు శుకుడు సమాధానమిస్తూ " కౌర వులు పాండవులను ఎలా కష్టపెట్టాలో చెప్పాడు దుర్యోధనుడు విదు రుణ్ణి దాసీ పుత్రుడని చాలా హీనంగా మాట్లాడిన విధము చెప్పాడు. (ఆనాటి కాలంలో కూడా దాసీ పుత్రులను హీనంగా చూచేవారు.)

విదురుడు ఉద్ధవుడిని అడిగిన సందర్భములో:—

"........యాదవుల సేనాధిపతి ప్రద్యుమ్నుడు కుశలంగా వున్నాడా? రుక్మిణీదేవి ఎంతోమంది బ్రాహ్మణులను పూజించి అతణ్ణి కన్నది వెనుక జన్మలో మన్మథుడే అతడు. (బ్రాహ్మణులను పూజించిన వారికి సంతానం కలుగుతుందని చెప్పితే అనేకులు బ్రాహ్మ ణులను పూజిస్తారని కవిగారి అంచన. మన్మథుడే అందరికీ కామో ద్రేకము కలిగిస్తాడని కవిగారు చెప్పారు. మరి మన్మథుని తల్లికి కామోద్రేకము ఎవరు కలిగించారో?)

హరిద్వారంలో గంగవొడ్డున కూర్చున్న మైత్రేయముని దగ్గ రకు వెళ్లాడు కురుశ్రేష్ఠుడు విదురుడు. (ఆనాడు హీనంగా చూడబడిన దాసీ పుత్రుడు విదురుడు. అతడు ఇతరులకు కష్టాలు కలిగించకుండా మానవత్వంతో ప్రవర్తించిన మహానుబావుడు)

మైత్రేయుణ్ణి విదురుడనేక ప్రశ్నలడిగాడు. ఆ ప్రశ్నలన్నిం టినీ ఇక్కడ వ్రాయడం అనవసరము. అవసరమున్నది ఒక ప్రశ్న.

ఆవులకు, బ్రాహ్మణులకు, దేవతలకు మేలు చెయ్యడం కోసమే రకరకాల అవతారాలెత్తి రకరకాల పనులు చేశాడు. అలాంటి భగ వంతుణ్ణి ఎలా ఆరాధించాలి మేము? ఎలా అనుగ్రహిస్తాడు భగవం తుడు? (ఈ ప్రశ్నలలో తేలేదేమిటంటే ఆ నాటి సంఘములో బ్రాహ్మణులు ఉన్నత స్థానములో ఉండడానికి భగవంతుని అనుగ్ర హమే కారణమని ప్రజలనుకునేవారు. విదురుడు కూడా అలాగే అనుకున్నాడు. ఆవులను పవిత్రంగా భావించేవారు. దేవతలు అనే ఒక వర్గము వారు ఆనాడు వుండేవారేమో! భగవంతుణ్ణి పూజించడం వల్లనే బ్రాహ్మణులకు, దేవతలకు మేలు జరుగుచున్నదని వారు భావించేవారు.) ఎలా పూజిస్తే భగవంతుడు మాకు కూడా మేలు

చేస్తాడు. అని ప్రశ్న వేశాడు విదురుడు. (ఆనాటి పరిపాలనా వ్యవస్థలో వున్న లోపాలను విదురుడు గ్రహించ లేకపోవడం వలనే ఇలాంటి ప్రశ్న వేశాడని మనం గ్రహించవచ్చు. పరిపాలన సక్రమంగా అనగా సమతాభావంతో కొనసాగినప్పుడు మనిషి సృష్టి కర్మ సిద్ధాంతము వైపు, కనబడని దేవుని వైపు మళ్లడు.

కవిగారికి సర్వసూనవ క్షేమము ఇష్టమున్నట్లయితే సుగుణవంతులను భగవంతుడు రక్షిస్తాడని పాఠకులకు బోధించేవారు. బ్రాహ్మణులలో నున్న దుర్మార్గులకు కూడా భగవంతుడు మేలు చేస్తాడా? బ్రాహ్మణేతరులలో వున్న శిష్టులకు భగవంతుడు మేలు చెయ్యడా? ఇవి కవిగారి మీద వేయవలసిన ప్రశ్నలు)

మైత్రేయుని సమాధానాలు బ్రాహ్మణులకు అనుకూలంగానూ, హేతువాద జ్ఞానము లేని ప్రజలను నమ్మించే విధంగానూ వున్నాయి.

సృష్టి, స్థితి, ప్రళయాల కోసం అవతారాలెత్తుతాడట భగవంతుడు (ప్రకృతి సిద్ధంగా ఏర్పడే సృష్టి స్థితి ప్రళయాలను కవిగారు భగవంతునికి ఆపాదించాడు. అంటే ప్రకృతినే దేవుడని కవి భావించాడా ఏమిటి?)

దేవా! నీ కథలు చదివి జ్ఞానవంతులై వైకుంఠము చేరుకుంటారు కొందరు. (దేవుని కథలు చదువని వారు ఏ లోకం వెళ్తారు. భాగవతాణ్ణి విమర్శిస్తున్న రేగులపాటి కిషన్‌రావు చచ్చిన తర్వాత ఎక్కడికి వెళ్తాడు.)

విరాట్పురుషునిలోనే చరాచరమైన జగత్తంతావుంది. నిద్రాణమైన జీవకోటితో సహా వెయ్యి సంవత్సరాలు నీళ్ళలో వున్నాడు. (విరాట్పురుషుని లోనే చరాచర జగత్తంతా వున్నప్పుడు అతడు నీళ్ళలో వుండడమేమిటి? ఈ నీళ్లు చరాచర జగత్తులో ఒక భాగం కాదా? ఈ నీళ్ళు వేరే అయినప్పుడు మిగిలిన భాగం చరాచర జగత్తు ఎలా అవుతుంది? ఏమిటండీ కవిగారూ! మీరు ఆలోచన లేకుండా ఏదేదో వ్రాశారు. గొర్రెలవలె తలవంచుక పోయేవారికి, గంగిరెద్దుల వలె తలలూపే జ్ఞాన శూన్యులకు నచ్చుతాయండీ మీ రచనలు.)

"కేవలం మూఢులు లేదా బాగా బుద్ధిమంతులై భగవత్ప్రాప్తి పొందిన వాళ్లూ-ఈ రెండు రకాల మనుష్యులే లోకంలో సుఖపడుతారు. సంశయంలో వూగులాడుతున్న మధ్యరకం మనుషులు దుఃఖాలే అనుభవిస్తారు." వ్యాస కవిగారన్న మాటలివి. ( హేతువాదులైన నాస్తికులు లేదా భగవద్భక్తులమని చెప్పుకొని యుక్తిగా ఇతరుల శ్రమశక్తిని దోచుకునే ఆస్తికులు సుఖపడుతున్నారు నేటి మన సమాజంలో. ఏది చెప్పితే అదే నమ్మే జ్ఞానశూన్యులు, ఆలోచనాశూన్యులు, దుఃఖాలే అనుభవిస్తున్నారు. ఇలాంటి మనుషులను అణచి వేయడానికి ఆస్తికులు అనేక ప్రయత్నాలు చేస్తుంటారు. హేతువాదులు వీరిని వుద్ధరించడానికి పూనుకుంటారు )

మునీంద్రా! మీ పాదాలు సేవించడం వల్ల భగవంతుని పాదాల మీద భక్తి చిరకాలం స్థిరపడుతుంది ( విదురుడు తన హీనత్వాన్ని వ్యక్తం చేస్తున్నాడు. విదురుడు దాసీ కుమారుడు అనేక సంవత్సరాల నుండి అణిచివేయ బడుచున్న వర్గము వాడు. అణిచివేయ బడే వారి ఆలోచనలు, మాటలు హీనత్వాన్నే చాటుతాయి. సాంఘికంగా ఉన్నతంగా వున్న వారి ప్రయత్నం ఇది.).

బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుడు భగవంతుని గుణావతారాలన్నాడు కవి (ఇంతకు పూర్వం బ్రహ్మ భగవంతుని బొడ్డులో నుండి పుట్టిన తామర పువ్వులో నుండి పుట్టాడని చెప్పాడు కవి.) మరొక చోట బ్రహ్మకు కొన్ని అనుమానాలు వచ్చాయి. 'ఈ పద్మము మీద కూర్చున్నాను ఎవరు నేను? ఈ పద్మం నిరాధారంగా నీటిలో ఎలా పుట్టింది? కింద నీటిలో ఏదో ఆధారం వుండేవుంటుంది. అలా యోచించి తామరతూడు సూక్ష్మ రంధ్రం నుండి నీటిలో ప్రవేశించి భగవంతుని నాభి ప్రదేశానికి వచ్చాను. అయినా పద్మానికి ఏది ఆధారమో తెలుసుకోలేక పోయాను., ( బ్రహ్మకు కూడా సృష్టి రహస్యం తెలియలేదట. పైగా వాడు సృష్టికర్తనట. సృష్టి రహస్యమును తెలుసుకోవాలన్న ఉబలాటం అనాదికాలం నుండి మానవునిలో ఉందనడానికి ఇది నిదర్శనం. అయితే ఇంతవరకూ ఎవరూ ఈ సృష్టి

రహస్యాన్ని సంపూర్ణంగా తెలుసుకోలేక పోయారు. (బ్రహ్మ తామర తూడులోని సూక్ష్మ రంధ్రం నుండి వెళ్లాడట. తామర తూడు రంధ్రము నుండి అంత పెద్ద బ్రహ్మ వెళ్లగలడా? లేక బ్రహ్మ వెళ్ళగలిగినంత పెద్ద రంధ్రమా అది? అది ఎంత పెద్ద తామర పువ్వు? బ్రహ్మన్నగారి తల్లి "తామర పువ్వు" కవిగారు ఏమిటేమిటో వ్రాశారు. హేతువాద జ్ఞాన శూన్యులకు నచ్చుతాయిని. ఇలా ఒక విషయానికి మరో విషయానికి పొంతన లేకుండా కవిగారు తమ భగవదాంశను నిరూపించుకున్నారు.

ఆదిదేవుడు, సంకర్షనుడు (శేషుడు) పాతాళంలో నివసిస్తు న్నాడు. (ఈ పాతాళం ఎక్కడ వుంది కవిగారూ?) సంకర్షణుడి వెయ్యి పడగలకు వెయ్యి కిరీటాలున్నాయి. (వెయ్యి తలల పాములు న్నట్లు జీవశాస్త్రములో ఎక్కడా పేర్కొనబడలేదు. పైగా ఆ పడగలకు కిరీటాలు కూడానూ, ఆ కిరీటాలను ఎవరుచేయించి ఆ పాము తలలకు అమర్చారు? ఇలాంటి ప్రశ్నలడగకూడదు. కవిగారు చెప్పిన దంతా కిమ్మనకుండా ఒప్పేసుకోవాలి. అదే భగవద్భక్తుల పని.)

హేతువాద శక్తి లేని విదురుణ్ణి పట్టుకొని మైత్రేయుడు ఐతే కూస్తున్నాడు.

మైత్రేయుడు:— సృష్టికి ముందు ఈ విశ్వమంతా నీళ్లల్లో మునిగి వుంది. అప్పుడు భగవంతుడు వొక్కడే నాగేంద్ర శయ్య మీద పడుకున్నాడు. (సృష్టికి ముందు విశ్వము నీళ్ళల్లో వున్న విషయం కవిగారు ఇంకా ఎన్ని సార్లు చెప్తారో తెలియదు. మొదటి తరగతి పిల్లవానికి పుస్తకమిచ్చి ఉపాధ్యాయుడు 'అమ్మ' అనే పదాన్ని పదేపదే వల్లె వేయించినట్లు, కవిగారు భగవద్భక్తులకు సృష్టి రహస్యం వల్లె వేయించదలచి ఇలా వ్రాశారేమో. సృష్టికి ముందు విశ్వమంతా నీళ్ళల్లో ఉందట. అయితే ఈ విశ్వాన్ని సృష్టిం చిన రెవ్వరు? ఆ నీటిని సృష్టించిన దెవ్వరు? ఆమాట కొస్తే భగవం తుణ్ణి సృష్టించిన దెవ్వరు? సృష్టికి పూర్వమే పాము సృష్టించబ డిందా? భగవంతుని పరుపు పామా? కవిగారు కనిపిస్తే ఇలాంటి

ప్రశ్నలెన్నో అడుగాలను కొంటున్నాను. కాని ఎక్కడ కనబడు తాడు చచ్చినోడు.) బ్రహ్మ పుట్టిన తర్వాత పద్మాసనం మీద కూచు న్నాడు. ఎవ్వరూ అతనికి కనిపించలేదు నాలుగు వైపులా మెడ త్రిప్పి చూశాడు. అందుచేత నాలుగు ముఖాలు పుట్టాయతనికి (నాలుగు వైపులా నాలుగు ముఖాలుంటే నాలుగుదిక్కులా ఒకేసారి చూడవచ్చు. నిజానికి ప్రతి మనిషికి నాలుగు ముఖాలుంటే ఎంత బాగుండేది-ఇది ఒక విచిత్రమైన ఆలోచన-

పాఠక మహాశయా! మీరు పది దిక్కులూ చూస్తారుకదా! మరి మీకు పది ముఖాలు పుట్టలేదేమిటి? అందరికున్నట్టే మీకు కూడా ఒకే ముఖముందేమిటి? బ్రహ్మన్నకు నాలుగు ముఖాలున్నాయని కవిగారు వ్రాశారు. మరి మీరు ఒప్పుకుంటూరా? నేనైతే ఒప్పుకోను. కాని బుర్రలేనివాళ్ళు మాత్రం ఒప్పేసుకుంటారు. భగవద్భక్తులూ! మీకు బుర్రుందా? లేదా? చెప్పండిప్పుడు ) జలరాశిలో శేష శయ్య మీద ఒంటరిగా పడుకున్న భగవంతుణ్ణి చూశాడు. బ్రహ్మ. ప్రజా సృష్టి సంకల్పించాడు. బ్రహ్మ భూమీ, నీరూ, తేజస్సూ, గాలీ, ఆకా శమూ ఈ అయిదే సృష్టికి కారణ రూపమని నిశ్చయించాడు. సృష్టి చెయ్యగల సామర్థ్యం కోసం భగవంతుణ్ని స్తుతించాడు. (భగవం తుని గుణావతారమే బ్రహ్మ అని వ్రాసిన కవి. బ్రహ్మ భగవంతుణ్ని స్తుతించాడని వ్రాశాడేమిటి? దీనినే ఆత్మ స్తుతి అంటారేమో, భగవం తుడు ఆత్మ స్తుతి చేసుకున్నాడన్నమాట. మరి ఆత్మ స్తుతి చేసుకో కూడదంటారేమిటి?)

బ్రహ్మ భగవంతుణ్ణి స్తుతిస్తూ ఒకచోట "ఏ కోరికా లేకుండా నిన్ను ఆరాధించేవాళ్లకి సులభుడివి నువ్వు. కోరికలున్నవాడు నీ దయకు పాత్రుడు కాలేడు (బ్రహ్మ సృష్టి చేయాలన్న కోరికతోనే భగవంతుణ్ణి ఆరాధించాడు కదా! మరి ఏ కోరికా లేకుండా భగవం తుడుని ఆరాధించాలంటూడేమిటి? ఏ కోరికా లేనివాడు భగవంతుడిని ప్రార్థించుటఎందులకు? ప్రతి జీవికి ఏదో ఒక కోరిక తప్పని సరిగా వుంటుంది. కోరికలు లేనివాడు బండతో సమానం. ఈ జీవులందరూ

బండల్లాగా పడి వుండాలనా కవిగారి కోరిక. భగవంతుని దయకు పాత్రుడు కావాలనుకోవడం మాత్రం కోరిక కాదా? అయ్యా! కవి గారూ! కాస్త ఆలోచించండి ) చివరికి భగవంతుడు బ్రహ్మకు కని పించి "నేనే అందరికంటే గొప్పవాణ్ణి, సమస్త కోరికలూ తీర్చగల వాణ్ణి" అన్నాడు ( రేగులపాటి కిషన్‌రావుకు భాగవతాన్ని విమర్శించాలన్న కోరికను కలిగించింది కూడా వీడేనా?) బ్రహ్మ వంద దివ్య సంవత్సరాలు తపస్సు చేసి ప్రళయ వాయువూ, ప్రళయ సముద్రపు నీళ్లూ తాగేశాడు (అన్ని సంవత్సరాలు తపస్సు చేస్తే బ్రహ్మకు బాగానే ఆకలి వేసినట్టుంది. సముద్రపు నీళ్ళన్నీ తాగా డట. వీని పొట్ట సముద్రపు నీళ్లన్నీ పట్టేంత పెద్దగా వుందా? భగ వంతుడు పడుకున్న ప్రళయ జలరాశిని బ్రహ్మ తాగిన తర్వాత భగవంతుడెక్కడ పడుకున్నాడు? అనేది ఒక ప్రశ్న. ఈ ప్రశ్నకు సమాధానం చెప్పేదెవ్వరు? కవిగారూ! మీరు చెప్తారా? భగవంతుడు పడుకున్న ప్రళయ జలరాశిని త్రాగిన బ్రహ్మ ఆకారం ఎంత పెద్దో ఆలోచించాలి. ఇది మరీ ఆలోచించాల్సిన విషయం. ఇలా హేతువాని విరుద్ధంగా కవిగారికి ఏదితోస్తే అదే వ్రాశారిక్కడ.)

మైత్రేయుడు విదురునికి పది రకాల సృష్టి విధానాలను చెప్పాడు అందులో కొన్ని చాలా గందరగోళంగా వున్నాయి.

రెండు డెక్కల జంతువులను గురించి, ఒంటిడెక్క జంతువులను గురించి, ఐదేసిగోళ్ళుగల జంతువులు, నేల మీద బ్రతికేవి, ఆకాశంలో బ్రతికేవి ఇలా ఎన్నో విషయాలు చెప్పాడు ( వ్యాసులవారు సైన్సు కూడా కాస్త చదువుకున్నట్టున్నారు.)......మనుష్య సృష్టి తొమ్మిది దోది......పదోసృష్టిలో ఎనిమిది రకాలున్నాయి. దేవతలు, పిత రులు, అసురులు, గంధర్వులు, అప్సరసలు, యక్షులు, భూతప్రేత పిశాచాలు, కిన్నరులు, కింపురుషులు.

మైత్రేయుడు విదురునికి కాల లక్షణం చెప్పాడు.

మైత్రేయుడు చెప్పినదంతా ఎదురు ప్రశ్నించకుండా మొదటి తరగతి మొద్దబ్బాయిలా విన్నాడు విదురుడు (నాకైతే బోలెడు

సందేహాలొచ్చాయి. కాని నా సందేహాలకు సమాధానాలు చెప్పే వెవరు?)

బ్రహ్మ మొదట అయిదు అజ్ఞాన వృత్తులు సృష్టించాడు. కాని ఆ పాపమయ సృష్టి అతనికి నచ్చలేదు. ( చిత్రకారుడు ఓ చిత్రం గీసిన తర్వాత అది అతనికి నచ్చకపోతే ఆ కాగితమును ప్రక్కకు పడేసి మరో కాగితం మీద మళ్ళీ మరో బొమ్మ గీస్తాడు. బ్రహ్మగారు కూడా మన చిత్రకారుని లాంటి వాడేనా?) తర్వాత అతడు ఇతర సృష్టి ప్రారంభించాడు. మొదట నలుగురు కుమారులను కని మీరు సృష్టి చేయండన్నాడు బ్రహ్మ. (నలుగురు కుమారులేనా? ఒక్క కూతురునైనా సృష్టించలేదేమిటి? స్త్రీ ప్రాముఖ్యత లేని కాలమేమో అది. బ్రహ్మనన్నా! పెళ్లాం లేకుండా కుమారులనెలా కన్నావయ్యా! కాస్త నాకా రహస్యం చెప్పవూ?) వాళ్ళు సృష్టి కార్యానికి పూనుకో లేదు. (వాళ్లు పితృవాక్య పరిపాలకులు కాదన్న మాట. అలాంటి వెధవలను కన్నాడేమిటి బ్రహ్మ? తన మాట వినే కుమారులనే సృష్టించాలన్న జ్ఞానం మొదట బ్రహ్మగారికి లేదా? ఈ విషయములో మానవునికి బ్రహ్మగారికి భేదమే లేదు. ఇక బ్రహ్మ ప్రత్యేకత ఏమిటి?) బ్రహ్మకు కోపం రాగానే మరో కొడుకు కనుబొమ్మలలో నుండి పుట్టాడు రుద్రుడు. ఇంకా వానికి శివుడు, భవుడు, కాలుడు మొద అగు పదకొండు పేర్లున్నాయి. వానికి పదకొండు మంది భార్యలు. రుద్రుడు తనను పోలిన వాళ్ళను పుట్టించాడు. ( వీడు నవ్వి పుట్టిం చాడో, ఏడ్చి పుట్టించాడో. భార్యలతో సంపర్కము చెంది పుట్టిం చాడో కవి చెప్పలేదు.)

రుద్రుని వల్ల కలిగిన రుద్రగణం లోకమంతా భక్షించడం చూచి సంశయములో పడ్డాడు బ్రహ్మ. (లోకాన్ని భక్షించడమంటే ఏమిటో, రుద్రుడు మొదట పుట్టించిందే రుద్రగణాన్ని. ఆ రుద్ర గణం ఎవరిని భక్షించినట్టు? వ్యాసుని కాలంలో నరభక్షణ ఉండే దేమో! ఆటవిక దశలో నరభక్షణ ఉండేదని చరిత్ర పుటలు తిరగవేస్తే తెలుస్తుంది.) రుద్రుణ్ణి పిలిచి " నీ కుమాళ్లు ఘోరమైన చూపులతో

నమ్మా, దిక్కులను భస్మం చేసేలా వున్నారు. కనుక ఇలాంటి సృష్టి చెయ్యకు" అని చెప్పాడు. (చూపులకు భస్మం చేసే శక్తి వుంటుందా? దిక్కులను భస్మం చేయడమంటే ఏమిటో కవిగారు చెప్పాలి? రుద్ర గణం ఏమైపోయిందో?) రుద్రుడు బ్రహ్మకు ప్రదక్షిణ చేసి తపస్సు కోసం అడవికి వెళ్ళిపోయాడు. (అడవి ఇంకా సృష్టించ బడలేదే!) బ్రహ్మకు తర్వాత ఒకడు బొటన వ్రేలిలో, ఒకడు చేతిలో, ఒకడు చెవిలో మొత్తం పది మంది పుట్టారు. (కవిగారూ! మరీ ఇంత బుద్ధి తక్కువ రచన ఎందుకు చేశావోయీ!) కామము, క్రోధము, ధర్మము, అధర్మము ఇంకా ఏమేమిటో అన్నీ బ్రహ్మగారికే పుట్టాయి.

సరస్వతి అనే చక్కని అమ్మాయి పుట్టింది బ్రహ్మకు (సృష్టిలో పుట్టిన మొట్ట మొదటి స్త్రీ ఈమె) చక్కనైన బిడ్డను చూడగానే కామ కోరిక పుట్టిందా దౌర్భాగ్యునికి. సరస్వతి అంగీకరించలేదు సంపర్కానికి. కొడుకులు తండ్రికి బుద్ధి చెప్పారు. "తండ్రీ నీవు ఉత్త మోత్తముడివి......నీవంటి తేజోవంతులు చేయవలసిన పన్నేనా ఇది అని మందలించారు. (బిడ్డను కామించిన తర్వాత కూడా ఉత్తముడే నట. బ్రహ్మ ఇచ్చట తన బిడ్డను కామించడం సమర్థించాలి లేదా బ్రహ్మ బుద్ధి హీనుడని అంగీకరించాలి. బ్రహ్మ భక్తులారా! మీ సమాధాన మేమిటి?)

బ్రహ్మదేవుడు సిగ్గుపడి శరీరం విడిచి పెట్టాడు. (ఉరిపెట్టు కున్నాడో, బండ కట్టుకొని బావిలో పడ్డాడో మొత్తం మీద ఆత్మ హత్య చేసుకున్నాడు.)

లోకాలన్నీ ఎలా సృష్టి చేసేది అని ఆలోచించాడు బ్రహ్మ (వీడెవడు మళ్ళీ? బ్రహ్మ ఇంతకు ముందే చచ్చాడే. శరీరం విడిచి పెట్టడమంటే చావడం కాదా? మనము మాసిన బట్టలను విడిచి మంచి బట్టలు ధరించినట్టు ఈ బ్రహ్మగాడు బిడ్డమీద చెడ్డ కోరిక కలుగగానే శరీరం చెడిపోయిందని భావించి శరీరం విడిచిపెట్టి ఇంకో శరీరం ధరించాడా ఏమిటీ?) వాని తూర్పు ముఖం నుండి ఋగ్వేదం, దక్షిణ

ముఖం నుండి యజుర్వేదం, పడమటి ముఖం నుండి సామవేదం, ఉత్తరముఖం నుండి అథర్వణ వేద పుట్టాయట.

నేను ఎంత ప్రయత్నం చేస్తున్నా ప్రజా సృష్టి కావడం లేదని ఆలోచనలో పడ్డాడు బ్రహ్మ. ఉన్నట్టుండి అతడు రెండు ముక్కలయ్యాడు. ఒకటి ఆడది ఒకటి మగది మిధునమైంది. ఈ విధంగా జవ సృష్టి చేయబడింది. మగ ముక్క పేరు స్వాయంభువ మనువు, ఆడ ముక్క పేరు శతరూప. ( బ్రహ్మ ముక్కలు కావడమేమిటో, అందులో ఒకటి మగది ఒకటి ఆడది కావడమేమిటో? వ్యాసక వీ! నీకంటే విశలాచార్య నయం ఇంత హేతువాద విరుద్ధమైన ఆలోచనలు ఆయనకు రావు )

భార్య శతరూపతో కలసి బ్రహ్మ ముందు నిలబడి అడిగాడు స్వాయంభువ మనువు (బ్రహ్మ ముక్కలయ్యాడు కదా! మళ్ళీ ఈ బ్రహ్మ ఎవడు? క్రొత్తగా ఉద్యోగానికి వచ్చాడా ఏమిటీ వీడు. లేక వాడే ఇంకో శరీరం ధరించాడా?) "మేము ఇహలోకములో పరలోకములో ఏమేమి చెయ్యాలో చెప్పు?"

"గుణవంతులైన కుమారులను కను. ధర్మంగా భూమి పాలించు"

"తండ్రీ! పాపాలు పోగొట్టేవాడవు, నీఆజ్ఞ శిరసావహిస్తాను" (అప్పటికి పాపాలు చేసిన వారెవ్వరు? ఎవరి పాపాలు పోగొట్టాడు బ్రహ్మ. బ్రహ్మగారూ ! పాపాలను ఎక్కడికి పోగొడుతారండీ మీరు?)

" ప్రాణకోటి నివసించే భూమి సముద్రములో మునిగి పోయింది. దీనిని ఉద్ధరించే ప్రయత్నంచెయ్యి" (భూమి సముద్రములో మునిగిపోయి వుందని మనువుకేం తెలుసు?)

"నేను సృష్టి చేస్తున్న సమయములో నీళ్ళలో మునిగిపోయింది భూమి. దీనిని పైకి తీసుకొని రావడమెలా? అని ఆలోచించసాగాడు" బ్రహ్మ. (భూమిని సృష్టించ గలిగిన బ్రహ్మ, నీళ్లలో నుండి దానిని పైకి తేలేకపోయాడా? ఈ భూమి ఏ సముద్రములో మునిగి

పోయింది? దీనికి సమాధానం కవిగారే చెప్పాలి. కవిగారు చనిపోయారు కనుక దీనికి సమాధానం చెప్పలేరు. కాని కవిగారి రచనను సమర్థించే పాఠకులు దీనికి సమాధానం చెప్పాలి )

హఠాత్తుగా బ్రహ్మ ముక్కులో నుండి చిన్న పంది పుట్టింది. అది అకస్మాత్తుగా ఏనుగంత పెరిగింది ఆకాశంలో ఎగిరింది. ఆ ఏనుగంత పంది తర్వాత కొండంత పెరిగింది. చివరికి ఏనుగువలె నటిస్తూ నీళ్ళలో దుమికింది. (ముక్కులో నుండి పంది పుడుతుందా? అనేది మొదటి ప్రశ్న రెండవది ఏనుగంత పెరిగిన ఆ పందికి రెక్కలున్నాయా? పైకి ఎలా ఎగిరింది?)

మహా మునులు పందిగారిని మూడు వేదాలలోని మంత్రాలలో స్తోత్రాలు చేశారు. సముద్రము గారు పందిగారికి చేతులెత్తి నమస్కరించాడు. (సముద్రానికి చేతులట.) పంది తన దంతాలపై భూగోళాన్ని పైకెత్తింది (కొండంత పెరిగిన పంది సువిశాలమైన భూమిని నీళ్లలో నుండి పైకెలా తేగలిగింది?) హిరణ్యాక్షుడు అడ్డుకున్నాడు. పంది వానిని చంపి వేసింది.

బ్రహ్మ పందిని స్తుతిస్తూ "అన్ని దేవతలూనువ్వే. అన్ని యజ్ఞాలూనువ్వే నీకు మా నమస్కారం. చరాచర జీవకోటి సుఖంగా బ్రతకడం కోసం నీభార్య అయిన భూదేవిని నీటి మీద స్థాపించు'' (పందిగారి భార్య భూగోలమట. మనమంతా పందిగారి భార్యమీదనే పడుకుంటున్నాము. పంటలు పండించుకుంటున్నాము. ఇంకా చాలా......) ఆ పంది సముద్రం నీళ్ళు చిమ్మేసి భూమిని స్థిరంగా స్థాపించింది. (విరజిమ్మితే ఆ సముద్రం నీరు ఎక్కడికి వెళ్లినట్లు)

మైత్రేయునితో విదురుడు:- "పందిని హిరణ్యాక్షుడు ఎందుకు ఎదురుకున్నాడు'' అని అడిగాడు.

అసుర సంధ్యవేళ దక్షుని కూతురు దితి భర్త అయిన బ్రహ్మ ఋషి కశ్యపుని దగ్గరకు వెళ్లి "నా పన్నెండు మంది సవతులు పిల్లలనుగని సుఖంగా వున్నారు. నాకు పిల్లవాడు కావాలి. మన్మథుడు నన్ను బాధిస్తున్నాడు. నా కోరిక తీర్చండి'' అంది. (పదమూడు

మంది భార్యల దగ్గర పడుకొని వారిని కశ్యపుడు సంతృప్తి పరచలేక పోయాడన్న మాట. సాధ్యమామరి. అందుకే దితి విరహ బాధతో భర్త దగ్గరకు వచ్చింది.) చీకటి పడ్డాక నీ కోరిక తీరుస్తానన్నాడు కశ్యపుడు. కశ్యపుడు దితికి ఇంకా ఇలా చెప్పాడు. "ఈ నరదేహం కుక్కలు పీక్కతినడానికే యోగ్యమైంది. తెలివితక్కువ మనుషులు బట్టలుకట్టి నగలుపెట్టి గంధంపూసి మురిసి పోతారు. (కశ్యపుణ్ణి నరికి కుక్కలకు వెయ్యవలసిందే, కశ్యపుడు బట్టలెందుకు కట్టుకున్నాడో-ఇది అడగవలసిన ప్రశ్న. కవిగారికి తన పాత్రలు బట్టలు కట్టకుండా నగ్నంగా తిరగాలని సరదా వున్నట్టుంది

దితి వేశ్యలాగా కశ్యపుని చెయ్యి పట్టుకొంది. కశ్యపుడు ఆమెతో సంగమం చేసి నదికి వెళ్లి స్నానం చేశాడు. ఆమె అతని దగ్గరకు మళ్ళీ వెళ్ళింది.

దితితో అన్నాడు కశ్యపుడు "నీ హృదయం కామవాసనతో కలుషితమై పోయింది. నీ కడుపులో దుష్టులు పుడుతారు. భగవంతుడు అవతారమెత్తి వారిని చంపుతాడు (వీని హృదయంలో కామవాంఛ లేకుండానే భార్యతో సంగమం చేశాడా? అనేక మంది భార్యలతో కామ సుఖాలనుభవించే వాడు కనుక దితితో సంయోగంచెందే సమయములో......కామ వాంఛ అధికంగా వుండకపోవచ్చు. అయినా అనేక మంది భార్యలతో కామ సుఖాలనుభవించే కశ్యపునికి కామ వాంఛ ఎంత బలీయమైందో ఎలా తెలుస్తుంది. కశ్యపునికి భవిష్యత్తు తెలిసినట్టే తన కొడుకులను ఎవరు ఎందుకు చంపేస్తారో చెప్పేస్తున్నాడు. కవిగారూ! ఇదంతా మీ చాతుర్యం )

దితి:— అవును నా కొడుకులు భగవంతుని చేతిలోనేచావాలి. బ్రాహ్మణుల చేత చావకూడదు. బ్రాహ్మణ శాపం వల్ల చచ్చివాళ్లను నరకంలో కూడా ఎవరూ కనికరించరు. ("బ్రాహ్మణులు ఏది చేసినా ఎదురు చెప్పకండి. ఎదురు చెప్పితే వాళ్లు శపిస్తే మీరు నరకం వెళ్ల డమే కాకుండా అక్కడకూడా అనేక బాధలు అనుభవించ వలసి వస్తుంది." అని చెప్పి బ్రాహ్మణేతరులను అణచి వేయడానికి కవిగారు

వేసిన ఎత్తు ఇది.)

నీ కడుపులో పుట్టిన కుమాళ్ళలో హిరణ్యకశిపుడి కొడుకు ప్రహ్లాదుడు భగవద్భక్తుడవుతాడు'' అన్నాడు కశ్యపుడు.

కశ్యపుడి వీర్యం వంద ఏళ్ళ దాకా గర్భములో మోసింది దితి. జగత్తంతా చీకటి కమ్మింది. దేవతలు బ్రహ్మను ప్రార్థించారు. బ్రహ్మ నవ్వుతూ ప్రత్యక్షమై "దీనికి పూర్వగాథ వుంది. చెప్తాను వినండి" అని మొదలు పెట్టాడు.

వైకుంఠములో అందరూ విష్ణువునే పూజిస్తారు. అక్కడ చెట్లు, పక్షులు, మేడలుంటాయి. శ్రీహరి కథలు విసని పాపాత్ములు వైకుంఠములో ప్రవేశించలేరు. భగవంతుని గుణాలు వర్ణిస్తూ ఏడ్చే వారికి యమ బాధలుండవు.

ఓనాడు నా కుమారులు సనకసనందనాదులు వైకుంఠపు ఆరు ద్వారాలు దాటి ఏడో ద్వారము వద్దకు చేరారు. అక్కడ ద్వార పాలకులున్నారు. (విష్ణువు మహా ధనవంతుడు కనుక అతనికి గొప్ప మేడలున్నాయి. ఆ మేడల ద్వారాలకు వజ్రాలు తాపిన బంగారు తలుపులున్నాయి, ద్వార పాలకులున్నారు. ఇది ఆనాటి ఆర్థిక వ్యత్యాసాన్ని గుర్తుచేస్తున్నది. ఈ ఆర్థిక అసమానత ఆనాటి నుండి ఈనాటి వరకు చెక్కు చెదరకుండా అలాగే వుంది. ఈ అసమానతను రూపుమాపి సమసమాజం స్థాపించ వలసిన బాధ్యత మానవత్వం వున్న మనుషులందరి మీదా వుంది.) సనకసనందనాదులు బట్టలు కట్టుకో లేదు. (వీరిని లక్ష్మిదేవి కూడా చూస్తుందా?) అడగకుండా లోనికి వెళ్తున్న మునులను ద్వారపాలకులు అడ్డుకున్నారు. మునులు ద్వార పాలకులను తిట్టారు. (ద్వారపాలకులు తమ ఉద్యోగ ధర్మాన్ని చక్క గానే నెరవేర్చారు. నేను మిమ్ముల్ను అభినందిస్తున్నాను ద్వారపాల కులారా! మూర్ఖ మునుల తిట్లను లెక్కించవలసిన అవసరం మీకేమీ లేదు.) "భగవంతుని సేవకులు కనుక మీ అపరాధానికి తగిన దండన విధిస్తాము దానివల్ల మీకు మేలే జరుగుతుంది. మీరు పాపయోనిలో పుట్టండి. (మేలు జరిగితే అది దండన ఎలా అనబడుతుంది?

యోనులలో పాపయోనులని, పుణ్య యోనులని భేదాలుంటాయా?)

భగవంతుడే బ్రాహ్మణ శాపానికి భయపడుతాడు. కనుక ద్వారపాలకులు మునుల కాళ్ళమీద పడ్డారు (భగవంతుడే సర్వ సృష్టికి కర్త అని చెప్పారు కవిగారు. అలాంటి సర్వ సృష్టికర్త బ్రాహ్మణ శాపానికి భయబడుతాడా? బ్రాహ్మణాధిక్యతను పెంచ డానికి కవిగారు వేసిన ఇదొక ఎత్తు. తప్పు చేయని ద్వారపాలకులు మునుల కాళ్ల మీద ఎందుకు పడాలి. తప్పు చేసింది మునులు. వాళ్లే ద్వారపాలకుల కాళ్ళ మీద పడి క్షమాపణ వేడుకోవాలి. ఇదే న్యాయము. ఈ నీచ మునులు న్యాయమును పాటించేట్టు లేరు.) విష్ణువు కనబడి తన ద్వారపాలకులది తప్పని ఒప్పుకున్నాడు. మునులు విష్ణువును పొగిడారు. (న్యాయదృష్టిలేని మూర్ఖుడైన విష్ణువును ఈ మూర్ఖ మునులు కాక మరెవరు పొగడుతారు.)

విష్ణువు:— మునులారా! బ్రాహ్మణులంటే దేవతలు నాకు. మీకు అపరాధం చేసిన వాళ్ళు ఎవరైనా సరే తుదకి నా చేతులైనా నరికి పారేస్తాను (విష్ణువు ఎలా వాగుతున్నాడో చూడండి. పిచ్చి వానిలాగా.) నేతులతో పాయసాన్నం భుజించే బ్రాహ్మణుల నోళ్ళ వల్ల కలిగిన తృప్తి యజ్ఞాగ్ని వల్ల కూడా కలుగదు నాకు. బ్రహ్మవేత్తల పాదధూళి నా శిరస్సున ధరిస్తాను, అన్యాయం చేసినా బ్రహ్మవేత్తల్ని సహించని వారెవరు? (పాఠకులారా! అన్యాయం చేసిన వారిని మీరు సహిస్తారా? లేక వాళ్ళ పళ్లు రాలగొడుతారా?) నా భృత్యులది తప్పేకాని వీళ్ళు తొందరగా నా దగ్గరకు వచ్చేట్టు అనుగ్రహించండి. (బ్రాహ్మణుల మెప్పుకోసం నిరపరాధులైన భృత్యులను శిక్షించిన విష్ణువెంత దుర్మార్గుడో. వారు లేకపోతే ఇబ్బంది కలుగుతుందని తొందరగా నా దగ్గరకు వచ్చేట్టు అనుగ్రహించు మంటున్నాడు.)

మునులు:— జయ విజయులు (ద్వారపాలకులు) నిరపరాధులు. వీళ్లని మేము శపించాము. అందుకని మాకు తగిన దండన విధించు. (మునులారా! ఇప్పటికైనా సత్యం మాట్లాడినందుకు

మిమ్మల్నలను మన్నిస్తున్నాను. కాని మీరు క్షమాపణ వేడుకోవలసింది విష్ణువును కాదు జయవిజయులను.)

విష్ణువు:— మునులారా! జయవిజయులు రాక్షసులై పుడతారు. క్రోధంతో వీళ్ళ హృదయం నామీదే వుంటుంది, త్వరలోనే నా దగ్గఱకు వస్తారు. (జయవిజయులను విష్ణువు చివరికి ఇలా శిక్షించాడు.)

విష్ణువు జయవిజయులతో అన్నాడు:— బ్రాహ్మణ శాపం మళ్లించగలను. కాని అది నా సంకల్పం కాదు. ఏమంటే మీవల్ల బ్రాహ్మణ తేజస్సు ప్రకాశించాలనే నా కోరిక. ( బ్రాహ్మణ తేజస్సును పెంచడానికి కవిగారు ఈ విధంగా ప్రయత్నం చేశారు )

బ్రాహ్మణుల శాపం పొందిన జయవిజయులు దితి గర్భములో ప్రవేశించారు. దితి వందేళ్లు గర్భం మోసి చివరికి కవల కుమారులను కన్నది (హిరణ్యకశిపుడు, హిరణ్యాక్షుడు) ఆ పిల్లలు పుట్టడంతోనే మేఘాలు చీము కురిశాయి. దేవ విగ్రహాలు కన్నీరు కార్చాయి. గాలి లేందే చెట్లు కూలాయి. ( ఇదంతా అభూతకల్పన వందేళ్ళు గర్భం మోయడం, మేఘాలు చీము కురియడం, గాలి లేందే చెట్లు కూలడం మొదలగునవన్నీ హేతువాదానికి విరుద్ధంగా వున్నాయి. ఆ కవలలు దుర్మార్గులు అని చెప్పడానికి బదులు కవిగారు ఈ చెత్తంతా వ్రాశారు ) హిరణ్యాక్షుడు వరుణ దేవుణ్ణి బెదిరించాడు. భగవంతుడు పందిగా మారి పాతాళంలో వున్నాడని విని పాతాళానికి వురికాడు. అక్కడ పంది కనిపించింది. ఆ పంది తన కోరల మీద వున్న భూదేవిని ఓచోట కూర్చుండ బెట్టాడు. పంది, హిరణ్యాక్షుడు కొట్లాడుతుండగా వెయ్యి మంది మునులను వెంటబెట్టుకొని వచ్చాడు బ్రహ్మ. బ్రహ్మ పందితో అన్నాడు " వీడు నిరపరాధులను బాధిస్తున్నాడు. వీనిని వెంటనే చంపు (నిరపరాధులైన జయ విజయులను విష్ణువు శిక్షించలేదా? హిరణ్యకశిపుడు కూడా విష్ణువు లాగే నిరపరాధులను శిక్షిస్తున్నాడేమో! అయితే వీళ్ళిద్దరూ దుర్మార్గులే కాని విష్ణువు ధనవంతుడు కనుక అతని తప్పులు ప్రచారం కాలేదు. పైగా

అతనికున్న కాస్త సుగుణములను అడుక్కుతినే మునులు విరివిగా ప్రచారం చేశారు హిరణ్యాక్షుడు విష్ణువంత గొప్ప ధనికుడు కాదు. హిరణ్యాక్షుని వలన మునులకు కలిగే లాభం ఏమీలేదు అందు వలన అతని తప్పులను వారు విరివిగా ప్రచారం చేశారు.) పందికి హిరణ్యాక్షునికి యుద్ధం మహా భయంకరంగా కొనసాగుతూవుంది. లెక్కలేనంత రాక్షసులు భయంకరంగా అరిచారు. (దితి గర్భములో జన్మించినవారు ఆది దైత్యులు. మరి ఈ రాక్షసులందరూ ఎవరి గర్భములో జన్మించారు. పూర్వ జన్మలో వారెవరు? వారెవరి శాపము పొంది రాక్షసులయ్యారు. తప్పు చేసిన వారిని జైల్లో వెయ్యాలి, లేదా ఉరిశిక్షవెయ్యాలి లేదా ఇంకేదైనా శిక్షవిధించాలి. అంతేకాని తప్పు చేసిన వారిని రాక్షసులుగా పుట్టించడమెందుకు? నిరపరాధులు బాధించబడడమెందుకు? భగవంతుడు కొందరు దురాత్ములను పుట్టించడమెందుకు? కొందరు శిష్టులను పుట్టించడమెందుకు? భగవంతుడు అందరినీ సన్మార్గులుగా ఎందుకు పుట్టించడంలేదు. భగవంతునికి అందరినీ సన్మార్గులుగా పుట్టించే శక్తి లేదా? లేక బుద్ధిలేదా? అయ్యా కవిగారూ! నా ప్రశ్నలకు సమాధానాలిచ్చే శక్తి మీ దగ్గరవుంటే ఒక్కసారి నా దగ్గరకు రండి ) పంది హిరణ్యాక్షుణ్ణి సంహరించగలిగింది. ఈ పంది చరిత్ర చదివిన వారికి బ్రహ్మ హత్యా మొదలైన పాపాలు పోతాయి. (కవిగారు మహా బాగా సెలవిచ్చారు. కాని బ్రహ్మ హత్య చేసిన వారిని ఈ పంది చరిత్ర చదువనివ్వకుండానే వెంటనే జైల్లో పెడుతారు కదండీ )

బ్రహ్మ తొడ నుండి అసురులను పుట్టించాడు. అసురులు కామాతురులై మైథునం కోసం బ్రహ్మ మీదికి ఎగబడ్డారు. (బ్రహ్మ మూర్ఖుడు కాకపోతే ఇలాంటి నీచులనెందుకు పుట్టిస్తాడు?) బ్రహ్మ శరీరం విడిచి పెట్టాడు. అది సంధ్యాదేవిగా తయారైంది. (బ్రహ్మ ఇలా శరీరం విడిచి పెట్టడం ఇది ఎన్నవసారి?) బ్రహ్మ మళ్ళీ అప్సరసల్ని పుట్టించాడు. తరువాత బ్రహ్మ సోమరిపోతుగా తయారై భూతాలు, పిశాచాలు సృష్టించాడు. ('శివాజీ' పటం గీయ మంటే

సోమరి విద్యార్థులు 'కోతి' పటం గీసినట్లు-సోమరి పోతు వెధవకు సృష్టిపని అప్పగిస్తే ఎన్నెన్ని ఘోరాలు జరుగుతాయో భగవంతుడు గారు ఆలోచించనే లేదా? సరి దేవునికి కూడా బుద్ధిలేదు. బ్రహ్మ సాధ్యుల్నీ, పితృదేవతల్నీ సృష్టించాడు. పితృదేవతలకీ, సాధ్యులకీ శ్రాద్ధ కర్మల్లో కవ్యాలు, హవ్యాలూ అర్పిస్తారు పండితులు (బుద్ధిలేని పండితులు మాత్రమే) సృష్టి పెరగడం లేదని కోపంతో కాళ్లూ చేతులు నలుపుకున్నాడు బ్రహ్మ. రోమాలురాలి పాములయ్యాయి (ఈ వెధవ శరీరం నుండే పుట్టాయా పాములు.) తర్వాత ఋషులను పుట్టించాడు.

కర్దముడు శ్రీహరిని ఆరాధించాడు. భగవంతుడు గరత్మంతుని మీద ఆకాశంలో కనిపించాడు (పక్షుల వలె ఆకాశంలో విహరించా లన్న కోరిక ఆనాటి మానవునిలో వుండేది. మనిషి స్వయంగా ఎగర లేడు గరత్మంతుడు ఆకాశంలో చాలా ఎత్తువరకు ఎగుర గలడు. ఆలోచనలలో మనిషి గరత్మంతుని మీద కూర్చుండి ఆకాశంలో విహ రించేవాడు. యథార్థంగా విహరించగలడా? అయినా భగవంతుని వాహనం ఒక పక్షా?) కర్దముడు అనుకూలవతి అయిన అర్ధాంగి నిమ్మని భగవంతుణ్ణి అడిగాడు.

"తొలి రాజు స్వాయంభువ మనువు కూతురు దేవహూతి. నీవంటి భర్తకోసమే వెదకుతూ ఉందామె ఆమెను నీకిచ్చి వివాహం చేస్తాడు మనువు నీ వీర్యంతో దేవహూతి గర్భములో నా అంశలో నేను అవతరిస్తాను. తత్వ సంహిత సాంఖ్యశాస్త్రము రాస్తాను" అన్నాడు భగవంతుడు.

స్వాయంభువ మనువు సపరివారంతో కర్దమముని ఆశ్రమము లోకి వచ్చాడు కర్దముని పాదాలకు నమస్కరించాడు. (ఆనాటి రాజు లకు ఎచ్చటికి వెళ్ళినా సేవకులుండేవారు. ఆనాడు సాంఘిక వ్యత్యాసం, ఆర్థిక వ్యత్యాసం ఎక్కువగానే వుండేది. బిడ్డలు కలవారు ఈనాటి వలెనే అల్లుని కొఱకు వెదకుతూ వుండేవారు. ఎంతటి వాడైనా అల్లునికి మ్రొక్కే ఆచారం ఇందులో చూడవచ్చు.)

"ఇక్కడికి ఎందుకు వచ్చావు అన్నాడు" కర్దముడు.

బ్రహ్మదేవుడు వేద రక్షణ కోసమే మీవంటి బ్రాహ్మణులను తన ముఖములో నుండి సృష్టించాడు. మీవంటి మహాత్ములను రక్షించడం కోసం రాజులను చేతులలో నుండి పుట్టించాడు. అందుకనే బ్రాహ్మణులు రాజులను, రాజులు బ్రాహ్మణులను రక్షిస్తారు. (వ్యాసముని పాఠకులను నమ్మించడానికి అనేక ఎత్తులు వేశాడు. బ్రాహ్మణులు విద్యావంతులు, రాజులు రాజ్యాధిపతులు వీరుభయులు కొట్లాడుకుంటే మిగిలిన వర్గాలవారు లాభపడే అవకాశం వుంది కనుక వీరుభయులు కలసిమెలసి వుండాలని వ్యాసుల వారి వుద్దేశం, అంటే ఆనాటికే బ్రాహ్మణులకు, రాజులకు మధ్య ఏదో ఒక విషయములో భేదాభిప్రాయాలు కలుగుతుండేవని అర్థం) ఇలా చెప్పి తన కూతురును పెళ్లిచేసుకొమ్మని కోరాడు మనువు.

దేవహూతి కర్దముల వివాహం జరిగింది. (ఆనాడు బ్రాహ్మణ పురుషులకు రాజకన్యలను ఇచ్చి వివాహం చేసే పద్ధతి వుండేది. భాగవతమును ఆరాధ్య గ్రంథముగా భావించే ఈనాటి అనేక లక్షలమంది ఈ విషయాన్ని గ్రహించాలి.) విలువైన నగలూ, వస్త్రాలు వధూవరులకు అరణమిచ్చింది రాణి శతరూప. (ఆనాడు కూడా తల్లిదండ్రులు బిడ్డకు పెళ్ళిచేసి కొంత ధనమిచ్చేవారు. మనువు తన కుమారుల కిచ్చినట్టు కూతుళ్ళకు సమానంగా రాజ్యాన్ని పంచిఇవ్వలేదు. అనగా స్త్రీకి ఆనాటినుండి పురుషులతో సమానావకాశాలు లేవు.) దేవహూతి భర్తకు అనేక సేవలు చేసేది. భర్తని మించిన దేవుడు లేడని భావించేది. (భార్యాభర్తలు పరస్పరం ప్రేమించుకోవాలి. సహాయం చేసుకోవాలి. అంతేకాని భాగవతంలో చెప్పినట్లు భార్యమాత్రమే భర్తకు సేవలు చేయనక్కరలేదు. వ్యాసులవారు స్త్రీకి నేర్పిన బానిస నీతి యిది. ఈ నీతులు చదివిన స్త్రీలు పురుషుల చేతుల్లో కీలు బొమ్మలవలె తయారయ్యే ప్రమాదం వుంది.) కర్దమునికి దివ్యదృష్టి వుంది. అతడు దేవహూతికి దివ్యదృష్టి ప్రసాదించాడు. (అయ్యా! కర్దమ ఋషి! ఇంకా దివ్య దృష్టి నేర్పుతావా? యోగ

ప్రభావంతో చిత్ర విచిత్రమైన పదార్థాలు సృష్టించాడు. (వీడు గారడీ వాడే వున్నట్టున్నాడు—ఆనాటి మానవులకు పదార్థాలు సృష్టించాలన్న కోరిక వుండేదని, అది అసాధ్యం కనుక అలాంటి కథలు వ్రాసి సంతృప్తి పడేవారు, అని అర్థం చేసుకోవాలి.)

కర్దముడు దేదీప్యమానమైన కామ గమనం కల మహా విమానంలో వాయువేగంతో అన్ని లోకాలూ తిరిగాడు. విమానంలో ఉత్తమశయ్య మీద భర్తతో రతిక్రీడలనుభవిస్తూ వందేళ్లు ఒక దినంలో గడిపింది. (వ్యాసమునీ! ఇలాంటి కథలు చదవడం వలన పాఠకులకు కలిగే ప్రయోజనమేమిటోయి ఈనాడు అనేక వేల మంది శ్రమ శక్తిని దోచుకొనుచున్న కోటీశ్వరులు కూడా విమానాలలో తిరుగుతూ అనేక సుఖాలనుభవిస్తూ వుంటే కొందరు అనేక కష్టాలు అనుభవించడం సహజమే సుఖాలనుభవించే వారికి దినాలు క్షణాల్లాగే గడుస్తాయి ) దేవహూతికి తొమ్మిది మంది పిల్లలు కలిగారు. (తొమ్మిది మంది ఆడ పిల్లలను కంటే ఈనాటి తండ్రి ఘోరమైన కష్టాలనుభవిస్తాడు.) కొన్నాళ్ళకు కర్దమ ప్రజాపతి వీర్యంతో దేవహూతి గర్భములో భగవంతుడు నాలుగు చేతులతో కపిలుడన్న పేరుతో జనించాడు. బ్రహ్మ హంసపైనెక్కి కర్థముని దగ్గఱకు వచ్చి కపిలుడు పెద్దవాడై ఏమేమి చేస్తాడో, తొమ్మిది మంది ఆడ పిల్లలను ఎవరెవరికిచ్చి పెళ్ళి చేయాలో చెప్పి వెళ్ళిపోయాడు. ( చూశారా దేవుళ్ళ వాహనాలు-బ్రహ్మ వాహనం హంస. మనం కూడా హంసనో, చిలుకనో, కాకినో, దోమనో కొనుక్కోవాలి. ధర తక్కువే, తర్వాత ఖర్చు కూడా తక్కువే. విమానంలో ప్రయాణం చేయాలంటే బోలెడు ఖర్చు. మనం భరించగలమా? గరత్మంతుణ్ణి, లేదా హంసను కొనుక్కుంటే సరి. పెట్రోలు ఖర్చుండదు. దానికింత ఆహారం పడేస్తే సరిపోతుంది. దాని మీద ఎక్కి ఎంచక్కా అమెరికా, రష్యా, జర్మనీ, జపాన్, ఇంకా ఎన్నో దేశాలు వెళ్ళిచూచి రావచ్చు. కాని హంస నన్నూ, నిన్నూ మోస్తాడా? బలహీనులైన, బరువు హీనులైన దేవుళ్ళను మోస్తాడేమో! అంతేనా కవిగారూ?)

కర్దమ దంపతులు మరీచికి కళను, అనసూయను అత్రికి;......; అరుంధతిని వశిష్ఠునికిచ్చాడు. (వశిష్ఠ మహాముని ధర్మపత్ని అరుంధతి హరిజన కులంలో పుట్టిందంటారు కొందరు. వశిష్ఠ మహామునులు చాలా మంది ఉన్నారాయేమిటి?)

ఒకనాడు కర్దముడు ఏకాంతంగా కుమారుని దగ్గఱకు వెళ్ళి నమస్కరించి అన్నాడు "మేమెంత నీచులమైనా మా యింట అవతరించావు. భక్తులను పాలించడమే నీ స్వభావం. (కర్దముడు తాను నీచుడనని ఒప్పుకున్నాడు. నీచుడైనా సరే కాని భగవద్భక్తి వుంటే భగవంతుడు భక్తులను రక్షిస్తాడట. దేవుడిగారి మీద భక్తి భావం పెంచడం కోసం కవిగారు వేసిన ఎత్తు ఇది. ఈనాటి మన సమాజంలో కూడా, భగవద్భక్తులవలె నటించేవారు, కొందరు ఎన్నో నీచ కార్యాలు చేస్తూ కూడా సుఖంగానే బ్రతుకుతున్నారు.)

కపిలుడు తల్లి దండ్రులకు ఎన్నో ఉపదేశాలు ఇచ్చాడు.

కొడుక్కు ప్రదక్షిణ చేసి కర్దముడు అడవికి వెళ్లిపోయాడు.

కపిలుడు తల్లికి ప్రియం కలిగించడం కోసం బిందు సరోవరం దగ్గరే నివసించాడు. కపిలుడు తన గొప్పతనాన్ని తల్లితో ఇలా చెప్పాడు. "నాభయం వల్లే గాలి వీస్తోంది, నాభయం వల్లే సూర్య మండలం వేడి ప్రసాదిస్తోంది, నాభయం వల్లే అగ్ని దగ్ధం చేస్తోంది. నాభయం వల్లే ఇంద్రుడు వాన కురుస్తున్నాడు. నాభయం వల్లే మృత్యువు లోకంలో తిరుగుతోంది. (దేవుడి గారి దగ్గఱ చాలామంది ఉద్యోగస్థులున్నట్టున్నారు. వాళ్లంతా దేవునికి భయపడి తమ తమ పనులు చేస్తున్నారట—శాస్త్రజ్ఞులారా! మృత్యువును పట్టుకొని చంపెయ్యండి. వీడు పరమ దుర్మార్గుడు. ఏ మాత్రం ఆలస్యం చేయకండి. సూర్యుడు గారు తన ఉద్యోగ ధర్మాన్ని సక్రమంగా నిర్వర్తిస్తున్నాడు. కనుక ఈయనగారికి రెండు ఇంక్రిమెంట్లు ఎక్కువ ఇవ్వాలి. రాయల సీమ వాసులారా! ఇంద్రుని మీద మీరు దేవుడి గారికి కాంప్లెంటు ఇవ్వండి. వానికి వేశ్యల మీద మోజెక్కువై

పోయింది. వాని బుద్ది మందగించింది. ఎక్కడ ఎంత వర్షం కురిపించాలో ఆలోచించకుండా వర్షం కురిపించడం వలన ఒకచోట అధిక వర్షం వలన పంట నష్టం, ప్రాణ నష్టం జరుగుతూవుంటే, మరోచోట వానలేక త్రాగనీరు లేక ప్రజలు చస్తున్నారు. ఈ అన్యాయాలను ఇక సహించేది లేదు శాస్త్రజ్ఞులారా! మనం ఇంద్రుని మీద తిరుగుబాటు చేయాలి పదండి ముందుకు.

ఈ కథలో కవిగారి చాతుర్యం చాలా వుంది. ఇది నిజం సుమా అని పాఠకులు ఒప్పుకునే విధంగా వ్రాసి పడేశారు

కపిలుడు తల్లికి భక్తియోగం వివరిస్తూ ఇలా చెప్పాడు "....
........పశువులకంటే మనుషులు శ్రేష్ఠమైనవారు. మనుషులలో బ్రాహ్మణులు శ్రేష్ఠమైనవారు. (బ్రాహ్మణులు, బ్రాహ్మణేతరుల కంటే గొప్పవారని చెప్పుట కొఱకు ఎంతో శ్రమపడి ఎన్నో విషయాలు వ్రాశారు. బ్రాహ్మణ పక్షపాత బుద్ధితో మీరు అనేక కథలు చాలా నేర్పుగా వ్రాశారు కవిగారూ! ఇన్నాళ్లూ మీ కథలను ఆరాధించిన బ్రాహ్మణేతరులు భయంకరంగా మోసపోయారు. మోసం ఎల్లకాలం సాగదు. అది ఆగిపోయే సమయం వచ్చింది. మీ కథలకు విలువ లేకుండా పోయే సమయం వచ్చింది కవిగారూ! మీ భాగవతాన్ని అగ్ని దేవునికి సమర్పిస్తాం." అసత్యం అగ్నిలో కాలి భస్మం కావాలని, నిజం నిప్పులాగే వెలగాలని కోరుకుంటాం." మేము సమత కొఱకు సరికొత్త కథలు వ్రాసుకుంటాం. మేము సృష్టించే కథలలో ఒకరి పుట్టుకకు హీనత్వాన్ని, ఒకరి పుట్టుకకు ఔన్నత్యాన్ని ఆపాదించం. మా కథలలో సర్వ మానవులు సమానులంటాం. సర్వ మానవులకు సమానావకాశాలుండాలంటాం. ఒకరి శ్రమశక్తిని ఒకరు దోచుకునే విధానముండకూడదంటాం. కొందరు మేడలలో నివసిస్తూ సర్వ సౌఖ్యాలు అనుభవిస్తూ వుండగా, కొందరు చెట్ల క్రింద చలికి, ఎండకు, వానకు నానా కష్టాలుపడే దౌర్భాగ్యం వుండకూడదంటాం. సమాజములో నున్న అసమానతలను రూపు మాపుటకు ఎదురగు శక్తులను నిర్దాక్షిణ్యంగా అణచి వేయాలని, సమసమాజ

నిర్మాణానికి విప్లవం కొనసాగాలని.........ఇలా సమసను సాధించ డానికి వుపయోగపడే అనేక కథలు రాస్తాం )

కపిలుడు తన తల్లికి చావును గురించి చెప్పాడు.

మనిషి చచ్చినప్పుడు గుడ్లురుముతూ భయంకరులైన ఇద్దరు యమభటులు వచ్చి అతని ముందు ప్రత్యక్షమవుతారు. మెడకు తాడు కట్టి యమ లోకానికి ఈడ్చుక పోతారు. (ప్రాణానికి కూడా తల కాయ, మెడ, కాళ్లుచేతులు వుంటాయా? కవిగారూ! మీరు చూశారా? చచ్చినప్పుడు యమ భటులు ప్రత్యక్షమవుతారట. ఈ విషయం కవి గారికేం తెలుసు. కవి చచ్చిన తర్వాత ఇదంతా వ్రాశాడా?) కుక్కలు పీక్క తినడానికి దారిలో మీద పడతాయి. (భూలోకం నుండి యమ లోకం వెళ్లేదారిలో, ఎన్ని కుక్కలున్నాయి కవిగారూ! చచ్చిన తర్వాత పీనుగు భూలోకంలోనే వుంటుంది కదా! ఇక కుక్కలు పీక్కు తినేది దేనిని?) అనేక కష్టాలు అనుభవిస్తూ చిమ్మచీకటి దారిలో యమ లోకం చేరాలి. యమలోక దారి తొంభయి తొమ్మిది వేల యోజనాలు (కవిగారు భూలోకానికి యమలోకానికి మధ్యనున్న దూరాన్ని గజం బద్దతో కొలిచినట్టే వున్నారు. అయ్యా! కవిగారూ! 99 వేల యోజనాల దూరం వెళ్ళేవారు ఎవరూవుండరని, అందరూ తమరు చెప్పింది నమ్మేస్తారని తమరు భ్రమ పడ్డారు. ఈనాటి విజ్ఞాన శాస్త్రము మీరు సృష్టించిన యమలోకాన్ని నమ్మదండీ బాబూ!)

కపిలుడు తన తల్లికి నర జన్మ గురించి చెప్తూ "స్త్రీలు క్రీడా మృగాల వంటి వాళ్లు. విషయవాంఛ కలిగిన మూఢాత్ములు–(కవి గారికి స్త్రీల మీద చాలా గొప్ప అభిప్రాయం వుంది. స్త్రీని అనాది కాలం నుండి హీనంగానే చూస్తున్నారనడానికి ఇది ఒక ఉదాహరణ. బ్రహ్మ దేవుడు తన కూతురు అందం చూచి మోహించాడు. కపిలుడు తన తల్లితోనే స్త్రీలు మూఢాత్ములని చెప్తున్నాడు. భగవద్భక్తులారా! మీరు నమ్మిన దేవతలు ఎంత దుర్మార్గులో గ్రహించండి )

బుద్ధిమంతుడు ఆడదాన్ని గడ్డికప్పిన నూతిలాగా, మీదపడు తున్న మృత్యువులాగా చూస్తాడు (బుద్ధిహీనుడు ఆడదాన్ని నీచంగా

చూస్తాడు. ఆడదాన్ని నీచంగా చూచిన కపిలుణ్ణి ఏమనాలి? పాత్రల చేత ఇలాంటి విషయాలను చెప్పించిన వ్యాసులవారినేమనాలి? వీళ్లు నిర్మల మనస్కులనడానికి వీలుందా? నిజం చెప్పారనడానికి వీలుందా?)

ఈలోకం మీదే ఆసక్తులైన వాళ్ళు, కర్మల మీదే శ్రద్ధాభావం కలవాళ్లూ వేదాలలో చెప్పిన కార్యకర్మలే ఆచరిస్తారు. (వేదాలలో బ్రాహ్మణులకు అనుకూలమైన ధర్మాలే వ్రాయబడ్డాయి. అందులో అనేక దోపిడీ నీతులున్నాయి)

రుచి ప్రజాపతి ఆకూతి గర్భములో ఒక కొడుకును ఒక కూతురును కన్నాడు. మగ బిడ్డ పేరు యజ్ఞుడు ఆడ బిడ్డ పేరు దక్షిణ. యజ్ఞుడు అమ్మమ్మ యింట్లో పెరిగాడు. దక్షిణ తల్లిదండ్రుల దగ్గఱ పెరిగింది. వయస్సు రావడంతోనే దక్షిణ, యజ్ఞుడు తన భర్త కావాలని కోరింది. అలాగే అతడు ఆమెను వివాహం చేసుకున్నాడు. (పూర్వకాలంలో అన్నాచెల్లెల్లు కూడా పెళ్ళి చేసుకొని దాంపత్య జీవితం గడిపేవారనడానికి ఈ కథ ఉదాహరణ. ఈనాడు మనం అన్నాచెల్లెళ్ళ పెళ్ళిళ్ళకు అంగీకరించడం లేదు. అన్నాచెల్లెళ్ళ దాంపత్య జీవితం ఆనాటి కాలంలో సమర్థనీయమే. అయినా ఈనాడది పాపంగా భావిస్తున్నాం. ఆనాడు వ్యతిరేకించని ఆచారాన్ని ఈనాడు వ్యతిరేకించడానికి శాస్త్ర రీత్యా ఆధారం వుంది.

ఒకే గర్భములో నుండి పుట్టిన స్త్రీ, పురుషులు సంపర్కము పొందగా పుట్టిన శిశువు మానసికంగానూ, శారీరకంగానూ బలహీనంగా వుండడం జరుగుతుంది. ఇది ఇలా కొనసాగిన యెడల మానవ జాతి నశించిపోయే ప్రమాదం వుంది. అందుకే అన్నాచెల్లెళ్ళ దాంపత్య జీవితాన్ని వ్యతిరేకించడం జరుగుతూవుంది. దానిని మతంతో అంటగట్టి అన్నాచెల్లెళ్ళు సంపర్కం పొందితే పాపం తగులుతుందని చెప్పారు. మానవ జాతికి హానిచేసే ఏ ఆచారాన్నైనా వ్యతిరేకించవలసిందే)

యజ్ఞుడు దక్షిణ గర్భములో పన్నెండు మంది కొడుకులను

కన్నాడు

బ్రహ్మ పుత్రుడు దక్షప్రజాపతి, మనువు కూతురు ప్రసూతిని వివాహం చేసుకున్నాడు (బ్రహ్మకు మనువుకు గల సంబంధమేమిటి? దక్షునికి ప్రసూతికి గల వరుసేమిటి? పాఠకులారా! ఆలోచించండి) అతడు 16 మంది కూతుళ్ళని కన్నాడు. అందులో 13 మందిని ధర్మునికి, ఒకామెను అగ్నికి (ఓ బిడ్డను అగ్నిలో వేశాడా ఏమిటి? ఖర్మ. వాడు ఆమెను కాల్చుక తిన్నాడో ఏమిటో) ఒకామెను సకల పితృగణాలకు (అంత మంది భర్తలతో ఆమె ఎలా కాపురం చేసిందో.) సతీదేవిని శివునికిచ్చి పెళ్ళి చేశాడు (వీడు హిమాలయ పర్వతాలలో వుంటాడట. ఆ మంచులో ఎలా వుంటాడో ఏమిటో మన హిమాలయ పర్వతంగారు శివుని మామనేనట. ఈ మధ్య మన వాళ్ళు చాలా మంది హిమాలయ పర్వతం గారి మీదికి ఎక్కి చూచి వచ్చారు. అక్కడ వాళ్ళకు శంకరుడు కనిపించనే లేదట. చచ్చాడో ఏమిటో లేక ఆయన మామగారు వెళ్ళగొట్టారో. ఓ దక్షిణ అమెరికా పశ్చిమ తీరవాసులారా! మీ ఆండీస్ పర్వతాల మీద మా శంకరుడు కనబడితే మాకు తెలియజేయండి. వాని గుర్తులు చెప్తాను వినండి. వాని తలకాయ మీద చంద్రగోళం, గంగానది వుంటాయి. మెడలో ఓ పాము వుంటుంది. మొలచుట్టు పులితోలో, గొర్రెతోలో ఏదో కట్టుకుంటాడు. మూడు కండ్లుంటాయి. చేతిలో త్రిశూలం పట్టుకుంటాడు. వాని వెంబడి వాని భార్య పార్వతి అనే అందమైన స్త్రీ వుంటుంది.

వివరాలు చెప్తుంటే నవ్వుతున్నారెందుకు? అయినా నేను చెప్తున్న విషయాలు నవ్వు పుట్టించే విధంగానే వున్నాయనుకోండి. నిజానికి నేనా శంకరుణ్ణి ఎప్పుడూ చూడలేదు శంకరుణ్ణి గురించి మా కవులు వర్ణించి చెప్పిన విషయాలనే మీకు చెప్తున్నాను. అలాంటి వాడు కనబడితే మాకు తెలియజేయండి. మేము వెంటనే విమానంలో వచ్చి వానిని మా భారత దేశానికి తీసుకపోతాం. మా జంతు ప్రదర్శన శాలలో వుంచుకుంటాం.)

గుణవంతురాలైన మూర్తి గర్భములో నరనారాయణ మునులు

పుట్టాడు. వీళ్లు చచ్చి యాదవ వంశములో శ్రీకృష్ణుడై, (దొంగ వెధవ) కౌరవ వంశములో అర్జునుడై జనిమించారు.

పూర్వం ప్రజాపతుల యజ్ఞంలో దేవతలు, మునులు సమావేశ మయ్యారు. ఆ సమయములో దక్షప్రజాపతి కూడా ఆసభకు వచ్చాడు. బ్రహ్మ, శివుడు తప్ప తక్కిన దేవతలంతా లేచి నిలబడ్డారు. తాను రావడంతోనే లేవకుండా కూర్చున్న శివుణ్ణి పదేపదే చూశాడు దక్షుడు. (పిల్లనిచ్చిన మామను చులకనగా చూచిన ఘట్టమిది-పెద్దలను గౌరవించే విధము మనం శివుని దగ్గరే నేర్చుకోవాలి.) దక్షుడు కోపంతో అన్నాడు "ఈ సిగ్గులేని శివుడు, ఈ కోతికళ్ల శివుడు నా అల్లుడు. సభామర్యాద పాటించడు, నాతో మాట్లాడడు, పెద్దల్ని మన్నించని గర్వపోతు శూద్రునికి వేద విద్య నేర్పినట్టు నా కూతుర్ని వీనికిచ్చి పెళ్ళిచేసి గొంతు కోశాను. (శివుడు ఎలాంటివాడో దక్షుడు వర్ణించాడు. శివుడు కోరిన కట్నం ఇవ్వలేదో, ఏమిటో దక్షుడు. అందుకే శివుడు సభా మర్యాదను పాటించకుండా నోరు మూసుకొని కూర్చున్నట్టునాడు.- చివరికి కవిగారు చెప్పదలచుకున్న దేమిటంటే శూద్రునికి వేదవిద్య నేర్పుట శుద్ధదండుగ, అని-ఆ కాలంలో శూద్రులను వేదవిద్య చదువనిచ్చేవారు కాదు వేదాలు శూద్రులు చదివితే అందులోనున్న దోపిడీ నీతులు గ్రహిస్తారని వారి భయం.) వీడు పిచ్చివాడిలాగా తల విరబోసుకుంటాడు. (ఆ కాలంలో పురుషులు ఆడవారి వలెనే తలవెంట్రుకలుంచుకునే వారు.) ఒంటినిండా బూడిద పూసుకుంటాడు పునుకల పేరు మెళ్ళో వేసుకుంటాడు. (బూడిద పూసుకొని పునుకల పేరు మెళ్లో వేసుకుంటే ఎంత అసహ్యంగా వుంటుందో చెప్పలేము) ఒకప్పుడు నవ్వుతాడు, ఒకప్పుడు ఏడుస్తాడు. గంజాయి మత్తులో వున్న వీనికి మత్తులో వున్నవాళ్ళే ప్రియులు. భూత ప్రేత గణాలకు నాయకుడు వీడు బ్రహ్మ మాట విని ఈపిచ్చి వెధవకు నా కూతుర్నిచ్చాను దక్షుడు శివుణ్ని ఇలా తిట్టి వెళ్ళి పోయాడు.

శివుని అనుచరుడు నందీశ్వరుడు దక్షుణ్ణి, అతడు చేసిన శివనింద

సమర్థించిన బ్రాహ్మణ్ణి దారుణంగా శపించాడు.

కర్మకాండలో ఆసక్తులైన బ్రాహ్మణులు శివుణ్ణి ద్వేషిస్తున్నారు. వేదాలలోని అర్థవాదంతో బుద్ధితల్లకిందైన ఈ శివద్రోహులు కర్మలలోనే నిమగ్నులై పోవాలి. ఈ బ్రాహ్మణులు సర్వ భక్షకులు కావాలి. విద్యా, తపస్సు, వ్రతాలు తిండికోసమే ఆచరించాలి. ధనము, దేహము వీటి మీద ప్రీతి కలిగి అడుక్కుతిరగాలి. (బ్రాహ్మణులకు బ్రాహ్మణేతరులకు జరిగిన కలహమిది. అప్పటికే బ్రాహ్మణులు కర్మకాండలలో ఆసక్తి చూపేవారు. వారు అడుక్కుతినేవారు. దొరకిన అన్ని రకాల పదార్థాలను ఆరగించేవారు. వారు నేర్చిన వేదవిద్య తిండికోసమే, తపస్సులు, వ్రతాలు తిండికోసమే. కష్టపడి పని చేయని ఒక వర్గము వారు లోక కల్యాణం కోసం తపస్సులు, వ్రతాలు చేస్తున్నామని ప్రజలను నమ్మించి వారి వద్దనుండి ధనధాన్యాలు సంపాదించి పనిచేయకుండానే కూర్చుండి పొట్టలు నింపుకొని సుఖంగా బ్రతికేవారు ఉత్పత్తి కార్యక్రమాల్లో పాల్గొనకుండా తపస్సులు, వ్రతాలు చేసేవారు దొంగల్లాంటి వాళ్లు వారు సమాజానికి తీరని ద్రోహమే చేస్తుంటారు కర్షకులారా! కార్మికులారా! సమాజంలో దోపిడి ఎక్కడ ఎలా కొనసాగుతుందో కని పెట్టండి. దానిని అరికట్టండి.) నందీశ్వరుడు బ్రాహ్మణులను శపించడంతోనే ఉగ్రుడై లేచాడు భృగువు. ఇలా శాపం పెట్టాడు. "శివ భక్తులు ఉత్తమ శాస్త్రాలకు వ్యతిరేకులూ, పాషండులూ కావాలి" (మతాల మధ్య జరిగిన కలహమిది) శివదీక్ష పూనిన వాళ్లంతా మూఢ బుద్ధులు కావాలి.

ధర్మసంస్థాపకులూ, వర్ణాశ్రమ రక్షకులూ అయిన బ్రాహ్మణులను, వేదాలను మీరు నిందిస్తున్నారు. వేదమార్గమే లోకానికి శుభం కలిగిస్తుంది. (దోపిడీదారులను, దోపిడీ సాహిత్యాన్ని నిందించడం వలన ఒక దోపిడీ దారుడైన భృగువుకు కోపం వచ్చింది నందిని తిట్టాడు. నీచంగా మట్లాడాడు. వేద మార్గమే లోకానికి శుభం కలిగిస్తుందని వేదాలను గొప్పచేసి మాట్లాడాడు) భృగవును ఎదిరించే

శివుడు చిన్నబుచ్చుకొని వెళ్ళిపోయాడు. (భృగువును ఎదిరించే శక్తి శివునికి లేకనా? 'బ్రాహ్మణులను ఎదిరించకూడదు, వాళ్ళు తిట్టినా సహించాలి, చెప్పినట్లు వినాలి, అని పాఠకులకు బోధించడానికే. అంతేనా కవిగారూ!) ప్రజాపతుల యజ్ఞం వెయ్యి సంవత్సరాలు సాగింది.

దక్షుడు 'బృహస్పతి యజ్ఞం' అనే ఉత్తమమైన యజ్ఞం ఆరంభించాడు. ఆకాశం మీద వచ్చి పోతూవున్న దేవతలు తమలో తాము దక్షుని యజ్ఞం గురించి మాట్లాడుకోవడం వింది సతీదేవి. వెంటనే శివుని దగ్గఱకు వెళ్ళింది

"మానాన్న చేసే యజ్ఞానికి చాలామంది వెళ్తున్నారు. మనం కూడా వెళ్దాం పదండి. అమ్మా నాన్నా పెట్టే నగలూ తీసుకొని వస్తాను (తల్లిదండ్రులు తమ బిడ్డలకు పండుగల సందర్భములో నగలు, చీరెలు ఇచ్చే ఆచారం వ్యాసుని కాలం నుండి ఈనాటివరకూ వుంది.) కనుక దయ తలంచి రండి. దయాబిక్షకోరుతున్నాను. అని ఎంతో ప్రాధేయపడింది. (ఆర్థిక స్వాతంత్ర్యము లేని స్త్రీలు పుట్టినింటికి వెళ్ళడానికి భర్త యిష్టాను సారంగా, భర్త అనుమతితో వెళ్ళేవారు. అది ఈనాటికీ వుంది. అదే పురుషుని విషయంలో వేరుగా వుంది. అతడు ఎక్కడికైనా వెళ్లదలుచు కుంటే భార్య అనుమతితో నిమిత్తం లేకుండా చెప్పి వెళ్తాడు. చెప్పి వెళ్లడానికి, అనుమతి తీసుకొని వెళ్ల డానికి ఎంతో వ్యత్యాసం వుంది. చెప్పి వెళ్లడంలో స్నేహభావం వుంది. అనుమతి తీసుకొని వెళ్ళడంలో దాస్య స్వభావం వుంది.) మామగారు తిట్టిన తిట్లు జ్ఞప్తికి వచ్చాయి శివునికి "దక్షుడు నామీద పగ బట్టాడు. అందుచేత నా మాట వినకుండా నువ్వు మీ పుట్టింటికి వెళ్తే క్షేమం కలుగదు." అన్నాడు.

స్త్రీ స్వభావం స్త్రీ స్వభావమే మూఢబుద్ధితో భర్తని వదిలేసి స్వేచ్ఛగా కన్నవారింటికి బయలుదేరింది. (స్వేచ్ఛగా ప్రవర్తించే స్త్రీలు మూఢులని భర్త చెప్పినట్లు వినే స్త్రీలు మంచివారని కవిగారి ఉద్దేశములా వుంది.) వెయ్యి మంది ఆమె వెంట వెళ్లారు తల్లి

అక్కలు అదలించారు. దక్షుడు పలుకరించలేదు. (కఠినాత్ముడు) ఆ అవమానము భరించలేక పోయింది సతీదేవి. ఆమె అనుచరులు యజ్ఞం ధ్వంసం చేయడానికి పరుగెత్తారు. వద్దని వారించిందామె తండ్రిని అంత మంది ఎదుట తిట్టింది:

"శివుడు మహాముని. ఆయన బుద్ధి ఎన్నడూ వేద విరుద్ధంగా నడవదు. అపరాధివివున్వు. దుర్జనుడివి నువ్వు" అని తండ్రిని తిట్టి ఆత్మహత్య చేసుకొంది సతీదేవి. (పిచ్చిపిల్ల భర్తకూ తండ్రికీ మధ్య కలహం జరిగితే ఎందుకు చచ్చిపోయిందో. తండ్రి మాట్లాడనంత మాత్రాన చావడమేనా? కవిగారు సృష్టించిన పాత్రలలో ఇది ఒక పిరికి పాత్ర. భృగువు కూడా శివుణ్ణి తిట్టి అవమానించాడు కదా! భర్తను తిట్టి అవమానించిన భృగువును సతీదేవి ఎందుకు తిట్టలేదు. అది కవిగారికి ఇష్టంలేదు. అందుకని భృగువును సతీదేవి చేత తిట్టించ లేదు. కవికి ఎక్కడైనా బ్రాహ్మణ పక్షపాత బుద్ధే కనిపిస్తూవుంది) సతీదేవి చావగానే ఆమె అనుచరులు దక్షుణ్ణి చంపడం కోసం విరుచుక పడ్డారు. యజ్ఞం పాడుచేసే వాళ్ళ నాశనం కోసం, భృగువు యిష్టప్రకారం-చంద్ర లోకంలో వున్న-రుభులు అనే దేవతలు ఎంతో మంది యజ్ఞ గుండంలో పుట్టుకవచ్చారు. (రుభులు రిజర్వు పోలీసు ల్లాంటి వాళ్ళా ఏమిటీ? ఆంస్ట్రాంగ్ చంద్రలోకం వెళ్లినప్పుడు ఈ రుభులు ఎక్కడ చచ్చారో ఏమిటో ఆయనగారికి కనిపించనేలేదే! రుభులు తన అనుచరులను తరిమికొట్టారని నారద ముని వల్ల విన్నాడు శివుడు. వల్లమాలిన కోపంతో ఉగ్రుడై పోయాడు, శిరస్సు నుండి జడ ఊడ బెరికి దానిని నేలమీద కొట్టాడు. ఉత్తర క్షణంలో వీరభద్రుడు పుట్టాడు ఆకాశమంత దేహం, వెయ్యి చేతులలో వెయ్యి ఆయుధాలు. మండుతున్న మూడు కళ్లు, మహా భయంకరంగా వున్నాడు. వీరభద్రుడు.

"దక్షుణ్ని, అతని యజ్ఞాన్ని ధ్వంసం చెయ్యి" అన్నాడు శివుడు. (కవిగారికి దక్షుని మీద చాలా కోపం వచ్చినట్టుంది. శివుణ్ణి గొప్ప చేయడం కోసం "శివుడు కోపంతో జడ పీక్కొని నేలకేసి

కొట్టగానే వీరభద్రుడు పుట్టాడు. అని కవిగారు రాశారు. కాని ఇది సాధ్యమా?) వీరభద్రుడు యజ్ఞశాలను ముట్టడించాడు. దక్షప్రజాపతిని కట్టేశాడు. వెనుక ప్రజాపతుల సభలో గడ్డాలూ మీసాలూ వూపుతూ శివుణ్ణి వెక్కిరించాడు భృగువు. అతని గడ్డాలు మీసాలు వూడపెరికేశాడు వీరభద్రుడు. దక్షుడు శివుణ్ణి తిట్టినప్పుడు దక్షుణ్ని ప్రోత్సహిస్తూ కన్నుకొట్టాడు భగదేవుడు. అతనికళ్లు పెరికేశాడు వీరభద్రుడు. (ప్రజాపతుల సభలో భృగువు శివుణ్ని వెక్కిరించిన విషయంగానీ, భగదేవుడు ప్రోత్సహిస్తూ కన్నుకొట్టిన విషయం గానీ వీరభద్రునికి శివుడు చెప్పలేదే! ఇచ్చట కవిగారు సందర్భశుద్ధి లేకుండా రాశారు. అయితే ఇందులో తప్పుచేసిన భృగువుకు చిన్న శిక్ష వేయడమేమిటి? ప్రోత్సహించిన భగదేవునికి పెద్ద శిక్షవేయడ మేమిటి? ఇదేనా న్యాయం.) దక్షుని తల నరికి అగ్నిలో ఆహుతి చేశాడు వీరభద్రుడు. (శివుణ్ని తిట్టిన దక్షుని తల నరికి వేసిన వీరభద్రుడు, అదే తప్పుచేసిన భృగువును ఎందుకు చంపలేదు? కవిగారు అలా వ్రాయలేదెందుకు?)

శివుని అనుచరులు దేవతలను ఓడించారు, వారంతా బ్రహ్మదేవుని దగ్గఱకు పారిపోయారు. "శివుని దగ్గఱకు వెళ్ళి క్షమాభిక్ష వేడుకోండి "పదండి నేనూ వస్తాను" అన్నాడు బ్రహ్మ. దేవతలతో కలసి కైలాస పర్వతానికి వెళ్ళాడు బ్రహ్మ. దేవతలు, కిన్నెరలు, గంధర్వులు, అప్సరసలు ఎప్పుడూ విహరిస్తూ వుంటారక్కడ. వీరికి పని లేనట్టుంది అందుకే కైలాస పర్వతముపైన విహరిస్తారు.)

వంద ఆమడల ఎత్తుతో, డెబ్బయి అయిదు ఆమడల పొడవు కొమ్మలతో వున్న మర్రిచెట్టు క్రింద కూర్చున్నాడు శివుడు (కవిగారూ! నిజంగా మీరంత పెద్ద చెట్టును చూశారా? మర్రిచెట్టు పెద్దగా వుండే మాట నిజమే కాని మరీ అంత పెద్దచెట్టు వుంటుందా? అని నా ప్రశ్న.) శివుడు లేచి నిలబడి బ్రహ్మకు నమస్కరించాడు. బ్రహ్మదేవుడు శివుణ్ని చాలాసేపు పొగడుతూ ప్రార్థించాడు. చివరికిలా అన్నాడు "దక్షుని యజ్ఞంలో బుద్ధిలేని యాజ్ఞికులు మీకు యజ్ఞభాగం లేకుండా చేశారు. (ఇచ్చట "యాజ్ఞికులు" అనే పద

ప్రయోగాన్ని చాలా తెలివిగా వుపయోగించాడు కవి.) అందుకనే అది ధ్వంసమైంది. ఇప్పుడు అనుగ్రహించి పునరుద్ధరించాలి. యజమాని దక్షునికి ప్రాణభిక్ష పెట్టు, భగదేవునికి నేత్ర దానం చెయ్యి, భృగువుకు మీసాలు గడ్డాలు ఇవ్వు. యజ్ఞభాగం గ్రహించి దానిని పూర్తి చేయించు'' (శివుణ్ణి గొప్పచేసే ఉద్దేశ్యముతో కవిగారు ఈ ఘట్టాన్ని ఎత్తుకున్నారు. శివునికి యజ్ఞభాగం లేక పోవడం వ్లలననే యజ్ఞం ధ్వంసమైన దన్నది అసలైన కారణం కాదు. పాఠకులు కాస్త ఆలోచిస్తే యజ్ఞం ధ్వంసం కావడానికి గల అసలైన కారణాలేమిటో తెలిసివస్తాయి.

భృగువుకు శివుడు గడ్డాలు, మీసాలు ఇచ్చేదేమిటి, అవి మళ్ళీ పెరుగుతూనే వుంటాయి. భగదేవుని కళ్ళు పెరికి వేయబడ్డాయి. వానికి చూపునిచ్చే శక్తి శివునికెక్కడిది?)

చివరికి శివుడన్నాడు. "యజ్ఞభాగం నాకివ్వడానికి అంగీకరించిన దేవతలందరికీ శుభం కలుగుతుంది, దక్షుని తల దగ్ధమైపోయింది. అతనికి మేక తల ఏర్పడుతుంది. భగదేవుడు మిత్ర దేవుని కళ్ళతో యజ్ఞభాగం చూస్తాడు. (ఇదే కవిగారి అతితెలివి. దక్షునికి మేక తల ఏర్పడడం సంభవమా? గ్రుడ్డివాడు మిత్రుని కళ్లతో సినీమా చూస్తాడా? అలాగే భగదేవుడు మిత్రదేవుని కళ్లతో యజ్ఞం చూడడం కూడా అసంభవమే? యజ్ఞభాగం ఇస్తామనగానే శివుడు ముగ్ధుడు ముక్కలయ్యాడు, పాత పగ మరిచి పోయాడు. తప్పు చేసినవారిని క్షమించాడు. యజ్ఞభాగం సంపాదించుకోవడం కోసమే శివుడు ఇంత నాటకమాడాడని మనం గ్రహించాలి. అయితే ఇందులో ఎక్కువగా కష్టమనుభవించిన వారు ఇటు శివుని సైనికులు అటు భృగుని సైనికులు. యజ్ఞ భాగం సంపాదించుకొన్న తర్వాత శివుడు భార్యా వియోగ దుఃఖం పూర్తిగా మరిచి పోయాడు.)

దక్షునికి మేక తల తగిలించారు. శివుని దయాదృష్టితో అతడు లేచాడు. (తల లేని దక్షునికి మేక తల తగిలించి బ్రతికించినప్పుడు, సతీదేవి శరీరంలో ప్రాణం పోసి ఆమెనెందుకు బ్రతికించ లేదు. అది

శివునికిష్టం లేదా? లేక కవిగారికిష్టం లేదా?) దక్షుడు శివుణ్ణి ఇలా "దేవా! నీ దగ్గఱ అపరాధం చేశాను. నీ శిక్ష నాకు వరమే అయింది. (దక్షుడు తన మేక తలను చూచుకొని మురిసి పోతున్నట్టున్నాడు.) బ్రాహ్మణాధములను కూడా శ్రీహరి ఉపేక్షించ లేదు. (కవిగారు చెప్పదలచుకున్న అసలు విషయం యిది. 'బ్రాహ్మణాధములను' కూడా మీరు. ఉపేక్షించకండి'అని ఇవి దోపిడీ సమాజపు నీతులు. ఈనీతులను అంగీకరించ వలసిన అవసరం పాఠకులకు ఎంతమాత్రం లేదు. బ్రాహ్మణుడే అయినా శూద్రుడే అయినా సుగుణవంతుణ్ణి ప్రేమించాలి. దుర్మార్గుణ్ణి అణచి వేయాలి. దుర్మార్గులను ఆదరిస్తే సమాజములో దుర్మార్గుల సంఖ్య పెరిగి పోతుంది.)

యజ్ఞం చేయగానే భగవంతుడు ప్రత్యక్షమయ్యాడు. ఒక్కొక్కరూ ఆయనను స్తుతించారు. అప్పుడు భగవంతుడిలాఅన్నాడు "సృష్టి చేసినప్పుడు బ్రహ్మనవుతాను నేను. పాలించినప్పుడు విష్ణువవుతాను. సంహరించినప్పుడు శివుణ్ణవుతాను''. (కవిగారూ! మిమ్మలను అభినందిస్తున్నానండీ. శివ మతము, విష్ణు మతము సమానమే అని పాఠకులకు బోధించదలచి తమరిక్కడిలా రాశారు. హిందూ, క్రైస్తవ, మహమ్మదీయ, బౌద్ధ, జైన, సిక్కు మొదలగు మతాలన్నీ సమానమే. ఏ మతాన్ని అవలంబించినాసరే కాని మత మౌఢ్యము, సంకుచిత దృక్పదము మనిషిలో వుండకూడదు. "మానవత్వం" అన్ని మతాల కన్న మిక్కిలిగొప్పది. మానవత్వంతో ప్రవర్తించే మనిషి సర్వోత్తముడు. వాడే నా దేవుడు. సర్వ మానవులకు ఉపయోగ పడని నీతులు ఏ మత గ్రంథములో వున్ననూ వానిని బహిష్కరించాల్సిందే తప్పులు ఏ మత గ్రంథములోనున్ననూ ఎత్తి చూపాల్సిందే.) ప్రజాపతులలో శ్రేష్ఠుడైన దక్షప్రజాపతిని ఆశీర్వదించి స్వర్గం వెళ్ళిపోయారు దేవతలు. (కవిగారు దక్షుణ్ణి అనేక పాత్రల చేత తిట్టించాడు ముందు. యజ్ఞం పూర్తయిన తర్వాత దక్షుడు శ్రేష్ఠుడని పాఠకులకు చెప్తున్నాడు. యజ్ఞం పూర్తి చేసి బ్రాహ్మణులకు బహుమతులిచ్చి బ్రాహ్మణులను సంతోష పెట్టాడు

కనుక బ్రాహ్మణ పక్షపాతియైన కవిగారు దక్షుణ్ని యిప్పుడు శ్రేష్ఠుడని పొగడుతున్నారు. పాఠకులు ఈ పొగడ్తలోని రహస్యాన్ని గ్రహించాలి.)

బ్రహ్మదేవుని కుమారుడు అధర్ముడు. అధర్మునికి మిథ్య గర్భములో దంభుడు, మాయ జన్మించారు. అన్నా చెల్లెలూ ఇద్దరూ ఆలు మగలయ్యారు. (పూర్వకాలములో అన్నా చెల్లెలు కూడా పెళ్ళి చేసుకునే ఆచారం వుండేదని పాఠకులు గ్రహించాలి. అధర్ముని వారసులంతా అన్నా చెల్లెళ్లే పెళ్ళిళ్ళు చేసుకుంటారు.)

ఉత్తానపాదుడుకి సురుచి, సునీతి అని యిద్దరు భార్యలు. సురుచి మీద ఉత్తాన పాదునికి ప్రేమ హెచ్చు. సునీతి తనయుడు ధ్రువుడు. సురుచి కుమారుడు ఉత్తముడు.

సవతి కొడుకు 'ధ్రువుడు' రాజుగారి తొడ మీద కూచోబోయాడు. సురుచి రాజు ఎదుటే ధ్రువునితో "రాజు తొడగాని, సింహాసనంగాని ఎక్కడానికి ఆశపడకు" అని చెప్పేసింది.

ధ్రువుడు ఏడుస్తూ తల్లి దగ్గఱకు పోయాడు. ఆమె కొడుకును ఓదారుస్తూ "రాజు నన్ను భార్యగా చూడడం లేదు. నేను భాగ్యహీనురాలిని, నా కడుపున పుట్టిన నీవు భాగ్యహీనుడవు. తపస్సు చేసి భగవంతుణ్ని ప్రార్థించు బాబూ! అప్పుడే నీకు సింహాసనం ఎక్కే భాగ్యం లభిస్తుంది భగవంతుణ్ని పూజించడం వలననే మీ తాత ఇతరులకు దుర్లభమైన లౌకిక సుఖాలనుభవించాడు" అంది. (రాజుకు ఇద్దరు భార్యలుండడం వలన ఒక భార్య మీద ప్రేమ, మరొక భార్య మీద ప్రేమ లేక పోవడం జరిగింది రాజు దయకు పాత్రులైన వారు సింహాసన మెక్కడానికి అవకాశమున్న రాజ్యములో ప్రజలు సుఖపడుతారన్నది కల్ల. ఇద్దరి భార్యలను సమానంగా చూడని ఉత్తానపాదుడు ప్రజలను ఎన్ని అసమానతలతో పరిపాలించాడో! మనుచక్రవర్తి లౌకిక సుఖాలనుభవించడానికి భగవంతుని కృపయే కారణమని ధ్రువునికి అతని తల్లి చెప్పింది. కాని అది నిజంకాదు మనువు "చక్రవర్తి" కావడం వలన అనేక సౌఖ్యాలు అనుభవించాడు.

భగవంతుని పేరు తలువని వారు కూడా పాలకులైతే ఎన్నో సుఖా లనుభవిస్తారు. సుఖపడాలని కోరిక కలవారు దేవుణ్ణి ప్రార్థించనక్కర లేదు. పరిపాలనా వ్యవస్థలోవున్న లోపాలను సరిదిద్దడానికి ప్రయ త్నం చెయ్యాలి ) ధ్రువుడు అడవికి వెళ్ళి నారదుని దగ్గర ఉపదేశం పొంది, గడ్డి, ఆకులు తింటూ నీళ్లు త్రాగుతూ, గాలిపీలుస్తూ శ్రీహ రిని ప్రార్థించాడు. చివరికి శ్వాసను జయించి శ్రీహరిని ప్రార్థించాడు. అప్పుడు లోకంలో నున్న ప్రాణులందరి వూపిరి ఆగిపోయి బాధపడి పోయారు. (ఊపిరి ఆగిపోయిన తర్వాత వాళ్ళు చావకుండా ఎలా బతికారు?) వాళ్ళు భగవంతుణ్ని వేడుకున్నారు. (ఒకడు తపస్సు చేస్తే ఊపిరి ఆగిపోయి ప్రాణులందరూ బాధపడుతారా? అదే నిజ మైతే తపస్సు కంటే నీచమైన కార్యము మరొకటి వుందా?) భగవం తుడు ధ్రువునికి కనబడ్డాడు. ధ్రువుడు భగవంతుణ్ని స్తోత్రం చేశాడు. భగవంతుడు ధ్రువుణ్ని మెచ్చుకొని అన్నాడు "నీకు ధ్రువలోకం ఇస్తాను. నీ తండ్రి నీకు రాజ్యం యిచ్చి అడవికి వెళ్లాక 36 వేల సంవత్సరాలు రాజ్యం చేస్తావు. ఉత్తముడు వేటలో చచ్చిపోతాడు. సురుచి పిచ్చిదై దావాగ్నిలో తగులబడి పోతుంది" (భగవంతునికి భవిష్యత్తు గురించి బాగానే తెలిసినట్లుందే. రేగులపాటి కిషన్‌రావు భాగవతాణ్ణి ఇలా విమర్శిస్తాడని కూడా ఆయనకు ముందే తెలుసా?)

ధ్రువుడు రాజ్యానికి తిరిగి వచ్చాడు. సురుచితో సహా అందరూ ఆదరించారు. (సురుచిలో ఈ మార్పు ఎలా వచ్చినట్టు? కవిగారూ! సురుచిలో మార్పు రావడానికి కొన్ని కారణాలు వ్రాస్తే బాగుండే దండీ)

ధ్రువుడు నివసించిన రాజభవనంలో ఏనుగు దంతాల మంచాల్లూ బంగారు దుస్తులూ, బంగారు సామగ్రులు, భవనం నాలుగు వైపులా దివ్యమైన ఉద్యానవనాలు వుండేవి.

ఉత్తానపాదుడు రాజ్యం ధ్రువునికిచ్చి అడవికి వెళ్లిపోయాడు.

ధ్రువుడు భ్రమిని, వాయువును (ఇద్దరమ్మాయిలను) పెళ్లా డాడు ఆయనకు పిల్లలు కలిగారు.

ఉత్తముడు వేటకు వెళ్లి యక్షుని చేతిలో చచ్చిపోయాడు. కొడుకును వెదకుతూ సురుచి చచ్చిపోయింది. (విష్ణువు చెప్పినట్లే అయిందే. నవలల్లో ఇలాంటి సంఘటనలు రాస్తే పాఠకులు నమ్మ రెందుకు? అయితే యిక్కడ కూడా నమ్మకూడదు విష్ణువు చెప్పినట్లే జరిగింది అని పాఠకులను నమ్మించడం కోసం, విష్ణువు మీద భక్తి గౌర వాలను పెంపొందించడం కోసం కవిగారు ప్రయోగించిన కిటుకు యిది. యక్షుడు ఉత్తముణ్ణి ఎందుకు చంపాడు? కవిగారు కారణం వ్రాయలేదు. ఉత్తముడు ఏదో నేరం చేశాడు కనుక యక్షుడు చంపాడు అని మనం భావించాలి.) ధ్రువుడు యక్షుల పైకి యుద్ధా నికి వెళ్లాడు. (ధ్రువుడు యక్షులతో యుద్ధమెందుకు చేయాలి?) లక్షా ముప్పయి వేల మంది యక్షులు ధ్రువుని మీద కత్తులూ, శూలాలూ, బాణాలూ దిమ్మరించారు. (ధ్రువుడు చచ్చాడా? ముక్కలుముక్క లయ్యాడా? అబ్బే కవిగారు అలా వ్రాస్తారా? కవిగారికి బోలెడు పక్షపాతబుద్ధి. ధ్రువుణ్ణి మహా వీరాధివీరుడని రుజువు చేయడం కోసం లక్షా ముప్పయి వేల మంది చేత కత్తులు మొదలగు ఆయుధాలు ధ్రువుని మీదికి విసిరేయించారు కవిగారు తన రచనలో.)

ధ్రువుడు బాణాలు ప్రయోగించి యక్ష వీరుల తలలు ఎగుర గొట్టాడు. కాళ్లు చేతులు విరుగగొట్టాడు. ధ్రువుడు నిరపరాధులైన యక్షులను సంహారించడం చూశాడు మనువు.

మనువు ధృవుని దగ్గరకు వచ్చి ఇలా అన్నాడు "నాయనా ధ్రువా! క్రోధానికి లొంగిపోయి నిరపరాధులను సంహరిస్తున్నావు నువ్వు. కుబేరుని అనుచరులయిన యక్షులు నీ తమ్ముణ్ణి చంపలేదు. మనుషుల చావు పుట్టుకలకు భగవంతుడే కారణం" అన్నాడు మనువు (మనువు పళ్లు రాలగొట్టి దీనికి భగవంతుడే కారణం అనిచెప్తే ఎలావుంటుంది? యక్షులు అపరాధిని చంపారా? నిరపరాధిని చంపారా? అనేది ఆలోచించాలి. కాని చావు పుట్టుకలకు భగవంతుడే కారణమంటా రేమిటి? అలా అయితే ధృవుని చేత చంపబడిన వారి చావుకు కూడా భగవంతుడే కారకుడు కాదా? ధృవుడు నిరపరాధులను చంపినందుకు

ఉరిశిక్ష వెయ్యాలి. లేదా అపరాధులను చంపినందుకు పూలమాలలు వెయ్యాలి భగవంతుడే కారణం అని మాత్రం చెప్పకూడదు. అలా చెప్పడం తప్పు )

"కుబేరుని అనుచరులను నిష్కారణంగా చంపావు. అందు చేత వందనాది కాలతో కుబేరుణ్ని సంతోష పెట్టు. మన వంశం నాశనం కాకుండా చూడు" అన్నాడు మనువు.

ధృవుడు కుబేరుని దగ్గఱకు వెళ్లి చేతులు జోడించాడు. (నిరప రాధులను చంపిన ధృవుడు నీచుడని తెలిసినా ఒక రాజ్యానికి రాజు కనుక అతడు నమస్కరించగానే కుబేరుడు తన కోపాన్ని మరిచి పోయాడు. కుబేరునికి ధృవుడు నమస్కరించాడంటే ధృవుడు కుబే రునికి లొంగి పోయాడని అర్థం. ధృవుడు వినయం చూపగానే కుబేర రాజు సంతోష పడ్డాడు. దిక్కుమాలిన అనుచరులు చస్తే చచ్చారులే అనుకున్నాడు. ధృవుణ్ని క్షమిస్తే ఎంతోలాభం వుంది కుబేరునికి. అందుకే క్షమించాడు. తన అనుచరులను చంపిన రాజుపై పగ తీర్చు కోకుండా వుండిపోయిన రాజు బలహీనుడైనా కావాలి. దుర్మార్గుడు, వంచకుడు అయినా కావాలి, ఈ కథలో కుబేరుడు బలహీనుడు కాదు. బుద్ధిలేనివాడు కూడా కాదు. యజమాని కోఱకు అనుచరులు ప్రాణత్యాగం చేసినప్పుడు వారి ఆత్మశాంతికి యజమాని చేయవల సింది శత్రువుపై పగతీర్చు కోవడమే. కుబేరుడు తన అనుచరులను చంపినధృవునితో నెయ్యము చేశాడు కనుక కుబేరుడు వంచకుడు.)

కుబేరుడు మన్నించగానే ధృవుడు తన రాజధానికి వచ్చేశాడు.

దీనవత్సలుడు ధృవుడు, ధర్మరక్షకుడు ధృవుడు, యజ్ఞాలు చేసి పాపాలు పోగొట్టుకున్నాడు ధృవుడు. (అని వ్రాశాడు కవి. పాపాలు చేసినవాడు దుర్మార్గుడు. దీనులను కాపాడడం, ధర్మాన్ని రక్షించడం దుర్మార్గులు చేసే పని కాదు. యజ్ఞాలు చేస్తే చేసినపాపాలు ఎక్కడికి పోతాయి? ధృవునిలాగా రాజ్యము చేసిన వానికి తన్నులు తప్పవు.)

ధృవుడు కొడుకుకు (వుత్కలుడు) సింహాసన మిచ్చి అడవికి

వెళ్ళిపోయాడు. (ధృవుడు అడవికి వెళ్ళిపోతూ కూడా స్వార్థాన్ని విడువలేదు. తన కుమారుడే రాజ్యం చేయాలనుకోవడం స్వార్థం కాదా?)

ఉత్కలుడు భేదబుద్ధి లేకుండా గుడ్డి వాడిలాగా, చెవిటి వాడిలాగా, పిచ్చి వాడిలాగా వుండేవాడు. (భేదబుద్ధి లేకుండావుండే నిర్మల మనస్సు కలవానికి గుడ్డివాడు, చెవిటివాడు, పిచ్చివాడు అను పదాలు ఉపయోగించ వచ్చునా కవిగారూ?) మంత్రులు అతణ్ణి మూర్ఖుడని అతని తమ్ముడైన వత్సరుడికి రాజ్యం పట్టం కట్టారు. (ఉత్కలుడు నిజంగా పిచ్చివాడైతే మంత్రులతణ్ణి గద్దె దింపితే తప్పు లేదు. కాని ఉత్కలుని పాలనలో ప్రజలందరూ సుఖపడుచుండగా మితి మీరిన స్వార్థబుద్ధితో మంత్రులతణ్ణి గద్దె దింపితే ప్రజలు సుఖపడడం జరుగదు.)

వత్సరుని వారసుడు అంగరాజు.

అంగరాజు రాజ్యానికి వచ్చిన తర్వాత అశ్వమేధ యాగం ప్రారంభించాడు. బ్రాహ్మణులు వచ్చారు. ఆహ్వానాలు అందుకొని కూడా దేవతలు రాలేదు బ్రాహ్మణులను కారణమడిగాడు అంగరాజు.

"ముందు కొడుకు కొఱకు యజ్ఞం చెయ్యి. దేవతలు యజ్ఞ భాగాలు స్వీకరిస్తారు" అని చెప్పారు బ్రాహ్మణులు.

పుత్రకామేష్టి యజ్ఞం చేయగా యజ్ఞ గుండములో నుండి పాయస పాత్ర పట్టుకొని ఒక పురుషుడు మీదికి వచ్చాడు. అంగరాజు ఆ పురుషుడందించిన పాయసపాత్ర అందుకొని భార్యకిచ్చాడు. ఆమె ఆ పాయసం త్రాగి వేనరాజును కన్నది. వేనుడు దుష్టుడయ్యాడు. (యజ్ఞం చేస్తే సంతానం లేని వారికి సంతానం కలుగుతుంది అని చెప్పడమన్నమాట. సంతానం లేనివారు యజ్ఞాలు చేస్తే బ్రాహ్మణులకు ధనధాన్యాలు ముడుతాయి. అందుకే బ్రాహ్మణులు వాటిని ప్రోత్సహిస్తారు. యజ్ఞాలు చేస్తే సంతానం కలుగుతుందన్న మాట కల్ల.)

వేనుడు సాటి క్షత్రవాళ్లను చంపేసేవాడు. అతనిని సరిదిద్దాలని ప్రయత్నించాడు అంగరాజు (వేనుడు చేసిన ఘోరాలకు అతనికి

తక్షణం ఉరి శిక్ష విధించాల్సిందే కాని అంగరాజు అలా చేయలేదు. అంగరాజులో న్యాయబుద్ధి లేదని పాఠకులు గ్రహించాలి. అతడు స్వార్థపరుడు కనుక కొడుకును సరిదిద్దాలని ప్రయత్నించాడు. అలోగా అనేక మంది పిల్లలు వేనుని చేతిలో చనిపోయారు. అంగరాజు లాంటి న్యాయ బుద్ధిలేని రాజు రాజ్యం చేస్తే ఆ రాజ్యములో ఎన్నెన్నో ఘోరాలు జరిగితీరుతాయి. అంగరాజు రాజ్య ప్రజలు ఎంత చవటలో చూడండి. యువరాజు ఎంతోమంది పిల్లలను చంపినా కిక్కురుమనకుండా వూరుకున్నారు. అంగరాజు బుద్ధిమంతుడని కవిగారు సెలవిచ్చిన మాట వాస్తవమేనా పాఠకులారా! మీరే చెప్పండి.) అంగరాజు అడవికి వెళ్ళి పోయాడు. (చేతగానివాడు, న్యాయ బుద్ధిలేనివాడు అడవుల్లోకి వెళ్ళవలసిందే.)

మంత్రులు యిష్టపడకపోయినా వేనుణ్ణి రాజుగా అభిషేకించారు మునులు. (మునులు ఇలాంటి బుద్ధిలేని పనులే చేస్తారు మరి.)

వేనరాజు రాజయ్యాక దొంగలను, దోపిడీదారులను అణచివేశాడు. (వేనరాజును ఈ విషయములో అభినందించాల్సిందే.)

బ్రాహ్మణులు మొదలైనవారు యజ్ఞాలూ, దానాలూ, హోమాలూ చెయ్యకూడదని రాజ్యమంతటా చాటించాడు. మునులందరూ రాజు దగ్గరకు వెళ్ళి చెప్పారు. "రాజ్యములో బ్రాహ్మణులు యజ్ఞాలు చేస్తే దేవతలు ప్రసన్నులవుతారు. నువ్వు కోరిన కోరికలు సఫలం చేస్తారు" (ఇంత కాలం కూర్చుండి తినడానికి అలవాటు పడ్డ వాళ్ళు బ్రాహ్మణులు, మునులు. రాజ్యములో యజ్ఞాలు చేయడం ఆగిపోతే వాళ్ళు బ్రతకలేరు. కనుక వేనరాజుకు యజ్ఞాలు చేస్తే జరిగే మేలు, చేయకపోతే జరగే కీడు వివరించి చెప్పారు. కాని హేతువాద దృష్ట్యా చూచినప్పుడు యజ్ఞాలు చేయడం వలన లాభాలు లేకపోగా నష్టాలే ఎక్కువగా వున్నాయి. యజ్ఞాలు చేయునప్పుడు యజ్ఞ గుండంలో ప్రాణులు తినవలసిన అనేక ధనధాన్యాలను కాల్చివేస్తారు ఇది ఒక నష్టం. యజ్ఞంలో పాల్గొనేవారు వుత్పత్తి కార్యక్రమాల్లో పాల్గొనక పోవడం వలన జరిగే నష్టం మరొకటి.)

వేనరాజు తననే పూజించుమన్నాడు. బ్రాహ్మణులు అతనిని చంపి వెళ్లిపోయారు సునీథ ఎంతో శోకించింది. వేనుని శవం చెడకుండా భద్రపరచింది.

వేనరాజు చావగానే దొంగలు, దోపిడీ దారులు విజృంభించారు. (మునులు, బ్రాహ్మణులు వారిని అణచలేకపోయారని గ్రహించాలి.) మునులు మళ్లీ వేనుడి శవం దగ్గఱకు వెళ్ళి అతని నుండి ఒక మనిషిని పుట్టించారు. అతని పేరు నిషాదుడు. భుజాల నుండి ఇద్దరిని పుట్టించారు. వాళ్ళ పేర్లు పృథువు, అర్చి, పృథువు, అర్చి భార్యాభర్తలయ్యారు. (శవం నుండి మనుషుల నెలా పుట్టిస్తారు కవిగారూ? మీ రాతలన్నీ పిచ్చిరాతలు కాక మరేమిటి?)

పృథువు రాజ్యానికి వచ్చాడు. గొప్ప గొప్పవాళ్లు అనేక రకాల కానుకలు ఇచ్చారీయనకు, వందిమాగధులు పొగిడారు.

పృథువు గారు భవిష్యత్తులో చేసే పనులు వందిమాగధులు చెప్పారు. (ఇంత వరకు వందిమాగధులు లేరు. పృథువుగారి కాలం నుండి వందిమాగధులున్నట్టు కవిగారు తెలియజేస్తున్నారు. వీరు రాజులను పొగడి రాజులిచ్చిన ధనధాన్యాలతో బ్రతికేవారు. రాజులను పొగడడమే వీరిపని. వందిమాగధులకు ఆ తర్వాత వచ్చిన భట్రాజులకు పోలికలున్నాయి.)

"పృథు చక్రవర్తి ప్రజల జీవనం కోసం ఆవు రూపములో వున్న భూమి నుండి ఓషధులు పితుకుతాడు ధనుస్సు పట్టుకొని దేవేంద్రునిలాగా కొండలు పిండికొట్టి భూమిని చదును చేస్తాడు. సరస్వతి నది పుట్టిన చోట వంద అశ్వమేధ యజ్ఞాలు చేస్తాడు. చివరి యజ్ఞం చేస్తున్నప్పుడు దేవేంద్రుడు ఇతని గుర్రం ఎత్తుకపోతాడు"

వందిమాగధులు చెప్పినదంతా విని పృథు మహారాజు చాలా సంతోషించాడు. వాళ్లు కోరిన వస్తువులిచ్చి వాళ్లను సంతోష పెట్టాడు.

పృథు మహారాజు రాజ్యానికి వచ్చేనాటికి భూమి మీద అన్నం అన్నమాట లేదు. ఆకలి మంటలతో బాధపడేవారు ప్రజలు. (ఇంత కాలం జనులు జంతువులను చంపుకొని తిన్నారనియూ, జనసంఖ్య

పెరిగిన తర్వాత వారికి తగినన్ని జంతువులు దొరకలేదనియూ మనం అర్థం చేసుకోవాలి.) ప్రజలు రాజు దగ్గరకు వచ్చి ఆహారం కొఱకు దారి చూపుమన్నారు.

పృథు చక్రవర్తి ఆలోచించాడు. అన్నమూ, ఓషధులు భూమిలోనే వున్నాయని గ్రహించి భూదేవి మీద బాణం గురి పెట్టాడు. భూమి ఆవు రూపం ధరించి పరుగెత్తసాగింది. రాజు దానిని వెంబడించి చంపేస్తానన్నాడు భూమి రాజుకు అన్నం దొరికే మార్గం చెప్పింది. (మనిషి యోచించి భూమి మీద ఆహారధాన్యాలు పండించాడు కొన్ని జంతువులను మచ్చిక చేసుకొని వాటి వలన ప్రయోజనం పొందాడు. మనిషి ఇంకా ఇంకా ఆలోచించి రకరకాల ఉత్పత్తులు సాధించాడు, అభివృద్ధి సాధించాడు. అని చెప్పడానికి కవిగారు చాలా డొంకతిరుగుడుగా చెప్పారు.)

పృథు చక్రవర్తి వంద యజ్ఞాలు చేయడానికి పూనుకున్నాడు. ఇంద్రునికి విషయం తెలిసింది. ఈర్ష్య పడ్డాడు. నూరో యజ్ఞంలో పృథువు భగవంతుణ్ణి ఆరాధిస్తుండగా ఇంద్రుడు దొంగ వేషం వేసుకొని వచ్చి అశ్వాన్ని దొంగిలించాడు. అది చూచి అత్రి ముని పృథువు కుమారుడైన మహారథితో చెప్పాడు. మహారథి వెంబడించగానే ఇంద్రుడు గుర్రాన్ని వదిలి వెళ్ళిపోయాడు. (ఇంద్రుడు దొంగ గాడిద కొడుకన్నమాట.) ఇంద్రుడు అలా రెండు సార్లు యజ్ఞాశ్వాన్ని దొంగిలించాడు.

దేవేంద్రుడు వేసిన దొంగ వేషాలు మనుషులను ఆకర్షించాయి. చాతుర్యంగా హేతువాదం చెయ్యడం వలన ప్రజలు పెడదారి తొక్కారు. (దొంగలకు దారి చూపినవాడు ఈ దొంగ వెధవ దేవేంద్రుడే, దొంగలను శిక్షించే ముందు చెడుదారి చూపించిన దేవేంద్రుణ్ణి చిత్రవధ చెయ్యాలి. హేతువాదం చేసేవారి మీద కవిగారికి దురభిప్రాయముంది. హేతువాదులు ప్రజలకు మార్గ దర్శకులవుతారు కవిగారూ! హేతువాదులను గురించి కాస్త జాగ్రత్తగా మాట్లాడండి లేకపోతే.........)

పృథు చక్రవర్తి దేవేంద్రుణ్ణి చంపబోయాడు. బ్రహ్మ దేవుడు వచ్చి వారించాడు. (వీడో పిచ్చి వెధవ. తప్పుచేసిన వానిని శిక్షించడం రాజ ధర్మమని వీనికి తెలిసినట్లు లేదు. పిల్లల్ని కనడమే పనిగాపెట్టు కున్న వీనికి రాజధర్మాలేమి తెలుస్తాయి.)

"భగవంతుని అవతారమే దేవేంద్రుడు. అందుచేత ఇంద్రుణ్ణి చంపవద్దు. ఇకపోతే ఇతనిని వారించడం కూడా అసాధ్యం. దైవి కంగా చెడిపోయిన పని తిరిగి చెయ్యడానికి ప్రయత్నించడం మంచిది కాదు. కనుక నువ్వు యజ్ఞం మానుకో" అన్నాడు బ్రహ్మ. (ఈ దొంగ వెధవ భగవంతుని అవతారమేనా? మాకు ఎవడైనా దొంగ కనిపిస్తే భగవంతుని అవతారమని భక్తిగా నమస్కారం చెయ్యమం టారా బ్రహ్మగారూ! అసలు విషయమేమిటంటే ఇంద్రునికి చాలా పలుకు బడివుంది. అలాంటివాడు దొంగతనం చేశాడు. పలుకుబడికల ఇంద్రుణ్ణి చంపవద్దని పలుకుబడివున్న బ్రహ్మ పృథు చక్రవర్తికి చెప్పాడు. పృథువు ఇంద్రుణ్ని చంపలేదు. ఇంద్రుడు దొంగగా ప్రచారం కాలేదు. ఉన్నతాధికారులు లంచం తీసుకుంటే వాళ్ళు దొంగలని ప్రచారం చేసేవారెవ్వరు?)

పృథు చక్రవర్తి యజ్ఞం మానుకొని ఇంద్రునితో స్నేహం చేశాడు. (ఆ దొంగ వెధవతో స్నేహం) పృథు చక్రవర్తి ఇచ్చిన సంభావనలు పుచ్చుకొని సంతోషంతో వెళ్ళిపోయారు బ్రాహ్మణులు (రాజులు యజ్ఞాలు చేస్తే సామాన్య ప్రజలకు, కష్టజీవులకు, యుద్ధాలు చేసి రాజ్యాలు సంపాదించే సైనికులకు కలిగే లాభం ఏమీ లేదు. బ్రాహ్మణులు మాత్రం చాలా లాభాలు పొందుతారు. అందుకే వాళ్లు యజ్ఞాలు చేయాలని రాజులను ప్రోత్సహిస్తారు. యజ్ఞాలు చేస్తేనే వానలు కురుస్తాయని, పంటలు పండుతాయని దొంగ నీతులు బోధిస్తారు.)

భగవంతుడు కనిపించి పృథువుకిలా చెప్పాడు.

"ఉత్తములను, అధములను సమ దృష్టితో చూడు. యజ్ఞాల వల్ల, తపస్సుల వల్ల నన్ను ఎవ్వరూ పొందలేరు. నిర్మల మనస్కులకు

పృథు చక్రవర్తి దేవేంద్రుణ్ణి చంపబోయాడు. బ్రహ్మదేవుడు వచ్చి వారించాడు. (వీడో పిచ్చి వెధవ. తప్పుచేసిన వానిని శిక్షించడం రాజ ధర్మమని వీనికి తెలిసినట్లు లేదు. పిల్లల్ని కనడమే పనిగాపెట్టు కున్న వీనికి రాజధర్మాలేమి తెలుస్తాయి.)

"భగవంతుని అవతారమే దేవేంద్రుడు. అందుచేత ఇంద్రుణ్ణి చంపవద్దు. ఇకపోతే ఇతనిని వారించడం కూడా అసాధ్యం. దైవికంగా చెడిపోయిన పని తిరిగి చెయ్యడానికి ప్రయత్నించడం మంచిది కాదు. కనుక నువ్వు యజ్ఞం మానుకో" అన్నాడు బ్రహ్మ. (ఈ దొంగ వెధవ భగవంతుని అవతారమేనా? మాకు ఎవడైనా దొంగ కనిపిస్తే భగవంతుని అవతారమని భక్తిగా నమస్కారం చెయ్యమంటారా బ్రహ్మగారూ! అసలు విషయమేమిటంటే ఇంద్రునికి చాలా పలుకు బడివుంది. అలాంటివాడు దొంగతనం చేశాడు. పలుకుబడికల ఇంద్రుణ్ణి చంపవద్దని పలుకుబడివున్న బ్రహ్మ పృథు చక్రవర్తికి చెప్పాడు. పృథువు ఇంద్రుణ్ని చంపలేదు. ఇంద్రుడు దొంగగా ప్రచారం కాలేదు. ఉన్నతాధికారులు లంచం తీసుకుంటే వాళ్ళ దొంగలని ప్రచారం చేసేవారెవ్వరు?)

పృథు చక్రవర్తి యజ్ఞం మానుకొని ఇంద్రునితో స్నేహం చేశాడు. (ఆ దొంగ వెధవతో స్నేహం) పృథు చక్రవర్తి ఇచ్చిన సంభావనలు పుచ్చుకొని సంతోషంతో వెళ్ళిపోయారు బ్రాహ్మణులు (రాజులు యజ్ఞాలు చేస్తే సామాన్య ప్రజలకు, కష్టజీవులకు, యుద్ధాలు చేసి రాజ్యాలు సంపాదించే సైనికులకు కలిగే లాభం ఏమీ లేదు. బ్రాహ్మణులు మాత్రం చాలా లాభాలు పొందుతారు. అందుకే వాళ్లు యజ్ఞాలు చేయాలని రాజులను ప్రోత్సహిస్తారు. యజ్ఞాలు చేస్తేనే వానలు కురుస్తాయని, పంటలు పండుతాయని దొంగ నీతులు బోధిస్తారు.)

భగవంతుడు కనిపించి పృథువుకిలా చెప్పాడు.

"ఉత్తములను, అధములను సమ దృష్టితో చూడు. యజ్ఞాల వల్ల, తపస్సుల వల్ల నన్ను ఎవ్వరూ పొందలేరు. నిర్మల మనస్కులకు

అన్నం సంపాదిస్తారు" (అనాది కాలములో దోపిడీదారులైన బ్రాహ్మణుల మాటలివి; తమను దోపిడీ దారులని ఇతరులు అనకుండా అనుకోకుండా, యుక్తిగా చెప్పిన మాటల గారడీ యిది.)

పృథువు ముసలివాడై భార్యతో కలసి తపోవనానికి వెళ్ళి పోయాడు. అక్కడ ఎండకాలం పంచాగ్నుల మధ్య, వానకాలం ఆరుబయట, చలికాలం పీకలదాక నీళ్ళలో నిలబడి బ్రహ్మచర్యం పాటిస్తూ, భార్యసేవలు పొందుతూ ఘోరాతి ఘోరంగా తపస్సు చేశాడు. (యజ్ఞాల వల్ల తపస్సు వల్ల నన్ను ఎవ్వరూ పొందలేరు అని భగవంతుడు చెప్పగా విన్న పృథువు మళ్ళీ ఇలా అగ్గిలో, నీళ్ళలో, వానలో వుండి చాలా బాధపడుతూ తపస్సు చేస్తున్నాడేమిటి? ముసలితనంలో పృథువుకు పిచ్చి లేచినట్టుంది. భగవంతుడు చెప్పినట్టు నిర్మలమైన మనస్సుతో వుండక మోక్షం కావాలన్న స్వార్థ బుద్ధితో తపస్సు చేస్తాడేమిటి)

పృథువు చచ్చి పోయాడు. అర్చి కొండమీద చితి పేర్చి భర్త కళేబరం చితిమీదపెట్టి భర్త చితికి ముమ్మారు ప్రదక్షిణ చేసి చితాగ్నిలో ప్రవేశించింది. (అర్చి చూశారా! చచ్చిన భర్తకు కూడా ప్రదక్షిణ చేసింది. చితాగ్నిలో పడి చచ్చింది.)

భర్తతో సహగమనం చేసిన అర్చిని దేవతలు స్తోత్రం చేశారు. (సహగమనం మీద స్త్రీలకు ఆసక్తి కలిగించే విధంగా కవిగారు చాలా గొప్పగా వ్రాశారిక్కడ.)

పృథు మహారాజు కొడుకు విజితాశ్వుడు సార్వభౌముడయ్యాడు. అతడు దేవేంద్రుని దగ్గఱ అంతర్థాన విద్య నేర్చుకున్నాడు. (అంతర్థాన విద్య ఇంద్రునికి తెలియడం వలననే అతడు ఎన్నోసార్లు దొంగతనం చేశాడు. అంతర్థాన విద్య నేర్చుకొని విజితాశ్వుడేమి చేయదలచుకున్నాడో.)

ప్రాచేతసులు పది మందినీ ప్రజా సృష్టి చెయ్యమని ఆజ్ఞాపించాడు తండ్రి ప్రాచీనబర్హి. తపస్సు చేయడం కోసం వాళ్ళు బయలు దేరారు. మార్గమధ్యములో శివుడు కనిపించి వాళ్లు అడగక

అన్నం సంపాదిస్తారు" (అనాది కాలములో దోపిడీదారులైన బ్రాహ్మణుల మాటలివి; తమను దోపిడీ దారులని ఇతరులు అనకుండా అనుకోకుండా, యుక్తిగా చెప్పిన మాటల గారడీ యిది.)

పృథువు ముసలివాడై భార్యతో కలసి తపోవనానికి వెళ్ళి పోయాడు. అక్కడ ఎండకాలం పంచాగ్నుల మధ్య, వానకాలం ఆరుబయట, చలికాలం పీకలదాక నీళ్ళలో నిలబడి బ్రహ్మచర్యం పాటిస్తూ, భార్యసేవలు పొందుతూ ఘోరాతి ఘోరంగా తపస్సు చేశాడు. (యజ్ఞాల వల్ల తపస్సు వల్ల నన్ను ఎవ్వరూ పొందలేరు అని భగవంతుడు చెప్పగా విన్న పృథువు మళ్ళీ ఇలా అగ్గిలో, నీళ్ళలో, వానలో వుండి చాలా బాధపడుతూ తపస్సు చేస్తున్నాడేమిటి? ముసలితనంలో పృథువుకు పిచ్చి లేచినట్టుంది. భగవంతుడు చెప్పినట్టు నిర్మలమైన మనస్సుతో వుండక మోక్షం కావాలన్న స్వార్థ బుద్ధితో తపస్సు చేస్తాడేమిటి )

పృథువు చచ్చి పోయాడు. అర్చి కొండమీద చితి పేర్చి భర్త కళేబరం చితిమీదపెట్టి భర్త చితికి ముమ్మారు ప్రదక్షిణ చేసి చితాగ్నిలో ప్రవేశించింది. (అర్చి చూశారా! చచ్చిన భర్తకు కూడా ప్రదక్షిణ చేసింది. చితాగ్నిలో పడి చచ్చింది.)

భర్తతో సహగమనం చేసిన అర్చిని దేవతలు స్తోత్రం చేశారు. (సహగమనం మీద స్త్రీలకు ఆసక్తి కలిగించే విధంగా కవిగారు చాలా గొప్పగా వ్రాశారిక్కడ.)

పృథు మహారాజు కొడుకు విజితాశ్వుడు సార్వభౌముడయ్యాడు. అతడు దేవేంద్రుని దగ్గఱ అంతర్ధాన విద్య నేర్చుకున్నాడు. (అంతర్ధాన విద్య ఇంద్రునికి తెలియడం వలననే అతడు ఎన్నోసార్లు దొంగతనం చేశాడు. అంతర్ధాన విద్య నేర్చుకొని విజితాశ్వుడేమి చేయదలచుకున్నాడో.)

ప్రాచేతసులు పది మందినీ ప్రజా సృష్టి చెయ్యమని ఆజ్ఞాపించాడు తండ్రి ప్రాచీనబర్హి. తపస్సు చేయడం కోసం వాళ్ళు బయలు దేరారు. మార్గమధ్యములో శివుడు కనిపించి వాళ్లు అడగక

మాత్రం వేటాడవచ్చు. అప్పుడు కూడా అవసరమైన పశువులను మాత్రమే చంపాలి. శాస్త్రాలు చెప్పిన ప్రకారం నడుచుకునే వ్యక్తి కర్మల వల్ల జ్ఞానవంతుడవుతాడు" అని వ్రాశారు కవిగారు. (ఇవి మనిషి స్వార్థపరుడై ఆలోచించినప్పుడే న్యాయంగానూ, ధర్మంగానూ కనిపిస్తాయి. "తోటి ప్రాణుల యెడ ప్రేమ కలిగివుండాలి, జీవహింస చేయరాదు" అన్న బాపూజీ సూక్తులతో ఏకీభవించినప్పుడు, వ్యాసుల వారి ఈ ధర్మాలు గాలిలో కలిసి పోతాయి.)

పురంజనుడు ఇంటికి తిరిగి వచ్చి రాణి కొఱకు వెదికాడు. శరీర సంస్కారం లేకుండా నేల మీద పడుకుంది రాణి. ఆమె అవస్థ చూచి ఎంతో బాధ పడ్డాడు. ఆమె పాదాలు పట్టుకొని, వొళ్ళో పెట్టుకొని లాలించాడు. తర్వాత ఇలా అన్నాడు "ఎవరైనా నీ విషయంలో ఏదైనా అపరాధం చేశాడా అయితే చెప్పు వాడు బ్రాహ్మణుడు మాత్రం కాకపోతే, భగవంతుని భక్తుడు కాకపోతే నీ విషయంలో అపరాధం చేసిన వాణ్ణి చంపేస్తాను" (బ్రాహ్మణుడు అపరాధం చేసినా క్షమిస్తాడట, భగవంతుని భక్తుడు తప్పు చేసినా క్షమిస్తాడట పురంజనుడు. పురంజనుడు ఎంత మూర్ఖుడో చూశారా? వ్యాసుడు ఏ ఉద్దేశముతో ఈ కథ వ్రాశాడో గ్రహించారా పాఠకులారా!)

రాణి లేచి స్నానం చేసి పురంజనుడి దగ్గఱకు సంతోషంతో వచ్చింది. అతడు స్త్రీ సంభోగమే పురుషార్థమని భావించాడు. భగవంతుణ్ణి పూర్తిగా మరిచి పోయాడు. ఆమె గర్భములో పదకొండు వందల మంది కుమారులను, నూటా పదిమంది కూతుళ్ళను కన్నాడు. (కుమారులు, కూతుళ్లు కలసి మొత్తం 1210 మంది అంటే వీళ్ళు నివసించడానికే ఒక చిన్న గ్రామము కావాలి. వీళ్ళకు పెళ్ళిళ్లు చేస్తే.........వాళ్ళకు పిల్లలు కలిగితే.........!!! పురంజనుడు, రాణి నూరేళ్లు కాపురం చేశారని కవిగారే సెలవిచ్చారు. నూరేండ్లకు 1200 నెలలు అయితే రాణి నెల కొకసారి సంతానవతి అయిందా? లేక గర్భవతి అయిన ప్రతిసారి 12 మందిని కన్నదా? దీనికి

సమాధానం కవిగారే చెప్పాలి?) అతనికి కుమారుల మీద, మనుమల మీద, సేవకుల మీద వీళ్ళందరి మీద మమత ఏర్పడింది. భోగాల మీద ఆసక్తితో పశువులను చంపి యజ్ఞాలు చేశాడు. (భోగాల మీద ఆసక్తి కలవారే యజ్ఞాలు చేస్తారని కవిగారే బయట పెట్టారు. అయ్యా కవిగారూ! నేననుకున్నదే నిజమైందండీ.) దేవతలను ఆరాధించాడు. ఆడదే మోక్షమనుకునే పురంజనునికి అప్రియమైన కాలం వచ్చేసింది. (కవిగారు ఇంత సేపు ఈ కథ ఎందుకు చెప్పారో తెలిసిందా? "ఆడదానితో కలిసి మెలిసి జీవించినవాడు చెడిపోతాడు" అని.)

360 మంది అనుచరులతోనూ, వారి భార్యలతోనూ (720 మంది) గంధర్వరాజు చండవేగుడు పురంజనుడి పట్టణము ముట్టడించాడు. (ఒకప్పుడు ఆడవాళ్లు కూడా యుద్ధాలలో పాల్గొనెడివారని మనం గ్రహించాలి) అయిదు తలల పాము ప్రజాగరుడు గంధర్వ రాజును ఎదిరించాడు. శత్రువులతో వంద సంవత్సరాలు పోరాడి అలసిపోయాడు. (720 మందితో ఒక పాము నూరేళ్ళు పోరాడిందట. ఇది కవిగారు చెప్పిన విషయం. మెడమీద తలకాయ వున్నవాడెవ్వడూ అంగీకరించరీ విషయాన్ని.)

పురంజనుడు పాంచాల దేశంలోని అనుచరులు తెచ్చి ఇచ్చే భోగ్య వస్తువులు అనుభవిస్తూ స్త్రీతో కామసుఖాలనుభవిస్తూ వుండేవాడు......గంధర్వుల విషయం విని రాజ్యములోని ప్రజలందరూ భయపడ్డారు. (రాజు ప్రజలకు యుద్ధములో శిక్షణ ఇవ్వలేదు.)......

యవనరాజు భయుడిసైన్యం వచ్చి పురంజనుడి పట్నం ముట్టడించింది. యవనరాజు అన్న ప్రజ్వారుడు పట్నానికి అగ్గి పెట్టాడు. పురజనులందరూ చాలా బాధపడ్డారు......యవనరాజు పురంజనుడిని బంధించాడు.........ఆడదాని వలలోపడి దీనుడైపోయాడు పురంజనుడు. [భగవంతుణ్ణి ధ్యానించక భార్యాపిల్లల మీద మమకారం పెట్టుకుంటే పురంజనుడిలాగే అనేక కష్టాలు అనుభవిస్తారని కవిగారు పాఠకులకు చెప్పదలచుకున్నారు. పాఠకులారా! మీరు కవిగారు చెప్పినట్టు అగ్గిమధ్య, వానలో, నీటిలో నిలబడి ముక్కు

మూసుకొని తపస్సు చేస్తారా? లేక భార్యా పిల్లలతో సుఖ సంతోషా లనుభవిస్తారా? అది మీయిష్టం. కాని పరులను వంచించడానికి గాని పరులను దోపిడీ చేయడానికి గాని ప్రయత్నం చేయకండి.]

పురంజనుడు అంత్యకాలంలో ఆడదానిమీదే ధ్యాస పెట్టుకో వడం వలన మరు జన్మలో విదర్భరాజు కూతురై పుట్టాడు. (ఆనాటి సంఘములో స్త్రీకి ఉన్నత స్థానం లేదని కథలలో అనేక చోట్ల రుజు వులతో సహా చూడవచ్చు.

"ఆడదానిమీద ధ్యాసపెట్టుకుంటే ఆడదై పుడుతాడు పురుషుడు. కనుక ఆడదాని మీద ధ్యాస పెట్టుకోకండి'' అని పాఠకులకు కవిగారు చెప్పదలచుకున్న విషయం.

ఆడదై పుట్టాలనుకున్న పురుషుడు స్త్రీమీదే ధ్యాస పెట్టుకో వాలి. కవిగారి సిద్ధాంతము ప్రకారం వాడు మరు జన్మలో ఆడదై పుడుతాడు.)

విదర్భరాజు కూతురుకు స్వయంవరం చాటించాడు. పరాక్ర మమే కన్యాశుల్కంగా పెట్టాడు (ఆనాటి కాలంలో ఏదో ఒక రూప ములో కన్యాశుల్కము ఉండేదని దీనివలన తెలియుచున్నది.)

పాండ్రదేశము రాజు మలయధ్వజుడు రాజులందరినీ జయించి విదర్భరాజు కూతురును పెళ్లిచేసుకున్నాడు. ఆమె గర్భములో ఒక కూతురు (వ్రతశీల) ఏడుగురు కొడుకులు జన్మించారు. వాళ్లు ద్రవిడ దేశములో రాజులయ్యారు.

వ్రతశీలను అగస్త్యుడు పెళ్లిచేసుకున్నాడు,

మలయధ్వజుడు కొడుకులకు రాజ్యమప్పగించి భార్యతో సహా మలయ పర్వతము దగ్గరకు దేవుణ్ణి ఆరాధించుట కొరకు వెళ్లాడు. మలయధ్వజుడు కొన్నాళ్ల తర్వాత చచ్చాడు. భర్తతో సహగమనం చెయ్యడానికి నిశ్చయించుకుందామె. ఒక బ్రాహ్మణుడచ్చటికి వచ్చి ఆమెను వారించాడు.

నీవు పూర్వం పురంజన మహారాజువి నేను నీ స్నేహితుడను అవిజ్ఞాతుడను. పూర్వం నీవు రాణి వలలో పడ్డావు. అందుకే నీకీ

దుర్దశ పట్టింది (కవిగారు పదే పదే హేతువాద విరుద్ధంగా ఆడవారిని హీనపరుస్తూ కథలు చెప్తూనే వున్నారు. అందులో ఇదొకటి. ఈ కథలో ప్రపంచ సుఖాల మీద విరక్తి కలిగించే భావాన్ని కూడా ప్రవేశ పెట్టాడు. ఈ కథ చదివిన వారికి ప్రపంచ సుఖాల మీద విరక్తి కలుగక పోయినా ఆడదాని మీద హీనభావం ఏర్పడే అవకాశం చాలా వుంది.)

ప్రాచేతసులు సముద్రములో మునిగి పదివేల సంవత్సరాలు తపస్సు చేశాక శ్రీహరి ప్రత్యక్షమయ్యాడు. (ధ్రువునికి చాలా కొద్ది కాలానికే శ్రీహరి ప్రత్యక్షమయ్యాడు. వీళ్లకు చాలాచాలా కాలానికి శ్రీహరి ప్రత్యక్షమయ్యాడు. తపస్సు చేయడంలో వీళ్లు మహా మొద్దులన్నమాట.)

శ్రీహరి ప్రాచేతసులకు చెప్పాడు "మీ పదిమందికి ఒక కుమారుడు కలుగుతాడు. అతడు బ్రహ్మదేవుణ్ణి మించిన వాడవుతాడు. (పదిమందికి ఒక కూమారుడు ఎలా కలుగుతాడో? ఇది మరీ విచిత్రంగా వుంది. బ్రహ్మదేవుణ్ణి మించిన వాడవుతాడట వీడు. పదిమంది కలసి పుట్టించడం వల్లనా ఏమిటి?)

ప్రమ్లోచ అనే అప్సరసకు కండుముని సంయోగం వల్ల మారిష అనే కన్య జన్మించింది. ప్రమ్లోచ బిడ్డను వదిలి స్వర్గం వెళ్లిపోయింది. మారిషను చెట్లు పెంచాయి. (కవిగారు చెప్పినదంతా నమ్మెయ్యాలి. లేకపోతే కవిగారికి కోపం వస్తుంది. చెట్లు ఎలా పెంచాయి? అని అడగకూడదు. చెట్లు మారిషకు స్నానం చేయి చేవి, బట్టలు తొడిగేవి, పాలిచ్చేవి, ఏడ్చినప్పుడు జోలపాటలు పాడేవి "అని అర్థం చేసుకోవాలి పాఠకులు. అప్పుడు కవిగారికి పాఠకులు నచ్చుతారు. పాఠకులకు తెలివి వుందని కవిగారు అంగీకరిస్తారు. "చెట్లు మారిషను పెంచడమేమిటి? ఇదంతా అబద్ధం." అని హేతువాదం మొదలు పెడితే ఒక్క వ్యాసుల వారికే కాదు చాలా మందికవులకు కోపం వస్తుంది. వ్యాస మహాకవి వ్రాసిన కథలను వేల సంవత్సరాల నుండి కోట్లకొలది మంది అంగీకరించారు. నువ్వు......

నువ్వు...... వ్యాసుల వారి రచనలను విమర్శించే వాడవా? అని వెధవ ప్రశ్నలు వేస్తారు. కనుక......)

ప్రాచేతసులు తపస్సు మానుకొని సముద్రము నుండి బయటకు వచ్చి చెట్లను కాల్చివేయడానకి పూనుకున్నారు. (ప్రాచేతసులు తపస్సు చేసి సాధించిందేమీలేదు. సాధారణ మానవుల కంటె హీనంగా చెట్ల మీద కోపం వచ్చి వాటిని కాల్చివేయ పూనుకున్నారు. ఈ వెధవలు 10 వేల సంవత్సరాలు తపస్సుచేసి కాస్త కోపాన్ని కూడా జయించ లేక పోయారు. ఇక వీళ్ల తపస్సెందుకు కాల్చనా?) బ్రహ్మవచ్చి శాంత పరిశారు. చెట్లు మారిషను ప్రాచేతసుల కిచ్చాయి. మారిష గర్భములో దక్షుడు పుట్టాడు, (శివుని మామ చచ్చి మారిష గర్భములో మళ్లీ దక్షుని పేరుతోనే పుట్టిండట. పది మంది భర్తలలో ఎవని వలన మారిష గర్భములో దక్షుడు పుట్టాడో తెలియదు. పదిమంది ఆమెతో ఎలా కాపురం చేశారో అసలే తెలియదు. అనాది కాలంలో స్త్రీ అనేకమంది పురుషులను పెళ్ళి చేసుకునే ఆచారముండేది.)

ప్రియవ్రతుడు విశ్వకర్మ కూతురు బార్హిష్మతిని పెళ్లిచేసుకొని పదిమంది కొడుకులు, ఒక కూతురును (ఊర్జస్వతి) కన్నాడు. ఇంకో భార్య గర్భములో ముగ్గురు కుమారులను కన్నాడు.

ప్రియవ్రత మహారాజు 11 అర్బుదాల సంవత్సరాలు రాజ్యం పాలించాడు. ఇతడు రాత్రిని పగలుచేశాడు. (సంభవమా?) బ్రహ్మ వచ్చి వారించాడు.

ప్రియవ్రతుడి రథచక్రాలతో ఏర్పడిన ఏడు సముద్రాలలో చెఱకు సముద్రము. ఉప్పు సముద్రము, కల్లు సముద్రము, నేతి సము ద్రము, పాల సముద్రము, పెరుగు సముద్రము, మంచినీళ్ళ సము ద్రము (కవిగారి కలం-ఘంటం-నుండి ఏడు సముద్రాలు జన్మించాయి, కవిగారు ఏమైనా సృష్టించగలరు. ఉన్నవీ, లేనివీ సృష్టించడంలో వ్యాసుల వారు మహా ఘనులు.)

ప్రియవ్రతుడు ఊర్జస్వతిని శుక్రాచార్యునికిచ్చి పెళ్లి చేశాడు. ఆమె గర్భములో దేవయాని పుట్టింది.

ప్రియవ్రతుడు భగవంతుని పాదధూళి శిరస్సున ధరించాడు. ఎంత నీచయోనిలో పుట్టినవాడైనా భగవంతుని నామం నోటపడితే సంసారబంధాలన్నీ ఫటుక్కుమని పోతాయి. (కవిగారూ! మీరు నీచ యోనులని, పవిత్రయోనులని, యోనుల విభజన చేయవచ్చునా, అంతా భగవంతుని సృష్టి అయినప్పుడు, ఈ ఎక్కువ తక్కువలు అన్న భావం మీరు సృష్టించడమెందులకు?)

"ఆడదాని చేతి క్రీడామృగాన్నై అయిపోయాను నేను. ఛీ ఛీ ఏం బ్రతుకునాది" అనుకున్నాడు ప్రియవ్రతుడు. రాజ్యాన్ని, భార్యను మృతదేహాన్ని వదిలి పెట్టినట్టు వదిలి పెట్టాడు. ("మగవాని చేతిలో క్రీడా మృగాన్నై అయిపోయాను నేను. ఛీఛీ ఏం బ్రతుకునాది'' అని ఇంత వరకు ఒక్క కథలో ఒక్క స్త్రీ చేతనైనా అనిపించాడా కవి? భర్తను పిల్లలను వదిలి పెట్టి అడవికి వెళ్ళినట్టు ఒక్క స్త్రీ పాత్రనన్నా సృష్టించాడా? పురుషుణ్ణి, భగవంతుణ్ణి గొప్ప చేయడంలో నిమగ్నమై విచక్షణా జ్ఞానం లేకుండా ఆడదాన్ని చాలా హీనంగా చిత్రించాడు. పక్షపాత బుద్ధితో రచనలు చేసినప్పుడు జరిగే ప్రమాదాలు ఇవే.)

ప్రియవ్రతుని పెద్దకొడుకు అగ్నిధ్రుడు జంబూ ద్వీపం పాలించాడు. సంతానం కోసం దేవతా స్త్రీల క్రీడా స్థలమైన మందర పర్వతానికి వెళ్ళాడు బ్రహ్మను ఆరాధించాడు, బ్రహ్మ దేవసభలోని పాటకత్తె పూర్వచిత్తినిని అగ్నిధ్రుడు సంభోగం కోసం మందర పర్వతానికి పంపాడు. ఆమె అతణ్ణి ప్రేమించింది. జంబూద్వీపాధిపతితో వెయ్యేళ్లు సుఖపడి 9 మంది కుమారులను కన్నది. అగ్నిధ్రుడు కుమారులకు రాజ్యమిచ్చాడు.

అగ్నిధ్రుడి పెద్దకొడుకు 'నాభి' సంతానం కోసం 'మేరుదేవి'తో కలసి యజ్ఞం చేశాడు. దేవుడు యజ్ఞ స్థలములో ప్రత్యక్షమయ్యాడు. "నేనే నాకళతో నాభి కుమారుణ్ణయి జన్మిస్తాన" ని చెప్పి భగవంతుడు వెళ్లిపోయాడు. నాభికి మేరుదేవి గర్భములో సత్యమూర్తి జన్మించాడు. (స్వయంగా భగవంతుడే వచ్చి నేను నీ కడుపులో జన్మి

స్తానని చెప్పిండట. చూశారా కవిగారి చాతుర్యం)

సత్యమూర్తికి రుషభుడని పేరు పెట్టారు.

రుషభుని ప్రభావం చూచి దేవేంద్రుడు వోర్వలేక పోయాడు. రుషభుని రాజ్యములో అతడు వర్షం కురిపించలేదు. రుషభుడు స్వయంగా వర్షం కురిపించుకున్నాడు (స్వయం కృషికి మించింది లేదని ఈ కథ వల్ల మనం గ్రహించాలి. శక్తి వుండికూడా ఇన్నాళ్లూ ఇంద్రుని మీద ఆధారపడి వున్నావెందుకు రుషభా! ప్రతి వ్యక్తి తన శక్తి సామర్థ్యాలను వినియోగించి తన ప్రగతి కొఱకు, సమాజ ప్రగతి కొఱకు పాటుబడాలని నీకు తెలియదా?)

నాభి భార్యతో సహా బదరికాశ్రమానికి వెళ్ళి తపస్సు చేసి చచ్చిపోయాడు. (అన్ని రకాల సుఖాలు అనుభవించి చచ్చేముందు తపస్సు చేసి చస్తారెందుకు వీళ్లు?)

రుషభుడు దేవేంద్రుని కూతురు జయంతిని పెళ్ళి చేసుకున్నాడు. (రుషభుడు తనలాగే వర్షం కురిపించాడని దేవేంద్రుడు సంతోషించి బిడ్డనిచ్చాడా ఏమిటి? సమానస్కందులు కయ్యమునకు, వియ్యమునకు తగుదురు, అన్నమాట నిజమేమరి.)

జయంతికి వంద మంది పుత్రులుదయించారు. భరతుడు పెద్ద కొడుకు, రుషభుడు బ్రాహ్మణులు చెప్పినట్టు వంద యజ్ఞాలు చేశాడు. ("బ్రాహ్మణులు చెప్పినట్టు యజ్ఞాలు చేశాడు రాజు" అని కవిగారు అనేక కథలలో అనేక పర్యాయాలు చెప్పారు. వ్యవసాయం గురించి వ్యాపారం గురించి, ఆయా వృత్తులతో జీవించే ప్రజల గురించి ఒక్క మాటన్నా చెప్పడేమిటి?)

రుషభుడు (భగవంతుడు) కుమారులకిలా చెప్పాడు.

"నర లోకంలో పుట్టి అశుద్ధం తినే పందుల్లాగా, దుఃఖమయమైన విషయభోగాలు అనుభవించడం కోసం కాదు మానవ శరీరం. విషయ భోగాలతో నర దేహం నాశనం చెయ్యడం న్యాయం కాదు. తపస్సు చెయ్యాలి. భగవంతుని కథలు వినాలి. (బ్రాహ్మణాధిక్యతను వ్యక్తపరిచే కథలు) మీరందరూ మీ అన్న భరతుణ్ణి పూజించండి.....

......పశువులకంటే మనుషులు గొప్పవారు.........శివుని కంటే బ్రహ్మ గొప్పవాడు. బ్రహ్మ కంటే భగవంతుడు గొప్పవాడు. భగవంతుని కంటే బ్రాహ్మణులు శ్రేష్ఠులు. (పాఠకులారా! కవిగారీ కథను ఎందుకు వ్రాశారో కాస్త ఆలోచించండి. సమానత్వం కాంక్షించే వాడెవ్వడైనా ఇలాంటి కథలు రాయడానికి సిద్ధపడుతాడా? సాహిత్యం మానవుల మధ్య సంభవించే అసమానతలను తొలగించి సర్వమానవ క్షేమము కోరడానికా? లేక మానవుల అసమానతలను వృద్ధి చేయడానికా?) బ్రాహ్మణులకు శ్రద్ధాపూర్వకంగా భోజనం పెడితే ఆ భోజనం భగవంతునికే చెందుతుంద. నా భక్తులు తమ సర్వస్వమూ నాకే సమర్పిస్తారు. (కవిగారింతవరకు పాఠకుల మనస్సును భగవంతునిపైన నిల్పడానికి ప్రయత్నం చేశారు. తర్వాత తన ప్రయత్నం సఫలమవుతుందని భావించి, భక్తులు భగవంతునికి ఏదివ్వడానికైనా సిద్ధంగా వుంటారని కూడా భావించి, బ్రాహ్మణులకు భోజనం పెడితే అది భగవంతునికే చెందుతుందని వ్రాశారు. కవిగారింతకు పూర్వం చెప్పిందంతా నమ్మినవాళ్లు, ఈ మాట కూడా నమ్మారు. కోట్లాది ప్రజలు ఈ విషయం నిజమని నమ్మడం వలన అనేక వేల సంవత్సరాల నుండి దోపిడీ చేయబడు తున్నారు.)

కొన్నాళ్లకు రుషభుడు సర్వం వదులు కున్నాడు. (బట్టలు కూడా) దిగంబరుడై పోయాడు. ఎటుపడితే అటుతిరిగేవాడు పిచ్చివానిలాగా (మీరు కూడా రుషభుని-పిచ్చివాని-లాగా దిగంబరులై ఇష్టమున్నట్టు తిరగండి. అప్పుడు కవిగారు మిమ్ముల్నిలను చూచి భగవద్భక్తులని ఒప్పుకుంటారు.) ఆ పిచ్చివాడు ఎవరేమన్ననూ ఏమీ అనేవాడు కాదు. (ఇలాంటి వర్ణన కవిగారు ఇంతకు పూర్వమొకచోట చేశారు.) రుషభుడు చివరికి దావాగ్నిలో భస్మమైపోయాడు. (రుషభుడు-భగవంతుడు-కూడా సుఖాలు, కష్టాలు అనుభవించి చచ్చాడెందుకు? కర్మసిద్ధాంతము ప్రకారం, రుషభుడు-భగవంతుడు-పూర్వజన్మలో ఏమి చెడ్డపనులు చేశాడు?)

అధర్మంతో నిండిన కలియుగ ప్రభావం వల్ల ప్రజలు బుద్ధి

హీనులై పోతారు, స్నానం చేయరు, తలలు కత్తిరించుకుంటారు. భగవంతుణ్ణి తిట్టిపోస్తారు. స్వేచ్ఛాపరులై తిరుగుతారు, వేదాలను. బ్రాహ్మణులను, భగవంతుడైన యజ్ఞ పురుషుణ్ణి నిందిస్తారు. వేద విరుద్ధమైన మతం అవలంభిస్తారు. నరకానికి వెళ్ళుతారు. (వ్యాసుని కాలంనాటికే కొందరు తలలు కత్తిరించుకునే వారని, తలలు కత్తిరించు కోవడం ఆనాడు నీచంగా భావించేవారని దీనివలన తెలియుచున్నది. ఆనాటి ప్రజలు కూడా కొందరు వేదాలను, బ్రాహ్మణులను ధిక్కరించి హాయిగా స్వేచ్ఛగా జీవించడానికి ప్రయత్నం చేసేవారనియూ కవిగారికి వారలా స్వేచ్ఛగా హాయిగా బ్రతకడం ఇష్టం లేదనియూ తెలియుచున్నది. బ్రాహ్మణులకు మిగిలిన వారు లొంగి వుండడము, వేదాలలో చెప్పినట్టు బ్రాహ్మణేతరులు బ్రాహ్మణుల చేత దోపిడీకి గురి అవుతూ వుండడము, తలవెంట్రుకలు పెంచుకోవడం కవిగారికి ఇష్టమనియూ తెలియుచున్నది. కవిగారు చెప్పినట్లు వినకపోతే నర కానికి పోతారని కవిగారు భయపెడుతున్నారు.)

భరతుడు విశ్వరూపుని కూతురు పంచజనిని పెళ్లి చేసుకున్నాడు. వారికి అయిదుగురు కుమారులు కలిగారు. అతడు భగవద్భక్తితో కోటి సంవత్సరాలు రాజ్యం చేశాడు. తర్వాత రాజ్యం కొడుకులకిచ్చి పులహాశ్రమానికి వెళ్లి భగవంతుణ్ణి ఆరాధించాడు. ఒకనాడు నదిలో కొట్టుకపోతున్న లేడిపిల్లను కాపాడాడు. దానిపై మమకారం పెంచుకున్నాడు. లేడి మీద ప్రేమ పెట్టుకొని చచ్చిపోయి లేడి జన్మ ఎత్తాడు. తాను లేడి జన్మ ఎత్తిన కారణం తెలుసుకొని బాధ పడ్డాడు (ఓ లేడి జన్మ ధరించిన భరతా! బాధపడకు. నిస్సహాయ స్థితిలోనున్న లేడిని బ్రతికించిన నీవు ధన్యుడవు. నీవు చింతించ వలసిన అవసరం లేదు. మానవ జన్మఎత్తినప్పుడు చింతించలేదే. అలాగే లేడి జన్మఎత్తినందుకు కూడా చింతించకు. మానవ జన్మకంటే లేడి జన్మ హీనమైనది కాదు. బాధపడుచున్న వారి బాధలు పోగొట్టడం కన్న భగవద్భక్తి గొప్పది కానేకాదు కవి గారూ!)

అంగిరస గోత్రములో ఒక బ్రాహ్మణుడుండేవాడు. అతని కిద్దరు భార్యలు. మొదటి భార్యకు 9 మంది కొడుకులు, చిన్న భార్యకు కొడుకు, కూతురు జన్మించారు. చిన్న భార్య కొడుకు భరతుడు. లేడి జన్మ వదిలి ఈ బ్రాహ్మణునకు కుమారుడై పుట్టాడు. పూర్వ జన్మ పరంపర జ్ఞాపకముండేదతనికి. (సంభవమేనా కవిగారూ?) అతడు వేద విద్య నేర్వలేక పోయాడు.

బ్రాహ్మణుడు చచ్చిపోయాడు. చిన్న భార్య సహగమనం చేసింది.

భరతునికి జడభరతుడని పేరు వచ్చింది. అతడు ఒంటి మీద గుడ్డలు లేకుండా తిరిగేవాడు. ధూళిలో పడుకునేవాడు. కూలిచేసి వాళ్ళు చేతిలో పెట్టింది తిని పొట్ట నింపుకునేవాడు. అన్నలు అతని చేత అనేక పనులు చేయించేవారు. పశువులు తినే ఆహారం పెట్టేవారు.

శూద్రుడైన ఒక దొంగల రాజు (శూద్రుణ్ణి దొంగలకు రాజుగా చేశాడు కవిగారు. శూద్రులను కించపరచడం, హీనంగా చూడడం కోసం ఇదొక ప్రయత్నం.) కొడుకును కాళి దగ్గఱ బలి ఇవ్వడానికి మొక్కుకున్నాడు. బలికోసం సిద్దం చేసి కట్టిపెట్టిన మనిషి రాత్రి ఎలాగో తప్పించుకొని పారిపోయాడు. (పూర్వకాలంలో కాళికి నర బలి ఇచ్చే విధానముండేది ) దొంగల రాజు అనుచరులు పొలములో పని చేస్తున్న జడ భరతుణ్ని పట్టుకొని వెళ్లి బలికి సిద్దం చేశారు.

భగవంతుని అంశ అయిన బ్రాహ్మణ వధ ఎన్నడూ కూడని ఘోరం. ఈ ఘోరం సహించని కాళి విగ్రహం బ్రద్దలు చేసుకొని బయటకు వచ్చి దొంగల తలకాయలు నరికేసింది. (కవి బ్రాహ్మణ వధ కూడదన్నాడు. కాని నరబలి కూడదనలేదు. కాళి ముందు నర బలి అంతకు పూర్వము మామూలే. భరతుడు శూద్రుడై పుట్టిన యెడల కాళి రక్షించేది కాదు. వాని తల ఎగిరి పోయి వుండేది..... ఒక బ్రాహ్మణుని ప్రాణం కాపాడడం కోసం విగ్రహం లోపల కూర్చున్న కాళి, ఆ విగ్రహాన్ని బ్రద్దలు చేసి బయటకు వచ్చి బ్రాహ్మణ వధకు పూనుకున్న శూద్రులనందరినీ చంపిందట-కవిగారు వ్రాశారీ

విధంగా-కాళిముందు నరబలి అంతకు పూర్వం మామూలుగా జరుగుతూనే వుండేది. కాని బ్రాహ్మణుల్ని బలి ఇచ్చుటకు వాళ్లు సిద్ధపడ్డారు కనుక అది తగదని చెప్పుటకు కవిగారు ఈ కథను సృష్టిం చారు .... కవిగారూ! పక్షపాత బుద్ధి లేకుండా నరబలి కూడదని తెలియజేసే కథ సృష్టిస్తే బాగుండేదండీ.)

ఒకనాడు సింధు సౌవీర దేశాల రాజు రహూగణుడు పల్లకిలో కూర్చొని వెళుతున్నాడు. బోయీల నాయకునికి మరొక బోయీ కావలసి వచ్చాడు. వాళ్ళకు భరతుడు కనిపించాడు. భరతుణ్ణి పల్లకీ మోయుటకు నియోగించాడు. భరతుడు పల్లకి సరిగా మోయలేక పోయాడు. (ఒక మనిషిని మరొక మనిషి మొయ్యడం అనాగరికతకు, బానిస విధానానికి చిహ్నం. ఈనాడు పల్లకీలు ఎక్కువగా ప్రచారంలో లేకపోయినా కొద్ది భేదంతో రిక్షాలున్నాయి. వ్యాసుని కాలం నాటి నుండి ఈనాటి వరకు మన సంఘ జీవన విధానంలో పెద్ద మార్పేమీ రాలేదని ఈ కథ వలన తెలియుచున్నది. మార్పు రాకపోవడానికి కారణమేమిటి? "పూర్వజన్మలో పాపం చేయడం వలన కొందరికి కష్టపడే గతి వచ్చింది,............పుణ్యం చేయడం వలన కొందరికి సుఖపడే యోగం వచ్చింది" ఈ కర్మ సిద్ధాంతాన్ని భాగవతం ప్రచారం చేస్తూ వుంది. ఈ కర్మ సిద్ధాంతాన్ని నమ్మినంత కాలం కష్టపడే మనుషులకు విముక్తి లేదు.

పూర్వజన్మలో పాపం చేయడం వలన ఈ జన్మలో బాధ పడడానికి కారణమైతే, పూర్వజన్మలో పాపం చేయడానికి కారణమేమిటి? అనే ప్రశ్నకు సమాధానం కావాలి. పూర్వ జన్మ, పాప పుణ్యాలనేవి దొంగ సిద్ధాంతాలు. ఇవి మనిషిని మానసికంగా క్రూరంగా భయంకరంగా అణచి వేస్తున్నాయి. దోపిడీ వ్యవస్థలో ప్రచార మయ్యే నీతులు కూడా దోపిడీకి అనుకూలంగానే వుంటాయి) విషయం తెలుసుకున్న రాజు భరతుణ్ణి హేళన చేశాడు, తిట్టాడు. భరతుడు చెప్పిన మాటలు విన్న రాజు భరతుని పాదాల ముందు తలవంచాడు. "నేను ఎవరికీ భయపడను. బ్రాహ్మణులను అవమానం చెయ్యడమంటే

మాత్రం భయపడుతాను. (ఈ సంఘటన కూడా వర్గ ప్రయోజన దృష్టితో వ్రాయబడినదే. ఈ సంఘటనలో కూడా విశాల భావం లేదు. కవిగారి సంకుచిత భావమే కనబడుతుంది.) నీ వంటి జ్ఞాన వంతుణ్ణి అవమానించను అపరాధంమన్నించు" అన్నాడు రాజు. (జ్ఞానం లేని వారిని ఈయనగారు అవమానిస్తారన్నమాట.)

భరతుడు చెప్పాడు.

"పల్లకీలో కూర్చున్నంత మాత్రాన నీ గొప్పతనమేమీ రుజువు కాలేదు. నిజానికి నువ్వు క్రూరుడివి పాపం దీనులైన ఈ బోయీల చేత వెట్టి చాకిరీ చేయిస్తున్నావు" (ఈ మొద్దబ్బాయికి ఇప్పుడు కాస్త చైతన్యము కలిగినట్టుంది--వ్యాసుని కాలం నుండి ఈనాటి వరకు వెట్టి చాకిరీ విధానముంది. ఇందిరాగాంధీ గారి పాలనలో వెట్టి చాకిరీ విధానము చట్టరీత్యా మాత్రం నిర్మూలించబడింది-ఏ మనిషిలో చైతన్యం, ఆత్మాభిమానం, ఆత్మవిశ్వాసం వుండవో ఆ మనిషి ఎన్ని చట్టాలు వచ్చినా ప్రయోజనం పొందలేడు.)

సంసారం వలన కలిగే కష్టనష్టాలను గురించి కవిగారిచ్చట ఒక స్కంధములో చాలా గొప్పగా వర్ణించారు (నేనది వర్ణించి మీకు విసుగు పుట్టించను లెండి.)

భరతుని వారసుడు గయుడు. (భరతుని వంశ వృక్షాణ్ణి రెండు పేజీల పొడుగున నింపాడు కవి. అది నేను వ్రాయలేదు.) గయునికి కోరికలు లేనే లేవని కవిగారు సెలవిచ్చారు. కాని యుద్ధాలు చేసి రాజులనోడించి వారందించిన కానుకలు తీసుకొన్నాడు. బ్రాహ్మణు లకు దానాలు చేశాడు. (కోరికలు లేనివాడు యుద్ధాలెందుకు చేస్తాడు? దానాలెందు కిస్తాడు?)

మందరం, మేరు మందరం, సుపార్శ్వం, కుముదం అనే పర్వ తాలు పదేసి వేల యోజనాల పొడవు విస్తీర్ణము కలిగి యున్నాయట.

మందర పర్వతం మీద 11 యోజనాల ఎత్తు (88 మైళ్ల ఎత్తు) మామిడి చెట్టుందట. ఆ చెట్టు పండ్లు క్రిందపడి పగులగా వెలువడిన రసంతో అరుణోదయ నది పారుతుందట. పార్వతీదేవి పరిచారికలైన

రాక్షస స్త్రీలు ఈ నదిలోని రసం త్రాగుతారట. (కవిగారూ! ఈ నదిని నాకు చూపిస్తారా? నాకు మామిడి రసం త్రాగాలని వుంది పాఠకులారా! మీకు త్రాగాలని వుందా? అయితే ఆగండి. కవిగారు ఆలోచిస్తున్నారు ఆ నది ఎక్కడ వుందో ఇప్పుడే చెప్పేస్తారు. పాఠకులారా! అలా అనుమాన పడుతున్నారెందుకు? కవిగారు చెప్పే విషయం మీద మీకు నమ్మకం లేదా? అలా అయితే వారు స్వయంగా వచ్చి మీకా నదిని చూపిస్తారు. సరేనా!)

మేరు మందరము మీద నేరేడు చెట్టు ఏనుగంతేసి పళ్లు పండుతుంది (మహా ఘోరంగా వ్రాశారు కవిగారు!) ఆ పళ్ళ రసంతో జంబూ నది ప్రవహిస్తూ వుంటుంది. ఈ రసం మట్టితో కలసి బంగారం తయారవుతుంది. ఈ బంగారంతో దేవతలు నగలు తయారు చేసుకుంటారు (పాఠకులారా! మీకు వ్యాసుని మాట మీద నమ్మకముంటే ఓ నేరేడు చెట్టు మీ పెరట్లో పెట్టుకోండి. కావలసినంత బంగారం తయారు చేసుకోవచ్చు.)

సుపార్శ్వ పర్వతం మీద విశాలమైన కడప చెట్టుకు 5 తొర్రలున్నాయి. ఆ తొర్రల నుండి 5 తేనెధారలు బయటకు వస్తుంటాయి. (భాగవతం వ్రాస్తుండగా కవిగారికి తేనె త్రాగాలనిపించిందేమో. అందుకే ఇలా వ్రాసేశారు.)

కుముద పర్వతం మీద వున్న మర్రి చెట్టు పేరు శతస్కంధ. దీని నుండి పాలు, పెరుగు, నెయ్యి.........ఆసనాలు, ఆభరణాలు మొదలైనవన్నీ నదిగా ప్రవహిస్తుంటాయి. ఈ నది ప్రసాదించిన పదార్థాలు ఉపయోగించిన వారికి చావుకూడా రాదు. (కవిగారు ఈ నది ప్రసాదించిన పదార్థాలు ఉపయోగించినట్లు లేదు ఉపయోగించినట్లయితే కవిగారు చచ్చేవారు కాదు. కవిగారిని మనం కూడా చూచేవాళ్ళం. అమ్మో! కవిగారు ఉంటేనా!!..........నేనిలా భాగవతాన్ని విమర్శించానని తెలియగానే నామీద కూడా ఓ కథ రాసేవారు. ఆ కథ ఇలా వుండేదేమో.

"విష్ణుదేవుని సైన్యాధికారి విష్వక్సేనుడు. అతడొకసారి

విష్ణుదేవుని మాటను ధిక్కరించాడు. విష్ణుదేవుడు కోపించి మానవ జన్మ ఎత్తుమని అతణ్ని శపించాడు. విష్వక్సేనుడు భూలోకంలో రేగులపాటి కిషన్‌రావుగా అవతరించాడు. అతడు భాగవతాణ్ని విమర్శించడం వలన విష్ణుదేవునికి కోపంవచ్చింది. విష్ణుదేవుడు గరత్మంతునిపైనెక్కి కిషన్‌రావు పైకి యుద్ధానికి వచ్చాడు. కిషన్‌రావు విమానం పైనెక్కి విష్ణుదేవుణ్ణి ఎదుర్కొన్నాడు. ఆ యుద్ధములో..... ......చేతిలో.........చచ్చాడు."

ఈ కథ చదివిన నిరుద్యోగులకు ఉద్యోగాలు దొరుకుతాయి. వారు సుఖంగా జీవించడానికి భగవంతుడన్నివేళలా సహాయ పడుతాడు.)

యుగాంతమప్పుడు రాక్షసులు వేదాలను నాశనం చేశారు. అప్పుడు విష్ణువు గుర్రం తలకాయతో రసాతలానికి వెళ్లి వేదాల నుద్ధరించి వాటిని బ్రాహ్మదేవుని కిచ్చాడు. (పందిగా జనించి భూమిని రక్షించాడట, గుర్రము తలకాయితో నాశనము చేయబడిన వేదాలనుద్ధరించాడట. చాలా బాగా వ్రాశారు కవిగారూ!)

భగవద్భక్తుడు సర్వసద్గుణాలు కలిగివుంటాడు. భగవద్భక్తి లేని వానికి మంచి గుణాలుండవు. వాడు పాపపు పనులు చేస్తాడు (కవి గారూ! కాస్త జాగ్రత్తగా మట్లాడండి మీ అభిప్రాయం సరియైనది కాదు. ఎందరో నాస్తికులు సద్గుణ వంతులున్నారు.)

సూర్యుని రథం, సూర్యగమనం, గ్రహాలు, నక్షత్రాలు మొదలగు వానిని గురించి కూడా కవిగారు వ్రాశారు. కవిగారి రచన హేతువాదానికి, శాస్త్ర జ్ఞానానికి విరుద్ధంగా వుంది.

అతలంలో బలాసురుడు ఆవలించడం వలన స్వైరిణులు, (తన జాతి పురుషులతో వ్యభిచరించే స్త్రీలు), కామినులు (తన జాతి కాని వాళ్లతో వ్యభిచరించే స్త్రీలు), పుంశ్చలులు (చంచల స్వభావంకలరంకువాళ్ళు) పుట్టారు. (ఆవలించడం వలన కూడా పిల్లలు పుడుతారా కవిగారూ?)

అనంతునికి వెయ్యి తలలున్నాయట. అందులో ఒక తల మీద

ఈ భూమండలం అవగింజలా కనబడుతుందట. (శాస్త్ర జ్ఞాన విరుద్ధంగా చెప్పారు కవిగారు.)

కవిగారు ఒక స్కంధములో 28 రకాల నరకాలున్నట్లు పేర్కొన్నారు. (మన సమాజములో స్వర్గ నరకాల మీద చాలా నమ్మకం వుంది. అయితే ఇది కవిగారి కల్పన మాత్రమే.)

పరధనమును, పరస్త్రీలను అపహరించిన వాణ్ణి యమదూతలు కాల పాశాలతో కట్టి తామిస్ర నరకంలో పడదోస్తారు. (పర ధనమును, పర స్త్రీలను అపహరించినవాడు ఈ లోకములోనే కఠినమైన జైలుశిక్ష అనుభవించే మాట మాత్రం నిజం.)

పశువులను, పక్షులను చంపి పొట్ట నింపుకునే రాక్షస గుణం కలవారిని కుంభిపాక నరకంలో సలసల కాగుతున్న నూనె గంగాళంలో పడేస్తారు యమదూతలు. (భాగవతం పుట్టిన భారత దేశములోనే రోజుకు వేలకొలది పశువులు, పక్షులు మనుషుల కడుపుల్లోకి వెళ్తున్నాయి. కవిగారూ! మీరు పాఠకులను ఎంతభయపెట్టాలని ప్రయత్నం చేసినా లాభం లేకపోయింది.

అయ్యా యమదూతల్లారా! -కవిగారి మాట ప్రకారం- కుంభిపాక నరకంలోకి వచ్చేవాళ్ళ సంఖ్య రోజురోజుకు పెరిగిపోతూ వుండి వుంటుంది. శిక్షలు సరిగ్గా వెయ్యండి. మా పోలీసు వాళ్ళలాగా లంచాలు పుచ్చుకొని శిక్షలు వేయడంలో అవకతవకలు చేయకండి.)

వేదాలను ధిక్కరించిన వాళ్లు, బ్రాహ్మణులను తిట్టినవాళ్లు కాలసూత్ర నరకం వెళ్ళుతారు. (వేదాలలో చెప్పబడిన దోపిడీ నీతులను దిక్కరించి తీరాలి. బ్రాహ్మణుడైనా సరే ఎవరైనా సరే చెడ్డ పనులు చేస్తే తిట్టితీరాలి. మంచివాడు ఎవడైనాసరే, వాడేవృత్తి చేసినా సరే, ఏ కులం వాడైనా సరే ప్రేమించి తీరాలి.)

బ్రాహ్మణులకు శారీరక దండన వేసేవారు సూకర ముఖ నరకంలోకి వెళ్తారు. (బ్రాహ్మణులకు శారీరక దండన ఎందుకు వేస్తారు? తప్పు చేసినప్పుడే కదా! తప్పు చేసిన వానికి దండన వేసిన వాడు నరకం ఎందుకు వెళ్తాడు? తప్పు చేసినప్పుడు బ్రాహ్మణుడైనా,

రాజైనా, వైశ్యుడైనా, శూద్రుడైనా శిక్ష అనుభవించ వలసిందే. కవిగారూ! మీ మాటలు చెల్లవు. కాబట్టి నోరుమూసుకోండి )

నల్లులు, పాములు, దోమలు, ఈగలు మొదలగువానిని చంపిన వారు అంధకూప నరకం వెళ్తారు. (మనకు హాని కల్గించే కీటకాలను చంపితీరాలి. అయినా కవిగారి పిచ్చి మాటలు నమ్మేదెవ్వరు? కవి గారు రాసిన దోపిడీ నీతులను ప్రచారం చేసిన దోపిడీదారులు, ఈ విషయాలను మాత్రం ప్రచారం చేయలేదు. ఎందుకు? ప్రచారం చేయడం వలన వారికి కలిగే ప్రయోజనం ఏమీలేదు కనుక.)

(తప్పు చేసిన వ్యక్తి బ్రతికుండగానే శిక్ష అనుభవించగలడు. చచ్చిన తర్వాత శరీరమే వుండదు. ఇక శిక్ష అనుభవించడమెలా జరుగుతుంది?)

అజామిళుడు బ్రాహ్మణుడు. ఇతడొకనాడు అడవికి వెళ్లి తిరిగి వస్తుండగా ఒక రంకుటాలు భ్రష్టుడైన శూద్ర పురుషునితో సంగమం చేస్తూ కనబడింది. అజామిళుడు తన భార్యను విడిచిపెట్టి రంకుటాలుకు సంపద యావత్తూ ధారపోశాడు. అతనికి పదిమంది కొడుకులుండే వారు. చిన్న కొడుకు పేరు నారాయణ.

అజామిళుడు తన ప్రాణం పోతున్న సమయములో నారా యణా! నారాయణా! అని పిలిచాడు.

యమదూతలు, విష్ణు దూతలు అజామిళుడి ప్రాణాలు తీసుకొని వెళ్ళడానికి వచ్చారు.

"అగ్ని సాక్షిగా పెళ్లాడిన భార్యను వదిలిపెట్టి రంకుటాలుతో సంసారం చేసిన దుర్మార్గుడు వీడు. వీనిని శిక్షించడానికి యమ ధర్మ రాజు దగ్గఱకు తీసుకపోతున్నాము" అన్నారు యమదూతలు.

"మీరు దండించరాని నిరపరాధులను నిష్కారణంగా దండిస్తారు. ఈ అజామిళుడు భగవంతుని నామం గొంతెత్తి పలికాడు. అతని పాపాలన్నీ పటాపంచలైపోయాయి. దొంగ; బ్రాహ్మణ్ణి చంపిన వాడు; గురువు భార్యతో జతకట్టినవాడు; రాజును, ఆవును, తండ్రిని చంపినవాడు; ఇంకా ఎంత పాపం చేసిన వాడైనా భగవంతుని పేరు

పలుకగానే పాపం పోతుంది. భగవంతునికి వాళ్ళమీద ప్రేమ కలుగుతుంది. (భగవంతుడు తన పేరును పలికే దుర్మార్గులను ప్రేమిస్తాడట. శిక్షించే యమధర్మరాజు ఎంత నీచుడో, అపరాధులను ప్రేమించే భగవంతుడు కూడా అంత నీచుడు. కాని ఇది నిజమని అర్థం చేసుకో కూడదు. "భగవంతుని నామస్మరణ చేయండి" అని పాఠకులకు చెప్పదలచిన కవిగారు ఇలా వ్రాశారని మాత్రమే అర్థం చేసుకోవాలి.) సాంకేతికంగా అయినా, యధాలాపంగా అయినా, హేళనకే అయినా భగవంతుని పేరు పలికితేచాలు పాపాలన్నీ పోయినట్టేనోయి." (రేగులపాటి కిషన్‌రావూ! నువ్వు హేళనగా భగవంతుని పేరు తలుస్తున్నావు కదా! నువ్వు తెలిసో తెలియకో చేసిన పాపాలన్నీ పోయినట్టేనోయి.) విష్ణు దూతలు అలా వాదించి యమదూతలను (తర్కజ్ఞానం లేని వారిని) మెప్పించారు. అజామిళుడు బ్రతికాడు. (హత్యలు, దోపిడీలు చేసిన దుర్మార్గులను, భగవంతుని పేరు తలచినంత మాత్రాన, శిక్షించకుండా వదిలి పెడితే అది అన్యాయమే కవిగారూ! నేరం చేసిన వానికి శిక్ష విధించడమే న్యాయము. మీరు నమ్మిన భగవంతుడు పక్షపాత బుద్ధికలవాడు. అలాంటి దుర్మార్గపు భగవంతుణ్ణి స్మరించవలసిన అవసరంలేదు. ఏ వ్యక్తి నేరం చేయడానికి వీలులేని సమాజాన్ని స్థాపించుకోవాలి)

"లంజ కడుపున సంతానం కన్నాను, నా బ్రాహ్మణత్వం మంట గలుపుకున్నాను. పాపాత్ముణ్ణి (అతడే ఒప్పుకున్నాడు. విష్ణు భటులు కాదంటారేమిటి?) లంజ కోసం చెయ్యరాని పనులు చేశాను. తల్లిదండ్రులను, కన్న బిడ్డలను వదిలేశాను" అని బాధపడ్డాడు అజామిళుడు.

(భార్యాబిడ్డలను, తల్లిదండ్రులను వదిలి వేయడం తప్పని చెప్పాలి. కాని లంజ కడుపున సంతానం కన్నాను, తప్పు చేశాను, అని ఒక పాత్ర చేత అనిపించారెందుకు కవిగారూ?)

అజామిళుని లాంటి నీచులు, దోపిడీచేసి ధనం సంపాదించేవారు సమాజములో పున్నంతకాలం వేశ్యావృత్తి నశించదు. కొందరి స్త్రీలకు

భయంకరమైన కష్టాలు తప్పవు. నిస్సహాయ స్థితిలో వేశ్యావృత్తి చేసుకొని బ్రతికే స్త్రీలను రక్షించి వారికి జీవనాధారం ఏర్పరచాలంటే అజామిళునిలాంటి దోపిడీదారులను నిర్దాక్షిణ్యంగా అణచి వేయాలి.

ఘోరమైన పాపాలు చేసినవాళ్లు కూడా భగవంతుని పేరు తలిస్తే పాపాలు పోయినయెడల (శిక్షలు తప్పినయెడల) పాపాలు చేయ దలచుకున్న వారు చేయకుండా వూరుకుంటారా?

అజామిళుని ప్రాణాలు తీసుకరావడానికి వెళ్ళినపుడు జరిగిన విషయం యమదూతలు యమధర్మరాజుకు చెప్పారు.

"నేను కాక ఈ జగత్తంతటికీ మరో ప్రభువున్నాడు" అన్నాడు యమధర్మరాజు. (పాఠకులారా! కవిగారు చెప్పింది, యమధర్మరాజు గారు చెప్పింది విన్నారుకదా! వారి మాటలు నమ్మదలుచుకుంటే పనులన్నీ మానేసి "నారాయణా!, నారాయణా!" అంటూ కూర్చుంటే యమ భటులు మీ దగ్గఱకు రారు. మీకు చావురాదు. కోట్ల సంవత్సరాలు బ్రతుకవచ్చు మీరు. ఇక నా విషయం నాకు కవిగారి పాత్రల మీద నమ్మకమేనాడో పోయింది. కవిగారు చాలా యుక్తిగా అనేక పాత్రలు సృష్టించారని గ్రహించాను.

10 మంది ప్రాచేతసులు చెట్ల చేత పెంచబడిన మారిషను పెళ్లి చేసుకున్న విషయం, ఆమె గర్భములో దక్షుడు పుట్టిన విషయం మీకు తెలుసుకదా!

ఆ దక్ష ప్రజాపతిగారు మొదట నీరు, భూమి, దేవతలు, మనుషులు, అసురులను సంకల్పముతో సృష్టించాడు. (దక్షుడు అసురులనెందుకు సృష్టించాడు? అసురులు చెడ్డ పనులు చేస్తారని గోలపెడుతారే కాని, చెడ్డపనులు చేసే అసురులను సృష్టించిన దక్షుని సంకల్పములోనే దోషముందని గోల చేయరెందుకు?) సంకల్ప సృష్టి వృద్ధి కాలేదు. దక్షుడు వింధ్య పర్వతము దగ్గఱకు వెళ్ళి తపస్సు చేశాడు.

భగవంతుడు ప్రత్యక్షమై "పంచజని ప్రజాపతి కూతురు అసిక్నిని భార్యగా స్వీకరించి మైథున ధర్మం అవలంభించి పిల్లలను కను" అన్నాడు.

దక్షుడు అసిక్ని గర్భములో హర్యశ్వులనే పది వేల మంది కుమారులను కన్నాడు. (ఒక్క కూతురైనా జనిస్తించలేదా కవి గారూ?........మరొక విషయం చెప్పండి కవిగారూ! దక్షదంప తులు రోజుకు ఎంత మంది పిల్లలను తయారు చేసేవారండీ? దక్షదంప తులను తలచుకుంటే బొమ్మలను తయారుచేసే కర్మాగారం జ్ఞప్తికి వస్తున్నది. పది వేలమందికి ఏయే పేర్లు పెట్టాలో కవిగారికి తోచ లేదు. అందువల్ల అంత మందికి 'హర్యశ్వులు' అని ఒకే పేరు పెట్టారు.)

హర్యశ్వులు నారదుని బోధన విని ప్రజాసృష్టి చేయడం మానుకున్నారు. (మనం నారదునికి 'కుటుంబ నియంత్రణ' ప్రచారం చేసే ఉద్యోగం ఇస్తే......జనవృద్ధి తగ్గిపోతుంది కదండీ.)

దక్షుడు బాధపడ్డాడు. అతడు అసిక్ని గర్భములో మళ్లీ వెయ్యి మంది కుమారులను కన్నాడు. వాళ్ళ పేర్లు శబలాశ్వులు (వెయ్యి మందికి ఒక్కటే పేరు)

శబలాశ్వులు ప్రజావృద్ధికోసం తపస్సు చేస్తుండగా నారదముని వారించాడు.

దక్షుడు నారదుణ్ణి తిట్టాడు. నారదుడు నోరుమూసుకొని వెళ్లి పోయాడు.

దక్షుడు అసిక్ని గర్భములో 60 మంది కూతుళ్ళను కన్నాడు. (ఇప్పుడందరూ కూతుళ్లేనా?) 10 మందిని ధర్మునికిచ్చి పెళ్ళిచేశాడు. 13 మందిని కశ్యపునికిచ్చాడు,............కిచ్చాడు, 27 మందిని చంద్రుని కిచ్చాడు. (మన చంద్రగోళం గారికి 27 మంది భార్యలట, కవిగారి తెలివితేటలన్నీ ఇక్కడేవున్నాయి. పాఠకులను నమ్మించ డానికి చాలా యుక్తిగా వ్రాశారు. మొత్తం మీద 60 మందికి పెళ్లి చేశాడు దక్షుడు. కాదు కవిగారు వ్రాశారలా.)

వినతా, కద్రువా, పతంగీ, యామినీ తార్క్ష్యుడనే కశ్యపుని భార్యలు, పతంగి గర్భములో పక్షులు పుట్టాయి, యామిని గర్భ ములో శలభాలు, వినత గర్భములో గరత్మంతుడు, అరుణుడు; కద్రువ గర్భములో నాగులు పుట్టాయి. గరత్మంతుడు విష్ణువుకు

వాహనమయ్యాడు, అరుణుడు సూర్యునికి సారథి అయ్యాడు. (లోక జ్ఞానమున్న వాడెవ్వడూ కవిగారి మాటలను ఒప్పుకోడు, ఇదంతా హేతువాద విరుద్ధంగా వుంది పిచ్చివాని మాటల్లావున్నాయి. ఇందు లోని విషయాలన్నీ సృష్టి పరిణామ సిద్ధాంతానికి భిన్నంగా వున్నాయి.

చంద్రునికి రోహిణి మీద ప్రేమ ఎక్కువగావుంది. మిగిలిన వారిని నిర్లక్ష్యం చేశాడు. దక్షుడు చంద్రుణ్ణి శపించాడు. చంద్రునికి క్షయరోగం వచ్చింది. చంద్రుడు మామను వేడుకున్నాడు దక్షుడు వరమిచ్చాడు. దక్షుని శాప వరాల వల్లనే క్షీణించి పోవడం, అభి వృద్ధి చెందడం జరుగుతూవుంది. (చంద్రగోళం కృష్ణపక్షములో క్షీణించుచున్నట్లు, శుక్ల పక్షములో వృద్ధి చెందుతున్నట్లు మనకు కన బడుతుంది. అంతేకాని చంద్రగోళం క్షీణించడం గాని, వృద్ధి చెందడం గాని జరుగదు అలా అని మనందరికీ ఇప్పుడు తెలుసు. చంద్రగోళం అలా కనబడడానికి భూమి, చంద్రుడు మొదలగువాని గమనాల మీద ఆధారపడి వున్నదికదా! కవిగారికి శాస్త్ర జ్ఞానం లేదు. (అసలే లేదనికాదు) అంటే కావిగారు జీవించివున్న కాలంనాటికి శాస్త్ర జ్ఞానం ఎక్కువగా అభివృద్ధి చెందలేదు. కవిగారు ఏది చెప్పితే అదే నమ్మే అజ్ఞానంలో ప్రజలుండేవారు.)

కశ్యపునికి తిమిగర్భములో నీటి జంతువులు. సరమ గర్భములో క్రూర జంతువులు, సురభి గర్భములో పశువులు, తామ్ర గర్భములో పక్షులు, ముని గర్భములో అప్సరసలు, క్రోధ గర్భములో విష జంతువులు, ఇళ గర్భములో చెట్లు, సురస గర్భములో రాక్షసులు, అరిష్ఠకి గంధర్వులు పుట్టారు. (ఇదంతా లోకజ్ఞానానికి, హేతువాదా నికి విరుద్ధంగావుంది.)

దేవేంద్రుడొకనాడు కొలువు తీర్చి కూర్చున్నాడు. అప్పుడు ఆచార్యుడు బృహస్పతి అక్కడికి వచ్చాడు. దేవేంద్రుడు కదలక మెదలక కూర్చున్నాడు. దేవేంద్రుడు నమస్కరించనందుకు బృహ స్పతికి కోపం వచ్చి వెళ్ళి పోయాడు. దేవేంద్రుడు తన తప్పు

తెలుసుకున్నాడు. వెంటనే బృహస్పతి ఇంటికి వెళ్ళి చూశాడు. బృహస్పతి కనబడలేదు. దేవేంద్రుడు తిరిగి వచ్చాడు. (దేవేంద్రునికి పెద్దలనెలా గౌరవించాలో కూడా తెలియదు)

శుక్రాచార్యుని మంత్రాంగం ప్రకారం ఆయుధాలు పట్టుకొని దేవతల మీద దండయాత్ర చేశారు రాక్షసులు. (దేవతలు ఇంతకు పూర్వం రాక్షసులకు ఏదైనా కీడుచేసి యుండవచ్చు. కాని కవిగారు ఆ విషయం మరుగు పరచి రాక్షసుల మీద నేరం మోపుతున్నారేమోనని నా అనుమానం. కవిగారికి పక్షపాతబుద్ధి వుంది కనుక నాకీ అనుమానం కలిగింది. సత్యాన్వేషణ కోసం ముందడుగు వేద్దాం.)

బ్రహ్మదేవుని దగ్గఱకు వెళ్లిన దేవతలకు బ్రహ్మదేవుడిలా చెప్పాడు.

"రాక్షసులు తమ గురువును ఆరాధిస్తున్నారు. వాళ్ళు అర్థశాస్త్రం పూర్తిగాం నేర్చుకున్నారు. వాళ్లు ఏం చెయ్యాలని చూస్తున్నారో తెలియదు. బ్రాహ్మణులను గౌరవించే వాళ్లు జయం పొందడంలో వింతలేదు" (అర్థ శాస్త్రం నేర్చుకొన్న రాక్షసులు దేవతల వల్ల జరిగిన దోపిడీని గ్రహించారు, తెలివికల శుక్రాచార్యుణ్ణి ఆరాధిస్తున్నారు. బ్రాహ్మణులను గౌరవించినంతమాత్రమున జయం పొందడం సాధ్యం కాదు. బ్రాహ్మణులను గౌరవించాలన్న ఉద్దేశము పాఠకులకు కలిగించాలన్న అభిప్రాయముతో కవిగారీ వాక్యము వ్రాశారు.

విశ్వరూపుడు బ్రాహ్మణుడు. (కవిగారు బ్రాహ్మణ కులాన్ని పదే పదే గొప్పచేసి వ్రాశారు.)

బ్రహ్మగారి సలహా ననుసరించి దేవతలు విశ్వరూపుని దగ్గఱకు వెళ్లారు. తమ పనిని గట్టెక్కించు కొనుటకు గాను దేవతలు విశ్వరూపుణ్ణి పొగిడారు

విశ్వరూపుడు 'దేవతల పౌరోహిత్య కార్యం నెరవేరుస్తానని మాట ఇచ్చాడు.

తెలుసుకున్నాడు. వెంటనే బృహస్పతి ఇంటికి వెళ్ళి చూశాడు. బృహస్పతి కనబడలేదు. దేవేంద్రుడు తిరిగి వచ్చాడు. (దేవేంద్రునికి పెద్దలనెలా గౌరవించాలో కూడా తెలియదు)

శుక్రాచార్యుని మంత్రాంగం ప్రకారం ఆయుధాలు పట్టుకొని దేవతల మీద దండయాత్ర చేశారు రాక్షసులు. (దేవతలు ఇంతకు పూర్వం రాక్షసులకు ఏదైనా కీడుచేసి యుండవచ్చు. కాని కవిగారు ఆ విషయం మరుగు పరచి రాక్షసుల మీద నేరం మోపుతున్నారేమోనని నా అనుమానం. కవిగారికి పక్షపాతబుద్ధి వుంది కనుక నాకీ అనుమానం కలిగింది. సత్యాన్వేషణ కోసం ముందడుగు వేద్దాం.)

బ్రహ్మదేవుని దగ్గఱకు వెళ్లిన దేవతలకు బ్రహ్మదేవుడిలా చెప్పాడు.

"రాక్షసులు తమ గురువును ఆరాధిస్తున్నారు. వాళ్ళు అర్థశాస్త్రం పూర్తిగా నేర్చుకున్నారు. వాళ్లు ఏం చెయ్యాలని చూస్తున్నారో తెలియదు. బ్రాహ్మణులను గౌరవించే వాళ్లు జయం పొందడంలో వింతలేదు" (అర్థ శాస్త్రం నేర్చుకొన్న రాక్షసులు దేవతల వల్ల జరిగిన దోపిడీని గ్రహించారు, తెలివికల శుక్రాచార్యుణ్ణి ఆరాధిస్తున్నారు. బ్రాహ్మణులను గౌరవించినంతమాత్రమున జయం పొందడం సాధ్యం కాదు. బ్రాహ్మణులను గౌరవించాలన్న ఉద్దేశము పాఠకులకు కలిగించాలన్న అభిప్రాయముతో కవిగారీ వాక్యము వ్రాశారు.

విశ్వరూపుడు బ్రాహ్మణుడు. (కవిగారు బ్రాహ్మణ కులాన్ని పదే పదే గొప్పచేసి వ్రాశారు.)

బ్రహ్మగారి సలహా ననుసరించి దేవతలు విశ్వరూపుని దగ్గఱకు వెళ్లారు. తమ పనిని గట్టెక్కించు కొనుటకు గాను దేవతలు విశ్వరూపుణ్ణి పొగిడారు

విశ్వరూపుడు 'దేవతల పౌరోహిత్య కార్యం నెరవేరుస్తానని మాట ఇచ్చాడు.

చేయూత నిచ్చాడన్నమాట.) దధీచి ఎముకలతో విశ్వకర్మ వజ్రా యుధం తయారు చేశాడు.

నీచులైన దేవతలకు, రాక్షసులకు యుద్ధం జరిగింది. అన్యాయ పరులకు ఉపాయం చెప్పిన భగవంతుణ్ణి వృత్రాసురుడు మొదలగు రాక్షసులు శరణు వేడలేదు. వృత్రాసురుడు వీరునివలె యుద్ధం చేశాడు.

వృత్రాసురుని దెబ్బతో ఐరావతం (దేవేంద్రుని వాహనమైన ఏనుగు) రక్తం కక్కుకుంది, దేవేంద్రుడు సంకటములో పడి పోయాడు. యుద్ధ ధర్మమెరిగిన వృత్రాసురుడు శత్రువు ఆ స్థితిలో దేవేంద్రుని మీద గద వెయ్యలేదు (వృత్రాసురుడెంత ధర్మపరుడో గ్రహించారా పాఠకులారా! తన అన్నను అన్యాయంగా చంపిన ఇంద్రునితో ధర్మయుద్ధం చేసి పగతీర్చుకోవడమే అతని ఆశయం.)

దేవేంద్రుడు వృత్రాసురుని సుగుణాలను మెచ్చుకుంటూనే అతని చేతులను నరికేశాడు. (వంచించడంలో మొనగాడు దేవేంద్రుడు.........మన దోపిడీ సమాజంలోని కవులు, పండితులు ఇప్పటికీ దేవేంద్రుని తప్పులను ఎత్తిచూపడానికి జంకుతున్నారు.)

వృత్రాసురుడు ఐరావతంతో సహా దేవేంద్రుణ్ని మ్రింగేశాడు. దేవేంద్రుడు వృత్రాసురుని కడుపు చీల్చి బయటకు వచ్చి అతని తల నరికేశాడు. (ఇది కవిగారి అతితెలివి. దేవేంద్రుణ్ణి గొప్పచేసే పక్షపాత బుద్ధితో వ్రాసిన కథ ఇది. ఇది లోకజ్ఞాన విరుద్ధంగా లేదా?)

వృత్రుడు చనిపోగానే బ్రహ్మహత్యా పాతకం చండాల స్త్రీ రూపంతో దేవేంద్రుణ్ణి వెంటాడింది. దేవేంద్రుడు మానస సరోవరంలో రహస్యంగా ఒక తామర తూడులో దాక్కొన్నాడు. "దేవేంద్రుడు అన్యాయంగా వృత్రాసురుణ్ని చంపేశాడు. నేరస్థుడు కనుక ఎవరికీ కనబడకుండా దాక్కొన్నాడు" అని మనం గ్రహించాలి. బ్రహ్మహత్యా పాతకం చండాల స్త్రీ రూపంలో ఇంద్రుణ్ని వెంటాడిందనడంలో కవిగారి అతితెలివి వుంది. ఇచ్చట ఒక వర్గం వారిని గొప్పచేస్తూ ఒక వర్గం వారిని హీనంగా భావించారు కవిగారు.

శూద్రులను చంపిన సందర్భములో శూద్రహత్యా పాతకం, అని వ్రాయని కవిగారు బ్రాహ్మణిని చంపగానే 'బ్రహ్మ హత్యా పాతకం' అని వ్రాయడంలో కవిగారికి పక్షపాతబుద్ధి, బ్రాహ్మణా ధిక్యత పెంచాలన్న వుద్దేశం లేదంటారా?)

ఇంతలో సమర్థుడై స్వర్గంలో రాజయాడు నహుషుడు. అతడు దేవేంద్రుని భార్య శచీదేవిని కామించి ఫలితంగా పామై పోయాడు. పరస్త్రీని కామించిన నహుషుడు దుర్మార్గుడని మనం ముందు అంగీకరించ వలసిన విషయం.........దేవేంద్రుడు కూడా అనేక పర్యాయాలు పరస్త్రీలను కామించాడు కాని దేవేంద్రుడు పామైపోయాడనో, కుక్కయి పోయాడనో, కవిగారు ఎక్కడా రాయ లేదు. ఈ విషయాన్ని ముందు కథల్లో స్పష్టంగా తెలుసుకోవచ్చు. దేవేంద్రుడు ఎన్ని తప్పులు చేసినా కవి దృష్టికి రాలేదా? నీచుడైన దేవేంద్రుని తప్పులను కప్పిపుచ్చుతూ, అతణ్ని సమర్థిస్తాడెందుకు?)

ఋషుల పిలుపు విని దేవేంద్రుడు స్వర్గం వెళ్లాడు. బ్రహ్మరుషులు దేవేంద్రునిచేత బ్రహ్మహత్యా పాతకానికి ప్రాయశ్చిత్తం చేయిం చారు. మునులు అతని చేత అశ్వమేధం చేయించారు. దేవేంద్రుని పాపం పోయింది. (దేవేంద్రుడు కాక మరొకడు ఇలాంటి నేరం చేస్తే కవిగారు అతనికి కఠిన శిక్ష విధించేవారు. ప్రాయశ్చిత్తం, అశ్వమేధం చేస్తే చేసిన పాపం ఎక్కడికి పోతుంది. ప్రాయశ్చిత్త సమయములో, అశ్వమేధం జరిగినప్పుడు దేవేంద్రుడు ఇచ్చిన దానాలు అందుకొని బ్రాహ్మణులు సంతోషపడి 'పాపం పోయిందని చెప్పారని మనం అర్థం చేసుకోవాలి. ధర్మమూర్తి, మహా పరాక్రమవంతుడు వృత్రాసురుడు బ్రతికివుంటే తమ అధర్మ కార్యాలు కొనసాగవని గ్రహించిన బ్రాహ్మ ణులు, ఋషులు వృత్రాసురుణ్ని చంపుమని ఇంద్రుణ్ని ప్రోత్స హించారు. మొదట దేవేంద్రుడు బ్రహ్మహత్యా పాతకం చుట్టుకుం టుందని భయపడ్డాడు. అప్పుడు మునులు' అశ్వమేధ యాగం చేయించి నీ పాపం పోగొడుతామని చెప్పారు.

బ్రాహ్మణ్ణి చంపితే బ్రహ్మహత్యా పాతకం చుట్టుకుంటుందని

కవిగారు వ్రాశారు. అదే శూద్రుణ్ణి చంపితే శూద్రహత్యా పాతకం చుట్టుకుంటుందని కవిగారు ఎక్కడా వ్రాయలేదు.

"అయినా వెధవ శూద్రులను చంపితే కూడా పాపం తగులుతుందా?" అని కవిగారి అభిప్రాయం.)

శూరసేన దేశపు రాజు చిత్రకేతుడు, అతనికి కోటి మంది భార్యలుండేవారు (కోటి మంది భార్యలతో చిత్రకేతుడు కాపురమెలా చేశాడు కవిగారూ! నీకు వాస్తవ దృష్టి లేదోయీ.) అంత మంది భార్యలకు సంతానం కాలేదు. ఒకసారి అంగిరస ఋషి చిత్రకేతుని దగ్గఱకు వచ్చాడు.

"నాకు సంతానం అనుగ్రహించు" అంటూ ప్రార్థించాడు చిత్రకేతుడు. (అనుగ్రహిస్తే పిల్లలెలా పుడుతారో?)

చిత్రకేతుడు యజ్ఞంచేసి చరువు (అమృతము) కృతద్యుతి (పెద్ద భార్య) కిచ్చాడు. కృతద్యుతి చరువు సేవించడం వలన కుమారుడు జన్మించాడు.

చిత్రకేతుడు సంతోషంతో బ్రాహ్మణులకు వెండి, బంగారము వస్త్రాలు, ఆభరణాలు, గ్రామాలు, గుఱ్ఱాలు, ఏనుగులు, ఆవులు, దానం చేశాడు. (చిత్రకేతుడివన్నీ కష్టపడి సంపాదించలేదు దోపిడీ విధానంతో సంపాదించాడు. తనను సమర్థించే బ్రాహ్మణుల కవి పంచిపెట్టాడు. దానాలు స్వీకరించే బ్రాహ్మణులు గొప్పవారని కవిగారి వాదన. దానాలు స్వీకరించడం చాలా నీచమైన పని, దానాలు స్వీకరించే వారికి బిచ్చమెత్తుకునే వారికి భేదమేముంది? బిచ్చగాళ్లు ఇతరుల శ్రమ శక్తి మీద ఆధారపడి బ్రతుకుతున్నారు. ఇతరుల శ్రమశక్తిని దోపిడీ చేసి బ్రతకడం అన్యాయం. కష్టపడి పని చేయాలి, తగిన ప్రతిఫలం పొందాలి అదే న్యాయం, అదే ధర్మం. ఇచ్చట మరొక విషయం గమనించాలి. ప్రతి వ్యక్తికి పని కల్పించాల్సిన బాధ్యత సమాజం మీద వుంది. అంతేకాని దోపిడీ విధానాన్ని మెచ్చుకోవడం గానీ సమర్థించడం గానీ కూడదు.)

కృతద్యుతి కొడుకుకు రహస్యంగా విషమిచ్చి చంపారు మిగిలిన

రాణులు. కృతద్యుతి, చిత్రకేతుడు చాలాసేపు ఏడ్చారు.

అంగిర ఋషికి విషయం తెలిసి నారదమునితో కలసి అవధూత వేషంలో అక్కడకు వచ్చాడు వాళ్లిద్దరు చిత్రకేతుణ్ణి ఎన్నో విధాల ఓదార్చారు.

"గ్రామ్య పశువునునేను. మూఢమతినినేను. నాకు జ్ఞానదానం చెయ్యండి" అంటూ చిత్రకేతుడు వారిని ప్రార్థించాడు (చిత్రకేతుడు తన్ను తాను హీనపరుచుకున్నాడు. నిజంగా చిత్రకేతుడెంత మూర్ఖుడు) వారు భగవంతుని పాదపద్మాలు ఆశ్రయించుమని చెప్పారు. (రాజ కుమారునికి విషమిచ్చి చంపిన నేరస్థులను పట్టుకొని తగిన శిక్ష విధించమని వారు చెప్పనేలేదు.)

నారదముని ఉపదేశించిన విద్యననుసరించిన చిత్రకేతుడు సంకర్షణ దేవుని పాద పద్మాలు చేరుకున్నాడు. సంకర్షణుడు చిత్రకేతునికి జ్ఞానోపదేశం చేశాడు.

చిత్రకేతుడు విష్ణుదేవుడిచ్చిన విమానమెక్కి తిరిగేవాడు.

ఒకనాడు ఒకచోట శివుడు పార్వతీదేవిని ఒడిలో కూర్చోబెట్టుకొని ఆలింగనం చేసుకొంటున్నాడు. వారిద్దరి చుట్టూ అనేక మంది గుమిగూడి వున్నారు. అదిచూచి చిత్రకేతుడు నవ్వుతూ ఇలా అన్నాడు. "అనేక మంది చూస్తుండగా ఆడదాన్ని ఒడిలో పెట్టుకొని ఆలింగనం చేసుకొంటున్నాడేమిటి శివుడు."

సిగ్గులేని పార్వతికి చిత్రకేతునిపై కోపం వచ్చింది. రాక్షసుడవై పుట్టుమని శపించింది.

చిత్రకేతుడు క్షమాభిక్ష వేడుకున్నాడు. (అలాంటి పరిస్థితుల్లో నవ్వడం చిత్రకేతుని అపరాధం కాకపోయినా)

పార్వతీదేవి శాపం పొందిన చిత్రకేతుడే వృత్రాసురుడుగా జన్మించాడు. (అని కవిగారు వ్రాశారు. కవిగారూ! పునర్జన్మ వుంటుందని రుజువు చేయగలరామీరు?)

దేవేంద్రుడు విష్ణుదేవుని సహాయంతో దితి కుమారులను చంపేశాడు. (ఎందుకు చంపేశాడో కవిగారు తెలియజేయలేదు. నిరప

రాధులను చంపడం దేవేంద్రునికి అలవాటే. అన్నలనూ తమ్ముళ్ళనూ చంపిన దుర్మార్గుడు ఇంద్రుడు.)

ఇంద్రుణ్ని హతమార్చే కుమారుణ్ని కనాలని నిశ్చయించుకుంది దితి. అనురాగంతోనూ, వినయంతోనూ కశ్యపుణ్ని సేవించింది.

కశ్యపుడు దితి శుశ్రూషతో సంతోషపడ్డాడు. "పతివ్రత స్త్రీలు భర్తే దైవంగా భావించి సేవిస్తారు. నీ కోరిక తీరుస్తాను. పతివ్రత కాని స్త్రీలకిది దుర్లభం. ఏం కావాలో అడుగు" అన్నాడు. (స్త్రీలను అణచి వేస్తున్న నీతులివి.)

దేవేంద్రుణ్ణి చంపగల కుమారుడు కావాలని అడిగింది దితి. అప్పుడు కశ్యపుడు విచారించి ఇలా అన్నాడు. "ఆడదాని మాయలో పడ్డాను వివేకం పోగొట్టుకున్నాను. ఆడదానికి ప్రియులంటూ ఎవ్వరూ వుండరు. తమ స్వార్థం సాధించుకోవడం కోసం భర్తను, కొడుకును, అన్నదమ్ములను హత్య చేస్తారు" (సోదరీమణులారా! మీకు కశ్యపుడు కనిపించి ఈ మాటలంటే మీరేమంటారు? అవునని తలవూపి ఆమోదిస్తారా? లేక చెయ్యెత్తి కశ్యపుని పళ్ళు రాలగొడుతారా? కవిగారికి స్త్రీలపైన చాలా హీనభావం వుంది. స్త్రీలను అనేక సార్లు కించపరిచారు. కవిగారూ! మీకిది తగదు....తగదు.... తగదు.)

"పుంసవన వ్రతం ఏడాదిపాటు నిష్ఠతో చేస్తే నీ కోరిక నెరవేరుతుందని చెప్పాడు కశ్యపుడు. దితి అంగీకరించి భర్త వీర్యంతో గర్భవతి అయింది.

తన పిన తల్లి దితి చేసినదంతా తెలుసుకున్నాడు దేవేంద్రుడు. మారువేషంలో దితి దగ్గఱకు వచ్చి ఆమెను సేవించాడు. దితి వ్రతం చెడగొట్టుట కోసం వేచి చూశాడు. ఒకనాడు పుంసవన వ్రతానికి వ్యతిరేకంగా ఎంగిలి ముట్టుకొని కడుక్కోకుండా పడుకొని నిద్రపోయింది. దేవేంద్రుడు దితి కడుపులోకి వెళ్ళి పిండాన్ని వజ్రాయుధంతో 49 ముక్కలు చేశాడు. (ఇది కవిగారి అతితెలివి. వజ్రా

యుద్ధం పట్టుకొన్న దేవేంద్రుడు ఆమె కడుపులోకి ఎలా వెళ్ళాడు.) 49 మంది మరుత్తులు జన్మించిన తర్వాత దితి మేలుకుంది.

"అమ్మా! పూజ్యురాలివి నువ్వు. నేను నీ గర్భములోకి వెళ్ళి పిండాన్ని 49 ముక్కలు చేసిన దుర్మార్గుణ్ణి నా తప్పు మన్నించు" అని ఆమెకు నమస్కరించి వెళ్ళిపోయాడు. (దేవేంద్రుడు పెద్దలనెలా గౌరవిస్తాడో తెలుసుకున్నారా పాఠకులారా! 49 మంది మరుత్తులు పుట్టి బతికారు కనుక ఇక తన ఆట సాగదని గ్రహించిన దేవేంద్రుడు పిన తల్లిని, తమ్ముళ్లను మంచి చేసుకోవడం కోసం ఈ ప్రయత్న మంతాచేశాడు.

ఈ కథలోని అనేక విషయాలు లోకజ్ఞానానికి, హేతువాదా నికి విరుద్ధంగా వున్నాయి.

పుంసవనవ్రతం చేసేవారు నగలూ, నైవేద్యమూ బ్రాహ్మణుల కిచ్చి పూజించాలి. (బ్రాహ్మణులకు వుచితంగా ఏదీ ఇవ్వకండి. ఎవరూ ఈ దోపిడీ నీతులకు లొంగిపోకండి. కవిగారి పక్షపాతబుద్ధి గ్రహించండి.)

విష్ణుదేవుడు పందిగా జన్మించి హిరణ్యాక్షుణ్ణి సంహరించాక తమ్ముణ్ని తలచుకొని ఏడ్చాడు హిరణ్యకశిపుడు

దేవతలు విష్ణువు కాళ్ళ మీద పడి అతనిని తమ పక్షం చేసుకున్నారు. (విష్ణువు ఆశ్రిత పక్షపాతి కాని న్యాయ పక్షపాతి కాదు.)

హిరణ్యకశిపుడు తన అనుచరులకిలా చెప్తున్నాడు

మీరందరూ భూలోకం మీద విరుచుకపడండి. బ్రాహ్మణులు, క్షత్రియులు బలసి పోయారిప్పుడు (ఇతరుల శ్రమశక్తిని దోచి ధనవంతు లయ్యారు.) తపస్సు చేస్తున్న వాళ్ళను, యజ్ఞాలు చేస్తున్న వాళ్ళను, వేదాలు చదువుతున్న వాళ్ళను, వ్రతాలు, దానాలు చేస్తున్న వాళ్ళను పట్టుకొని చంపెయ్యండి. బ్రాహ్మణులు, వేదాలు వున్న వూళ్ళన్నీ తగుల పెట్టెయ్యండి. (హిరణ్యకశిపా! మరీ అంత కోపమైతే ఎలాగోయీ! ఉగ్రవాదం వదులుకొని సరసవాదం, సమతా వాదం అవలంభించు ఉగ్రవాదం అవలంభిస్తే నీ కోరిక న్యాయమైనదే

అయినా కాదంటారు. సమతా వాదులు కూడా నీకు సహాయం చేయరు నీవు ఏ వర్గము వాడవో నాకింకా స్పష్టంగా తెలియలేదు. ఇప్పటికీ నీవు దుర్మార్గుడవని లోకములో ప్రచారం మాత్రం బాగానే జరుగుతూవుంది. నీ మాటల్లో సత్యముంది. అది నీ సమతా వాదబుద్ధో, స్వార్థబుద్ధో తర్వాత తెలుసుకుంటాను. తపస్సు చేస్తున్న వాళ్లు, యజ్ఞాలు చేస్తున్న వాళ్ళు పని చేసిన పాపానపోరు-కాని అప్పుడప్పుడు ఆహారం తింటారు. ఇతరుల శ్రమశక్తితో తయారైన ఆహారమది. అంటే వాళ్ళు ఒక రకమైన దోపిడీదారులన్న మాట. వేదాలలో దోపిడీ నీతులు కొన్ని వున్నాయి. ఆ దోపిడీ నీతులు స్వార్థపరులు తమ స్వప్రయోజనం కొఱకు ప్రచారం చేసుకుంటారు. కనుక వేదాలు చదివేవారిని చంపివెయ్యాలని హిరణ్యకశిపుని వాదన. నేను హిరణ్యకశిపుని వాదంతో ఏకీభవించుట లేదు. దోపిడీ నీతులు ప్రచారం చేసుకునేవారు ఏ కాలములోనైనా వుంటారు. వాళ్ళను చంపి వేస్తే ఆ సమస్య పరిష్కరింపబడదు. అది న్యాయం కూడా కాదు. దోపిడీ నీతులకు వ్యతిరేక ప్రచారం ముమ్మరంగా కొనసాగిస్తే దోపిడీ దారులు, దోపిడీ చేయబడేవారు, ఇరు పక్షాలవారు గ్రహిస్తారు. సమతకోసం కృషి చేస్తారు.

దానాలు చేయడం, స్వీకరించడం క్షమించరాని నేరం. దోపిడీ దారులే ఎక్కువగా దానాలు చేస్తుంటారు. దానాలు స్వీకరించేవారు మరొక రకమైన దోపిడీదారులు. దానాలు చేసేవారిలో చాలా మంది ఇతరుల శ్రమశక్తిని దోపిడీ చేసే వారే, అలా దోపిడీ చేసిన ధనాన్ని బ్రాహ్మణులకు (తెలవికలవారికి) కడుపేద వారికి దానం చేస్తారు. అది కూడా స్వార్థబుద్ధితో.

తెలివికల వారు దోపిడీ విధానాన్ని అరికట్టుటకు ప్రయత్నం చేస్తారు. అజ్ఞానకలి కలవారు తిరుగుబాటు చేస్తారు. తెలివికలవారికి, కడు పేదవారికి దానాలు ఇచ్చి దోపిడీదారులు రాబోయే ప్రమాదం నుండి తప్పించుకుంటారు. దానాలు ఇవ్వడంలోవున్న రహస్యం ఇది. దానాలు స్వీకరించేవారిలో కొందరు సోమరిపోతులుంటారు.

దోపిడీ వ్యవస్థలో దోపిడీ దారుల ఆలోచనలు, దోపిడీ చేయ బడే వారి ఆలోచనలు అక్రమంగా వుంటాయి.)

హిరణ్యాకశిపుని అనుచరులు గ్రామాలు, తోటలు ఆలమందలు నాశనం చేశారు. (ఈనాడు కూడా కొందరు స్వార్థపరులు తమ స్వప్రయోజనం సాధించడానికి ఉద్యమాలు లేవదీసి యువకులను రెచ్చగొట్టి బస్సులను, రైళ్ళను మొదలగువానిని నాశనం చేయిస్తు న్నారు.)

లోకమంతటికీ రాజు కావాలనుకున్నాడు హిరణ్యాకశిపుడు. తనను ఎవరూ జయించకుండా, ముసలితనం, చావు రాకుండా వుండా లని ఊహించాడు. తాను అనుకున్నది సాధించుటకు తపస్సు చేశాడు. కాలి బొటన వ్రేలి మీద నిలబడి ఎంతో కాలం తపస్సు చేశాడు. అతని నెత్తి మీద అగ్ని బయలుదేరి అంతటా వ్యాపించి చాలా మందిని కాల్చివేయడం మొదలుపెట్టింది. నదులు, సముద్రాలు కుత కుత లాడాయి. గ్రహాలు, నక్షత్రాలు గతులు తప్పాయి. దేవతలు భయ పడి బ్రహ్మ దగ్గరకు వెళ్లారు. (తపస్సు చేస్తే అగ్ని బయలుదేరు తుందా? గ్రహానక్షత్రాలు గతులు తప్పుతాయా? అలా అయితే మునులు తపస్సు చేసినప్పుడు కూడా మంటలు బయలుదేరాయని, లోకం నాశనమైపోయిందని కవిగారు ఎందుకు వ్రాయలేదు? మునులు తపస్సు చేసినప్పుడు అలాగే జరగాలి కదా? ఎవరైనా తపస్సు ఎందుకు చేస్తారు. తాననుకున్నది సాధించడానికే కదా. (తపస్సు చేస్తే అనుకున్నది సాధిస్తామన్న నమ్మకం నాకు లేదు.) పాఠకులకు హిరణ్యాకశిపుని పైన దురభిప్రాయం ఏర్పరచుటకు కవిగారు వేసిన ఎత్తు ఇది.

దేవతలు బ్రహ్మకిలా చెప్పారు.

"బ్రహ్మదేవా! నువ్వు తపః ప్రభావం వల్ల లోకాలను సృష్టి చేస్తున్నావు కదా! అలాగే హిరణ్యాకశిపుడు కూడా తపస్సు చేసి బ్రహ్మ పదవి లాక్కోవాలని ప్రయత్నం చేస్తున్నాడు. నీ పరమేష్టి పదవి బ్రాహ్మణుల క్షేమం కొరకే కదా! ఇప్పుడు ఏది కర్తవ్యమో

అదిచెయ్యి" బ్రాహ్మణుల క్షేమం కొరకు బ్రహ్మదేవుడు తన పదవి కొనసాగిస్తున్నాడట. అలాంటప్పుడు బ్రాహ్మణేతరులకు బ్రాహ్మణుల పైననూ, బ్రహ్మపైననూ, కోపం రాక ఏ చేస్తుంది? కొలది జనుల మేలు కోరెడి పాలకులను పదవీ భ్రష్టులను చెయ్యవలసిందే. సర్వజనుల మేలుకోరెడి పాలకులను ఏర్పాటు చేసుకోవలసిందే.

హిరణ్యకశిపుడు తపస్సు చేసి బ్రహ్మ పదవికి వస్తే దేవతలకు, బ్రాహ్మణులకు లాభం కలిగే అవకాశం లేదు. కనుక వాళ్లు అందోళనతో బ్రహ్మదేవుని దగ్గరకు వచ్చారు.)

బ్రహ్మ హిరణ్యకశిపుని దగ్గరకు వచ్చాడు. అప్పటికి హిరణ్యకశిపుడు వందదేవ సంవత్సరాలు తపస్సు చేశాడు. అతనిమీద పుట్ట పెరిగింది. అతని శరీరాన్ని దోమలు తిన్నాయి, ఎముకలకు ప్రాణం వ్రేలాడుతుంది. (ఇదంతా అసంభవమే) బ్రహ్మ కమండలంలో నుండి నీళ్లు తీసి హిరణ్యకశిపుని ఎముకల మీద చల్లి 'ఏం కావాలో కోరుకో' అన్నాడు.

హిరణ్యకశిపుని అవయవాలు పరిపుష్టంగా తయారైనాయి. హిరణ్యకశిపుడు బ్రహ్మనడిగాడు. "మనిషిచేత, జంతువుచేత. నిర్జీవుల చేత, సజీవులచేత, దేవదానవులచేత, నాగులచేత, ఇంట, బయట, పగలు, రాత్రి, భూమి మీద, ఆకాశంలో నువ్వు పుట్టించిన ఏ ప్రాణి చేత చావకూడదు."

బ్రహ్మ హిరణ్యకశిపునికి వరాలిచ్చి వెళ్లిపోయాడు.

హిరణ్యకశిపుడు ఇంటికి చేరుకోగానే అతనికి కోపం కలిగించే విషయం తెలిసింది.

అతడు తపస్సుకు వెళ్లిన తర్వాత దేవతలు హిరణ్యకశిపుని రాజ్యముపై దండయాత్ర చేశారు. హిరణ్యకశిపుడు లేకపోవడంవలన అతని సైనికులు భయపడి పారిపోయారు. దేవతలు రాజభవనంలో చొరబడి దోచుకున్నారు. (దొంగ వెధవలు) ఆడవాళ్లను లాక్కొని పోయారు. (దుర్మార్గులు) దేవేంద్రుడు (మహానీచుడు) హిరణ్యకశిపుని భార్యను (లీలావతిని) కొంతదూరం లాక్కొని పోయాడు.

ఆ సమయములో నారదుడు అటువైపు రావడం తటస్థించింది. దేవేంద్రుడు ఎంత నీచుడో నారదునికి తెలుసు. సహజంగా నారదునికి ఆడవారిమీద భక్తిభావం ఎక్కువ. నారదుణ్ణి చూచి గతుక్కుమన్నాడు దేవేంద్రుడు. అప్పుడు నారదుడు దేవేంద్రునికిలా చెప్పాడు. "ఈమె పతివ్రత. ఏ అపరాధమూ ఎరగనిది. ఈమెను అవమానించకు వదిలిపెట్టు."

దేవేంద్రుడు కొంచెం ఆలోచించి ఆమె పొట్టను చూచి "విడిచిపెట్టను. నా శత్రువు మరొకడు ఈమె గర్భములో పెరుగుతున్నాడు'' అన్నాడు.

దేవేంద్రుడు లీలావతిని ఏ ఉద్దేశముతో లాక్కొని పోతున్నాడో నారదునికి తెలుసు. "దేవరాజా! మీరీమెను ఏ ఉద్దేశముతో లాక్కు పోతున్నారో నేను కూడా తెలుసుకున్నాను. ఈమెకు పుట్టిన కుమారుణ్ణి విష్ణు భక్తునిగా తయారుచేసే బాధ్యతనాది. నీవీమెను విడిచిపెట్టు" అన్నాడు.

దేవేంద్రుడు లీలావతిని విడిచిపెట్టక తప్పలేదు.

నారదుడు లీలావతిని తన ఆశ్రమానికి తీసుకవెళ్లి శ్రీహరి కథలు వినిపించాడు.

తర్వాత హిరణ్యకశిపుడు భార్యను తన అంతఃపురానికి రప్పించు కున్నాడు.

తన భార్యను బలత్కారంగా లాక్కొని వెళ్లిన దేవేంద్రుని మీద పగ సాధించాలని హిరణ్యకశిపునికి పట్టుదల కలిగింది. (కవిగారూ! మీ భార్యను ఎవరైనా దుర్మార్గుడు ఎత్తుకపోతే మీకు కోపం రాదా? హిరణ్యకశిపునికి కూడా దేవేంద్రుని మీద కోపం రావడంలో తప్పేముంది? దేవతల పక్షం చేరి మీరు హిరణ్యకశిపుణ్ణి మహానీచునిగా చిత్రించారెందుకు? దేవేంద్రుడు ఎంత నీచుడైనా దేవతల రాజు కనుక గొప్పవాడని సమర్థించారు మీరు. మీకీ పక్షపాత బుద్ధి తగదు. పక్షపాత బుద్ధితో సాహిత్యసృష్టి చేయడం మానుకోండి. అయినా వ్యాసుడు చెప్పాడు కదా! మరి నేనెవరికి చెప్పినాను.)

హిరణ్యకశిపుడు మూడు లోకాలు జయించాడు. త్రిమూర్తులు తప్ప మిగిలిన యావన్మందీ అతనికి కానుకలు తెచ్చి యిచ్చేవారు, సేవలు చేసేవారు. గంధర్వులూ, కింపురుషులు, విద్యాధరులు, అప్సరసలు అతణ్ణిస్తుతించేవాళ్లు. సాగు చెయ్యకుండానే పంట పండేది భూమి. అతడు ఏది కావాలంటే అది అందిచ్చేది అంతరిక్షం. (హిరణ్యకశిపుడు మహాసామ్రాజ్యాధిపతి అయిన తర్వాత ఋషులు మొదలగువారు హిరణ్యకశిపుణ్ణి పొగడి బహుమతులందుకొని పొట్ట గడుపుకొనేవారు. సాగు చెయ్యకుండా భూమి పంట నివ్వడం, అడిగినది అంతరిక్షం ఇవ్వడం అసంభవం. తీరని కోరికలు ఇవి. తీరని కోరికలను కథలు వ్రాయడంలోనూ, చదవడంలోనూ తీర్చుకునేవారు రచయితలు, పాఠకులు.)

దేవతలు శ్రీవారిని వేడుకున్నారు (చవట దద్దమ్మలు)

శ్రీహరి దేవతలకిలా చెప్పాడు "దేవతలారా! మిమ్మల్నీ, బ్రాహ్మణులనూ, వేదాలనూ, నన్నూ ద్వేషించినవాళ్లు త్వరలోనే నాశనమైపోతారు. (దోపిడీదారులను ద్వేషించిన వారిని శ్రీహరి రక్షిస్తాడన్న మాట.) బ్రహ్మ ఇచ్చిన వరాల రహస్యం తెలుసుకున్నాను. హిరణ్యకశిపుడు కొడుకు మీద పగ బట్టడానికి నేనొక పథకం వేశాను. ప్రహ్లాదుని ద్వారా వాని మీద పగ సాధిస్తాను. కారణం లేకుండా హిరణ్యకశిపుణ్ణి చంపేస్తే లోకులకు మన మీద దురభిప్రాయం ఏర్పడుతుంది కదా! అందుకే సమయం కొఱకు వేచి చూస్తున్నాను. వాణ్ణి చీల్చిపారేసే రోజు త్వరలోనే వస్తుంది"

శ్రీహరి మాటలు విన్న దేవతలు సంతృప్తిపడి వెళ్లిపోయారు.

హిరణ్యకశిపునికి నలుగురు కుమారులు. ప్రహ్లాదుడు చిన్నవాడు. అతనికి బ్రాహ్మణుల మీద భక్తిఎక్కువ. పెద్దలకు సేవకునివలె తల వంచి నమస్కరించేవాడు. (ప్రహ్లాదునికి బ్రాహ్మణుల మీద భక్తిభావం వుంది కనుక అతడు మంచివాడని కవిగారు పొగిడారు.)

ప్రహ్లాదుడు కృష్ణ విగ్రహం పట్టుకొని తిరిగేవాడు. అప్పు

డప్పుడు అకస్మాత్తుగా ఏడ్చేవాడు. ఉత్తర క్షణం నవ్వేవాడు. పాటలు పాడేవాడు, కేకలు వేసేవాడు, నాట్యం చేసేవాడు.

ప్రహ్లాదుడు పిచ్చి పనులు చేయడం వలన హిరణ్యకశిపునికి అతని మీద కోపం ఏర్పడింది.

భగవంతుడైన శుక్రాచార్యుని కుమారలు చండుడూ, అమ ర్కులు హిరణ్యకశిపుని దగ్గఱ వుండి ప్రహ్లాదునికి చదువు చెప్తుండే వారు.

ఒకనాడు హిరణ్యకశిపుడు ప్రహ్లాదుణ్ణి ఏదైనా చదివి విని పించుమని కోరాడు.

"అందరూ అడవికి పోయి శ్రీహరి శరణువేడడమే క్షేమమని నా అభిప్రాయం" అన్నాడు పిచ్చి ప్రహ్లాదుడు.

ప్రహ్లాదుని పిచ్చి తగ్గలేదని హిరణ్యకశిపునికి తెలిసిపోయింది. బాధతో నిట్టూర్పు విడిచాడు. ప్రహ్లాదుని మీద కోపం కూడా వచ్చింది.

"ఒరే ప్రహ్లాదా! శ్రీహరి మహానీచుడురా. వాడు దోపిడీ దారులకు సహాయం చేస్తాడు. వానిది కపటబుద్ధి. దోపిడీ నీతులు చెప్పే బ్రాహ్మణులన్నా, ఋషులన్నా, దేవతలన్నా వానికి యిష్టం బాబూ!" అయినా నీకీ పిచ్చి మాటలు ఎవరు నేర్పారురా! అన్నాడు హిరణ్యకశిపుడు బాధగా.

ప్రహ్లాదుడు పిచ్చిగా నవ్వి "శ్రీహరి భక్తి తొమ్మిది రకాలు వానా!" అన్నాడు.

హిరణ్యకశిపుడు చండామార్కులవైపు తిరిగి కఠినంగా అన్నాడు "మీరు చెప్పిన చదువు ఇదేనా? మా శత్రువులకు లాలూచీ అయిపోయిన దుర్మార్గులు మీరు. మిత్రుల వేషంలోవున్న శత్రువులు మీరు. ఆ దోపిడీ వెధవలు నామీద పగ సాధించడానికి మీకు లంచం యిచ్చారని నా అనుమానం. అందుకే మీరు నా కుమారునికి దోపిడీ సాహిత్యం మీద, దోపిడీదారులమీద సదభిప్రాయం కలిగింప జేశారు. చెప్పండి, నా అనుమానం నిజమేనా? కాదా?

చండామార్కులు గడగడలాడి పోతున్నారు. "అయ్యా! మీరు అనుమతిస్తే నిజం చెప్పేస్తాం."

"ఊఁ! చెప్పండి."

"మా విద్యాలయానికి దగ్గఱలోనే శ్రీహరి భక్తులవి అదే బ్రాహ్మణులవి, ఋషులవి, దేవతలవి ఇండ్లున్నాయి. వాళ్లు మా పాఠశాల ముందు నుండే నదికి వెళ్తుంటారు. మేము విద్యార్థులకు చెప్తున్న విద్య విప్లవవిద్య అని వాళ్లు ఎలా గ్రహించారో గ్రహించారు. వాళ్ళు విద్యార్థులను ఆకర్షించడానికి, పాఠశాల విశ్రాంతి సమయములో, పాఠశాల ముందు పండ్లు పంచిపెట్టడం ప్రారంభించారు విద్యార్థులు పండ్లమీద ఆశతో వాళ్ల దగ్గఱకు వెళ్లేవారు ఆ సమయములోనే దోపిడీ సాహిత్యాన్ని మన పాఠశాల విద్యార్థులకు బోధించేవారు."

"అయితే మీరు చవట దద్దమ్మల్లాగా చూస్తూ వూరుకున్నారా?" హిరణ్యకశిపుడు కోపంతో అన్నాడు.

"అయ్యా! చాలారోజుల తర్వాత మాకీ విషయం తెలిసింది. ఓనాడు ప్రహ్లాదుడు శ్రీహరిమీద పద్యం చదువుతూ చాలా ఆలస్యంగా వచ్చాడు. మాకు ప్రహ్లాదుని మీద చాలా కోపం వచ్చింది. ఎక్కడికి వెళ్ళావని గద్దించి అడిగాము అప్పుడు ప్రహ్లాదుడు పిచ్చిగా నవ్వుతూ శ్రీహరి మీద ఇంకో పద్యం చదివాడు. మాకు మరింత కోపం వచ్చి "ఎవరు నేర్పారు నీకీ పద్యం" అన్నాము "తల్లి కడుపులో వుండగానే నేర్చుకున్నాను" అన్నాడు ప్రహ్లాదుడు.

బ్రాహ్మణులు, ఋషులు, దేవతలు కలసి మన ప్రహ్లాదునికి చాలా యుక్తిగా అనేక మాటలు నేర్పారు. వాళ్ళ దగ్గఱవున్న దోపిడీ సాహిత్యంలోని నీతులన్నీ మన ప్రహ్లాదునికి నేర్పారు. ప్రహ్లాదునికిపిచ్చి చదువును నేర్పడానికి ఆ దొంగ నారదుడు కూడా ప్రముఖ పాత్ర వహించాడన్న రహస్యాన్ని కూడా తెలుసుకున్నాము. మేము ఎన్ని ప్రయత్నాలు చేసినా ప్రహ్లాదునికి సైన్సు, లెక్కలు, సాంఘిక శాస్త్రము నేర్పలేక పోయాము. ఆ

దోపిడీసాహిత్య పిచ్చిలో పడి నిజంగానే ప్రహ్లాదునికి పిచ్చి లేచి నట్టుంది.

ప్రహ్లాదుడు పిచ్చిగా నవ్వుతూ శ్రీహరి మీద మరో పద్యం చదివాడు. హిరణ్యకశిపుడు కోపంతో గర్జించాడు. సైనికులను పిలిచి "ఈ పిచ్చి వెధవను చంపెయ్యండి. నా తమ్ముణ్ణి చంపిన దుర్మార్గుని పాదాలు పూజిస్తున్న చవటవీడు. ఆత్మాభిమానం లేని వెధవ వీడు. దాస్యబుద్ధి కల చచ్చువెధవ వీడు. ఈ పిరికి వెధవను, పిచ్చివెధవను తొందరగా చంపెయ్యండి" అన్నాడు.

సైనికులు చేతులు పిసుక్కుంటూ నిలబడ్డారు

"ఆలోచిస్తారెందుకు? ఎలా చంపాలని ఆలోచిస్తున్నారా ఏమిటి? విషం త్రాగించి చంపండి. లేకపోతే కొండమీదినుండి పడద్రోయండి, అగ్గిలో పడవేయండి, విషసర్పాలచేత కరిపించండి, మంచులో పాతి పెట్టండి. ఎలా తొందరగా చస్తే అలా చంపండి" అనిచెప్పి హిరణ్యకశిపుడు లోనికి వెళ్ళిపోయాడు.

సైనికులు ప్రహ్లాదుణ్ణి పట్టుకొని పోయారు. రాజు కోపంతో ప్రహ్లాదుణ్ని చంపమని చెప్పాడేకాని ప్రహ్లాదుణ్ని చంపివేస్తే అతడెంత బాధపడుతాడో సైనికులకు తెలుసు అందుకే వాళ్లు ప్రహ్లాదుణ్ణి ఒక గదిలో బంధించి మరునాడు రాజు దగ్గఱకు వచ్చారు.

ప్రహ్లాదుణ్ణి తలచుకొని ఏడుస్తున్న హిరణ్యకశిపుడు సైనికులను చూచి "అయ్యో నా కుమారుణ్ని చంపేశారా? కోపములో ఇవ్వకూడని ఆజ్ఞ ఇచ్చాను మీకు" అన్నాడు.

"ప్రభూ! ప్రహ్లాదుణ్ని చంపివేస్తే కోపం తగ్గిన తర్వాత మీరు బాధ పడుతారని మాకు తెలుసు అందుకే ప్రహ్లాదుణ్ని చంపలేదు. కోపముతో మీరిచ్చిన ఆజ్ఞను పాటించని మమ్ములను క్షమించండి" అన్నారు.

సైనికుల మాట వినగానే హిరణ్యకశిపుని ముఖం కళకళ లాడింది. "ఎక్కడున్నాడు నా చిట్టితండ్రి. తొందరగా నా దగ్గఱకు

తీసుకరండి"

హిరణ్యకశిపుడు సంతోషం పట్టలేక గంతులు వేశాడు. అంతః పుర పరిచారికలు రాజు ఎదుట నవ్వునాపుకొని చాటుకు వెళ్లి నవ్వు కున్నారు.

సైనికులు ప్రహ్లాదుణ్ని తీసుకవచ్చారు. హిరణ్యకశిపుడు అతనిని దగ్గరకు తీసుకొని ముద్దాడాడు. అప్పుడే చండామార్కులు హిరణ్యకశిపుని దగ్గరకు వచ్చారు.

ప్రహ్లాదుడు తల్లి దగ్గఱకు వెళ్ళిపోయాడు. తర్వాత చండామార్కులు హిరణ్యకశిపునికిలా చెప్పారు: "ప్రభూ! విచారించకండి. ప్రహ్లాదుడు చెడు సహవాసం చేసి చెడిపోయాడు. కాస్త మతి భ్రమణం కూడా జరిగినట్టుంది. రాజవైద్యులకు చూపించండి. మా తండ్రి శుక్రాచార్యుడు వచ్చిన తర్వాత అతనిచేత ప్రహ్లాదునికి విద్య చెప్పించండి. అంతవరకు మేము చేసే ప్రయత్నం చేస్తూనే వుంటాము.

హిరణ్యకశిపుడు కొంత సంతోషించాడు.

ఆనాడే దేశములో తిరుగుబాట్లు జరుగుచున్నాయని హిరణ్యకశిపునికి తెలిసింది.

రాజ్యాలు పోగొట్టుకున్న క్షత్రియులు తిరిగి రాజ్యాలు సంపాదించడానికి ప్రయత్నాలు చేస్తున్నారు. యజ్ఞాలు ఆగిపోవడంతో పని చేయనిదే పొట్ట గడవని పరిస్థితి వచ్చింది బ్రాహ్మణులకు. కష్టపడి పనిచేయడం వారికి బాధగా తోచింది. ఎలాగైనా హిరణ్యకశిపుణ్ని చంపివేసి పూర్వ రాజులను గద్దెలపైనెక్కిస్తే తప్ప తాము సుఖపడడానికి అవకాశముండదని గ్రహించారు. రాజులు, బ్రాహ్మణులు రహస్యంగా సభలు సమావేశాలు ప్రారంభించారు. హిరణ్యకశిపుడు మహానీచుడని, తిరుగుబాటు చేయండని ప్రజలకు బోధించసాగారు. ఈ విషయం చారుల వలన హిరణ్యకశిపునికి తెలిసింది. ఆనాటి నుండి హిరణ్యకశిపుడు మారువేషములో తిరగడం ప్రారంభించారు.

బ్రాహ్మణులు, క్షత్రియులు కలసి ఏర్పాటు చేసిన ఒక సభకు

హిరణ్యాకశిపుడు మారువేషంలో హాజరయ్యాడు. ఆ సభలో ప్రసంగించినవారు హిరణ్యాకశిపుడు చాలా దుర్మార్గుడని, యజ్ఞాలు ఆపివేశాడనీ, యజ్ఞాలు చేయకపోతే దేవతలు సంతోషపడరనీ, వర్షాలు కురువవనీ, పంటలు పండవనీ,కరువుకాటకాలతో ప్రజలు చస్తారని చెప్పారు. యజ్ఞాలుచేసి బ్రాహ్మణులకు, మునులకు దానాలు ఇస్తే వర్షాలు సక్రమంగా కురుస్తాయన్నీ, పంటలు సమృద్ధిగా పండుతాయనీ ప్రజలు సుఖసంతోషాలతో వర్ధిల్లుతారనీ చెప్పారు.

సభకు హాజరైన నలుగురైదుగురు విప్లవ భావాలు కల యువకులు గుసగుసలాడడం ప్రారంభించారు.

"హిరణ్యాకశిపుడు యజ్ఞాలు చేయవద్దని ఆజ్ఞాపించిన వెంటనే యజ్ఞాలు ఆగిపోయాయి. అయినా వర్షాలు కురుస్తూనే వున్నాయి కదా!"

"యజ్ఞాలు చేస్తే వర్షాలు పడుతాయని వాళ్లు చెప్తారుగానీ యజ్ఞాలు చేయడానికి వర్షాలు పడడానికి ఏమైనా సంబంధం వుందా?"

"హిరణ్యాకశిపుడు దుర్మార్గుడంటున్నారు వీళ్లు. ఇంతకు పూర్వం పరిపాలించిన రాజుల మాటో. వాళ్లు మాత్రం తక్కువ దుర్మార్గులా!"

"ఆఁ! ఎవడైనాఅంతే.......పదవులు పోగొట్టుకున్నవాళ్ళు కొత్తగా పదవులలోకి వచ్చిన వారిని తిట్టడం మామూలే కదా!.,.... ఎవడు రాజ్యానికి వచ్చినా మనమిలా కష్టపడి పని చేయవలసిందే, ఆ రాజుకు పన్నులు ఇవ్వవలసిందే, మన జీవితంలో వచ్చే మార్పేమీ లేదు......సింహాసనం మీద కూర్చున్న రాజుకు, అతణ్ణి ఆశ్రయించి యున్న అధికారులకు, అతణ్ణి పొగిడే బ్రాహ్మణులకు ఎన్నో సుఖాలు అనుభవించడానికి అవకాశం వుంది.....హిరణ్యాకశిపుని రాజ్యములో వీళ్ళు సుఖపడడానికి అవకాశంలేదు. కనుక వీళ్లు రాజు దుర్మార్గుడని ప్రచారం చేస్తున్నారు"

"ఈ ప్రజలలో చైతన్యం లేదు. ఏది చెప్పితే అదే నమ్మేస్తారు. ఈ దోపిడీవ్యవస్థ నాశనమై సమ సమాజం వచ్చేదెప్పుడో?"

"సమ సమాజం స్థాపించాలంటే మనలాంటి యువకులే పూనుకోవాలి"

"మనం నలుగురైదుగురం పూనుకుంటే అది సాధ్యమయ్యే పనా? రాజు గారు పూనుకుంటేనే అది సాధ్యపడాలి".

"హిరణ్యకశిపుల వారు సమసమాజం కొరకు పాటుబడుతారంటావా?

"హిరణ్యకశిపుని లాంటి వాళ్ళు కూడా తమ క్షేమమే చూచుకుంటారు కానీ సమ సమాజం కొరకు పాటుపడుతారన్న మాట కల్ల. సమ సమాజం వస్తే వాళ్ళ సుఖాలన్నీ నాశనమైపోవూ?"

"సమ సమాజం రావాలంటే ప్రజలల్లోనే చైతన్యం రావాలి"

"మన ప్రజలలో చైతన్యమా?.........వాళ్ళు బసవన్నలు, గొర్రెలు, గాడిదలు......వాళ్ళు రాళ్లను రప్పలను చెట్లను పుట్టలను పూజిస్తారు. అంతేకాని దోపిడి ఎక్కడ ఎలా జరుగుతుందో గ్రహించడానికి ప్రయత్నం చెయ్యరు."

"మన సమాజంలో ప్రచారంలో వున్న నీతులు వాళ్ళలో చైతన్యం కలుగకుండా అడ్డు పడుతున్నాయి."

"రాజుగారి గూఢచారులు ఇలాంటి సభలలో రహస్యంగా తిరుగుతున్నారని తెలిసింది. మనం కాస్త మాట్లాడకుండా వుంటేనే బాగుంటుంది. మనలాంటి విప్లవకారులను రాజు బ్రతకనిస్తాడా?"

ఆ యువకులు సంభాషణ ఆపి బ్రాహ్మణుడు చెప్తున్న కథ వినడంలో నిమగ్నులయ్యారు.

మరునాడు హిరణ్యకశిపుడు రాజ్యములో సభలు, సమావేశాలు జరుగకూడదని ఆజ్ఞాపించాడు.

బ్రాహ్మణులు, క్షత్రియులు నారదుని ద్వారా శ్రీహరికి వార్తపంపారు. శ్రీహరి వారి దగ్గరకు వచ్చాడు. రహస్య సమావేశం జరిగింది. హిరణ్యకశిపుణ్ణి ఎలా యుద్ధములోకి దింపాలో, ఎలా చంపివెయ్యాలో నిర్ణయించుకున్నారు.

నారదుడు చెప్పినట్లు ప్రహ్లాదుడొకనాడు మిత్రులను ప్రోగుచేసి

శ్రీహరి విగ్రహమును పూజించాడు. తర్వాత మిత్రులకు శ్రీహరి సంధిగా అనిర్మించి తన పిన తండ్రిని చంపిన ఘట్టాన్ని కథగా చెప్తున్నాడు.

హిరణ్యకశిపుడు ఆ రోజు సాయంత్రము అనేక గ్రామాలు తిరిగి అలసిపోయి వచ్చాడు.

"వేదాలు చదువ కూడదనీ, యజ్ఞాలు చేయకూడదనీ ప్రజలకు బోధించాడు. వేదాలలో దోపిడీ నీతులున్నాయనీ! యజ్ఞాలు చేసే సందర్భములో అగ్నిల్లో నెయ్యి నూనె ఆహార ధాన్యాలు వేసి కాల్చివేస్తే రాజ్యములో ప్రజలకు, ఆహార పదార్థాలు సరిపోవని చెప్పాడు." ఇలా నాలుగైదు గ్రామాలల్లో ఉపన్యసించడం వలన చాలా అలసిపోయాడు.

ప్రహ్లాదుడు మిత్రులకు చెప్తున్న కథ "హిరణ్యాక్షవధ" విని హిరణ్యకశిపుడు అగ్గిమీద గుగ్గిలం లాగ భగ్గుమన్నాడు.

"దుష్టుడా! తండ్రి ఆజ్ఞను తిరస్కరించావు రాజు ఆజ్ఞను ధిక్కరించావు. రాజ్య క్షేమం కోసం నేను చేసిన చట్టాలను ఉల్లంఘించావు. దోపిడీ దారులకు సహాయపడుతున్న ఆ వెధవ శ్రీహరిని పొగడుతున్నావు సిగ్గులేదూ?"

"నాన్నగారూ!-మీరు అసుర స్వభావం విడిచిపెట్టండి."

"దోపిడీ దారులకు సహాయపడే ఆ నీచ శ్రీహరిని తిట్టడం అసుర స్వభావమా? రాజ్యద్రోహివి, రాజద్రోహివైన నిన్ను తిట్టడం అసుర స్వభావమా? శత్రువులెవరో? మిత్రులెవరో తెలుసుకోలేని బుద్ధిహీనుడవు నువ్వు. గతములో నీవెన్ని తప్పులు చేసినా పసివాడవని వూరుకున్నాను కొడుకువని, కనికరించాను. నిన్నిప్పుడు క్షమించను. క్షమించలేను నా తమ్ముణ్ణి చంపిన శ్రీహరి దుష్టుడు. నీచుడు......"

"నాన్నా! నా ముందు శ్రీహరిని తిట్టడం నేను సహించను"

"ఒరేయి వెధవా నీ తల తెగనరుకుతాను. నువ్వు ఎవని మీద ఇంత ధీమా పెట్టుకొని కూస్తున్నావో వాడు నిన్ను ఎలా రక్షిస్తాడో?

చూస్తాను" అని చంద్రునకత్తి దూశాడు.

ప్రహ్లాదుడు పరుగెత్తి ఓ స్తంభము వెనుక దాక్కున్నాడు హిరణ్యాకశిపుడు ఆ స్తంభము దగ్గఱకు రాగానే ప్రహ్లాదుడు మరొక స్తంభం వెనుకకు వెళ్ళాడు. అక్కడ ఎవరో ప్రహ్లాదుణ్ణి రక్షించే తన శత్రు పక్షం వాడున్నాడని గ్రహించాడు హిరణ్యాకశిపుడు. రివ్వునవెళ్ళి చేతిలోవున్న గదతో శక్తినంతా ఉపయోగించి స్తంభాన్ని కొట్టాడు. స్తంభం విరిగి పోయింది. అంతవరకు దానివెనుక దాక్కొని వున్న సింహం, తలకాయవాడు అకస్మాత్తుగా ముందుకు వచ్చి హిరణ్యాకశిపుని చేతిలోనున్న గదను ఎగురగొట్టాడు. హిరణ్యాకశిపుణ్ణి రెండు చేతులతో గట్టిగా పట్టుకున్నాడు. చేతికి కత్తుల్లాటి గోళ్ళు న్నాయి. అకస్మాత్తుగా కనిపించిన ఆ వికార స్వరూపాణ్ణి చూచి హిరణ్యాకశిపుడు బిత్తరపోయాడు. నరసింహుడు హిరణ్యాకశిపుణ్ణి పడగొట్టాడు. హిరణ్యాకశిపుడు మరుక్షణమే నరసింహమును పడ గొట్టాడు. ఇరువురు చాలా సేపు పోట్లాడారు హిరణ్యాకశిపుడు అలసి పోయివున్నప్పటికీ నరసింహుడిని చంపాలన్న ఉద్దేశముతో ఉత్సా హంగా యుద్ధం చేస్తున్నాడు నరసింహుడు హిరణ్యాకశిపుని చేతిలో చస్తాడేమోనని దేవతలు భయపడ్డారు. తమ స్వర్గం లాక్కున్న హిర ణ్యాకశిపుడు గెలిస్తే తమ పొట్లు కుక్కలకైనా వుండవని వారి భయం హిరణ్యాకశిపుడు, నరసింహుడు కొట్లాడుతూ కొట్లాడుతూ సభా భవన ద్వారం దగ్గఱకు వెళ్ళారు. హిరణ్యాకశిపుని శరీరం నుండి చెమటలు కారుతున్నాయి అతడు పూర్తిగా అలసి పోయి శక్తిహీనుడయ్యాడు. తల తిరిగినట్టయి కూలబడిపోయాడు. అదే అనుకొని నరసింహుడు హిరణ్యాకశిపుణ్ని లేవనెత్తి తొడల మీద పెట్టుకొని కత్తుల్లాంటి గోళ్ళతో హిరణ్యాకశిపుని కడుపు చీల్చి పారేశాడు.

హిరణ్యాకశిపుడు చనిపోయాడన్న వార్తవిని బ్రాహ్మణులు, దేవతలు చాలా సంతోష పడ్డారు.

ప్రహ్లాదుడు పావుగంట సేపు నరసింహుణ్ని పొగిడాడు.

నరసింహుడు సంతోషించి 'ఏం వరం కావాలి ప్రహ్లాదా!' అని అడిగాడు.

"నిన్ను సంతోషపరచి వరమడగడమంటే వ్యాపారం చెయ్యడమన్నమాట. వరాలు ఆశపెట్టి నన్ను లోభంలో పడదోయకు ప్రభూ!" అన్నాడు ప్రహ్లాదుడు. (ఇలా అన్న ప్రహ్లాదుడు తర్వాత ఏం చేశాడో చూడండి.)

"వత్సా! నీ తండ్రి సింహాసనం అలంకరించు. నీ తండ్రికి శ్రాద్ధ కర్మ మాత్రం చెయ్యి. అతడు ఉత్తమ గతులు పొందుతాడు. (నరసింహుడు బ్రాహ్మణ పక్షపాతి కనుకనే శ్రాద్ధ కర్మలు చెయ్యమని ప్రోత్సహిస్తున్నాడు. శ్రాద్ధ కర్మలు చేసినప్పుడు బ్రాహ్మణులకు ధనధాన్యాలు దొరుకుతాయి కదా! అందుకే ఈ ప్రోత్సాహం. శ్రాద్ధ కర్మలు చేస్తే ఉత్తమ గతులు దొరుకుతాయని, శ్రాద్ధ కర్మలు చేయండని ప్రోత్సహిస్తున్నాడు. నాకు స్వర్గ నరకాల మీద నమ్మకం లేదు. స్వర్గనరకాల మీద నమ్మకమున్నవారు నా ఈ ప్రశ్నకు సమాధాన మివ్వండి. పుణ్యం చేసుకున్నవాడు స్వర్గానికి, పాపం చేసుకున్నవాడు నరకానికి పోతాడు కదా! ఇక కొడుకు శ్రాద్ధకర్మ చేస్తే పాపాలు చేసి చచ్చిన తండ్రికి స్వర్గమెలా దొరుకుతుంది?

ఇది దోపిడీ విధానాన్ని ప్రోత్సహించడమే. ఈ విషయాలు చదివి అనేక మంది పాపంవైపు మొగ్గడానికి వీలుంది. ఎలాగంటారా?

ఉదాహరణకు:— ఒక తండ్రి ఎంతో మందిని కష్టపెట్టి, హింసించి, చంపి డబ్బు సంపాదించాడు. చచ్చిన తర్వాత నాకు శ్రాద్ధకర్మలు చెయ్యమని కొడుకుకు చెప్పాడు తండ్రి. కొడుకు ఒప్పుకున్నాడు. తండ్రి చచ్చి నరకం పోయాడు. అప్పుడు తండ్రి సంపాదించిన డబ్బు నుండి కొంత శ్రాద్ధ కర్మల పేరిట బ్రాహ్మణులకు పంచి పెట్టాడు కొడుకు. అప్పుడు నరకంలో వున్న తండ్రి స్వర్గం చేరాడు. (కవిగారి మాట ననుసరించే) 'పాపం చేసైనా డబ్బు సంపాదించి బ్రాహ్మణుల కివ్వండి, మీకు పుణ్యం వస్తుంది. స్వర్గం వెళ్తారు. అని చెప్పడమన్నమాట. శ్రాద్ధాలు పెట్టడం వలన ఎవరికీ లాభం

వుండదు. ఒక్క బ్రాహ్మణులకు తప్ప. అందుకే వారు శ్రాద్ధాలు చేయండని ప్రోత్సహిస్తారు. శ్రాద్ధకర్మలలో నున్న దోపిడీ విధానాన్ని గ్రహించి అందరూ శ్రాద్ధాలు పెట్టడం మానుకోవాలి. నీతులు దోపిడీ విధానానికి ఎంత మాత్రం విలు కలిగించకూడదు.)

భగవంతుడు ఆదేశించిన ప్రకారం, బ్రాహ్మణుల మతానుసారంగా పట్టాభిషేకం చేసుకున్నాడు ప్రహ్లాదుడు. (సర్వజనుల మతానుసారంగా అని కవిగారు వ్రాస్తే బాగుండేది. బ్రాహ్మణాధిక్యతను ప్రచారం చేయడమే కవిగారి వుద్దేశం కనుక అలా వ్రాయలేదు. నా హృదయంలో ఎన్నడూ ఏ కోరికా మొలకెత్తకుండా వరమియ్యమని కోరిన ప్రహ్లాదుడు అనేక కోరికలతో సింహాసన మెక్కాడు. ప్రహ్లాదుని కపటబుద్ధి పాఠకులు గ్రహించాలి.) దేవతలందరూ సింహాసనం మీద కూర్చున్న ప్రహ్లాదుణ్ణి ప్రశంసించారు. (తమ కనుకూలంగా రాజ్యపాలన చేస్తాడన్న వుద్దేశం వుండడం వలన రాక్షసరాజును దేవతలు ప్రశంసించారు.

శత్రుభావంతో శ్రీహరిని తలచుకొని రాక్షస రాజులు అతని సాయుజ్యం పొందారు. (రేగులపాటి కిషన్‌రావూ! నువ్వు శ్రీహరిని తిడుతున్నావు. మరి నువ్వు కూడా ఆ కల్ల శ్రీహరి దగ్గరకే వెళ్తావామిటి?)

పూర్వం ఒకసారి విష్ణుదేవుని బలంతో అసురులందరినీ ఓడగొట్టారు దేవతలు. (అకారణంగా) అప్పుడు అసురులందరూ మయదానవుణ్ణి ఆశ్రయించారు. మయుడు తన కౌశలమంతా వినియోగించి 3 పట్నాలు నిర్మించాడు. ఒకటి బంగారు పట్నం, ఒకటి వెండిపట్నం, ఒకటి ఇనుప పట్నం వీటినే త్రిపురాలు అంటారు. ఆ త్రిపురాలు ఎప్పుడు ఎక్కడికి పోతాయో ఎవరికీ తెలిసేదికాదు. ఆ పట్నాలలో నివసిస్తూ రహస్యంగా దేవతల మీద దెబ్బతీసేవాళ్లు అసురులు.

దేవతలు శివుణ్ణి ఆశ్రయించారు. శివుడు తన ధనుస్సు పినాకం ఎక్కుపెట్టి బాణం వదిలాడు. ఆ బాణం నుండి మంటలు బయలుదేరాయి. మూడు పట్నాలు కనబడకుండా అయిపోయాయి. అసురు

లందరూ చచ్చిపోయారు.

మయుడు చచ్చిన అసురులను తీసుకపోయి అమృతపు బావుల్లో పడేశాడు. వాళ్ళు బ్రతికి బయటకు వచ్చారు.

విష్ణువు గంగిగోవు రూపం ధరించాడు, బ్రహ్మ దూడగా మారాడు ఉభయులు అమృతపు బావుల్లోని అమృతం అంతా తాగేశారు. విష్ణువు ఇచ్చిన యుద్ధసామగ్రిని తీసుకొని యుద్ధానికి సిద్ధపడ్డాడు శివుడు మూడు పట్నాలను కాల్చివేశాడు. త్రిపురాలు భస్మం చేసి శివుడు త్రిపురారి అయ్యాడు. దేవతలు శివుణ్ని స్తోత్రం చేశారు. దేవతలు చేసిన నీచ కార్యం మరిచిపోయి కైలాసం వెళ్ళాడు శివుడు.

(దేవతలకు అక్రమ లాభం చేకూర్చడం కోసం అసురులను ఓడించడం విష్ణుదేవుని మొదటి తప్పు. మహా బలవంతుడు, అద్భుత కళాకారుడు మయుడు. అతని సహాయంతో అసురులు దేవతల మీద పగ తీర్చుకున్నారు. శివుడు త్రిపురాలలో నివసిస్తున్న అసురులను చంపడం శివుని తప్పు. బ్రహ్మ, విష్ణువు రూపాలు మార్చుకొని అసురులను మోసం చేశారు అదొకతప్పు. శివుడు త్రిపురాలు కాల్చివేయడం ఇంకొకతప్పు. ఇతరుల కొంపలు కాల్చే వారినేమనాలి? వీనికి పూజలు చేయడం ఆపి వెయ్యవలసిందే.

కవిగారికి వైష్ణవ మతంపైన అభిమానమెక్కువగా వున్నట్టుంది అందుకే విష్ణువు శివుని కంటే గొప్పవాడని ఈ కథలో రుజువు చేశాడు. విష్ణువు, శివుడు, బ్రహ్మ ముగ్గురూ దేవతలకు అక్రమలాభం కలిగించారు. అసురులను నిర్దాక్షిణ్యంగా అణచి వేశారు.)

మానవ ధర్మాలు.

వేదము చదువుట, వేదము చదివించుట, యజ్ఞము చేయుట, యజ్ఞము చేయించుట, దానము పుచ్చుకొనుట మొదలగునవి బ్రాహ్మణ ధర్మములు.

చదువు కొనుట, యజ్ఞాలు చేయుట, బ్రాహ్మణుల దగ్గఱ తప్ప తక్కిన వాళ్ళ దగ్గఱ పన్ను పుచ్చుకొనుట రాజధర్మం.

వ్యవసాయము, వర్తకము, బ్రాహ్మణులు చెప్పినట్లు వినుట వైశ్య ధర్మము.

బ్రాహ్మణులకు, రాజులకు, కోమట్లకు సేవ చేయుట శూద్రుల ధర్మము.

(ఈ ధర్మాలలో బ్రాహ్మణులు మూడు వర్ణాల వారిని దోపిడీ చేస్తూ కూర్చుండి తింటూ సుఖపడుతారు. చివరికి పన్నులు కూడా కట్టరు.

రాజులు పరిపాలన చేస్తూ తాము దోపిడీ చేయడానికి అవకాశాలు కల్పించుకొంటూ, తాము సుఖపడుతూ బ్రాహ్మణులను సుఖపెడుతారు.

కోమట్లు వ్యవసాయాన్ని, వర్తకాన్ని తమ చేతుల్లో వుంచుకొని శూద్రుల శ్రమశక్తిని దోచుకొంటూ, కొంతవాటా బ్రాహ్మణులకు కొంత వాటా రాజులకు, కానుకల రూపంగా, పన్నుల రూపంగా ఇస్తూ బ్రాహ్మణ, క్షత్రియులను సుఖపెడుతూ వారిని మెప్పిస్తూ తమ దోపిడీ విధానాన్ని కొనసాగిస్తూ సుఖపడుతారు.

బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య వర్ణాల వారి చేత అన్ని విధాలా భయంకరంగా దోపిడీ చేయబడుతారు శూద్రులు, ఈ ధర్మాల వలన నష్టపడే శూద్రులు ఈ ధర్మాలను ఎంత మాత్రం అంగీకరించ కూడదు.)

భర్తను సేవించడమూ, భర్తనియమాలు పాలించడమూ, భర్తనే దేవుడని భావించడమూ పతివ్రత ధర్మాలు. (ఈ నీతులన్నీ ఆడవారిని అణచి వేయడానికి చెప్పినవే. కవిగారు పురుష పక్షపాత బుద్ధితో వ్రాశారని మనం సులభంగానే గ్రహించవచ్చు.

"భార్యాభర్తలు పరస్పరం ప్రేమించుకోవాలి, గౌరవించుకోవాలి. ఒకరికొకరు సహాయం చేసుకోవాలి, ఉత్తమ గుణాలతో, ఉత్తమ అలవాట్లతో కలిసిమెలసి జీవించాలి" అని వ్రాస్తే బాగుంటుంది.)

ఆశ్రమ ధర్మాలు.

శిష్యులు సేవకుని లాగా గురువును సేవించాలి. భిక్షమడిగి తెచ్చి గురువుకు సమర్పించాలి. గురువు ఆజ్ఞాపించాక భోజనం చెయ్యాలి. ఆజ్ఞాపించకపోతే ఉపవాసమేవుండాలి. శక్తి వంచన లేకుండా గురువు కోరిన దక్షిణ సమర్పించాలి. (శిష్యులు గురువుగారిని గౌరవించాలి. గురువు శిష్యుణ్ణి ప్రేమించాలి. శిష్యులు భిక్షమెత్తుకొని బ్రతికే హీనస్థితికి దిగజార కూడదు. కష్టపడి పని చెయ్యాలి. ఆకలి వేసినప్పుడు భోజనం చెయ్యాలి. గురువుగారి ఆజ్ఞ లేకున్ననూ ఆకలి వేస్తే తినవలసిందే. గురువుగారు చెప్పిన విద్యకు ప్రతిఫలంగా తగిన గురుదక్షిణ ఇవ్వాలి.)

వానప్రస్థాశ్రమ నియమాలు.

తలమీద జడలు ధరించాలి. జుత్తూ, మీసాలూ, గడ్డాలూ, గోళ్లూ కత్తిరించకూడదు. శరీరం మీద మురికి కూడా శుభ్రపరచ కూడదు. (కవిగారు చెప్పిన ఈ నియమాలు పాటిస్తే మనిషిని అనేక రోగాలు ఆశ్రయిస్తాయి. ముఖ్యంగా గజ్జిరోగం అంటుకుంటుంది.)

యతిధర్మం.

సన్యాసి రహస్యాంగము కప్పడానికి గోచీ మాత్రం పెట్టుకోవాలి. గ్రంథాలు చదువకూడదు. ఉపన్యాసాలివ్వకూడదు. బ్రతుకు తెరువు కోసం ఏదీ అవలంభించకూడదు. (కవిగారు చెప్పింది పిచ్చి పిచ్చిగా వుంది. అయినా కవిగారు చెప్పినట్లు సన్యాసులీనాడు ప్రవర్తించుట లేదు. కష్టపడి పనిచేయకుండా అనేక సుఖాలు అనుభవించడానికి అనేక ఎత్తులు వేస్తున్నారు.)

హరిమేధ రుషి భార్య పేరు హారిణి. ఆమె గర్భములో 'హరి' అన్న పేరుతో అవతరించాడు భగవంతుడు.

పాల సముద్రములో త్రికూటం అనే పది ఆమడల ఘనపు టాకారములో బంగారు, వెండి, ఇనుప శిఖరాలు గల పర్వతం వుంది. ఈ పర్వతలోయలో వరుణదేవుని ఉద్యానవనముంది. దాని పేరు రుతు మంతం. దేవతాస్త్రీల క్రీడాస్థలమది.

రుతుమంతం మధ్య పెద్ద సరోవరముంది. తామరలు, కలువలు

విరుగ బూసి ఎంతో అందంగా వుంటుంది. రకరకాల నీటి పక్షులు సరస్సులో ఎగురుతాయి, ఈదుతాయి.

త్రికూట పర్వతం మీద ఒక ఏనుగు రాజు వుండేవాడు. అతనికి సింహాలు కూడా భయపడేవి. (ఆ ఏనుగును గొప్ప చేసే వుద్దేశముతో వ్రాసిన మాట ఇది.)

ఏనుగు రాజు వెంట అతని భార్యలు పెంటి ఏనుగులూ, పిల్లలూ, పరివారమూ మందగా వెళుతూ వుండేవి.

వేసవి కాలములో ఏనుగురాజు పరివారంతో ఋతుమంతంలోని వరుణ సరస్సు వద్దకు వచ్చాడు. సరస్సులో దిగాడు. నీళ్లు త్రాగాడు. తొండంతో నీళ్ళు తీసి పెంటి ఏనుగులకు, పిల్లలకు త్రాగించాడు, స్నానాలు చేయించాడు. సరోవరములో వున్న మొసలి వచ్చి ఏనుగు రాజు కాలు పట్టుకుంది. ఏనుగు రాజు, మొసలి హోరాహోరి పోరాడాయి వెయ్యి సంవత్సరాలు. (వెయ్యి సంవత్సరాలు, అని వ్రాయక పోతే కవిగారికి తృప్తి కలుగలేదేమో, వెయ్యి సంవత్సరాలు ఏనుగు ఏమీ తినకుండా, మొసలి ఏమీ తినకుండా ఎలా బ్రతికాయి. ఇది కవి గారిని అడుగవలసిన ప్రశ్న.)

ఏనుగు బలం, ఉత్సాహం తగ్గిపోయాయి. మొసలి శక్తి హెచ్చింది. (ఎలా కవిగారూ?)

'భగవంతునికి మృత్యువు కూడా భయపడుతాడు. కనుక ఆ భగవంతుణ్ణే ఆశ్రయిస్తాము; అని గజరాజు నిశ్చయించుకున్నాడు. వెనుక జన్మలో నేర్చుకున్న స్తోత్రం జపిస్తూ భగవంతుణ్ని ప్రార్థించాడు. (వెనుక జన్మలో నేర్చుకున్న స్తోత్రం కూడా జ్ఞాపకముంటుందా? రేగులపాటి కిషన్‌రావూ! నువ్వు వెనుకటి జన్మలో విప్లవ రచయితవా?, అభ్యుదయ రచయితవా?.........ఏమైనా జ్ఞాపకముందా నీకు?)

"నేను జీవించాలని కోరడం లేదు. ఈ ఏనుగు కళేబరంతో ప్రయోజనం లేదని భావిస్తున్నాను. ముక్తి పొందాలని కాంక్షిస్తున్నాను. (జీవించాలనే కోరిక లేకపోతే ఈ పడుపంతా దేనికి? ఏనుగు

లాట. దేనికి? మొసలితో యుద్ధం చేయుట యెందులకు?)

ఏనుగు రాజు మూర్తిభేదం లేకుండా భగవంతుణ్ణి స్తోత్రం చేశాడు, తమ నామ రూపాలు లేకపోవడం చేత బ్రహ్మ మొదలైన స్వార్థపరులు అతణ్ని రక్షించడానికి రాలేదు.

శ్రీహరి గరుత్మంతుని మీద కూర్చొని గజేంద్రుని దగ్గరకు వచ్చాడు. (శ్రీహరి ఎక్కగానే ఆ పక్షి చావలేదా? శ్రీహరికి కూడా నడవడమంటే కష్టమేనా ఏమిటి? శ్రీహరి ఉపాయశాలిలాగే వున్నాడు. పెట్రోలు ఖర్చు లేకుండా పక్షివాహనం సంపాదించు కున్నాడు.) ఏనుగు రాజును పైకి తీశాడు, మొసలి ముఖం చీల్చి వేశాడు. ఏనుగు రాజును విడిపించాడు.

ఆ మొసలి హూహూడు అనే గంధర్వుడు. అతడు దేవల ముని శాపం వల్ల మొసలిగా మారి సరోవరంలో వుండేవాడు. శ్రీహరి చక్రంతో నరకడం వల్ల గంధర్వుడయ్యాడు. అతడు శ్రీహరికి ప్రదక్షిణ చేసి గంధర్వలోకం వెళ్ళిపోయాడు.

ఏనుగురాజు వెనుక జన్మలో పాండ్యదేశపు రాజు. అతని పేరు ఇంద్రద్యుమ్నుడు. అతడు రాజభవనం వదలి మలయ పర్వతం మీద నివసించేవాడు. ఓనాడు పూజలో కూర్చున్న సమయమున అగస్త్యుడు వచ్చాడు. పూజలో వుండుట వలన ఇంద్రద్యుమ్నుడు అగస్త్యునితో మాటాడలేదు. అగస్త్యునికి కోపం వచ్చింది. 'ఈ రాజు దురాత్ముడు. బ్రాహ్మణులను అవమానం చేశాడు. కనుక వీడు ఏనుగై పుట్టుగాక' యని శపించాడు.

(హూహూడు దేవల ముని శాపం పొందడానికి కారణం చెప్పలేదు కవిగారు. అగస్త్యుడు అకారణంగా ఇంద్రద్యుమ్నుణ్ణి శపించాడు. దేవల ముని అగస్త్యుడు వీళ్లిద్దరూ నీచులే. హూహూడు ఇంద్రద్యుమ్నుడు అమాయకులు. తమను అకారణంగా శపించిన నీచులను ఎదుర్కొనే శక్తి వాళ్ళ దగ్గరలేదు, అకారణంగా శపించిన దేవల మునికి, అగస్త్యునికి కవిగారు ఎలాంటి కష్టాలు కలుగజేయ లేదు. కారణమేమిటి?

పూజలో నిమగ్నుడై యున్న ఇంద్రద్యుమ్నుడు అగస్త్యునితో ఎలా మాట్లాడుతాడు? అది అవమానించడమెలా అవుతుంది? రాజులు ఏ పనిలో వున్నా మానేసి బ్రాహ్మణులను పూజించాలా? ఈ కథ రాయడంలో కవిగారి వుద్దేశమేమిటి?

భగవంతుణ్ణి పూజిస్తుండగా ఇంద్రద్యుమ్నుడు శాపం పొందాడు కదా! అకారణంగా శపించిన అగస్త్యుణ్ణి భగవంతుడు ఏమీ చేయలేక పోవడానికి కారణమేమిటి?

పక్షపాత బుద్ధితో రాసిన రచనలలో ఇలాగే ఎన్నో లోపాలుంటాయి. బ్రాహ్మణులను గొప్పచేసే ఉత్సాహంలోపడి కవిగారు సందర్భశుద్ధి లేకుండా రచించారు.)

సిరిలేని దేవతలు.

పూర్వం దుర్వాసుని శాపం వలన దేవేంద్రుడు మొదలైన దేవతలు ముల్లోకాల సిరిపోయి దీనులైపోయారు. ఆ దినాల్లోనే దేవతలకు, అసురులకు యుద్ధం జరిగింది. ఆ యుద్ధములో అనేక మంది దేవతలు చనిపోయారు. మిగిలిన దేవతలు బ్రహ్మ దగ్గఱకు వెళ్ళారు.

(దుర్వాసుడు దేవతల నెందుకు శపించాడు? అకారణంగా శపించాడా? కారణముందా? అసురులకు, దేవతలకు యుద్ధమెందుకు జరిగింది? కవిగారు కారణాలు తెలియజేయలేదు.

దుర్వాసుడు వచ్చినప్పుడు దేవతలు గౌరవించ లేదేమో! అందుకే శపించి యుండవచ్చు సిరిలేని దేవతలు రాక్షసుల సిరిని దోచు కోవడానికి ప్రయత్నం చేసి యుండవచ్చు.

దేవతలకు రాక్షసులకు జరిగిన యుద్ధములో దేవతలు చచ్చారు.

దేవదానవుల యుద్ధానికి మూలకారకుడు దుర్వాసుడని మనం గ్రహించాలి దేవతలు దుర్వాసుని మీద పగ సాధించలేదు. ఆ కోపాన్ని దేవతలు ఎవరి మీద ప్రయోగిస్తారో.........)

భగవంతుడు వైరజుని భార్య దేవసంభూతి గర్భములో అజితుడన్న పేర అవతరించాడు. అతనికి శ్రీహరి అని, భగవంతుడని,

విష్ణువని పేర్లున్నాయి.

బ్రహ్మ దేవతలతో కలసి అజితుని నివాసానికి వెళ్లాడు. దేవతలు శ్రీహరికి స్తోత్రం చేశారు. శ్రీహరి సంతోషపడ్డాడు.

బ్రహ్మ, శివుడు, యావన్మంది దేవతలు శ్రీహరిని మరో మారు స్తుతించారు.

శ్రీహరి వారికిలా చెప్పాడు.

"మీకు అనుకూలమైన కాలం వచ్చేవరకు రాక్షసులతో సంధి చేసుకోండి. వాళ్లు శుక్రాచార్యుని మంత్రాంగము ననుసరించి నడుచుకుంటున్నారు. వాళ్లతో సంధిచేసుకొని అమృతం కోసం ప్రయత్నించండి అమృతం త్రాగితే చచ్చిన ప్రాణి బ్రతుకుతుంది. (ఓడిపోయిన వారు సంధి చేసుకునే విధానమిది.)

మందర పర్వతం కవ్వం చెయ్యండి. వాసుకుని కవ్వం తాడు చెయ్యండి. నేను కూడా పాల సముద్రము చిలకడానికి సహాయం చేస్తాను సముద్ర మథనంలో కాలకూట విషం కూడా పుడుతుంది. మీరు భయపడవలసిన అవసరం లేదు. సముద్రములో పుట్టెడి మంచి మంచి వస్తువుల కోసం ఆశపడకండి. (పర్వతాన్ని కవ్వంగా ఉపయోగించడం, పామును కవ్వం త్రాడుగా ఉపయోగించడం సాధ్యమా? పర్వతాన్ని చుట్టగలిగినంత పాము సృష్ట్యాది నుండి ఎప్పుడైనా వుందా?

పాలసముద్రాన్ని చిలికితే విషం పుట్టదు, అమృతం పుట్టదు. కాని వెన్న పుడుతుంది. అయినా పాలసముద్రము కవిగారి కల్పన మాత్రమే. అది ఎచ్చటనూ లేదు.)

రాక్షసులతో సంధిచేసుకోవడానికి దేవేంద్రుడు, దేవతలు బలి చక్రవర్తి దగ్గఱకు వచ్చారు.

శ్రీహరి చెప్పిన విధంగా తియ్యటి మాటలతో బలిచక్రవర్తితో సంధి చేసుకున్నాడు దేవేంద్రుడు.

దేవతలు, రాక్షసులు కలసి పాలసముద్రం చిలకడం కోసం నిశ్చయించుకున్నారు. (రాక్షసుల సహాయం లేనిదే దేవతలు సము

ద్రాన్ని మథించడానికి పూనుకోలేదు. అనగా వాళ్లు స్వయంగా సాధించలేని పని అది.)

దేవదానవులు మందర పర్వతం పెకిలించి మోసుక రావడం మొదలు పెట్టారు. కొందరు పర్వతం క్రింద పచ్చడి అయ్యారు. కొందరి చేతులు, కాళ్లు విరిగాయి. (పర్వతాన్ని మోసుక పోవడం అసాధ్యం. అసాధ్యమైన విషయాలను కథలో సాధించి సంతృప్తి పడే విధానమిది.)

శ్రీహరి గరత్మంతుని మీద అచ్చటికి వచ్చి చచ్చినవారిని బ్రతికించాడు. (అసాధ్యం.) శ్రీహరి మందర పర్వతాన్ని చేతిలో ఎత్తి గరత్మంతుని మీద పెట్టాడు. గరత్మంతుడు దానిని తీసుకవెళ్లి నీళ్లలో దించాడు. (పర్వతాన్ని ఎత్తగలిగినవాడు మొదటే ఎందుకు ఎత్తలేదు? పర్వతం క్రింద పలువురు చనిపోగా చూచాడెందుకు? కవిగారు శ్రీహరిని గొప్పచేసే ఉద్దేశముతో ఇదంతా వ్రాశారు.)

దేవదానవులు నాగరాజయిన వాసుకి దగ్గఱకు వెళ్లి సముద్ర మథనంలో సహాయపడుమని లభించిన అమృతంలో వాటా ఇస్తామని చెప్పారు.

వాసుకి అంగీకరించింది.

నాగుపాము కవ్వం త్రాడుగా ఉపయోగ పడునప్పుడు నోటి లోనుండి విషం కక్కుతుందని శ్రీహరికి తెలుసు. అందుకే ఉపాయంతో రాక్షసులు తలవైపు పట్టుకొనునట్లు చేశాడు.

దేవతలు తోకవైపు రాక్షసులు తలవైపు పట్టుకొని పాల సముద్రం చిలకడం ప్రారంభించారు. పర్వతం సముద్రములో మునిగి పోసాగింది. అది గమనించిన శ్రీహరి తాబేలు రూపం ధరించి పర్వతాన్ని పైకెత్తాడు.

దేవదానవులు మళ్లీ పాలసముద్రం చిలకసాగారు. దేవతలు తోకను లాగుతున్నారు. రాక్షసులు తలను లాగుతున్నారు. నాగుపాము శరీమంతా నొప్పిపెట్టింది. దేవదానవులు స్వార్థ బుద్ధితో తన నుపయోగించుకుంటున్నారని గ్రహించింది. దేవదానవులు నాగు

పాము బాధను గుర్తించకుండా ఉత్సాహంగా లాగుతూనే వున్నారు.

దేవతల మీద రాక్షసులమీద విపరీతంగా కోపం వచ్చింది. నోటి నుండి విషం కక్కింది. నిట్టూర్పులు విడిచింది. అయినా దేవదానవులు నాగుపామును విడువలేదు. అలాగే పట్టుకొని చిలికారు. అమృతం దొరకలేదు.

శ్రీహరి స్వయంగా చిలకడం మొదలు పెట్టాడు. కొద్దిసేపట్లోనే విషం పుట్టింది. (శ్రీహరి ఒక్కడే చేసినపని వలన కలిగిన ఫలితమిలా పడ్చింది) విషం నుండి తప్పించుకొని బ్రతికేదారి లేక పోయింది. శ్రీహరి అలసిపోవడం వలన కొంత దూరం వెళ్లి కూర్చున్నాడు.

దేవదానవులు శ్రీహరి ముఖం చూశారు. అతడు చాలా అలసిపోయి వున్నాడని, విషం నుండి తమను రక్షించేశక్తి ప్రస్తుతం అతనికి లేదని గ్రహించారు. తర్వాత కైలాసంలో వున్న శివుని దగ్గఱకు వెళ్లారు.

దేవదానవులు శివుణ్ణి ఇలా పొగిడారు.

"బ్రహ్మ, విష్ణువు కంటే చాలా గొప్పవాడవు నువ్వు. ఈ విశ్వాన్ని నువ్వే సృష్టిస్తావు, పాలిస్తావు, సంహరిస్తావు. నువ్వు చాలా గొప్పవాడవు. త్రిపురాలు కాల్చివేసిన శూరుడవు. కాలకూట విషం మ్రింగిన ధీరుడవు. (ఇంతకు పూర్వమొకసారి విషం మ్రింగాడా?) పార్వతితో కలసి వుండడం చూచి నిన్ను కాముకుడంటారు కొందరు. క్రూరుడవనీ, హింసచేస్తావనీ నిందిస్తారు మరికొందరు. నీలీలలు తెలుసుకోలేని సిగ్గుమాలిన వాళ్లు నిన్నుగురించి నీచంగా మాట్లాడుతారు. మహాపురుషుడవు నువ్వు. నీ మహిమ ఎవరూ తెలుసుకోలేరు. (ఇంతకు పూర్వం విష్ణువును వేడుకున్నప్పుడు కూడా "నువ్వు బ్రహ్మ, శివుని కంటే గొప్పవాడవు. నువ్వు మహాపురుషుడవు. నీ మహిమ ఎవరూ తెలుసుకోలేరు" అని పొగిడారు. ఎవరి అవసరమున్నప్పుడు వారిని పొగిడి పనిచేయించుకునే విధానమిది. ఎవరిని గొప్పచేయాలనుకుంటే వారిని పొగిడి మిగిలిన వారిని దద్దమ్మల క్రింద జమకట్టడం కవిగారికి

అలవాటే)

"పాలసముద్రంలో కాలకూట విషం పుట్టింది దానినుండి నువ్వే మమ్మల్ని కాపాడాలి. అని వేడుకున్నారు దేవదానవులు చివరికి (ఇదంతా కవిగారి కల్పన వాస్తవంగా ఇలా జరగడం అసంభవం)

శివుడు పాలసముద్రం దగ్గరకు వచ్చి అందరూ చూస్తుండగా విషం త్రాగాడు. (చావలేదావీడు?) బ్రహ్మ, శ్రీహరి మొదలగు యావన్మందీ ఆశ్చర్యపోయారు.

దేవదానవులు మళ్లీ పాలసముద్రం చిలికారు. అందులో నుండి కామధేనువు పుట్టింది. దానిని రుషులు తీసుకున్నారు. (రుషులు పాల సముద్రం చిలకడంలో పాల్గొననేలేదు. అయినా ఫలితాన్ని ముందుగానే తీసుకున్నారు దొంగవెధవలు.) తర్వాత ఉచ్చైశ్రవం పుట్టింది. దానిని బలిచక్రవర్తి తీసుకున్నాడు ఉచ్చైశ్రవాన్ని దేవేంద్రుడే తీసుకోవాలను కున్నాడు. కాని విష్ణువు మాట విని వూరుకున్నాడు. తర్వాత ఐరావతం మొదలగునవి పుట్టినవి. తర్వాత పుట్టిన కౌస్తుభ మణిని విష్ణుదేవుడు తీసుకున్నాడు. తర్వాత పారిజాత కల్పవృక్షం పుట్టాయి. వాటిని స్వర్గంలో పాతిపెట్టారు. అనంతరం అప్సరసలు పుట్టారు. వారి అందాన్ని తిలకించిన దేవతల మనసులు చెదరినవి. తర్వాత లక్ష్మిదేవి పుట్టింది. పుట్టినప్పుడే లక్ష్మిదేవికి స్తనాలున్నాయి. (అని కవిగారు వ్రాశారు.) ఆమె రొమ్ములు, నడుము, ముక్కు, ముఖం, చేతులు, కాళ్లు, తొడలు..........ఇంకా అన్ని అంగాలు బాగున్నాయి. (అని కవిగారు వ్రాశారు )

ఆమె అందాన్ని చూచినవారందరూ ఆమెను పొందాలని తహతహ లాడారు. పెదవులు చప్పరించారు. దేవేంద్రుడు మొదలగువారు ఆమెను పొందడానికి అనేక సేవలు చేశారు.

తనకు అన్నివిధాల పనికివచ్చే వాడిని వరించి పెళ్ళాడాలని నిర్ణయించుకొంది లక్ష్మిదేవి. (పుట్టగానే పెళ్లిధ్యాసలో పడ్డదేమిటీమె) అక్కడ గుమిగూడిన గంధర్వులను, దేవతలను, రాక్షసులను, రుషులను,

అందరినీ మార్చిమార్చి చూచింది, ఆసక్తిగా చూచింది. విష్ణుమూర్తి ఆమె కన్నులకు చాలా అందంగా కనిపించాడు. అతడు అన్ని విధాలా తనకు తగినవాడని నిర్ణయించుకొంది. (లక్ష్మిదేవిలాగా ప్రతి స్త్రీ తనకు నచ్చిన మగవాణ్ణి పెళ్ళిచేసుకోవాలి. తండ్రి తెచ్చిన మగవాణ్ణి ఇష్టం లేకపోయినా పెళ్ళిచేసుకొని జీవితమంతా నరకం అనుభవించ కూడదు.) తర్వాత ఆమె పూలమాల పట్టుకొని వెళ్ళి విష్ణుమూర్తి మెడలో వేసింది. (పూలమాల పట్టుకొని పుట్టిందా ఏమిటీ? లేకపోతె ఈ పూలమాల ఆమెకెవరిచ్చారిప్పుడు.) విష్ణుమూర్తి లక్ష్మిదేవిని వక్షస్థలములో దాచుకున్నాడు. (తన భార్య పర పురుషునికి కనబడకూడదని వక్షస్థలములో దాచుకున్నాడు... ......ఈనాటి మగాళ్ళు కూడా కొందరు భార్యలను బయటకు రానివ్వరు. పర పురుషుల కంటబడనివ్వరు.)

దేవదానవులు పాల సముద్రం చిలకడం మరిచిపోయి లక్ష్మిదేవిని, విష్ణువును స్తోత్రం చేశారు.

అనంతరం సముద్ర మథనంలో కల్లు దేవత పుట్టింది. దానిని శ్రీహరి రాక్షసులకిచ్చాడు. (ఇంత వరకు వెలువడిన విలువైన వస్తువులను దేవతలే స్వీకరించారు.........విష్ణువు కల్లు దేవతను రాక్షసుల కివ్వడంలో అతని అభిప్రాయమేమిటి? కల్లు దేవతను స్వీకరించిన రాక్షసులకు లాభమా? నష్టమా? పాఠకులారా! ఈ ప్రశ్నలకు సమాధాన మివ్వగలరా?)

చివరికి అమృత కలశం పట్టుకొని ధన్వంతరి పుట్టాడు. ఇంతకు ముందు పుట్టిన విలువైన వస్తువులన్నీ దేవతలే తీసుకున్నారు. ఈ అమృత కలశం కూడా కాజేస్తారేమో అన్న తొందరలో రాక్షసులు ధన్వంతరి చేతిలోనున్న అమృత భాండం లాక్కున్నారు. దేవతలు తెల్లమొహం వేశారు. శ్రీహరి దేవతలనోదార్చి రాక్షసుల మధ్య కలహం పుట్టించాడు.

ఉపాయం, ఆలోచనా శక్తి లేని రాక్షసులు కొట్లాడుకున్నారు. ఆ సమయం కనిపెట్టి శ్రీహరి జగన్మోహిని వేషం ధరించాడు.

జగన్మోహిని రూపం చూచిన రాక్షసులు కొట్లాడుట మాని ఆమె దగ్గరకు పరుగెత్తి ఆమెతో ఇలా అన్నారు. "మేమంతా అన్నదమ్ములం. మా శరీరాల్లోవున్న శక్తినంతా ఉపయోగించి అనేక విలువైన వస్తువులను ఉత్పత్తిచేశాం. వాటన్నిటినీ దేవతలే తీసుకున్నారు. కనీసం ఈ అమృతమైనా నువ్వు న్యాయంగా, పక్షపాత బుద్ది లేకుండా మాలోమాకు తగవురాకుండా పంచిపెట్టు"

"నేను లంజను. నామీదెందుకు ఈ బరువంతా మోపుతారు" అంది జగన్మోహిని ఓర చూపులు చూస్తూ. (ఇలా అనడంలోనే మోసం వుంది. అది రాక్షసులు గ్రహించలేక పోయారు.)

రాక్షసులు సంపూర్ణ విశ్వాసంతో అమృత కలశం జగన్మోహిని కిచ్చారు.

"నేను ఏం చేసినా అంగీకరించాలి మీరు. అలా అయితేనే అమృతం పంచి పెడతాను" అంది జగన్మోహిని.

"అసురులు సరేనని తలలూపారు.

దేవతలు, రాక్షసులు పంక్తి తీర్చి కూర్చున్నారు. వారి ముందు జగన్మోహిని గంతులు వేసింది. ఆమె స్తనాల మీద నుండి పైట జారిపోయింది. దాంతో దేవదానవులు కామపరవశులయ్యారు.

అసురులకు అమృతం అందనివ్వ కూడదని నిశ్చయించుకుంటామె. అమృత కలశం పట్టుకొని రాక్షసుల దగ్గరకు వచ్చి వాళ్లకు కామ కోరికలు కలిగే విధంగా ప్రవర్తించింది.

తర్వాత దేవతల వద్దకు వెళ్లి అమృతం పంచసాగింది. ఎంతో ప్రేమగా చూచిన జగన్మోహిని తమకు అన్యాయం చేయదనుకున్నారు. రాక్షసులు. దేవతలకు పంచిన తర్వాత తమకు పంచుతుందనుకున్నారు. ఏమి చేసినా అంగీకరిస్తామని మొదట ఇచ్చిన మాట నిలబెట్టుకోవాలనుకున్నారు. అందుకే వాళ్లు ఓపిగ్గా కూర్చున్నారు.

జగన్మోహిని కపట బుద్ది గ్రహించాడు రాహువు అనేరాక్షసుడు. వెంటనే దేవతల పంక్తిలో కూర్చున్నాడు. దేవతలకు గబగబా అమృతం పంచిపెడుతున్న జగన్మోహిని రాహువుకు కూడా పంచింది.

సూర్యచంద్రులు అతని గుట్టు బయటపెట్టారు. రాహువు అమృతం గుటక వేశాడో లేదో జగన్మోహిని అతని తల తెగనరికింది. రాహువు మొండెం చచ్చిపోయింది. తల బ్రతికింది.

బ్రహ్మ, రాహువును గ్రహంగా తయారు చేశాడు. పాతపగ వలన రాహువు సూర్య చంద్రులను, అమావాస్య పున్నమలలో అప్పు డప్పుడు మింగేస్తాడు. (సూర్య గ్రహానికీ, చంద్ర గ్రహానికీ కారణం ఇదీ అని కవిగారు ఓ కట్టు కథ అల్లి చెప్పారు. ఆలోచనాశక్తి లేని అజ్ఞానులు అది నమ్మారు. కోట్లాది ప్రజలు చాలా కాలం నుండి నమ్ముతూనే వున్నారు.

విజ్ఞాన శాస్త్రం అభివృద్ధి చెంది సూర్య, చంద్ర గ్రహణాలకు కారణమిది కాదని ఈనాడు రుజువయ్యింది. అయినా కొందరు మూర్ఖ ఆచార పరాయనులు ఈనాటికీ కవిగారి ఈ కట్టుకథను నమ్ముతూనే వున్నారు. వీళ్ల అజ్ఞానం అంతరించే దెప్పుడు?

ఇక మరొక విషయం. అమృతం త్రాగని రాక్షసులు తర్వాత కాలంలో చచ్చారనుకుందాం. అమృతం త్రాగిన దేవతలు బ్రతికి వుండ వలసిందే కదా? అయితే వారెచ్చట వున్నారు.? రాహువు కథ ఎంత అసత్యమైనదో, సముద్రంలో నుండి లక్ష్మి, అప్సరసలు, అమృతం, కల్పవృక్షం, కామధేనువు పుట్టడం కూడా అంత అసత్యమే అని మనం అర్థం చేసుకోవాలి.

హేతువాద దృష్టితో ఈ కథను చదివినప్పుడు ఇదంతా కవి గారికల్పనఅని మనం స్పష్టంగా గ్రహించగలం. కాని ఇందులో రాక్షసు లకు అన్యాయం జరిగిందనీ, రాక్షసుల శ్రమశక్తిని దేవతలు దోచు కున్నారనీ, విష్ణువు వంచకుడనీ, అతడు ఆశ్రిత పక్షపాతి కాని న్యాయ పక్షపాతి కాదనీ మనం గ్రహించాలి. నమ్మిన వారిని మోస గించిన కథ ఇది.)

వాసుకికి అమృతం వాటా ఇచ్చారా? శివుడు కష్టపడి విషం మ్రింగి నందుకు అతనికి దక్కిందేమిటి?

విష్ణువు చాలా ఉపాయశాని కనుక కౌస్తుభమణిని తన పరం

చేసుకున్నాడు తనకు కావలసిన వారికి అమృతం పంచి పెట్టాడు. ఇదంతా గ్రహించడమే అసలైన హేతువాదం.)

విష్ణువు గరత్మంతుని పైనెక్కి వెళ్ళిపోయాడు. (తర్వాత యుద్ధం జరుగుతుందని విష్ణువు పసికట్టి పారిపోయినట్టున్నాడు.)

రాక్షసుల శ్రమశక్తిని దేవతలు దోచుకోవడం వలన రాక్షసులకు దేవతలపైన కోపం వచ్చింది. పాల సముద్రపు ఒడ్డున దేవాసురులకు యుద్ధం జరిగింది.

యుద్ధభూమికి కొందరు ఏనుగుల మీద వచ్చారు. కొందరు గుర్రాల మీద వచ్చారు......గాడిదలమీద, ఒంటెలమీద, పులుల మీద, సింహాల మీద, రాబందుల మీద, కొంగలమీద, నక్కల మీద, ఎలుకల మీద, తొండల మీద, మేకల మీద, పందుల మీద ఇంకా రకరకాల జంతువుల మీద ఎక్కివచ్చి......బాణాలతో, కత్తులతో, గదలతో, ఈటెలతో.........తో యుద్ధం చేశారు. (సముద్రం మధించడానికి వచ్చినప్పుడు ఈ యుద్ధసామగ్రి, ఈ వాహనాలు ఏవీ తెచ్చుకోలేదు కదా! అకస్మాత్తుగా ఇవన్నీ ఎక్కడి నుండి వచ్చాయి? తొండలు, ఎలుకలు మొదలగు వాని మీద దేవదానవులు ఎక్కినప్పుడు అవి చావలేదా? తొండలు, ఎలుకలు కూడా యుద్ధరంగములో వాహనాలుగా ఉపయోగించడానికి వీలుందా? ఇవన్నీ అడగవలసిన ప్రశ్నలు. కవిగారు వ్రాసిందంతా ఒప్పుకోవలసిన అవసరం పాఠకులకు ఎంత మాత్రం లేదు. సందర్భశుద్ధి లేకుండా లోకజ్ఞాన విరుద్ధంగా, చిన్న పిల్లవానికి కూడా అనుమానం కలిగేవిధంగా వ్రాశారేమిటి కవిగారూ! మీరు చాలా తెలివికలవారని, చాలా గొప్పగా వ్రాశారని చాలా మంది పండితులు చాలా గొప్పగా పొగిడారు. ఈనాటికీ పొగడుతున్నారు.

రేగులపాటి కిషన్‌రావూ! నువ్వు మాత్రం వ్యాసునిలాగా ఇలాంటి చెత్త కథలు వ్రాయకు. వ్యాసుని కథలను ఒప్పుకున్న హేతువాద జ్ఞానహీనులు కూడా నీ కథలను ఒప్పుకోరు.)

విరోచనుడి కుమారుడు బలిచక్రవర్తి అసుర సేనకంతటికీ

ఆధిపత్యం వహించాడు. మయుడు తయారు చేసిన వైహాయస విమానమెక్కి వచ్చాడతడు. కాలగమనం కల విమానం వైహాయస విమానం. చాలా విచిత్రమైన విమానమది. ఆ విమానం ఒకప్పుడు కనబడితే ఒకప్పుడు కనబడదు. అన్ని రకాల యుద్ధపరికరాలు ఆ విమానంలో నిండుగా వుంటాయి.

అసురులు కయ్యానికి కాలుదువ్వుతూ కేకలు వేశారు.

దేవేంద్రుని చుట్టూ తమతమ వాహనాల మీద ఆయుధాలు పట్టుకొని సిద్ధంగా వున్నారు దేవతలు.

బలి దేవేంద్రునితో......యముడు కాలనాభునితో, సూర్యుడు బాణునితో........రాహువు చంద్రునితో..........పులోముడు వాయువుతో, శుక్రాచార్యుడు బృహస్పతితో... తో యుద్ధం చేశారు. ఉభయసేనల లోనూ కాళ్లు తెగి, చేతులు తెగి, తలలు తెగి, ముక్కులు తెగి, చెవులు తెగి అనేక మంది చచ్చారు.

దేవేంద్రునికి బలికి ఘోర యుద్ధం జరిగింది. బలిచక్రవర్తి రాక్షస మాయతో పెద్ద పర్వతం దేవసేన మీదికి వచ్చింది. ఆ పర్వతం మీది నుండి చెట్లు, రాళ్ళు, తేళ్లు, పాములూ దేవసేన మీద పడ్డాయి. పెనుగాలి వీచింది. ప్రళయ మేఘాలు గర్జించాయి. అగ్గి నిప్పులు కురిశాయి. (విష్ణువు—పురుషుడు—జగన్మోహిని—స్త్రీ—రూపంగా మారిపోవడం ఎలాంటిదో బలిచక్రవర్తి మాయతో పర్వతం దేవతల మీదికి రావడం అలాంటిదే. ఇవిరెండూ హేతువాద విరుద్ధమైనవే, విష్ణువు జగన్మోహినిగా మారి దేవతలకు అమృతం పంచి పెట్టడం న్యాయమే అయితే, బలిచక్రవర్తి మాయతో పర్వతం వచ్చి దేవతలను బాధించడం కూడా న్యాయమే. అది అన్యాయమైతే ఇదీ అన్యాయమే.) ఆ ఆపద నుండి తప్పించుకోవడం కోసం దేవతలు విష్ణువును తలచుకున్నారు.

శ్రీహరి గరత్మంతుని మీద ఎక్కి యుద్ధరంగానికి వచ్చాడు. పేరు, పలుకుబడి, బలంలేని రాక్షసులను కొందరిని చంపాడు శ్రీహరి. (దేవతలను మాయతో బాధపెట్టింది బలిచక్రవర్తి అయితే సామా

న్యంగా యుద్ధం చేసే అనామకులను చంపాడేమిటి వీడు. శత్రువు అందరినీ ఒక్క దెబ్బతో చంపేశక్తి శ్రీహారికి లేదని మనం గ్రహించాలి. దేవేంద్రుని కంటే కాస్త బలవంతుడు ఈ శ్రీహరి. అంతే కాని సర్వశక్తి సంపన్నుడు కాదు.

"నేను దేవేంద్రుణ్ణి, సర్వశక్తి సంపన్నుణ్ని, నువ్వు మాయతో మమ్ముల్ను గెలవాలనుకున్నావేమో. మాయచేయడంలో మిమ్ముల్లను మించిన వాళ్ళం మేము. ఈ వజ్రాయుధంతో నీతల వెయ్యి చెక్కలు చేస్తాను. నీ చుట్టాలనందరినీ తీసుకొనిరా అంతమందినీ చంపేస్తాను" అని చెప్పి దేవేంద్రుడు బలిచక్రవర్తిని భయపెట్టాలనుకున్నాడు. (సర్వశక్తి సంపన్నుడట! చూశారా దేవేంద్రుని ప్రగల్భాలు. మాయవిద్య, యుద్ధ విద్య ఏ విద్యా సరిగా తెలియదు వీనికి. ప్రగల్భాలు పలకడం, ఆడ వాళ్ళను ఎత్తుక పోవడం, ఓడిపోయి విష్ణువు దగ్గఱకు పరుగెత్తి వాని కాళ్లు పట్టుకోవడం బాగా తెలుసు ఇంద్రునికి.)

"నువ్వు తెలివి తక్కువ వాడివని నాకు తెలుసు" అన్నాడు బలి. దేవేంద్రునికి కోపం వచ్చి వజ్రాయుధం విసిరాడు అది వచ్చి బలికి తాకడం వలన బలికి పెద్దగాయమయింది. బాధతో క్రిందపడిపోయాడు.

దేవేంద్రుడు చాలా మందితో యుద్ధం చేసి కొంత మందిని చంపి వేశాడు.

అసురుల నాశనంచూచి నారదమునిని దేవతలదగ్గఱకు పంపాడు బ్రహ్మదేవుడు. (ఎక్కడి నుండి చూశాడు.) నారదుడు వచ్చి యుద్ధం నిలుపు చేశాడు. (ఇప్పుడు యుద్ధం నిలిపి వేయడానికి కారణమేమిటి?)

యుద్ధంలో పడిపోయిన అసురులను తన సంజీవినీ విద్యతో తిరిగి బ్రతికించాడు శుక్రాచార్యుడు. బలిచక్రవర్తిని లేపి కూర్చుండబెట్టాడు. (గరత్మంతుని మీద వచ్చిన విష్ణువు నలుగురిని చంపివేసిన తర్వాత యుద్ధరంగములో వున్నాడా? వైకుంఠం వెళ్లిపోయాడా?

ఏదీ వ్రాయలేదు కవిగారు. ఆ విషయమే మరచి పోయినట్టున్నారు.)

శ్రీహరి ఆడదాని వేషం వేసి రాక్షసులను మోసగించి దేవతలకు అమృతం పంచిపెట్టిన విషయం శివునికి తెలిసింది. అతడు పార్వతితో సహా ఎద్దుపైనెక్కి తన పరివారాన్ని తీసుకొని విష్ణుమూర్తి దగ్గఱకు వచ్చాడు.

"అసురులను మోహపెట్టి దేవతలకు అమృతం పంచిపెట్టిన నీ జగన్మోహిని రూపం చూడాలన్న కాంక్షతో వచ్చాం మేము. చూపించు" అన్నాడు శివుడు.

"జగన్మోహిని రూపం కామభావం రెచ్చగొడుతుంది. ఆ రూపం కాముకులకే నచ్చుతుంది. సరే నువ్వు అడిగావు కనుక చూపిస్తాను" అని చెప్పి విష్ణువు మాయమయ్యాడు.

మరుక్షణంలో ఎదుటవున్న పూలతోటలో సన్నని దుస్తులతో చక్కని అందంతో జగన్మోహిని కనబడింది. జారిపోతున్న చీరెను, ఊడిపోతున్న కొప్పును సవరించుకొంటూ, బంతి ఆట ఆడుతూ, గంతులు వేస్తూవుంది.

జగన్మోహిని శివుని వైపు ఓరగా చూచింది. శివుడు కామభావంతో సర్వం మరిచి పోయాడు. పార్వతిని, తన పరివారాన్ని మరచిపోయి మోహిని వెంట బడ్డాడు. మోహిని పరుగెత్తుచుండగా చీరె వూడిపోయింది. నగ్నంగా వున్న మోహినిని కౌగలించుకున్నాడు శివుడు. ఋషులు నివసిస్తున్న ప్రదేశాలలో కూడా మోహిని వెంట తిరిగాడు శివుడు. (కామభావం కలిగించే మోహినిని చూచిన ఋషులకు, శివుని పరివారానికి కామభావం కలుగలేదా? వాళ్లకున్నంత ఇంద్రియ నిగ్రహ శక్తి శివునికి లేదా? కామభావం కలిగించే శక్తి మోహినిలోనే లేదా? లోపాలు లేకుండా వ్రాసే శక్తి కవిగారికి లేదా? పాఠకులారా! ఆలోచించి చెప్పండి.)

శివుని వీర్యం స్ఖలనమైపోయింది. ఆ వీర్యం పడిన చోటల్లా వెండి, బంగారాల గనులు తయారైనాయి. (విష్ణువు స్త్రీ రూపం ధరించడం, శివుని వీర్యం వెండి, బంగారు గనులుగా తయారు

కావడం హేతువాద విరుద్ధం. అందమైన ఆడది కనబడితే ఏ మగాని కైనా కామభావం కలుగుతుందన్నదే సత్యం ఈ కథలోని రహస్యం అదే.)

సూర్యునికి (వివస్వంతుడు) ఇద్దరు పెళ్లాలు. సంజ్ఞ గర్భములో యముడూ, శ్రాద్ధదేవుడు అను కుమారులు. యమి అనే కూతురు; ఛాయ గర్భములో సావర్ణి, శని అను కుమారులు, తపతి అనే కూతురు జన్మించారు. (యముడు సర్వజీవుల ప్రాణాలను తీసుక పోతాడని కవిగారు చెప్పారు. యముడు పుట్టకముందు ఎవరూ చని పోలేదా? ఎంతోమంది చనిపోయినట్లు వ్యాసులవారు వ్రాసిన భాగ వతంలోనే వుంది. అయితే వాళ్లందరి ప్రాణాలను ఎవరు తీసుక పోయారు?

శనిగారు ఎవరిని ఆశ్రయిస్తే వాళ్ళు నానా బాధలు అనుభ విస్తారని లోకములో వాడుకవున్నది. మనుషులు బాధలనుభవించేది శనిగారి వలన కాదు. పరిపాలనా వ్యవస్థలోని లోపాల వలన మను షులు అనేక బాధలకు గురియవుతూ వుంటారు. శని పట్టుకుంటుందని ఏడుస్తూ కూర్చుంటే పరిపాలనా వ్యవస్థలోని లోపాలు సవరింపబడవు. సమస్యలు పరిష్కరింపబడవు. అన్ని సమస్యలను తెలివితేటలతో, ధైర్యంగా సాధించడానికి పూనుకొన్ననాడు ఏడుపులు, కన్నీళ్లు మనిషి దరిదాపులలో ఉండవు.

సూర్యుడు గోళము కదా! గోళానికి పెళ్లాలేమిటి? పిల్లలు కలగడమేమిటి? ఇదంతా కవిగారి అభూత కల్పన.)

దేవాసుర యుద్ధములో దేవేంద్రుడు బలిచక్రవర్తిని ఓడించి అతని రాజ్యములోని ధనధాన్యాలను దోచుకున్నాడు.

మోసాన్ని మోసంతో జయించాలనుకున్నాడు బలి. పని చేయకుండా దానాలు స్వీకరించి తిని తిరిగే బ్రాహ్మణులను తన వైపు త్రిప్పుకొని దేవతల నోడించి స్వర్గం సంపాదించాలను కున్నాడు.

శుక్రాచార్యుణ్ణి, బ్రాహ్మణులను సేవించాడు బలి.

తమకనుకూలంగా వున్న బలిని గెలిపిస్తే, అతడు స్వర్గానికి రాజైతే ఎన్ని దానాలైనా పొందవచ్చునన్న ఆశకలిగింది బ్రాహ్మణులకు మొదట అతనిచేత విశ్వజిత్తు అనే యజ్ఞం చేయించి దానాలు స్వీకరించారు.

భవిష్యత్తులో తమకు కలుగబోయే లాభాన్ని దృష్టియందుంచుకొని బ్రాహ్మణులు బలికి యుద్ధసామగ్రినిచ్చారు. బలి బ్రాహ్మణులకు, పెద్దలకు ప్రదక్షిణలు చేసి గొప్ప సైన్యముతో అమరావతి పట్టణం ముట్టడించాడు.

అమరావతి పట్టణం చుట్టూ బంగారు ప్రహారి వుంది. దాని ద్వారాలకు బంగారపు తలుపులున్నాయి. ఆ పట్టణంలో వజ్రాల తిన్నెలు, పగడాల వేదికలు, పదివేల విమానాలు. రథాలు, సుందరమైన ఉద్యాన వనాలున్నాయి. అలాంటి పట్టణంలో దేవేంద్రుడు సర్వసౌఖ్యాలు అనుభవిస్తున్నాడు. (రాక్షసుల శ్రమశక్తిని దోపిడీచేసి దేవేంద్రుడు అమరావతిని సుందర పట్టణంగా మార్చివేశాడు.)

బలి అమరావతిని ముట్టడించాడన్న వార్తవిని దేవేంద్రుడు దేవగురువు బృహస్పతి దగ్గరకు వెళ్లాడు.

బృహస్పతి ఇలా చెప్పాడు "బ్రాహ్మణులు బలికి అన్నివిధాలా సహాయం చేస్తున్నారు. ఈ సమయములో బలిని జయించడం అసాధ్యం స్వర్గం వదిలి పారిపోండి"

దేవతలు స్వర్గం విడిచి పారిపోయారు. బలి వంద యజ్ఞాలు చేశాడు.

(అమృతం త్రాగిన వారికి చావురాదని కవిగారు చెప్పారు. దేవతలు అమృతం త్రాగారు. వారు యుద్ధము చేసిననూ చనిపోయే ప్రసక్తేలేదు కదా! అయినప్పుడు దేవతలు పిరికిపందల్లాగా పారిపోవడమేమిటి?

అమృతం త్రాగితే చావురాదన్నమాట అసత్యం కనుక శత్రువులు బలవంతులు కావడం వలన దేవతలు ప్రాణభయంతో పారిపోయారు. దేవతలలో ఎలాంటి గొప్పతనం లేదు.

పాల సముద్రం చిలికినప్పుడు దేవతలు రాక్షసుల శ్రమశక్తిని దోచుకున్నారు. అది గ్రహించిన బలి తన నైపుణ్యంతో బ్రాహ్మణు లను తన వైపుకు త్రిప్పుకొని దేవతలను ఓడించాడు. న్యాయదృష్టితో చూస్తే దేవేంద్రుని కన్న బలిచక్రవర్తి ఉత్తముని వలె కనబడుతాడు. అంతమాత్రాన బలిచక్రవర్తి సామాన్య ప్రజలకు చేసిన మేలు ఏమీ లేదు. దేవేంద్రుడు, బలిచక్రవర్తి ఇరువురూ స్వంత లాభం కోసమే యుద్ధాలు చేశారు. ఇరువురూ దోపిడీ విధానంతో పరిపాలించిన వారే, దోపిడీ సంస్కృతిని రక్షించినవారే.)

దేవతల తల్లి తన కుమారులు ఏమైపోయారోనని విచారిస్తూ కూర్చుంది. కశ్యపముని సమాధిలో నుండి లేచి అదితి దగ్గరకు వచ్చాడు. ఆమెను చూచి అతడిలా అన్నాడు. "ఎప్పుడూ సంతో షంగా వుండేదానివి, ఇప్పుడు విచారంగా వున్నావేమిటి?"

అదితి విచారంతో ఇలా చెప్పింది. "రాక్షసులైనా దేవతలైనా అందరూ నీ బిడ్డలే. వాళ్ళందరినీ సమానంగానే చూస్తావు నువ్వు. భగవంతుడు భక్తుల పక్షం వహిస్తాడు. (కాదు దేవతల పక్షమే వహి స్తాడు. ఈ కథంతా చదివితే ఈ నిజం మీకే తెలుస్తుంది.) దితి కుమా రులు-రాక్షసులు-స్వర్గాన్ని జయించారు. నా బిడ్డలు పారిపోయారు. నా కుమారులకు పోయిన సంపద తిరిగి వచ్చేట్టు అనుగ్రహించు''

అప్పుడు కశ్యపుడు ఆమెతో ఇలా చెప్పాడు.

"నీ కోరిక నెరవేరాలంటే నువ్వు పాల వ్రతం చెయ్యాలి. అది ఎలా చెయ్యాలో చెప్తాను విను. 'తక్కువలో ఇద్దరు బ్రాహ్మణు లకు పాయసాన్నంతో భోజనం పెట్టాలి' దక్షిణలివ్వాలి, వారి అను మతి తీసుకొని మిగిలింది బంధుమిత్రులతో కలసి తినాలి, జ్ఞానవంతు లైన ఋత్విజులను, ఆచార్యులను సంతోషపరచి వస్త్రాలు, నగలు, ఆవులు మొదలగునవి దానమివ్వాలి, ఇలా వ్రతం చేస్తే భగవంతుడు సంతోషించి అనుగ్రహిస్తాడు" (ఈ పాల వ్రతములో చెప్పిన విధా నాలన్నీ దోపిడీ విధానాలే, అయితే ఇది ఒక కోణం. మరో కోణం నుండి ఆలోచిస్తే తేలేదేమిటంటే, బ్రాహ్మణులకు, ఋత్విజులకు,

ఆచార్యులకు, (ఆనాడు దోపిడీ విధానానికి అలవాటు పడినవారికి) భోజనాలు, దక్షిణలు ఇస్తే వారందరూ సంతోషపడి దాత పక్షం వహిస్తారు. కార్యసాధనకు సహకారం, ప్రోత్సాహం లభిస్తాయి. అనుకున్నపని నెరవేరుతుంది "బ్రాహ్మణులు ఏ పక్షం వహిస్తారో భగవంతుడు ఆ పక్షం వహిస్తాడు" అనడంలో వున్న రహస్యం ఇది.

బ్రాహ్మణులకు మేలు చేసే ఉద్దేశముతో (వర్గ ప్రయోజనం కోసం) కవిగారు తన రచనలో భగవంతుణ్ణి-ఒక పాత్రను-తన చేతిలో కీలుబొమ్మగా తయారు చేసుకున్నాడు.)

అదితి పాలవ్రతం చేసింది శ్రీహరి అదితి దగ్గఱకు వచ్చాడు. అదితి అతనిని స్తోత్రం చేసింది

శ్రీహరి అదితితో ఇలా చెప్పాడు.

"నీ సవతి బిడ్డలు నీ కుమారులను జయించిన విషయం నాకు తెలుసు. నీ కుమారులు పూర్వము వలె సర్వసంపదలతో తులతూగుతూవుంటే చూడాలని నీకు కోరికగా వుంది. అదినేను గ్రహించాను. అయితే బ్రాహ్మణులు రాక్షసులకు సహాయంగా వున్నారు వాళ్లను జయించుట ప్రస్తుతము సాధ్యపడదు (భగవంతుడు కూడా సామాన్య మానవుని వలె మాట్లాడడమేమిటి? భగవంతుడు సర్వశక్తి సంపన్నుడని వ్రాసిన కవి ఇచ్చట ఇలా ఎందుకు వ్రాశాడు.) నేను నీ కడుపున పుట్టి దేవతలను రక్షిస్తాను. (రాక్షసులను జయించడానికి అదితి గర్భములో పుట్టడమెందుకో?)

శ్రీహరి అదితి గర్భములో జన్మించాడు. (కిరీటాలు, భుజకీర్తులు, శంఖము, చక్రము, గద మొదలగునవి ధరించి పుట్టాడని కవి వ్రాశాడు. కిరీటాలు మొదలగునవి తయారు చేసే కర్మాగారం అదితి గర్భములో వుందా కవిగారూ?)

అదితి తన కుమారునికి వామనుడు (పొట్టివాడు) అను పేరు పెట్టింది. జన్మించిన కొద్ది క్షణాలలోనే పొట్టోడు బ్రహ్మచారి వేషం వేసుకొని, బ్రాహ్మణులతో యజ్ఞాలు చేస్తున్న బలిచక్రవర్తి దగ్గఱకు వచ్చాడు.

బలిచక్రవర్తి ఆసనం వేసి అతణ్ని కూర్చోబెట్టి పూజించాడు. తర్వాత అడిగాడు "బ్రహ్మచారీ! ఏదో కోరికతో వచ్చినట్టున్నావు ఏం కావాలి నీకు"

పొట్టివాడు ఇలా అన్నాడు "మీ కులంలో సత్యహీనులు ఎన్నడూ పుట్టలేదు, బ్రాహ్మణులకు దానమివ్వని వాళ్లు, మాటిచ్చి తప్పినవాళ్లు పుట్టలేదు. మీ తండ్రి విరోచనుడు బ్రాహ్మణులను చాలా గౌరవించేవాడు. అతని శత్రువులు బ్రాహ్మణ వేషంలో వచ్చి ఆయుర్దాయమే దానమడిగారు. మీ తండ్రి మోసం తెలిసి కూడా ఆయువు ధారపోశాడు. నువ్వుకూడా అడిగింది కాదనకుండా ఇచ్చే గొప్ప దాతవు కనుక నా అడుగులతో మూడడుగుల నేల ఇవ్వు" (వామనుడెంత కపట స్వభావుడో చూడండి. అతడు బలిచక్రవర్తి వంశాణ్ణి అతని తండ్రిని పొగడి చివరికి మూడడుగుల నేల దాన మడిగాడు.)

మూడడుగుల నేల పొట్టోనికి దానమివ్వడానికి బలిరాజు సిద్ధ పడగానే శుక్రాచార్యుడు వద్దని అడ్డు వచ్చాడు. పొట్టోడు మోసం చేయడానికి వచ్చాడని శుక్రాచార్యుడు గ్రహించాడు. "దాన రూపంగా నీ సర్వ సంపదలను దోచుకొని దేవేంద్రుని కివ్వాలన్న ఉద్దేశంతో వచ్చాడితడు" అని చెప్పాడు శుక్రుడు.

"ఇతడు నాపగ వారి క్షేమము కోరేవాడే కావచ్చు. కాని నాకు భయపడి మరుగుజ్జు వేషంలో వచ్చాడు కదా! అదికాకుండా ఇస్తానని మాట ఇచ్చి లేదని ఈ బ్రాహ్మణ కుమారునితో ఎలా అన గలను? బ్రాహ్మణులను తృప్తిపరచకపోతే ఆ సంపదవల్ల ప్రయోజన మేమిటి?" అన్నాడు బలిచక్రవర్తి.

జ్ఞానహీనుడైన బలిచక్రవర్తి ఆ పొట్టోని కాళ్ళు కడిగి ఆ పాదజలం తలపై చల్లుకున్నాడు.

"నీ పతనం తప్పదు" అన్నాడు శుక్రుడు. బలిచక్రవర్తి నవ్వి ఊరుకున్నాడు.

వామనుడు ఒక అడుగుతో భూమండలమంతా ఆక్రమించాడు.

మరో అడుగుతో స్వర్గం ఆక్రమించాడు (అతని పాదం క్రింద మిద్దెలు మేడలు, మనుషులు, జంతువులు......ఇవన్నీ నలిగి పోలేదా? అనే అనుమానం వస్తుంది కొంత ఆలోచించేవారికి ఒక పాదంతో భూగోళ మంతా ఆక్రమించడం సాధ్యపడదని హేతువాదులు హేతువాద జ్ఞానంతో గ్రహిస్తారు. ఈ కథను ఇంతవరకు ఆలోచించి వదిలిపెడితే అసలు రహస్యం గ్రహించలేము. వామనుడు ఎవరి ప్రయోజనం కోసం పాటుబడ్డాడు? ఎందుకు? వామనుని బుద్ది ఎలాంటిది? బలిచక్ర వర్తి దానాలు ఎందుకు ఇచ్చాడు? ఎవరికిచ్చాడు? ఎలా ఇవ్వగలి గాడు? అతడా డబ్బు ఎలా సంపాదించాడు? బలిచక్రవర్తి గుణం ఎలాంటిది? ఈ ప్రశ్నలన్నింటికీ సమాధానాల కొఱకు పరిశోధించ డమే అసలైన హేతువాదం. ఈ కథ ఏ ప్రయోజనాన్ని ఆశించి వ్రాయబడిందో తర్వాత తెలుస్తుంది.)

మూడడుగుల నేల కావాలని మిష పెట్టి శ్రీహరి, బలిచక్రవర్తి అధీనంలో నున్న భూమినంతా అపహరించడం చూచి రాక్షసులు కోపంతో మండి పడ్డారు.

"దొంగ బ్రాహ్మణుడు నిన్ను మోసం చేశాడు. నమ్మినవా ళ్లను మోసం చేయడంలో ఈ శ్రీహరి చాలా నేర్పరి. వంచకుడు, న్యాయాన్యాయాలతో నిమిత్తం లేకుండా ఆశ్రితులకు సహాయం చేసే నీచుడు, దేవతలకు అక్రమలాభం కలిగించే ఉద్దేశముతో మన అసురు లను అడుగడుగునా అణచివేస్తున్న పరమ దుర్మార్గుడు వీనిని చంపివే స్తేనే కాని మనం బాగుపడము" రాక్షసులిలా అని, అస్త్రశస్త్రాలు పట్టుకొని వామనమూర్తి ప్రాణాలు తియ్యడానికి విరగబడ్డారు. అంత లోనే విష్ణు భటులు రాక్షసులను అడ్డుకున్నారు. (వామనుడు చాలా ప్లానుతోనే వచ్చాడన్నమాట, తనుచేసే నీచపు పనికి రాక్షసులు ఎదురు తిరుగుతున్నారన్న ఉద్దేశముతో తన సైన్యాన్ని ఒకచోట నిలబెట్టి బలిచక్రవర్తి దగ్గఱకు వచ్చాడని మనం గ్రహించాలి.)

రాక్షసులకు, విష్ణు భటులకు యుద్ధం జరిగింది. అందులో రాక్ష సులు ఓడిపోయారు. (రాక్షసులు అనుకోకుండా యుద్ధం చేయవలసి

వచ్చింది. శ్రీహరి సైనికులు యుద్ధానికి సిద్ధంగా వచ్చారు. అందు వల్లే విష్ణు భటులు గెలిచారు )

గరత్మంతుడు బలిచక్రవర్తిని బంధించాడు. (యజ్ఞం చేస్తున్న వానిని మోసం చేయడం, యుద్ధానికి సిద్ధంగా లేని రాక్షసులను యుద్ధానికి పురికొల్పడం, ఓడించడం రాజ్యం ఆక్రమించడం మొదలగునవి శ్రీహరి రాజకీయపుటెత్తులు. అయితే శ్రీహరి ప్రవేశపెట్టిన ఈ రాజకీయపుటెత్తులు చాలా సంకుచితమైనవి. రాక్షసులను శౌర్యంతో, ధైర్యంతో, బలంతో ఓడించలేక ఇలా మోసగించి ఓడించడం జరిగింది.)

"బలిరాజా! రెండడుగుల నేల ఇచ్చావు. ఇంకో అడుగు నేల దానం చెయ్యి. లేకపోతే అసత్యవాదిగా చలామణి అవుతావు" అన్నాడు వామనుడు.

"నీ మూడో అడుగు నా తలమీద పెట్టు" అన్నాడు బలిరాజు.

(వామనుడు తన పాదంతో భూమినంతా ఆక్రమించి నప్పుడు బలిచక్రవర్తి మొదలగు సర్వజనులు ఎక్కడవున్నారు? "ఇలాంటి వెధవ ప్రశ్నలు వెయ్యకూడదు. కవిగారు ఏది వ్రాస్తే అదే చదువాలి. అందులో ఏదో అర్థం ఇమిడి ఉంటుంది'' అంటారు మూర్ఖ పండితులు.)

వామనుడు అన్నాడు. "ఎవళ్ళని అనుగ్రహిస్తానో, వాళ్ళ సిరిసంపదలను నాశనం చేస్తాను. బలిరాజా! నువ్వు సత్యవాదివి కనుక సుతల లోకానికి వెళ్ళు"

(సత్యవాది, అమాయకుడు, జ్ఞానహీనుడు, బ్రాహ్మణ భక్తుడు అయిన బలిచక్రవర్తిని మంచి మాటలతో మోసం చేసి రాజ్యం లాక్కొని అతనిని సుతలలోకం వెళ్లగొట్టాడు వామనుడు. రాజ్యాన్ని దేవేంద్రుని కిచ్చాడు. (తోబుట్టువుకు) "ఎవళ్ళని అనుగ్రహిస్తానో వాళ్ళ సిరిసంపదలను నాశనం చేస్తాను" అన్నాడు శ్రీహరి. ఈ మాటనుపయోగించి శ్రీహరి అనేక విధాల రాక్షసులను దోపిడీ చేశాడు. బలిచక్రవర్తిని భయంకరంగా అణచి వేశాడు. "నీ క్షేమం

కోరి నీ పళ్ళురాల గొడుతాను" అంటే ఎలా ఉంటుందో శ్రీహరి చెప్పిన మాటలలా ఉన్నాయి. భగవద్భక్తులారా! మీ సిరిసంపదలు నాశనమైపోవాలని మీరనుకుంటే మీరు భగవంతుణ్ణి ప్రార్థించండి. అతడు అనుగ్రహించి మీ సిరిసంపదలను నాశనం చేస్తాడు.)

వెనుకటి కల్పాంతములో బ్రహ్మదేవుడు నిద్రపోయి నప్పుడు ప్రళయం వచ్చింది. భూగోళం మొదలగునవి సముద్రములో మునిగి పోయాయి అతడు నిద్రలో వుండగానే అతని నోటినుండి వేదాలు పైకి వచ్చాయి. రాక్షసుడు-హయగ్రీవుడు-వేదాలు ఎత్తుకపో యాడు. ఈ విషయం శ్రీహరి తెలుసుకొని చేపగా పుట్టాడు.

సత్యవ్రతుడను రాజురుషి నీళ్ళు త్రాగి తపస్సు చేస్తుండే వాడు ఒనాడు సత్యవ్రతుడు నదిలోని నీటిని దోసిట్లోకి తీసుకోగా ఓచేప అతని చేతిలోకి వచ్చి రక్షించుమని అడిగింది. రాజు దానిని కమండలపు నీళ్లలో వేశాడు. అది కమండలము నిండా పెరిగింది. వెంటనే దానిని గంగాళంలో వేశాడు. అది గంగాళం నిండా పెరి గింది. తర్వాత దానిని సరస్సులో వేశాడు. అది సరస్సు నిండా పెరిగింది. భగవంతుడే చేప వలె పుట్టాడని గ్రహించాడు రాజు. "ఈ చేప అవతారం ఎందుకు దేవా? అని అడిగాడు.

"వారం రోజులలో ప్రళయం వస్తుంది. నీకు పెద్ద ఓడ పంపిస్తాను. ఆ ఓడలో ఎక్కి తిరుగు............" అని చెప్పి చేప వెళ్లిపోయింది.

ప్రళయం వచ్చింది. ఓడ వచ్చింది. రాజు ఓడ ఎక్కాడు. ప్రళయం అంతమైన తర్వాత బ్రహ్మదేవుడు నిద్రలేచాడు. శ్రీహరి హయగ్రీవ దానవుణ్ణి చంపి వేదాలు తెచ్చి బ్రహ్మకిచ్చాడు.

(ఈ కథలోని గమ్మత్తు:— బ్రహ్మ నోరు తెరచి నిద్రపో యాడు. అతని నోటిలో పెద్దగదిలో వేదాలున్నాయి. వాటికి కాళ్లు న్నాయి. బ్రహ్మ పెదవులనే తలుపులు తెరచి వుండడం వలన వేదాలుగార్లు బయటకు ఆడుకోవడానికి వచ్చారు. హయగ్రీవుడు ఎత్తుక పోయాడు. శ్రీహరి దొంగను చంపడానికి చేపగా మారి

వానిని చంపి వేదాలను రక్షించాడు.

కథలోని హేతువాదం:—

వేదాలు బ్రహ్మ నోటి నుండి బయటకు రావడమేమిటి? వాటికి కాళ్ళున్నాయా? క్షణాలలో చేప అలా పెరగడం జరుగుతుందా? భగవంతుని గొప్పను అధికం చేయడానికి, రాక్షసుల పైన నేరం మోపడానికి కవిగారు కల్పించిన కథ ఇది.

కథలోని మరొక కోణం:—

వేదాలలోని దోపిడీ నీతులు ప్రచారం కాకుండా వుండాలంటే అవి దోపిడీదారులకు అందుబాటులో వుండకూడదు. దోపిడీ విధానాన్ని అంతం చేయడానికి పూనుకొన్న రాక్షసుడు వేదాలు దొంగిలించి పాతాళానికి వెళ్ళిపోయాడు. జిత్తులమారి శ్రీహరి ప్రళయం సృష్టించి రాక్షసుణ్ణి చంపి వేదాలు బ్రహ్మకిచ్చాడు.)

వైవస్వత మనువుకు సంతానం లేదు. మనువు భార్య శ్రద్ధాదేవి. ఆమె తనకు కూతురు కావాలని ప్రార్థించింది. మనువుకు కుమారుడు కావాలనే కోరిక వుండేది. చివరికి శ్రద్ధాదేవి పాలవ్రతం చేయడం వలన కూతురు ఇళ జనిమించింది.

ఇళనే కుమారునిగా మార్చడం కోసం మనువు దేవుణ్ణి ప్రార్థించాడు. ఇళాకన్య పురుషునిగా మారిపోవడం జరిగింది. ఆ పురుషుని పేరు సుద్యుమ్నుడు.

సుద్యుమ్నుడు అడవికి వేటకు వెళ్లాడు. ఆ అడవిలో అడుగు పెట్టగానే సుద్యుమ్నుడు ఆడదైపోయాడు.

ఓనాడు మునులు శివుని దగ్గరకు వెళ్ళారు. ఆ సమయానికి పార్వతి నగ్నంగా శివుణ్ణి ఆలింగనం చేసుకొని వుంది. అది చూచి మునులు వెళ్ళిపోయారు. అప్పుడు. శివుడు సిగ్గుపడి ఇలా అన్నాడు "ఈ అడవిలోకి వచ్చిన వాళ్లు ఆడవారు అవుతారు"

అందువల్లనే సుద్యుమ్నుడు ఆడదైపోవడం తర్వాత బుధుడి ఆశ్రమం దగ్గరకు వెళ్లడం జరిగింది. బుధుడు ఆడరూపంలో వున్న సుద్యుమ్నుణ్ణి జతకలవడం వలన పురూరవుడు పుట్టాడు.

సుద్యుమ్నుని స్థితి తెలుసుకొని వశిష్ఠుడు విచారించాడు. శివుణ్ణి ఆరాధించాడు. శివుడు కనబడి వశిష్ఠునికిలా చెప్పాడు "సుద్యుమ్నుడు ఒక నెల ఆడదిగా, ఒక నెల మగాడుగా వుంటాడు"

శివుడు చెప్పిన విధంగానే సుద్యుమ్నుడు ఒక నెల ఆడదాని లాగా, ఒక నెల మగవాని లాగా వుంటూ ముసలి తనం రాగానే పురూరవునికి రాజ్యమిచ్చి తపస్సుకై అడవికి వెళ్ళిపోయాడు.

(పాలవ్రతం వల్ల శ్రద్ధాదేవికి ఇళ అనే కూతురు జన్మించడం, వైవస్వతునికి కూతురుపై యిష్టం లేక కుమారునిగా మార్చమని ప్రార్థించడం, ఇళ సద్యుమ్నుడుగా మారడం, అతడు అడవికి వెళ్లి నపుడు స్త్రీగా మారడం. తర్వాత శపించిన ఆ శివుడే సుద్యుమ్నుడు నెల ఆడదిగానూ, నెల మగవానిగానూ వుంటాడని చెప్పడం ఇదంతా హేతువాద విరుద్ధమే కాని, ఇందులో వున్న రహస్యమిది.

పూర్వకాలం పురుషులే రాజ్యం పరిపాలించేవారు. ఆడదానికా హక్కు ఉండేదికాదు. ఆడపిల్ల జన్మిస్తే రాజులకు ఇష్టముండేది కాదు. ఈ కథలో వైవస్వతుడు తనకు పుట్టిన కూతురుకు మగవేషం వేయించి భగవంతుని దయవలన మగవాడైనాడని ప్రజలను నమ్మించాడు. పురుషుని వేషంలోవున్న ఆ స్త్రీ పేరు సుద్యుమ్నుడు. సుద్యుమ్నుడు రాజ్యానికి కాబోయే రాజు కనుక ప్రజలకు కష్టం కలిగించే క్రూర మృగాలను చంపడానికి అడవికి వెళ్లాడు. ఆ కాలములో బహిరంగ ప్రదేశాలలో నగ్నంగా జతకట్టడం కూడా జరుగుతూ వుండేది. శివుడు పార్వతి నగ్నంగా జతకట్టడం చూచిన పురుష వేషములో వున్న ఇళ తనను తాను మరచిపోయింది. కామకోరికలు తీర్చుకోవాలన్న కాంక్షతో ఆమె బట్టలువిడిచి శివుని వద్దకు పరుగెత్తింది. ఆమె వెంటనున్న పరివారానికి రహస్యం తెలిసిపోయింది.

సైనికులు రాజధానికి వెళ్లిపోయారు. శివపార్వతులు బట్టలు పట్టుకొని కైలాసం వెళ్లిపోయారు. ఇళ అదే అడవిలో నివసిస్తున్న బుధుని దగ్గఱకు వెళ్లి కామకోరికలు తీర్చుకొని గర్భవతియై పిల్లవాణ్ణి కన్నది.

ఇక ఇళ ఎల్లకాలం మగవేషంలో వుండడం సాధ్యపడదని గ్రహించిన రాజు "నెల రోజులు ఆడవేషంలోనూ, నెల రోజులు మగ వేషంలోనూ వుండు. ఎలాగైనా రాజ్యం దక్కించుకోవాలి" అన్నాడు. ఇళ కది ఇష్టం లేకపోయినా రాజ్యపాలన చేస్తూ సుఖాలను భవించ వచ్చునని అంగీకరించింది.

ప్రజలను నమ్మించడానికి రాజు మునుల కథ ఒకటి క్రొత్తగా ప్రచారం చేశాడు. ప్రజలు నమ్మారు.

"శివుని అనుగ్రహం వల్ల ఇళ నెల ఆడదిగానూ, నెల మగవాని గానూ వుండడం జరుగుతుందని. పురుషునిగా మారినప్పుడు రాజ్యము పరిపాలిస్తాడని" చెప్పి ప్రజలను నమ్మించాడు. ప్రజలు అదేనమ్మారు. ఇళకు జన్మించిన పురూరవుడు పెరిగి పెద్దవాడు కాగానే రాజ్య మతనికి అప్పగించి ఇళ వేషాలు మార్చడం మానుకొని ఆడ వేషంలో అంతఃపురంలో వుండి ముసలిదై చచ్చిపోయింది. ఈ కథ ఇలాగే జరిగింది. కవిగారు పాఠకులను నమ్మించడానికి లోకజ్ఞాన విరుద్ధమైన కారణాలు చూపెట్టారు )

సుద్యుమ్నుడు అడవికి వెళ్లాక వైవస్వత మనువు కొడుకుల కోసం వందేళ్లు తపస్సు చేసి పది మందిని కన్నాడు. (ఈ ముసలా యనకు ఇప్పుడు కుమారులు కావలసి వచ్చిందా మళ్లీ.) అందులో పృషధ్రుడనే వానిని ఆవులను కాయడానికి నియోగించాడు. కుల గురువు వసిష్ఠుడు. (రాజు కొడుకు ఆవులు కాచిన విధానం) ఓనాడు వానకురుస్తున్న చీకటి రాత్రి సమయమున ఓపులి ఆవును పట్టుకొంది. పృషధ్రుడు పరుగెత్తి వచ్చి పులి అనుకొని ఆవును నరికేశాడు. వసి ష్ఠుడు శపించాడు "నీవు శూద్రుడవవుతావు" అని. (శూద్రులను హీనంగా చూచే రోజులలో తప్పు చేసిన రాజ కుమారుణ్ని శూద్రు డవు కమ్మని శపించుట ఇది. రాజు శూద్రుడగుట అంటే ఏమిటి? కష్ట పడి పని చేసి ఇతరుల చేత దోపిడీ చేయబడుతూ బ్రతుకుట అన్న మాట. శాపమంటే ఇదేమరి.)

ధృష్టుడి వల్ల ధార్ష్టులు అనే క్షత్రియులు కలిగి తర్వాత

వాళ్ళు బ్రాహ్మణులయారు.

దిష్టుడి కుమారుడు నాభాగుడు కర్మవల్ల వైశ్యుడయాడు.

(క్షత్రియులు బ్రాహ్మణులగుట అంటే రాజ్యాలు పాలించుట మాని యజ్ఞయాగాదులు చేయించి దానాలు స్వీకరించి, సుఖంగా బ్రతుకుట, నాభాగుడు-కర్మవల్ల-అధికారం పోగొట్టుకొని బ్రతుకు తెరువు కోసం ఏదో వ్యాపారం చేయుట అని మనం అర్థం చేసుకోవాలి)

మరుత్తుడనే రాజు గొప్ప యజ్ఞం చేశాడు. ఆ యజ్ఞంలో అన్నీ బంగారు పాత్రలే ఉపయోగించాడు. (మరుత్తుడు గొప్ప దోపిడీదారు.) యజ్ఞంలో దేవేంద్రుడు సోమపానం చేసి మత్తుడై పోయాడు. (త్రాగుబోతు వెధవ) బ్రాహ్మణులు దక్షిణలు పుచ్చుకొని సంతోషపడ్డారు. (తమకనుకూలంగా వున్న రాజును గద్దెనెక్కిస్తారు బ్రాహ్మణులు, అనుకూలంగా లేని రాజును గద్దెదించుతారు, ఎందుకో తెలిసిందా ఇప్పుడు.)

శర్యాతికి సుకన్య అనే కూతురుండేది. అతడొకనాడు సపరివారంగా అడవికి వెళ్లాడు. తిరిగి తిరిగి చ్యవన ముని ఆశ్రమం చేరుకున్నారు. సుకన్య పుట్టలోనున్న చ్యవనముని కండ్లను ముళ్లుతో పొడిచింది. రక్తం బయటకు వచ్చింది. వెంటనే శర్యాతి సైనికుల మలమూత్రాలు బందయి పోయాయి ముని బయటకు రాగానే సుకన్య నతనికిచ్చి శాంత పరిచాడు రాజు.

(చ్యవన మునికి పుట్టలో కూర్చుండి తపస్సు చేయడమే ఇష్టమేమో. చ్యవనముని కండ్లు పొడిచింది సుకన్య, అయితే సైనికులను శిక్షించడమెందుకు? సుకన్యను స్వీకరించి శాంత పడ్డాడు చ్యవనుడు, అంటే సైనికుల కష్టం అప్పుడు తీరిందన్నమాట. సుకన్య తండ్రి అధికారంలో వున్నాడు కనుక తప్పు చేసిన ఆమెను శిక్షించడం జరుగలేదు. అయితే ఆ కోపాన్ని అధికారం లేని సామాన్య సైనికుల మీద ప్రయోగించాడు చ్యవనుడు. (దుష్టుడు)

చ్యవనముని ఆశ్రమానికి అశ్వినీ కుమారులు వచ్చారు.

(వైద్యులు కీళ్ళు) "నన్ను యువకుని లాగా చెయ్యండి" అన్నాడు చ్యవనుడు అశ్వినీ కుమారులతో. అశ్వినీ కుమారులు అతనిని మడుగు లోకి తీసుక వెళ్లారు తిరిగి బయటకు వచ్చేసరికి ముగ్గురు ఒక్కలాగే యవ్వనంలో వున్నారు.

తన భర్త ఎవరో తెలుసుకోలేక అశ్వినీ కుమారులను శరణు వేడింది సుకన్య. అశ్వినీ కుమారులు ఆమె భర్తను ఆమెకు అప్పగించి వెళ్ళిపోయారు. (మడుగులో మునుగగానే ముదుసలివాడు యువకు డయ్యాడన్న విషయం హేతువాద విరుద్దం. అశ్వినీ కుమారుల వైద్యం వలన ముదుసలి చ్యవనుడు ఆరోగ్యంగా, దృఢంగా తయార య్యాడన్నది సత్యం.)

యజ్ఞం చెయ్యడం కోసం శర్యాతి చ్యవనముని ఆశ్రమానికి వచ్చాడు సుకన్య యువకుని దగ్గర వుండడం చూచి తిట్టాడు. తర్వాత అసలు విషయం తెలుసుకొని బిడ్డను దగ్గరకు తీసుకున్నాడు.

చ్యవనుడు శర్యాతి చేత యజ్ఞం చేయించాడు. అర్హులు కాక పోయినా గతములో సహాయం చేసిన అశ్వినీ కుమారులకు సోమ పానం చేయించాడు అది దేవేంద్రుడు సహించలేక వజ్రాయుధంతో శర్యాతిని చంపడానికి వచ్చాడు. చ్యవనముని అడ్డుతగిలి ఆపేశాడు. చివరికి దేవతలు అశ్వినీ కుమారులు సోమపానం చేయడానికి అంగీక రించారు. (అశ్వినీ కుమారులు తమ శక్తి సామర్థ్యాల ద్వారా దేవ తలతో సమాన హక్కులు సాధించుకున్నారు. హక్కులు కష్టపడి సంపాదించుకోవలసిందే తప్ప ఎవరూ దయతలంచి ఇవ్వరు. ఓకూలీ జనులారా! దినమంతా చమటోడ్చి పని చేసినమా కడుపు నిండని ఓ నిరుపేద జనులారా! కష్టపడి పని చేయడం మాత్రమే మీ బాధ్యత కాదు. మీ హక్కు లేవో తెలుసుకోవలసిన బాధ్యత, వాటిని సాధించు కోవలసిన బాధ్యత కూడా మీ మీదేవుంది. ఈ కథ చదివి మీరు తెలుసుకోవలసింది ఇదే)

శర్యాతి మనుమడు రేవతుడు సముద్రములో కుశస్థలి అనే పట్నం కట్టాడు. రేవతుని పెద్దకొడుకు కకుద్మి. కకుద్మి కూతురు

రేవతి ఆమెకు కావలసిన వరుణ్ణి నిర్ణయించుమని బ్రహ్మ దగ్గరకు వెళ్ళాడు కకుద్మి. భూలోకంలో నారాయణాంశలో పుట్టిన బల రాముని కిమ్మని చెప్పాడు బ్రహ్మ. అలాగే చేశాడు కకుద్మి. (ఆడ పిల్లను కన్నతండ్రి వరుని కొఱకు వెదకడమే వుందికాని మగ పిల్ల వాణ్ణి కన్నతండ్రి వధువు కొఱకు వెదకడం ఆనాడు లేదు. ఈనాడు లేదు. స్త్రీకి పురుషునితో సమాన హక్కులు వచ్చిననాడు పురుషునికి లేని సమస్యలు స్త్రీకి వుండవు, ఎవరో నిర్ణయించిన పురుషుణ్ణి ఇష్టం వున్నా లేకపోయినా వెళ్లిచేసుకునే విధాన ముండదు. తనకు నచ్చిన యువకుణ్ని పెళ్ళి చేసకోవడానికి అవకాశముంటుంది.)

నభగుడి చిన్నకొడుకు నాభాగుడు అతడు చాలాకాలం గురువు ఇంట వుండిపోయాడు. అతని అన్నలు ఆస్తినంతా పంచు కున్నారు. నాభాగుడు ఇంటికి వచ్చి 'నా వాటా యేది' అని అడి గాడు. 'నాన్న నడుగు' అన్నారు వాళ్ళు.

'నాన్నా! నా వాటాయేది' అడిగాడు నాభాగుడు.

"బ్రాహ్మణులు సత్రయాగం చేస్తున్నారు. వాళ్ల దగ్గరికి వెళ్ళి రెండు వైశ్యదేవ సూక్తులు తెలియజెయ్యి. వాళ్ళు నీకు యజ్ఞంలో మిగిలిన ధనం ఇస్తారు" అన్నాడు నాభాగుడు.

అలాగే చేశాడు నాభాగుడు. యజ్ఞంలో మిగిలిన ధనం తీసుకో బోయాడు. 'యజ్ఞంలో మిగిలిన ధనం తీసుకోవడానికి అర్హుణ్ణి నేను' అని శివుడు వచ్చి మొదట ఆటంక పరిచాడు. తర్వాత 'నీకు వేదం క్షుణ్ణంగా తెలుసు కనుక ఈ ధనమంతా తీసుకో' అని చెప్పాడు.

(ఈనాడు విందు భోజనాలు అయిన తర్వాత విస్తళ్ళలో మిగిలిన ఎంగిలి మెతుకులను బిచ్చగాళ్లు, కుక్కలు, కాకులు తినడం జరుగుచున్నది. పూర్వం శివుడు యజ్ఞంలో మిగిలిన ధనమును తీసు కొనేవాడు. ఆనాడది గౌరవంగా భావించేవారు. కష్టపడి పని చేయ కుండా ఇతరుల శ్రమశక్తిని తీసుకొని అనుభవించేవాడు దొంగలాంటి వాడు. శివుడు, నాభాగుడు దొంగల్లాంటి వాళ్ళు.)

అంబరీషుడు తిరుగులేని సిరిసంపదలతో తులతూగేవాడు.

ధనాన్ని రాళ్లలాగా, బొగ్గుల్లాగా, పెంకల్లాగా చూచేవాడు. అంత గొప్ప ధనవంతుడతడు. ప్రజల నుండి డబ్బు వసూలుచేసి ధనాగారం నింపి వుంచేవాడు. ఏ కోరికలు లేనట్లు అతడు నటిస్తూ వుండేవాడు. బ్రాహ్మణులు చెప్పినట్లు రాజ్యం పరిపాలిస్తూ ఉండేవాడు. కాయ కష్టంచేసి బ్రతికేవారి దగ్గఱ డబ్బులాగి యజ్ఞాలు చేసేవాడు. బ్రాహ్మ ణులకు ధనధాన్యాలు పంచిపెట్టేవాడు.

అంబరీషుని రాజ్యంలోని ప్రజలు శ్రీహరి కథలు విని ఆలో చనాశక్తి, బుద్ధి జ్ఞానం లేనివారై అనేకవిధాల దోపిడీచేయబడుతూ కూడా తిరుగుబాటు చేసేవారుకాదు. సుఖాలకు దూరమై అనేక కష్టాలు అనుభవిస్తూ, ఆ కష్టాలు తమ పూర్వజన్మ కర్మఫలమని సరి పుచ్చుకొనేవారు.

అంబరీషుడు ఒకసారి ద్వాదశి వ్రతంలో శ్రీహరిని ఆరాధిం చాడు. కొమ్ములకు బంగారం తాపి, డెక్కలకు వెండితొడిగి, చక్కని వస్త్రాలు పైనకప్పి అప్పుడే ఈనిన అరవైకోట్ల పాడిఆవులు బ్రాహ్మ ణులకు దానంచేశాడు, రుచికరమైన భోజనాలు పెట్టించాడు (దైవ భక్తి నటిస్తూ అనేక సుఖాలు అనుభవిస్తున్న అంబరీషుడు తనకనుకూల ధర్మాలు చెప్పే బ్రాహ్మణులకు అరవైకోట్ల పాడిఆవులను దానరూ పంలో ఇచ్చాడు.) ఆనాడు దుర్వాసుడు-కోపిష్ఠి వెధవ-అతిథిగా వచ్చాడు. అంబరీషుడు దుర్వాసునికి పూజ చేసి భోజనానికి రమ్మ న్నాడు.

స్నానంచేసి వస్తానని చెప్పి దుర్వాసుడు యమునానదికి వెళ్లాడు.

"ద్వాదశి మరో ముహూర్తంవుంది. ఆలోగా పారణ పూర్తి కావాలి. లేకపోతే వ్రతఫలం దక్కదు. ఇంతచేసి వ్రతఫలం దక్కించు కోకపోతే ఎలా? బ్రాహ్మణ దుర్వాసునికి కోపమెక్కువ. అతడు రాకముందే భోజనాల మీద కూర్చుంటే ఆయనకు కోపంవచ్చి శపించ వచ్చు" అని మనసులో అనుకొన్న అంబరీషుడు కాలుగాలిన పిల్లి లాగా అటూఇటూ తిరిగాడు,

బ్రాహ్మణులు అంబరీషుని అవస్థ గ్రహించి "నీళ్లు త్రాగితే

భోజనం చేసినట్టు అవుతుంది. చెయ్యనట్టు అవుతుంది. నీళ్లు తాగిగు" అన్నారు. అంబరీషుడు బ్రాహ్మణుల అనుమతి తీసుకొని నీళ్లు తాగాడు. (వీడు బ్రాహ్మణుల అనుమతిలేనిదే గాలి కూడా పీల్చడా ఏమిటి? ఇదేమి బానిసబుద్ధి వీనికి. సుఖపడడానికి ఇదొక ఎత్తులెండి.)

దుర్వాసుడు స్నానంచేసి వచ్చాడు. అంబరీషుడు పారణ పూర్తి చేశాడని గ్రహించాడు. ఆకలితోవున్న దుర్వాసునికి కోపం వచ్చింది. అప్పుడతడిలా అన్నాడు "వీడు, ఈ అంబరీషుడు మహా క్రూరుడు, ధనమువలన కొవ్వెక్కింది వీనికి. భగవద్భక్తి అసలే లేదు వీనికి. వీడు చేసేదంతా నటన. ధర్మాన్ని కాలితో తన్నాడు. భోజనానికి పిలిచి నాకు పెట్టకుండానే తిన్నాడు (తనకు పెట్టకుండా తిన్నాడని దుర్వాసునికి కోపం వచ్చింది. అప్పుడు అంబరీషుడు నిజంగా ఎలాంటివాడో 'నిజం' చెప్పాడు దుర్వాసుడు )

దుర్వాసుడు తన జటలలోంచి ఒక జడ వూడబెరికి అంబరీషుణ్ణి చంపడానికి కృత్యను పుట్టించాడు. కృత్య అంబరీషుని మీదికి వెళ్లింది చంపడానికి. శ్రీహరి తన భక్తుణ్ణి రక్షించడం కోసం ముందే సుదర్శన చక్రం నియోగించాడు. (అంబరీషుణ్ని చంపడానికి కృత్య వస్తుందని శ్రీహరికి ముందే ఎలా తెలిసింది? రచన ఇలా చేయవచ్చునా కవిగారూ?) సుదర్శన చక్రం కృత్యను బూడిదచేసి దుర్వాసుని మీదికి తిరగబడింది. దుర్వాసుడు బ్రహ్మ దగ్గఱకు వెళ్లాడు రక్షించమని.

"నేను చేయకాని దద్దమ్మను, నిన్ను రక్షించలేను" అన్నాడు బ్రహ్మ. శివుడు అదేమాట అన్నాడు చివరికి దుర్వాసుడు విష్ణువు దగ్గఱకు వెళ్లాడు.

శ్రీహరి దుర్వాసునికిలా చెప్పాడు "అంబరీషుణ్ణి అకారణంగా బాధించాలని ప్రయత్నించి ఆపదలో చిక్కుకున్నావు. ఇప్పుడు వెళ్లి అంబరీషుని కాళ్లమీద పడు, నీ ప్రాణాలు దక్కుతాయి"

సుదర్శన చక్రం తరుముతూవుంటే పారిపోయి దుర్వాసుడు ముల్లోకాలూ తిరిగి అంబరీషుని దగ్గఱకు వచ్చేసరికి సంవత్సరం పట్టింది. (సుదర్శన చక్రం ఎంత బలహీనమైన ఆయుధమో చూడండి

తప్పు చేసిన వానిని సంవత్సర కాలంలో కూడా వెంటాడి చంపలేక పోయింది. అయితే ఇందులో కవిగారి పక్షపాత బుద్ధి కూడా వుంది. దుర్వాసుడు చేసిన తప్పే రాక్షసుడు చేసినట్లయితే కవిగారు ఇలా రాసి వుండేవారు. "రాక్షసుడు అంబరీషుణ్ణి తిట్టిన మరుక్షణమే సుదర్శన చక్రం రివ్వున వెళ్ళి రాక్షసుని తల నరికి వేసింది. తల బంతి లాగా ఎగిరి వెళ్ళి పసిఫిక్ మహా సముద్రములో లోతైనప్రాంతమైన మెరియానా ట్రెంచ్‌లో పడి మునిగి పోయింది") దుర్వాసుడు అంబరీషుని పాదాల మీద పడ్డాడు.

"అధర్మంగా ప్రవర్తించే అసురులను చంపివేసే సుదర్శన చక్రమా! ఈ బ్రాహ్మణ్ణి రక్షించు" అన్నాడు అంబరీషుడు.

సుదర్శన చక్రానికి చెవులు లేకపోయినా అంబరీషుడు చెప్పిన మాట విని శాంతించింది.

అంబరీషుడు దుర్వాసుని పాదాలు పట్టుకొని ఓదార్చిలాలించి బుజ్జగించి షడ్రసాలతో భోజనం పెట్టాడు. (అధర్మంగా ప్రవర్తించిన దుర్వాసుని పాదాలను అంబరీషుడు పట్టుకోవడమేమిటి? అంబరీషునికి వేపకాయంత వెర్రి వున్నట్టుంది.) దుర్వాసుడు కడుపునిండా మెక్కి "రాజా! నీకు శుభం కలుగుతుంది. లోకం నిన్ను కీర్తిస్తుంది" అని తిన్నదంతా అరిగేదాకా పొగడి భుక్తాయాసం తీరిన తర్వాత బ్రహ్మ లోకం వెళ్లి పోయాడు.

అంబరీషుని మనుమని కొడుకు రథీతరుడు. రథీతరునికి మగ తనం లేదు. అందు వలన అతడు తన భార్యను అంగిర ముని దగ్గర పడుకొమ్మన్నాడు. ఆమె అంగిర మునితో జతకట్టడం వలన కుమారులు కలిగారు. వాళ్లే అంగీరసులు. క్షత్రియ గోత్రీకులైన బ్రాహ్మణులు వాళ్లు (సంకరవర్ణం.)

ఒకసారి మనువు తుమ్మాడు. అప్పుడు అతని ముక్కులో నుండి ఇక్ష్వాకుడనే కుమారుడు పుట్టాడు. (తుమ్మితే కొడుకు పుడు తాడా? అనేది ప్రశ్న. అసంభవం అనేది సమాధానం.)

ఇక్ష్వాకునికి వందమంది కుమారులు కలిగారు. అందులో వికుక్షి

తప్పు చేసిన వానిని సంవత్సర కాలంలో కూడా వెంటాడి చంపలేక పోయింది. అయితే ఇందులో కవిగారి పక్షపాత బుద్ధి కూడా వుంది. దుర్వాసుడు చేసిన తప్పే రాక్షసుడు చేసినట్లయితే కవిగారు ఇలా రాసి వుండేవారు. "రాక్షసుడు అంబరీషుణ్ణి తిట్టిన మరుక్షణమే సుదర్శన చక్రం రివ్వున వెళ్ళి రాక్షసుని తల నరికి వేసింది. తల బంతి లాగా ఎగిరి వెళ్ళి పసిఫిక్ మహా సముద్రములో లోతైన ప్రాంతమైన మెరియానా ట్రెంచ్‌లో పడి మునిగి పోయింది") దుర్వాసుడు అంబరీషుని పాదాల మీద పడ్డాడు.

"అధర్మంగా ప్రవర్తించే అసురులను చంపివేసే సుదర్శన చక్రమా! ఈ బ్రాహ్మణ్ణి రక్షించు" అన్నాడు అంబరీషుడు.

సుదర్శన చక్రానికి చెవులు లేకపోయినా అంబరీషుడు చెప్పిన మాట విని శాంతించింది.

అంబరీషుడు దుర్వాసుని పాదాలు పట్టుకొని ఓదార్చిలాలించి బుజ్జగించి షడ్రసాలతో భోజనం పెట్టాడు. (అధర్మంగా ప్రవర్తించిన దుర్వాసుని పాదాలను అంబరీషుడు పట్టుకోవడమేమిటి? అంబరీషునికి వేపకాయంత వెర్రి వున్నట్టుంది.) దుర్వాసుడు కడుపునిండా మెక్కి "రాజా! నీకు శుభం కలుగుతుంది. లోకం నిన్ను కీర్తిస్తుంది" అని తిన్నదంతా అరిగేదాకా పొగడి భుక్తాయాసం తీరిన తర్వాత బ్రహ్మ లోకం వెళ్లి పోయాడు.

అంబరీషుని మనుమని కొడుకు రథీతరుడు. రథీతరునికి మగ తనం లేదు. అందు వలన అతడు తన భార్యను అంగిర ముని దగ్గఱ పడుకొమ్మన్నాడు. ఆమె అంగిర మునితో జతకట్టడం వలన కుమా రులు కలిగారు. వాళ్లే అంగీరసులు. క్షత్రియ గోత్రీకులైన బ్రాహ్మ ణులు వాళ్లు (సంకరవర్ణం.)

ఒకసారి మనువు తుమ్మాడు. అప్పుడు అతని ముక్కులో నుండి ఇక్ష్వాకుడనే కుమారుడు పుట్టాడు. (తుమ్మితే కొడుకు పుడు తాడా? అనేది ప్రశ్న. అసంభవం అనేది సమాధానం.)

ఇక్ష్వాకునికి వందమంది కుమారులు కలిగారు. అందులో వికుక్షి

పుట్టడం సంభవిస్తుందా? నోటిలో అగ్ని వుంటుందా? అందులో 20,997 మంది పడి చావడం జరుగుతుందా?

యువనాశ్వునికి వందమంది భార్యలు. అతనికి సంతానం కలుగలేదు. కుమారుని కోసం యజ్ఞం చేయించారు మునులు. యజ్ఞం జరుగుచుండగా, రాత్రి దాహంతో మునులు మంత్రించి వుంచిన నీళ్లు త్రాగాడు. యువనాశ్వునికి గర్భం పెరిగింది. 9 నెలలు నిండిన తర్వాత యువనాశ్వుని కుడి పక్క చీల్చుకొని మాంధాత జనించాడు. (నీళ్ళు త్రాగితే మగవానికి గర్భం పెరుగుతుందా? కడుపును చీల్చుకొని కొడుకు పుట్టాక యువనాశ్వుడు బ్రతికాడే? సంభవమేనా?)

మాంధాత యజ్ఞాలుచేసి దానాలు చేశాడు.

మాంధాత ఇందుమతిని పెళ్ళాడి పురుకుత్సుణ్ణి, అంబరీషుణ్ణి, ముచికుందుణ్ణి, 50 మంది కూతుర్లను కన్నాడు.

50 మంది కూతుళ్ళు ముసలి సౌభరి ఋషిని భర్తగా వరించారు. అతడు యౌవనవంతుడై 50 మంది భార్యల వలన 5 వేల మంది పిల్లలను కని అడవికి వెళ్ళి తపస్సు చేసి చచ్చిపోయాడు.

సత్యవ్రతుడు తండ్రి శాపం వల్ల చండాలుడయ్యాడు. కాని విశ్వామిత్రుని దయ వలన స్వర్గానికి వెళ్లాడు. దేవతలు అతణ్ని స్వర్గంలో నుండి తోసేశారు. కిందపడకుండా విశ్వామిత్రుడు అతణ్ణి అంతరిక్షంలో నిలిపాడు (ఆనాటి సమాజములో కూడా కొందరు హీనకులం వారని, కొందరు ఉన్నత కులం వారనే భేదభావం వుండేది. ఉన్నత కులం వారికి స్వర్గములో స్థానము లభిస్తుందని, హీనకులం వారికి స్వర్గములో స్థానముండదని ఆనాటి వారు అభిప్రాయపడుతూ వుండేవారు.

సత్యవ్రతుడు తండ్రి శాపం వల్ల చండాలుడెలా అయ్యాడు అనే అనుమానం వస్తుంది సత్యవ్రతుడు తండ్రికిష్టంలేని పని ఏదో చేశాడనీ, తండ్రి అతణ్ని హీనంగా చూశాడనీ మనం అర్థం చేసుకోవాలి.)

త్రిశంకుని కుమారుడు హరిశ్చంద్రుడు.

పుట్టడం సంభవిస్తుందా? నోటిలో అగ్ని వుంటుందా? అందులో 20,997 మంది పడి చావడం జరుగుతుందా?

యువనాశ్వునికి వందమంది భార్యలు. అతనికి సంతానం కలుగలేదు. కుమారుని కోసం యజ్ఞం చేయించారు మునులు. యజ్ఞం జరుగుచుండగా, రాత్రి దాహంతో మునులు మంత్రించి వుంచిన నీళ్లు త్రాగాడు. యువనాశ్వునికి గర్భం పెరిగింది. 9 నెలలు నిండిన తర్వాత యువనాశ్వుని కుడి పక్క చీల్చుకొని మాంధాత జనిస్తుంచాడు. (నీళ్ళు త్రాగితే మగవానికి గర్భం పెరుగుతుందా? కడుపును చీల్చుకొని కొడుకు పుట్టాక యువనాశ్వుడు బ్రతికాడే? సంభవమేనా?)

మాంధాత యజ్ఞాలుచేసి దానాలు చేశాడు.

మాంధాత ఇందుమతిని పెళ్ళాడి పురుకుత్సుణ్ణి, అంబరీషుణ్ణి, ముచికుందుణ్ణి, 50 మంది కూతుర్లను కన్నాడు.

50 మంది కూతుళ్ళు ముసలి సౌభరి రుషిని భర్తగా వరించారు. అతడు యౌవనవంతుడై 50 మంది భార్యల వలన 5 వేల మంది పిల్లలను కని అడవికి వెళ్ళి తపస్సు చేసి చచ్చిపోయాడు.

సత్యవ్రతుడు తండ్రి శాపం వల్ల చండాలుడయ్యాడు. కాని విశ్వామిత్రుని దయ వలన స్వర్గానికి వెళ్లాడు. దేవతలు అతణ్ని స్వర్గంలో నుండి తోసేశారు. కిందపడకుండా విశ్వామిత్రుడు అతణ్ణి అంతరిక్షంలో నిలిపాడు (ఆనాటి సమాజములో కూడా కొందరు హీనకులం వారని, కొందరు ఉన్నత కులం వారనే భేదభావం వుండేది. ఉన్నత కులం వారికి స్వర్గములో స్థానము లభిస్తుందని, హీనకులం వారికి స్వర్గములో స్థానముండదని ఆనాటి వారు అభిప్రాయపడుతూ వుండేవారు.

సత్యవ్రితుడు తండ్రి శాపం వల్ల చండాలుడెలా అయ్యాడు అనే అనుమానం వస్తుంది సత్యవ్రితుడు తండ్రికిష్టంలేని పని ఏదో చేశాడనీ, తండ్రి అతణ్ని హీనంగా చూశాడనీ మనం అర్థం చేసుకోవాలి.)

త్రిశంకుని కుమారుడు హరిశ్చంద్రుడు.

ధనికుల చేతుల్లో నలిగిపోయే విధానం ఈ కథలో చూడవచ్చు. ఈ కథ వలన ఆనాటి సమాజంలోని ఆర్థిక అసమానత్వాన్ని గ్రహించవచ్చును.)

బహుకుని రాజ్యం శత్రువులు అపహరించారు. అందుకని అతడు భార్యతో అడవికి వెళ్ళిపోయాడు. తర్వాత అతడు ముసలివాడై చచ్చిపోయాడు. అతని భార్య సహగమనం చెయ్యడానికి సిద్ధపడింది. (ఆ కాలంలో సహగమనం అనే ఆచారం అమలులో వుండేది. అయితే అది బలవంతంగా కాదు.) ఆమె గర్భవతి అని తెలుసుకొని ఔర్యముని ఆమెను వారించాడు. తర్వాత ఆమెకు సవతులు విషం పెట్టారు. విషం తిన్న తర్వాత కొన్నాళ్ళకు కొడుకు పుట్టాడు. అతడే సగరుడు.

సగరుడు శత్రువులను వికలాంగులను చేసి వారి సంపదలను దోచుకొని, వారిని అవమానపరచి సామ్రాట్టు అయ్యాడు.

ఔర్యుడి ఉపదేశం ప్రకారం సగరుడు అశ్వమేధయాగం చేశాడు. అతడు యజ్ఞంలో విడిచి పెట్టిన గుఱ్ఱాణ్ని దేవేంద్రుడు ఎత్తుక పోయాడు. (ఈ దొంగ వెధవే దేవతల రాజు. దేవతల నాయకుడే దొంగైనప్పుడు, అతని రాజ్యంలోని దేవతలు మాత్రం దొంగలు కాకుండా వుంటారా?)

సగర చక్రవర్తికి సుమతి గర్భంలో పుట్టిన 60 వేల మంది కుమారులు తండ్రి ఆజ్ఞ ప్రకారం గుఱ్ఱం వెదకడానికి బయలుదేరి భూగోళమంతా గాలించారు. (ఆనాటి వారి వాహనం గుఱ్ఱం. అంతకంటే వేగంగా పరుగెత్తే వాహనం వారికప్పుడు అందుబాటులో లేదు. నడచిగానీ, గుఱ్ఱము మీద కూర్చుండి గానీ భూగోళమంతా గాలించడం సాధ్యమవుతుందా?) గుఱ్ఱం ఎక్కడా కనబడలేదు. భూమిని త్రవ్వడం మొదలు పెట్టారు. తవ్వుతూ పాతాళం వెళ్ళారు. (ఈ పాతాళం ఎక్కడ వుంది కవిగారూ?) అక్కడ కపిలముని వున్నాడు. అతనికి సమీపములోనే గుఱ్ఱము వుంది. కపిలముని దొంగనుకొని అతనిని చంపెయ్యడానికి ప్రయత్నం చేశారు సగరపుత్రులు. కపిల

ధనికుల చేతుల్లో నలిగిపోయే విధానం ఈ కథలో చూడవచ్చు. ఈ కథ వలన ఆనాటి సమాజంలోని ఆర్థిక అసమానత్వాన్ని గ్రహించవచ్చును.)

బహుకుని రాజ్యం శత్రువులు అపహరించారు. అందుకని అతడు భార్యతో అడవికి వెళ్ళిపోయాడు. తర్వాత అతడు ముసలివాడై చచ్చిపోయాడు. అతని భార్య సహగమనం చెయ్యడానికి సిద్ధపడింది. (ఆ కాలంలో సహగమనం అనే ఆచారం అమలులో వుండేది. అయితే అది బలవంతంగా కాదు.) ఆమె గర్భవతి అని తెలుసుకొని ఔర్వముని ఆమెను వారించాడు. తర్వాత ఆమెకు సవతులు విషం పెట్టారు. విషం తిన్న తర్వాత కొన్నాళ్లకు కొడుకు పుట్టాడు. అతడే సగరుడు.

సగరుడు శత్రువులను వికలాంగులను చేసి వారి సంపదలను దోచుకొని, వారిని అవమానపరచి సామ్రాట్టు అయ్యాడు.

ఔర్వుడి ఉపదేశం ప్రకారం సగరుడు అశ్వమేధయాగం చేశాడు. అతడు యజ్ఞంలో విడిచి పెట్టిన గుఱ్ఱాణ్ని దేవేంద్రుడు ఎత్తుక పోయాడు. (ఈ దొంగ వెధవే దేవతల రాజు. దేవతల నాయకుడే దొంగైనప్పుడు, అతని రాజ్యంలోని దేవతలు మాత్రం దొంగలు కాకుండా వుంటారా?)

సగర చక్రవర్తికి సుమతి గర్భంలో పుట్టిన 60 వేల మంది కుమారులు తండ్రి ఆజ్ఞ ప్రకారం గుఱ్ఱం వెదకడానికి బయలుదేరి భూగోళమంతా గాలించారు. (ఆనాటి వారి వాహనం గుఱ్ఱం. అంతకంటే వేగంగా పరుగెత్తే వాహనం వారికప్పుడు అందుబాటులో లేదు. నడచిగానీ, గుఱ్ఱము మీద కూర్చుండి గానీ భూగోళమంతా గాలించడం సాధ్యమవుతుందా?) గుఱ్ఱం ఎక్కడా కనబడలేదు. భూమిని త్రవ్వడం మొదలు పెట్టారు. తవ్వుతూ పాతాళం వెళ్ళారు. (ఈ పాతాళం ఎక్కడ వుంది కవిగారూ?) అక్కడ కపిలముని వున్నాడు. అతనికి సమీపములోనే గుఱ్ఱము వుంది. కపిలముని దొంగనుకొని అతనిని చంపెయ్యడానికి ప్రయత్నం చేశారు సగరపుత్రులు. కపిల

(చచ్చిపోయిన పిల్లలను బ్రతికించేశక్తి అసమంజసుని దగ్గఱ వుందా? అలా అయితే 60 వేల మంది సగర పుత్రులను ఎందుకు బ్రతికించ లేదు? ఇది కవిగారి కల్పితమే అయినా ఇందులో కూడా లోపం వుంది.)

అసమంజసుని కుమారుడు అంశుమంతుడు.

అంశుమంతుడు తాతగారి ఆజ్ఞప్రకారం గుఱ్ఱం వెదకుతూ కపిల దేవుని దగ్గఱకు వెళ్ళాడు. అతణ్ణి చాలా సేపు పొగిడాడు. "నేను మూర్ఖుణ్ణి" అని తనను తాను తిట్టుకున్నాడు (ఇది కవిగారి అతితెలివి.)

కపిలుడు అంశుమంతునికి గుఱ్ఱం ఇచ్చాడు. "నీ చిన్న తండ్రులు బూడిదై పోయారు. గంగాజలం వల్ల వీరు ముక్తి పొందుతారు" అని చెప్పాడు (సగరపుత్రులను బ్రతికించే శక్తి కపిల మునికి లేదన్న మాట అసమంజసునికి చచ్చిన వాళ్ళను బ్రతికించేశక్తి వుందని కవి గారు రాశారు. కాని అతడు సగరపుత్రులను బ్రతికించాడని మాత్రం వ్రాయలేదు.........కవిగారూ! ఈ విషయం మరిచిపోయారా లేక కథ నడిపించడమే ముఖ్యమని భావించారా?)

అంశుమంతుడు గుర్రం తీసుకొని వచ్చాడు సగరుడు యజ్ఞం పూర్తి చేశాడు. (గుర్రాన్ని దొంగిలించిన ఇంద్రుణ్ని, తన కుమారు లను చంపిన కపిలుణ్ని సగర చక్రవర్తి చేసిందేమీ లేదు సగరుడు ఇంత బలహీనుడా? కూర్చున్న చోటునుండి కదలడా యేంటి? ఇతని రాజ్యములో ఎన్ని ఘోరాలు జరిగినా ఇలాగే నోరుమూసుకొని కూర్చుంటాడా? ఇతని రాజ్యములో ప్రజలు సుఖపడ్డారను కోవ డానికి వీలుందా?

గంగను తీసుకరావడానికి అంశుమంతుడు తపస్సు చేశాడు. కాని ప్రయత్నం ఫలించకముందే చచ్చిపోయాడు. (తపస్సు చేస్తు న్న వాళ్ళు కూడా మామూలుగా పనిచేసుకొని బ్రతికేవారిలాగే చని పోతారన్నమాట. అయితే తపస్సులోనూ, తపస్సు చేసేవారిలోనూ ఉన్న ప్రత్యేకత ఏమిటి? ఏమీలేదు. పని ఎగగొట్టి కూర్చుండడానికి

ఇదొక ఎత్తు.)

అంశుమంతుని కుమారుడు దిలీపుడు గంగను తీసుక రావడం కోసం తపస్సు చేస్తూ చచ్చిపోయాడు.

దిలీపుని కుమారుడు భగీరథుడు. అతడు ఘోరమైన తపస్సు చేశాడు. గంగాదేవి ప్రత్యక్షమై 'వరమిస్తాను కోరుకో' అంది (గంగాదేవి అంటే గంగానది అంటే ప్రవహించే నీరు.........భగీరథుని దగ్గఱకు వచ్చి మాట్లాడిందా? వరమిస్తాను కోరుకో అందా? కవి గారూ! మీరు పాఠకుల తర్కజ్ఞానాన్ని తక్కువగా అంచనా వేసి ఈ కథ రాశారండీ.)

"భూలోకానికి దయచెయ్యి" అన్నాడు భగీరథుడు.

"నేను స్వర్గం నుండి భూమికి దిగినప్పుడు నావడికి తట్టుకో గలిగిన వాళ్ళు కావాలి. లేకపోతే భూమిని చీల్చుకొని రసాతలానికి పోతాను-పాపాత్ములు తమ పాపాలన్నీ నాలో విడిచిపెడుతారు. ఈ కారణంగా కూడా నేను భూమి మీదికి రావడానికి సంకోచిస్తున్నాను—అంది గంగ. (భగీరథుడు ఎక్కడ కూర్చుండి తపస్సు చేశాడు? గంగ అతనికి ఎక్కడ ప్రత్యక్షమైంది? అనేది ఒక ప్రశ్న. స్వర్గం ఎక్కడవుంది అనేది ఇంకో ప్రశ్న?

పాపాత్ములు పాపాలన్నీ నాలో విడిచిపెడుతారని గంగ సంకోచించిందట. పాపాలు ఘన రూపంలో వుంటాయా? ద్రవ రూపంలో వుంటాయా? పాపమనేది శరీరాన్ని మట్టిలాగా అంటుకొని వుంటుందా?

పాపాలు చేసినవాడు గంగలో మునిగి తేలితే వాని పాపాలన్నీ పోయి పుణ్యాత్ముడవుతాడా? ఇది కేవలం దోపిడీదారులకు ఉపయోగపడే నీతి అందుకే ఈనాటికి కూడా ఎందరో ఎన్నో పాపాలుచేసి గంగలో మునిగి పవిత్రులమయ్యామని భావిస్తున్నారు.)

"సాధువులు తమ శరీరస్పర్శతో నీ పాపాలు పోగొడుతారు. శివుడు నీవడి భరిస్తాడు. కనుక నువ్వు భూలోకానికి రావాలి" అని చెప్పాడు భగీరథుడు.

గంగ సరేనని ఒప్పుకొంది. భగీరథుడు మళ్ళీ శివుని కోసం తపస్సు చేశాడు. శివుడు ప్రత్యక్షమై భగీరథుని ప్రార్థన మన్నించి గంగను తల మీద ధరించాడు.

గాలిలా ఎగిరే రథమెక్కి ముందు వెళ్ళాడు భగీరథుడు. రథం వెంట గంగాదేవి భస్మరాసుల దగ్గరకు వెళ్లి భస్మరాసులను తనలో కలుపుకొంది. (గంగాదేవి బూడిదరాసులను మింగిందా?) సగర పుత్రులు పాపాలు పోగొట్టుకొని స్వర్గం పోయారు. (ఈ కథలోనున్న విషయాలన్నీ అభూతకల్పనలు. ప్రకృతిని జయించాలన్న కాంక్ష మానవునికి అనాది కాలము నుండి వున్నదని ఈ కథ ద్వారా తెలుసుకోవచ్చు)

ఒకసారి సౌదాసుడనే వాడు వేటకు వెళ్లాడు. వేటలో ఒక రాక్షసుణ్ణి చంపేశాడతడు. (కారణమేమిటో చెప్పలేదు కవి.) అతని తమ్ముణ్ణి మాత్రం వదిలేశాడు. రాక్షసుని తమ్ముడు తన అన్నను చంపినవాని మీద పగ తీర్చుకోవాలనుకొని వంటవాని వేషంలో వచ్చి సౌదాసుని వంటశాలలో కుదురుకున్నాడు.

ఓనాడు వసిష్ఠుడు సౌదాసునింటికి భోజనానికి వచ్చాడు. వంటవాడు-రాక్షసుడు-మనిషి మాంసం వండి వడ్డించాడు. వసిష్ఠ ముని ఆ మాంసం చూచి సౌదాసుణ్ణి - యజమానిని - రాక్షసుడవు కమ్మని శపించాడు. (గతములో మనిషి మాంసాన్ని మనిషి తినే రోజులు కూడా వుండేవి. కాని ఈ కథా కాలం నాటికి మనిషి మాంసం మనిషి తినడం తప్పుగానూ, నీచంగానూ భావించేవారు.)

అది రాజు చేసిన తప్పు కాదని, రాక్షసుని కుట్రఅని తెలిశాక ఆ శాపం 12 సంవత్సరాలు మాత్రం వుండేట్టు తగ్గించాడు వసిష్ఠుడు. (సౌదాసుడు నిరపరాధి అని తెలిశాక కూడా అతణ్ణి శిక్షించుట అన్యాయం కాదా?) తప్పులేందే తనకు శాపం పెట్టడం చేత తాను కూడా వసిష్ఠుణ్ణి శపించడానికి చేతిలో నీళ్ళు పుచ్చుకున్నాడు సౌదాసుడు. అతని భార్య వద్దని వారించింది. (తపోగర్వంతో నిరపరాధియైన నీ భర్తను శిక్షించిన ఈ నీచ వసిష్ఠుణ్ణి శిక్షించవలదని

ఎందుకన్నావమ్మా?) (కోధాగ్నివంటి నాచేతిలోని నీళ్లు ఎక్కడ పోసేది అంటూ ఆలోచించాడు సౌదాసుడు. తుదకు తన పాదాల మీద పోసుకున్నాడు. (మనిషి మాంసం వండిపెట్టిన రాక్షసుని మీద పొయ్యలేదెందుకు?) ఆ నీళ్ళుపడి అతని పాదాలు నల్లబడ్డాయి-ఇంతేనా ఆ నీటి మహిమ.)

వసిష్ఠుని శాపం ప్రకారం సౌదాసుడు రాక్షసుడై పోయాడు. (వసిష్ఠుని లాంటి ఆలోచనాహీనులు లోకంలో వున్నంత కాలం మంచివాళ్ళు కూడా చెడ్డవాళ్లుగా మారే ప్రమాదం వుంది.) అతడొక నాడు ఆకలితో అడవిలో తిరుగుతూ భార్యతో సంభోగం చేస్తున్న బ్రాహ్మణ్ణి పట్టేశాడు. (బహిరంగ సంభోగాలు పూర్వకాలంలో జరుగుతూ వుండేవని ఈ కథ ద్వారా గ్రహించవచ్చు.)

"సంతాన వాంఛతో వున్నాను. కనుక నా భర్తను విడిచి పెట్టు, ఇతడు నిరపరాధి, ఇతణ్ణి చంపడం అన్యాయం, ఇతణ్ణి చంపుక తినడమే నీ నిశ్చయమైతే ముందు నన్ను చంపుక తిను" అంది ఆ బ్రాహ్మణి.

సౌదాసుడు బ్రాహ్మణ్ణి చంపితిన్నాడు. (బ్రాహ్మణ్ణి చంపుక తిన్నవాడు ఆ స్త్రీని వదిలి పెడుతాడా? సౌదాసుడు ఆ స్త్రీని చంపుక తిన్నట్టు కవి వ్రాయలేదు.)

"కామం తో బాధపడుతున్నాను నా భర్తను చంపిన నువ్వు స్త్రీ సంయోగానికి పూనుకోగానే తల పగిలి చస్తావు" అంది ఆ స్త్రీ. (శపించిన తర్వాతనైనా సౌదాసుడా స్త్రీని చంపి తినకుండా వుంటాడా? ఇక్కడ కూడా కవిగారు కథ నడపడమే ముఖ్యమని భావించినట్టున్నారు.

ఈ బ్రాహ్మణ స్త్రీ సౌదాసునితో కామ బాధను తీర్చుకో గూడదా? తప్పంటారా? వసిష్ఠుడు సౌదాసుని భార్య దగ్గర పండు కునే ఘట్టం వస్తుంది ముందు. అది తప్పుకాకపోతే ఇదికూడా తప్పు కాదుకదా!

"బ్రాహ్మణుడు క్షత్రియ స్త్రీతో సంభోగం చేయవచ్చును.

కానీ క్షత్రియుడు బ్రాహ్మణ స్త్రీతో సంభోగం చేయరాదు" అని వేదాలలో వుంది. వేదనీతులను సమర్థించే కవిగారు దానికి విరుద్ధంగా రాస్తారా? సమానత్వాన్ని కాంక్షిస్తారా?) తర్వాత భర్త ఎముకలను చితిలో పెట్టి నిప్పంటించి ఆమె కూడా చితిలోపడి విలవిలా తున్నుకొని చాలా కష్టపడి చచ్చిపోయింది.

12 సంవత్సరాలు పూర్తయాక సౌదాసుని శాపం తీరిపోయింది. సంగమవాంఛతో తన భార్య మదయంతి దగ్గరకు వెళ్ళాడతడు. బ్రాహ్మణి శాపం ఎరిగిన మదయంతి వద్దని వారించింది. ఆనాటి నుండి స్త్రీ సాంగత్యం మానుకున్నాడు సౌదాసుడు. (ఎలా మానుకున్నాడు? కామవాంఛ అతని శరీరం నుండి ఎగిరిపోయిందా? లేక తిండి తినడం తగ్గించాడా?) అతనికి సంతానం లేదు. సంతానం కోసం వసిష్ఠుణ్ని ప్రార్థించాడు వసిష్ఠుడు మదయంతి దగ్గఱ పడుకోవడం వలన ఆమె గర్భవతి అయింది. (వసిష్ఠుని లాంటి మునులు సంతానం లేని రాజుల భార్యల దగ్గఱపడుకొని వాళ్లను గర్భవతులుగా తయారు చేస్తారు..................తమకు మంది పెళ్ళాల దగ్గఱ పండే అవకాశం దొరికినందుకు వాళ్లు సంతోషపడుతారు. ఈ పద్ధతి తప్పని వాళ్ళు చెప్పరు. పైగా ప్రోత్సహిస్తారు కూడా.)

మదయంతి గర్భవతి అయింది. 7 సంవత్సరాలదాకా ప్రసవించలేదామె. (7 సంవత్సరాలంటే 2555 దినాలు. అమ్మో...... అమ్మో......ఇన్ని రోజులు మదయంతి గర్భం మోసిందా కవి గారూ?) అప్పుడు వసిష్ఠుడు రాతితో ఆమె గర్భం మీద కొట్టాడు. ఆమె ప్రసవించింది (శిశువు చావలేదా?) కుమారుడు కలిగాడు. అతని పేరు ఆశ్మకుడు. ఆశ్మకుని కుమారుడు మూలకుడు. పరశురాముడు లోకంలో క్షత్రియుల్ని తెగనరికినప్పుడు స్త్రీ జనం అతణ్ని కాపాడారు. (పరశురామునికి ఏం రోగమని రాజులందరినీ చంపాడు.) పరశురాముని చేతనాశనమైన క్షత్రియకులానికి మూలాధారం కావడం చేత అతని పేరు మూలకుడయింది. మూలకుని కుమారుడు దశరథుడు. దశరథుని కుమారుడు ఐలబిలుడు. ఐలబిలుని కుమారుడు

విశ్వసహు. విశ్వసహుని కుమారుడు ఖట్వాంగుడు. ఖట్వాంగుడి కుమారుడుదీర్ఘ బాహుడు. దీర్ఘ బాహుని కుమారుడు రఘు మహారాజు. రఘు మహారాజు కుమారుడు అజుడు. అజుని కుమారుడు దశరథుడు. దశరథుని కుమారులు రామలక్ష్మణ భరత శత్రుఘ్నులు (ఇందులో భర్తల పేర్లు ఇచ్చారు, కాని భార్యల పేర్లు ఇవ్వలేదు. పురుషుల ఆధిక్యతగల కాలంనాటి కవి వ్యాసకవి. భర్త కాని పురుషునితో కొడుకును కన్న మదయంతి వారసుడు శ్రీరాముడు. వసిష్ఠుడు ఏ కాలం నాటివాడు? శ్రీరాముడు ఏ కాలంనాటివాడు? ఈనాడు కథలలో ఇలాంటి విషయాలు వ్రాస్తే అంగీకరించని పాఠకులు వ్యాసకవి రచనలను అమూల్యమైనవిగా ఎందుకు భావిస్తున్నారు? సామాన్యలోక జ్ఞానానికి విరుద్ధంగా వ్రాసిన ఈ కవిని గొప్పవాడని పొగడుతారెందుకు?)

విశ్వామిత్రుడు తన పలుకుబడిని పెంచుకొనుటకు యాగం చేయాలనుకున్నాడు యజ్ఞం చేస్తున్నాననీ, సాధ్యమైనంత సహాయం చేయండనీ తనకు తెలిసిన ధనికులను కోరాడు.

చాలామంది ధనవంతులు ధనధాన్యాలు, పాలు పెరుగు, ఆవులు మొదలగు వానిని పంపారు.

యజ్ఞానికి వచ్చే బ్రాహ్మణులకు, మునులకు (సంఘాన్ని శాసించే అంతస్థుకల వారు) వస్త్రాలు, ధనము, బంగారము, పాడి ఆవులు ఇచ్చి వారిని సంతోషపరచి తన ఆధిక్యత పెంచుకోవాలన్నది విశ్వామిత్రుని ధ్యేయం. పది మందిచేత బ్రహ్మర్షి అనిపించుకోవాలన్న ఆరాటం ఇ.కొకటి.

యజ్ఞశాలలో ఎన్ని జంతువులను బలిఇస్తే అంత పెద్ద యజ్ఞంగా చెప్పుకోబడుతుంది యజ్ఞాగ్నిలో నెయ్యి, నూనె, ధాన్యాలు మొదలగు ఆహార పదార్థాలు ఎంత ఎక్కువగా కాలిస్తే అంత గొప్ప యజ్ఞంగా పేర్కొనబడుతుంది. సాధ్యమైనన్ని జంతువులను బలిఇచ్చి, చాలా రకాల ఆహార పదార్థాలను యజ్ఞాగ్నిలో కాల్చి వేసి గొప్ప సోమయాజిగా పేరుపొంది పలుకుబడి సంపాదించుకోవాలన్న ఉద్దేశ

ముతో విశ్వామిత్రుడు యాగం ప్రారంభించాడు.

ఆ యజ్ఞానికి బ్రాహ్మణులు, మునులు చాలామంది హాజర య్యారు.

విశ్వామిత్రుడు యజ్ఞం చేస్తున్నాడని, వ్యవసాయానికి ఉప యోగపడే జంతువులను బలిఇస్తున్నాడని, ప్రాణికోటి తినవలసిన ఆహార పదార్థాలను యజ్ఞాగ్నిలో కాల్చివేస్తున్నాడని తాటకి అనే ఆటవిక స్త్రీకి తెలిసింది.

నాగరిక సమాజంచేత చిన్నచూపు చూడబడుతున్న ఆటవిక జాతిలో ఆమెకు ఓ ప్రత్యేకత వుంది. దోపిడీదారులచేత అణచి వేయ బడుతున్న వారిని కార్యోన్ముఖులను చేస్తుందామె. అన్యాయాలను ఎదుర్కొంటుందామె. దోపిడీదారులను ఎదిరించి దోపిడీ విధానాన్ని అంతం చేయడమే ఆమె లక్ష్యం. అణచివేయబడుతున్న తమ జాతి ప్రజలను విముక్తి చేయాలన్న ఆరాటం వుందామెలో, కాని దోపిడీ దారుల దగ్గఱ వున్నన్ని మారుణాయుధాలు ఆ ఆటవికుల వద్దలేవు. అయినా అన్యాయాలను, అక్రమాలను సహిస్తూ ఆకలి బాధలతో, కనీస అవసరాలు తీరని దుర్భర పరిస్థితిలో బ్రతకడం కన్న దోపిడీ దారులను లక్ష్యపెట్టకుండా, వారి ఆయుధాలకు భయపడకుండా, ప్రాణాలకు తెగించి పోరాడడమే కర్తవ్యమని బోధిస్తుందామె

గతములో ఆమెభర్త సుందుడు దోపిడీదారులను ఎదిరించి అగస్త్య మహర్షిచేత చంపబడ్డాడు.

తాటకి యజ్ఞం జరుగుతున్న ప్రదేశానికి తన సహచరులతో బయలుదేరింది ఎలాగైనా యజ్ఞాన్ని నిలిపి వెయ్యాలి. యజ్ఞములో కాల్చివేయడానికి సిద్ధపరచిన ధన ధాన్యాలను వశపరచుకోవాలి. వ్యవసాయానికి ఉపయోగపడే జంతువులను యజ్ఞములో బలిఇవ్వ కుండా రక్షించాలి. ఇది ఆమె ఆరాటం, అందుకె ఆమె చేస్తుంది పోరాటం.

యజ్ఞం జరుగుతున్న ప్రదేశానికి చేరుకుంది తాటకి. విలు విద్యలో ఆమె నేర్పరి. ఆమె విల్లు పట్టిందంటే ఎదిరించి పోరాడే

ముతో విశ్వామిత్రుడు యాగం ప్రారంభించాడు.

ఆ యజ్ఞానికి బ్రాహ్మణులు, మునులు చాలామంది హాజర య్యారు.

విశ్వామిత్రుడు యజ్ఞం చేస్తున్నాడని, వ్యవసాయానికి ఉప యోగపడే జంతువులను బలిఇస్తున్నాడని, ప్రాణికోటి తినవలసిన ఆహార పదార్థాలను యజ్ఞాగ్నిలో కాల్చివేస్తున్నాడని తాటకి అనే ఆటవిక స్త్రీకి తెలిసింది.

నాగరిక సమాజంచేత చిన్నచూపు చూడబడుతున్న ఆటవిక జాతిలో ఆమెకు ఓ ప్రత్యేకత వుంది. దోపిడీదారులచేత అణచి వేయ బడుతున్న వారిని కార్యోన్ముఖులను చేస్తుందామె. అన్యాయాలను ఎదుర్కొంటుందామె. దోపిడీదారులను ఎదిరించి దోపిడీ విధానాన్ని అంతం చేయడమే ఆమె లక్ష్యం. అణచివేయబడుతున్న తమ జాతి ప్రజలను విముక్తి చేయాలన్న ఆరాటం వుందామెలో, కాని దోపిడీ దారుల దగ్గఱ వున్నన్ని మారణాయుధాలు ఆ ఆటవికుల వద్దలేవు. అయినా అన్యాయాలను, అక్రమాలను సహిస్తూ ఆకలి బాధలతో, కనీస అవసరాలు తీరని దుర్భర పరిస్థితిలో బ్రతకడం కన్న దోపిడీ దారులను లక్ష్యపెట్టకుండా, వారి ఆయుధాలకు భయపడకుండా, ప్రాణాలకు తెగించి పోరాడడమే కర్తవ్యమని బోధిస్తుందామె

గతములో ఆమెభర్త సుందుడు దోపిడీదారులను ఎదిరించి అగస్త్య మహర్షిచేత చంపబడ్డాడు.

తాటకి యజ్ఞం జరుగుతున్న ప్రదేశానికి తన సహచరులతో బయలుదేరింది ఎలాగైనా యజ్ఞాన్ని నిలిపి వెయ్యాలి. యజ్ఞములో కాల్చివేయడానికి సిద్ధపరచిన ధన ధాన్యాలను వశపరచుకోవాలి. వ్యవసాయానికి ఉపయోగపడే జంతువులను యజ్ఞములో బలిఇవ్వ కుండా రక్షించాలి. ఇది ఆమె ఆరాటం, అందుకే ఆమె చేస్తుంది పోరాటం.

యజ్ఞం జరుగుతున్న ప్రదేశానికి చేరుకుంది తాటకి. విలు విద్యలో ఆమె నేర్పరి. ఆమె విల్లు పట్టిందంటే ఎదిరించి పోరాడే

ఎక్కుపెట్టారు.

"విలువిద్యలో సాధన చేస్తున్నారా బాలూ! చెయ్యండి. చాలా సంతోషం. క్రూరులనూ, క్రూరమృగాలనూ ఎదిరించడానికి ఈ విలువిద్య చాలా ఉపకరిస్తుంది బాలలూ!... ...." ఆమె ఇంకా ఏదోచెప్తూ దగ్గఱకు వస్తుండగా రాముడు బాణం వదిలాడు. తాటకి నేల కూలింది. యజ్ఞం చేసే వాళ్ళలో చాలా మంది బయటకు వచ్చి తమ హర్షాన్ని ప్రకటించారు. రాముణ్ని అభినందించారు.

మిథిలాపురంలో జనక చక్రవర్తి కూతురు సీతాదేవి స్వయంవరం ప్రకటించారని తెలిసింది విశ్వామిత్రునికి. రామ లక్ష్మణులను తీసికొని మిథిలకు చేరాడు.

300 మంది వీరులు వేల యోజనాల దూరం నుండి మోసుకొని తెచ్చిన ధనుస్సు అది. యుద్ధాలలో వాడిన అందమైన పాత ధనుస్సు అది. దానికి నారి తొడిగి విరిచి వేసిన ఏ పురుషునికైనా తన కూతురునిస్తానని జనకుడు ప్రకటించాడు.

ఆ ప్రకటన విన్నగానే విశ్వామిత్రుడు రామునికి కనుసైగ చేశాడు. రాముడు లేశాడు.

పుష్టికరమైన ఆహారపదార్థాలు తిని ఏనుగు సున్నలా బలిసివున్న రాముడు ధనుస్సును చెరకు గడను విరిచినట్లు విరిచేశాడు అందంగా వున్న ఆ రాముని మెడలో సిద్ధంగావున్న పూలమాలను వేసింది సీత. సిగ్గును అభినయించింది సీత.

సీతకు, రామునికి పెళ్లి జరిగింది.

మిథిలనుండి సీతారాములు అయోధ్యకు తిరిగి వస్తుండగా పరశురాముడు రాముణ్ని అడ్డగించాడు. 21 సార్లు క్షత్రియకులాన్ని నిర్మూలించిన పరశురాముణ్ని—కాదు అతని గర్వాన్ని అణచి వేశాడు శ్రీరాముడు. (అదే ఏ రాక్షసుడో అయితే "21 సార్లు క్షత్రియులను చంపిన గర్వంగల దురాగ్రహుడైన ఆ రాక్షసుణ్ని శ్రీరాముడు చంపి వేశాడు" అని వ్రాసి వుండేవాడు కవి.)

కైకేయిని పెళ్ళి చేసుకునే సందర్భములో కైకేయికి కలిగిన

కుమారునికే రాజ్యమిస్తానని మాట ఇచ్చాడు దశరథుడు. కాని రాముని వినయ విధేయతలు దశరథునికి చాలా నచ్చడం వల్ల రాము నికే రాజ్యం అప్పగించాలని సన్నాహాలు చేయసాగాడు. రాజు కాబో తున్నందుకు రాముడు సంతోషంగా వున్నాడు. దశరథుడు రహ స్యంగా రామునికి రాజ్యపట్టాభిషేకం చేయిస్తున్నాడని తన చెలికత్తె మందర ద్వారా వింది కైకేయి ఆమె మనసు మండింది.

తనకు లేని హక్కును పొందడానికి సిద్ధపడిన రాముణ్ని అడ వికి పంపి, హక్కుదారుడైన భరతునికి రాజ్యం అప్పగించాలని కోరింది కైకేయి, తన ముసలి భర్త దశరథుణ్ని.

తన నిర్ణయాన్ని ప్రతిఘటించిన కైకేయిని అణచి వేయలేక, రాజు కాబోతున్నానని మురిసిపోతున్న రామునికి రాజ్యం అప్పగించ లేక దొంగకు తేలుకుట్టినట్టు బాధగా మూల్గసాగాడు దశరథుడు.

నటనలో ఆరితేరిన రాముడు, దశరథుని బాధకు కారణ మేమిటో అడిగి తెలిసికొని ఏడ్వలేక నవ్వి కైకమ్మ తల్లి కోరినట్టు అడవికే వెళ్తానన్నాడు. భరతునికే రాజ్య పట్టాభిషేకం చేయండని కోరాడు సీతాలక్ష్మణులు వెంటరాగా అడవికి వెళ్ళాడు.

అడవిలో పర్ణశాల నిర్మించుకొని, అడవినే రాజ్యంగా భావిం చుకొని, అడవి జంతువులను వేటాడితింటూ, దుంపలు పలురకాల పండ్లనూ తింటూ అందినంత వరకు అన్నిరకాల సుఖాలు అనుభవించ సాగారు సీతారాములు లక్ష్మణుడు అన్నకు, వదినకు సేవలు చేస్తూ సేవకునిలా జీవించసాగాడు.

వనాలలో తిరుగుతూ సౌందర్యమును ఆరాధించే పడతి ఆమె. క్రూర మృగాలకు భయపడని ధీరవనిత ఆమె. కోనేర్లలో, సెల యేర్లలో స్వేచ్ఛగా విహరించే స్వేచ్ఛాజీవి ఆమె. ఆమె పేరు శూర్ప ణఖ. ఆమె రాముణ్ని చూచింది వలచింది. వివాహ మాడుమని కోరింది.

ఏక పత్నీవ్రత నిబంధనకు బద్ధుడైన రాముడు ఆమెను తన చెంతకు చేరనివ్వలేదు. ఆమె తనను వలచి వచ్చినదని తెలిసి కూడా

పరిహాసమాడుతూ తన తమ్ముడైన లక్ష్మణుని చెంతకు చేరుమని చెప్పినాడు. ఆమె మనసు చిన్నబోయినది. రాముడు అచటి నుండి కదలిపోయినాడు ఆమె అచటనే నిలబడి రాముడు వెడలిన వైపు చూస్తున్నది. ఇంతలో ఎచటినుండో ఒక చేతిలో ఏవో పండ్ల మూట పట్టుకొని, మరో చేత కత్తి పట్టుకొని నేలచూపులు చూస్తూ వస్తున్న లక్ష్మణుడు శూర్పణఖకు తగిలినాడు. ఆమె ప్రక్కకు తొలగి అన్నది "కళ్లు కనిపించడంలేదా? గొర్రెలా తలవంచుకొని నడుస్తావెందుకు?"

భార్య లేకుండా ఒంటరిగా జీవిస్తున్న లక్ష్మణునికి, ఆడదాని ముఖం చూస్తే కామోద్రేకం కలుగుతుందేమో తన నియమానికి భంగం కలుగుతుందేమో అని భయపడే లక్ష్మణునికి, శూర్పణఖపై మితిమీరిన కోపం వచ్చింది. చేతిలోవున్న కత్తితో ఆమె ముక్కు కోసేశాడు.

శూర్పణఖ ఏడుస్తూ వెళ్ళి తనకు జరిగిన పరాభవాన్ని గూర్చి తన అన్నయగు రావణునికి తెలియజేసింది.

తన చెల్లెలిని అవమానించిన రామలక్ష్మణులపై ప్రతీకారం తీర్చుకోవాలనుకున్నాడు రావణుడు. సీత అభిరుచులు ఏమిటో తెలుసుకున్నాడతడు.

రకరకాల వేషాలు వేయుటలో ఆసక్తి కనబరిచే మారీచుణ్ని లేడి రూపం ధరించి పర్ణశాల చెంతకు వెళ్ళి రమ్మని కోరాడు రావణుడు. మారీచుడు లేడివేషం వేసుకొని సీతారాములు నివసించే పర్ణశాల చెంతకు వెళ్లాడు. సీత లేడిని తెచ్చిఇమ్మని భర్తను కోరింది. రాముడు లేడిపై బాణాలు వేయసాగాడు. మారీచుడు బాణాలు తప్పించుకుంటూ పరుగెత్తసాగాడు. రాముడు వెంబడించాడు.

కొంత సమయం గడచిన తర్వాత సీత లక్ష్మణున్ని అన్నకు సాయంగా వెళ్ళుమని కోరింది. లక్ష్మణుడు అన్నను వెదకుతూ బయలుదేరాడు.

రావణుడు సీతతో బిచ్చగాని వేషములో పర్ణశాల చెంతకు వచ్చాడు. సీతను ఎత్తుకొని తన రాజ్యం చేరాడు.

రావణుడు సీతతో అన్నాడు "సీతా! నా చెల్లెలిని పరాభవించిన నీ భర్తను కష్టములకు గురి చేయుటకే నిన్నిక్కడకు తెచ్చాను. నాచేగానీ, నా రాజ్యములోని మరే పురుషుని చేతగానీ నీ శీలమునకు భంగము కలుగదు నీవు నిశ్చింతగా వుండవచ్చును. నీకు నచ్చిన చీరలు ధరించవచ్చును నచ్చిన విధముగా అలంకరించుకోవచ్చును. నచ్చిన ఆహార పదార్థములు భుజించి జీవించవచ్చును" అని చెప్పి అతడు తన రాణి చెంతకు వెళ్లిపోయాడు.

తన భర్త ఏమైపోయాడో అనే అనుమానంతో సీత కృంగిపోసాగింది, శోకించసాగింది.

రాముడు అడవిలో తిరుగుతూ వానర రాజ్యం చేరుకున్నాడు. సుగ్రీవునితో స్నేహం చేశాడు. అతని అన్నయగు వాలిని చంపి మొత్తం రాజ్యాన్ని సుగ్రీవునికి పట్టాభిషేకం చేశాడు. సీతను వెదకుటలో సహాకరించుమని సుగ్రీవుని ఇంకా అతని బంధు మిత్రులను కోరాడు.

ఆంజనేయుడనే కోతి సాయంతో సీత జాడ కనుక్కున్న రాముడు లంకకు వెళ్లడానికి నిశ్చయించుకున్నాడు. మార్గమధ్యంలో సముద్రం వుంది.

"సముద్రుడా! దారిఇవ్వు" అన్నాడు రాముడు గంభీరంగా, సముద్రం మాట్లాడలేదు. రామునికి కోపం వచ్చింది. బాణం వేశాడు. బాణం సముద్రం మీద తేలియాడ సాగింది. అప్పుడే సముద్రం మీద వారధి కట్టాలన్న ఆలోచన వచ్చింది రామునికి. కోతుల సాయంతో వారధి కట్టాడు, లంకకు చేరాడు.

ఆ సమయములో విభీషణుడు అన్నయగు రావణునితో అన్నాడు. "అన్నా! రాముడు బలవంతుడు. సీతను అతనికి అప్పగిస్తే యుద్ధం తప్పుతుంది"

"రాముడు బలవంతుడే అవుగాక, కానీ మన చెల్లెలిని పరాభవించిన రామునితో యుద్ధం చేయుటయే పౌరుషలక్షణం" మీసం మెలివేస్తూ అన్నాడు రావణుడు.

"నీకు చావు మూడినది. అందుకే రామునితో యుద్ధమునకు సిద్ధపడినావు"

"విభీషణా! అధిక ప్రసంగం కట్టిపెట్టు. వెళ్ళు ఇక్కడి నుండి" కోపంతో అన్నాడు రావణుడు.

రాజ్య పాలన చేయాలన్న కాంక్షగల విభీషణునికి చక్కని ఆలోచన వచ్చినది అతడు వెంటనే రాముని చెంతకు వెళ్ళాడు. రాజ్య ద్రోహం చేస్తున్నానన్న ఆలోచన కూడా లేకుండా రావణ రాజ్యం లోని రహస్యాలన్నీ రామునికి చెప్పాడు విభీషణుడు.

రామరావణ యుద్ధం జరిగింది. రావణుడు మరణించాడు.

మండోదరి రణరంగానికి వచ్చి భర్త శవాన్ని చూచి ఏడుస్తూ అంది "ప్రాణేశ్వరా! విభీషణుడు చేసిన ద్రోహంవల్ల నువ్వు సుల భంగా చంపబడ్డావు కసాయివానికంటె హీనంగా శూర్పణఖ ముక్కు చెవులు కోసిన రాముణ్ని చంపే శక్తిసామర్థ్యాలు నీకు లేనందుకు విచారిస్తున్నాను కాని రాముడు బలవంతుడని తెలిసికూడా అతనితో యుద్ధం చేయుటకు వెనుకాడని నీ పౌరుషమునకు గర్విస్తున్నాను."

మండోదరి రామునివైపు తిరిగి అంది "వలచి వచ్చిన ఆడ దాన్ని పరాభవించినందుకు భార్యావియోగం పొంది కొన్నాళ్లు శిక్ష ననుభవించావు. నా భర్తను చంపి నా శోకమునకు కారకుడవైన నువ్వు శాశ్వతంగా భార్యావియోగం పొంది శోకమునకు గురి అవు దువు గాక" అంటూ శపించింది.

లంకా రాజ్యమునకు విభీషణుడే రాజని దండోరా వేయించాడు రాముడు.

రాముడు సీతా సమేతంగా అయోధ్యకు వచ్చాడు.

ఆవు మూత్రంలో యవాన్నం వుడికించి భోజనం చేస్తున్న భరతుడు అయోధ్యను రామునికి అప్పగించాడు.

రాజ్యములో మరెవరూ ధరించనటువంటి ఖరీదైన బట్టలు, నగలు ధరించారు సీతారామలక్ష్మణులు.

రాముడు యజ్ఞాలు చేసి, దానాలు చేసి బ్రాహ్మణులకు

మాత్రమే సంతృప్తి కలిగించాడు. రాముడు దేవుడని పొగిడారు కడుపునిండిన బ్రాహ్మణులు.

ప్రజలు తనగురించి ఏమనుకుంటున్నారో మారు వేషాలలో వెళ్ళి తెలుసుకుంటుండేవాడు రాముడు. ఒకనాడు రాముడు మారు వేషంలో తిరుగుతుండగా ఒకడు తన భార్యతో కోపంతో ఇలా అన్నాడు "ఒసే పరాయివాడి ఇంట్లో వుండి వచ్చిన నువ్వు లంజవి. ఆడదంటే పడిచచ్చే రాముడు సీతను ఇంట్లో వుంచుకున్నాడు. కాని నేను నిన్ను నా ఇంట్లో వుండనివ్వను. వెళ్ళిపో"

ఉచితానుచితాలు ఆలోచించని రాముడు నిరపరాధియగు సీతమ్మ తల్లిని, గర్భవతియగు సీతమ్మ తల్లిని కనీసం ఆమెకు చెప్ప కుండా అడవులలో వదిలేయించాడు.

వాల్మీకి ఆశ్రమంలో ఇద్దరు కొడుకులను కంది సీతమ్మ తల్లి. కొడుకులను వాల్మీకికి అప్పగించి ప్రాణత్యాగం చేసింది అభిమాన వంతురాలగు సీతమ్మ తల్లి.

రాముడు చాలా సంవత్సరాలు రాజ్యంచేసి చచ్చిపోయాడు.

* శ్రీశుకుడు పరీక్షిత్తుకు కుశవంశములో పుట్టినవారి పేర్లు, చచ్చినవారి పేర్లు, పుట్టబోయేవారి పేర్లు రెండు పేజీల నిండా చెప్పాడు —కుశవంశం గురించి చెప్పే సందర్భములో ఒక్క ఆడ దాని పేరు కూడా చెప్పలేదు. వాళ్ళంతా పెళ్ళాలు లేకుండానే పిల్లలను కన్నారా? లేక ఆడవాళ్ళ పేర్లు కూడా చెప్పడమెందుకు శుద్దదండుగ అని కవిగారు భావించారా?

* నిమి ఒక యజ్ఞం తలపెట్టి వసిష్ఠమునిని యజ్ఞం చేయిం చుమని కోరాడు.

యజ్ఞం చేయిస్తానని ఇంద్రునికి ఇదివరకే మాటఇచ్చాను కనుక అతని యజ్ఞం చేయించి వచ్చిన తర్వాత నీ యజ్ఞం చేయిస్తానని చెప్పి వసిష్ఠముని వెళ్ళిపోయాడు.

నిమి వసిష్ఠముని వచ్చేదాకా ఆగకుండా మరో ఋత్విజుని సహా యంతో యజ్ఞం ప్రారంభించాడు.

ఇంద్రుని యజ్ఞం పూర్తిచేసి వసిష్ఠుడు తిరిగి వచ్చి నిమియజ్ఞం చేయయడం చూచి కోపించి శపించాడు.

వసిష్ఠుడు తనను అన్యాయంగా శపించడం నిమి సహించలేక పోయాడు. అతడు తిరిగి వసిష్ఠుణ్ని శపించాడు.

నిమి శాపం వల్ల వసిష్ఠుడు శరీరం విడిచిపెట్టాడు. కాని ఊర్వశి వల్ల మిత్రావరుణుల వీర్యంతో తిరిగి పుట్టాడు వసిష్ఠుడు.

నిమి శరీరాన్ని సుగంధ ద్రవ్యాలలో భద్రపరిచారు. యజ్ఞం పూర్తయింది. దేవతలు వచ్చి నిమిని బ్రతికిస్తామన్నారు. కాని నిమి అంగీకరించలేదు.

రాజు లేకపోతే రాజ్యంలో అరాజకత్వం వస్తుందని ఆలోచించిన మునీశ్వరులు నిమి శరీరాన్ని మథించారు. అందులోనుండి ఒక కుమారుడు జన్మించాడు. అతని పేరు జనకుడు.

(ఈ కథలో వసిష్ఠుడు నిమిని శపించడం తప్పు. తప్పు చేసిన వసిష్ఠుడు మొదట చనిపోయినా తిరిగి జన్మించాడు,-ఇది హేతువాద విరుద్ధమే-అయినా తప్పు చేసిన వసిష్ఠుడు కాస్త శిక్షననుభవించినా తిరిగి సుఖంగానే వున్నాడని గ్రహించాలి. నిమి తప్పు చేయకపోయినా 'నాకు చావే ఇష్టమని చెప్పి' చచ్చిపోయాడు. బ్రతికేఅవకాశం వుండికూడా నిమి చావడం వల్ల దుర్మార్గుడైన వసిష్ఠుని ఇచ్ఛానుసారమే జరిగినది-కవి అలా వ్రాశాడు. కథలు ఇలా వ్రాయడమంటే పాఠకులను మోసపుచ్చడమే అవుతుంది. శవాన్ని మథించడం వల్ల సంతానమెలా కలుగుతుంది?)

* జనకుని వారసులలో సీరధ్వజుడొకడు. అతడు యజ్ఞం కోసం భూమి దున్నుతుండగా నాగేటి చాలులో సీత దొరికింది.

(అనామిక అనూరుడు అనే రాజు కూతురు.

ఆమె ప్రతి దినము సాయంకాలం వేళ ఉద్యానవనానికి వెళ్ళేది తోటమాలి పూలు కోసి తెచ్చి ఆమెకు ఇచ్చేవాడు.

ఆ తోటమాలి అందగాడు, ధైర్యవంతుడు.

ఒకనాడు అనామిక పూలతోటలో తిరుగుచుండగా ఆమెకు

నాగ సర్పము కనిపించినది. భయముతో ఆమె కేకలువేస్తూ పరు గెత్తినది. పాము ఆమెను వెంబడించినది. అది తోటమాలి చూశాడు. అతడు వెంటనే పాము వెనుక పరుగెత్తి యుక్తిగా దానిని పట్టి చంపేశాడు.

తోటమాలి ధైర్యసాహసములకు ఆమె ఆశ్చర్య పోయింది. ఆమె ఆనాడే అతనిని ప్రేమించింది.

అనామిక తనను ప్రేమించుచున్నదని తోటమాలి గ్రహించాడు. అతడు అనామికను ప్రేమించలేదు. కాని ఆమెపై నున్న ఆభరణా లను కాజేయాలన్న ఉద్దేశముతో ఆమెను ప్రేమించినట్లు నటించాడు.

అతడంతకు పూర్వమే చాలా అందమైన ఒక ఆటవిక స్త్రీని గాఢంగా ప్రేమించాడు. ఆమె బంగారు ఆభరణాలు తెచ్చిఇచ్చినచో పెండ్లి చేసుకొందునని షరతు పెట్టినది.

ఒకనాడు అనామిక తోటమాలిని అంతఃపురానికి రమ్మని చెప్పి తన వ్రేలి ఉంగరమిచ్చింది తోటమాలి రాత్రివేళ అంతఃపురా నికి బయలుదేరాడు, భటులు అతనిని అడ్డగించారు. అతడు యువ రాణి ఇచ్చిన వ్రేలి ఉంగరం వారికి చూపించాడు. వారు లోనికి వెళ్లడానికి అంగీకరించారు.

ఆనాడు అనామిక తోటమాలితో సర్వ సుఖములు అనుభ వించినది.

అనామిక నిద్రపోయిన తర్వాత తోటమాలి ఆగదిలోనున్న ఆభరణాలను తీసుకొని వెళ్ళిపోయాడు.

తోటమాలి తనను మోసగించాడని గ్రహించి అనామిక బాధ పడినది

అనామికకు నెల తప్పినది. అది గ్రహించిన అనామిక పెద్ద లకు ముఖం చూపించలేక అడవికి పారిపోయినది. నెలలు నిండిన తర్వాత అనామికకు కూతురు జన్మించింది.

సీరధ్వజుడు యజ్ఞం కోసందున్నిన నాగేటిచాలులో అనామిక తన కూతురును విడిచిపెట్టి వెళ్ళిపోయింది. మరునాడు భూమి దున్ను

టకువచ్చిన సీరధ్వజునికి శిశువు కనిపించినది. శిశువు నాగేటి చాలులో దొరకడంవలన సీత అని పేరుపెట్టాడు.

కవిగారు సీత జననానికి ఆధారాలేవీ చూపలేదు. చూపిన ఆధారం హేతువాద విరుద్ధంగా వుంది. నేను హేతువాదానికి అనుకూలంగా ఈ కథ కల్పించాను.)

* బ్రహ్మ కుమారుడు అత్రి.

అత్రి కన్నులలోనుండి చంద్రుడు (చంద్రగోళం) పుట్టాడు. బ్రహ్మ చంద్రుణ్ణి బ్రాహ్మణుల మీద రాజు చేశాడు.

చంద్రుడు బృహస్పతి భార్యయైన తారను ప్రేమించాడు. తార చంద్రుని వద్దకు వెళ్ళిపోయింది.

ఓనాడు బృహస్పతి చంద్రుని దగ్గఱకు వచ్చి "నా భార్యను నాకివ్వు" అన్నాడు.

"తారను నేను గాఢంగా ప్రేమించాను. ఆమెనన్ను గాఢంగా ప్రేమించింది. అలాంటి నా ప్రేయసిని నేను వదలుకోలేను" అన్నాడు చంద్రుడు.

తార తన స్వంత భర్త దగ్గఱకు వెళ్లుటకు ఇష్టపడలేదు. చివరికి చంద్రునికి, బృహస్పతికి యుద్ధం జరిగింది.

శుక్రాచార్యుడు చంద్రుని పక్షమున, శివుడు బృహస్పతి పక్షమున యుద్ధం చేశారు ఆ యుద్ధములో సామాన్య సైనికులెందరో చనిపోయారు.

బృహస్పతి తండ్రియైన అంగిర రుషి బ్రహ్మ దగ్గఱకు వెళ్ళి యుద్ధం ఆపు చేయుమని ప్రార్థించాడు.

బ్రహ్మ వచ్చి చంద్రుణ్ణి చీవాట్లుపెట్టాడు.

తాత చెప్పినట్లు వినకపోతే ఆయన తనకిచ్చిన అధికారం పరిగి లాక్కుంటాడని భయపడి చంద్రుడు తారను వదిలేశాడు.

బృహస్పతి భార్యను ఇంటికి తెచ్చుకొని తిట్టరాని తిట్లుతిట్టాడు.

కొన్నాళ్ళ తర్వాత తార కుమారుణ్ని కన్నది. ఆ బాలుడు నా కుమారుడంటే, నా కుమారుడని చంద్రుడు బృహస్పతి తగవు

లాడు కొన్నారు.

దేవతలు తగవు తీర్చడానికి వచ్చారు. "నీ ఈ కుమారుడు ఎవరికి పుట్టాడో చెప్పు?'' అని అడిగారు. తార సిగ్గుతో సమాధానం చెప్పలేదు.

బ్రహ్మ తారను ఏకాంతంగా పిలిచి అడుగగా "వీడు చంద్రుడు నికే పుట్టాడు" అని చెప్పిందామె.

బ్రహ్మ ఆ పిల్లవానికి 'బుధుడు' అని పేరు పెట్టాడు.

చుక్కల రాజు చంద్రుడు బుధుణ్ని తీసుకొని వెళ్ళిపోయాడు.

* నారదుడొకనాడు ఇంద్రుని సభలో పురూరవుని రూప గుణశీలాలను గురించి చెప్పాడు. అది వింది ఊర్వశి. వెంటనే పురూరవుని దగ్గఱకు వెళ్లింది. తొలి చూపుల్లోనే ఒకళ్లనొకళ్లు ప్రేమించుకున్నారు.

పురూరవుడు తనతో సంభోగించడానికి ఊర్వశి రెండు షరతులు పెట్టింది. "నేనిచ్చిన రెండు గొఱ్ఱె పిల్లలను భద్రంగా కాపాడాలి" (ఇది పురూరవుని వీరత్వాన్ని పరీక్షించడానికి పెట్టిన షరతు) పురూరవుడు ఒప్పుకున్నాడు. కొంతకాలం వారు దాంపత్య జీవితం అనుభవించారు

ఊర్వశి లేకపోవడం వల్ల ఇంద్రసభ చిన్నబోయింది.

ఊర్వశి ఎక్కడ వున్నా తీసుకరండి "అంటూ గంధర్వులను ఆదేశించాడు దేవేంద్రుడు,

గంధర్వులు భూలోకం వచ్చి పురూరవుని అధీనంలోవున్న గొఱ్ఱెలను ఎత్తుకపోవడానికి సిద్ధమయ్యారు. అవి అరిచాయి. ఆ సమయంలో పురూరవుడు ఊర్వశితో సంభోగిస్తున్నాడు.

"నువ్వు తొందరగా వెళ్లి నా గొఱ్ఱెలను కాపాడు" అంది ఊర్వశి.

పురూరవుడు వినిపించుకోలేదు. ఊర్వశి అతణ్ని తిట్టింది. పురూరవునికి పౌరుషం వచ్చి నగ్నంగానే గంధర్వులను ఎదిరించాడు. గంధర్వులు గొఱ్ఱెలను వదలి పారిపోయారు.

నగ్నంగా వున్న పురూరవుణ్ని చూచింది ఊర్వశి. వెంటనే అక్కడి నుండి వెళ్లిపోయింది.

పురూరవుడు ఊర్వశి కోసం అనేక ప్రాంతాలు తిరిగాడు. ఓనాడు ఆమె కురుక్షేత్రంలో కనిపించింది. "నాపై నీకుదయ లేనప్పుడు నాకు ఈ అందమైన శరీరమెందుకు?" అంటూ విరక్తి ప్రకటించాడు పురూరవుడు. అప్పుడు ఊర్వశి పురూరవునికిలా చెప్పింది

"క్రౌర్యం ఆడవాళ్ల సహజ స్వభావం. నమ్మకం కలిగించి తోబుట్టువులను, భర్తను చంపేస్తారు ఆడవాళ్లు నేను మాత్రం సంవత్సరానికి ఒక రాత్రి నీతో కలసివుంటాను"

ఆనాటిరాత్రి ఊర్వశి పురూరవుని దగ్గఱ పడుకొంది. మరునాడు ఇద్దరూ విడిపోయే సమయంలో పురూరవుడు ఏడ్చాడు.

"నువ్వు గంధర్వులను వేడుకో, వాళ్లు నన్ను నీకు సమర్పిస్తారు'' అంది ఊర్వశి బానిస స్వభావంతో.

పురూరవుడు గంధర్వులను ప్రార్థించాడు. గంధర్వులు ఊర్వశిని ఇవ్వలేదు. కాని కుంపటి ఇచ్చారు.

( ఊర్వశీ పురూరవుల ప్రేమ పవిత్రమైనది కాదు. పురూరవుడు ఊర్వశి వ్యక్తిత్వాన్ని కాకుండా ఆమె శరీరాన్ని మాత్రమే ప్రేమించాడు. అది ప్రేమకాదు, కామము. ఊర్వశి పురూరవుని అందాన్ని చూచి ప్రేమించిందని కవిగారు వ్రాశారు. కాని అది కూడా ఈ కథ పూర్తిగా చదివిన తర్వాత అసత్యమని తేలిపోతుంది. ఊర్వశి పురూరవుని వీరత్వాన్ని ప్రేమించిందా? ప్రేమించలేదు. పురూరవుడు గంధర్వుల బారినుండి గొర్రెలను రక్షించి తను వీరుడని రుజువు చేసుకున్నాడు. ఊర్వశి పురూరవునితో కలసి జీవించడానికి ముందు కొన్ని షరతులు పెట్టింది ఆ షరతులకు భిన్నంగా పురూరవుడు ప్రవర్తించగానే ఆమె అతణ్ణి విడిచిపెట్టి వెళ్లిపోయింది. కాని ఆ షరతు కూడా పూర్తిగా పాటించడం జరగలేదు. పురూరవునితో సంవత్సరాని కొకసారి కలసి జీవించడానికి ఒప్పుకుంది. చివరకు

"గంధర్వులను వేడుకో, వాళ్లు నన్ను నీకు సమర్పిస్తారు" అని వ్యక్తిత్వం లేకుండా మాట్లాడుతుంది. ఊర్వశి స్త్రీలస్వభావం గురించి పురూరవునికి చెప్తూ "ఆడవాళ్ళు తోబుట్టువులను, భర్తను నమ్మించి చంపేస్తారు" అంది. కాదు కవిఅలా వ్రాశాడు. నిజంగా అలా ఏ ఆడదన్నా చెప్తుందా? ఆడవారిని హీనపరచడం కవిగారికి అలవాటే. ఆడవాళ్ళు చాలా దుర్మార్గులని పాఠకులకు చెప్పే ఉద్దేముశతో కవి గారికథను వ్రాశారు.)

* గాధిరాజు కూతురు సత్యవతి.

రుచీకరుషి. సత్యవతిని తనకిమ్మని గాధిరాజునడిగాడు.

ఒక చెవి నల్లగా వుండి శరీరమంతా చంద్రునివలె తెల్లగా వుండే వెయ్యి గుర్రాలు కన్యాశుల్కంగా ఇస్తే సత్యవతినిస్తానన్నాడు గాధిరాజు. (ఆనాడు రాజులు కూడా కన్యాశుల్కము పుచ్చుకునే వారా?)

గాధిరాజు కోరిన కన్యాశుల్కం ఇచ్చి రుచీకుడు సత్యవతిని వివాహమాడాడు. భార్య, అత్త తమకు కుమారులు కావాలని రుచీకుణ్ని అడిగారు.

బ్రాహ్మణ మంత్రముతో భార్య చరువు. క్షాత్రమంత్రముతో అత్తచరువు తయారుచేసి రుచీకుడు స్నానానికి వెళ్ళాడు.

గాధిరాజు భార్య తనకోసం తయారు చేసిన చరువుకాకుండా తన బిడ్డ కొరకు తయారు చేసిన చరువు త్రాగింది.

రుచీకుడు జరిగింది తెలుసుకొని భార్యతో అన్నాడు "నీకు క్షత్రియుడు పుడుతాడు, నీ తల్లికి బ్రాహ్మణుడు పుడుతాడు"

నాకు కూడా బ్రాహ్మణుడే పుట్టాలని సత్యవతి భర్తను ప్రాధేయపడింది. అప్పుడు రుచీకుడు "నీకు బ్రాహ్మణుడే పుడుతాడు. కాని నీ మనుమడు క్షత్రియగుణం కలవాడవుతాడు" అని సర్ది చెప్పాడు.

సత్యవతి గర్భములో జమదగ్ని జన్మించాడు.

జమదగ్ని రేణుడికూతురు రేణుకను వివాహమాడాడు. రేణుక

చివరి కొడుకు పరశురాముడు.

ఇచ్చట కార్తవీర్యార్జునుని గురించి కొంత తెలుసుకోవాలి.

హైహయ క్షత్రియులలో కార్తవీర్యార్జునకు వెయ్యి చేతులు న్నాయి. (ఇది కవిగారి అభూత కల్పన)

కార్తవీర్యార్జునుడొకనాడు భార్యలతో కలసి నర్మదానదిలో జలక్రీడలాడుతున్నాడు. వెయ్యి చేతులతో నర్మద ప్రవాహం అడ్డగించాడు. పొరుగుదేశంపై దండయాత్రకు బయలుదేరిన రావణుడు నర్మదానది ఒడ్డున దండువిడిశాడు. కార్తవీర్యార్జునుడు నర్మద నడ్డగించడం వలన నీరుపోటెక్కి రావణుని శిబిరం మునిగిపోయింది. రావణుడు కార్తవీర్యార్జునుని తిట్టాడు. కార్తవీర్యుడు రావణాసురుణ్ణి కట్టేసి శిక్షించాడు............

కార్తవీర్యార్జును డొకనాడు వేటకు వెళ్ళి మృగాలను వేటాడుతూ జమదగ్ని ఆశ్రమంలోకి వెళ్ళాడు. కామధేనువు ప్రభావం వల్ల జమదగ్ని రాజుకు గొప్ప విందు చేశాడు.

కార్తవీర్యార్జునుడు జమదగ్నిని అడుగకుండా కామధేనువును తీసుకపోయాడు. అప్పుడు పరశురాముడు ఆశ్రమంలో లేడు.

కార్తవీర్యార్జునుని దౌర్జన్యం తెలుసుకొన్న తర్వాత పరశురాముడు గండ్రగొడ్డలితో కార్తవీర్యార్జునుని చేతులు నరికేశాడు. కార్తవీర్యుని కుమారులు పారిపోయారు.

కామధేనువును పట్టుకవచ్చి, తాను చేసిన శత్రువధను గురించి తండ్రికి వివరించి చెప్పాడు పరశురాముడు

అప్పుడు జమదగ్ని "రాజును చంపడం పాపము, దుర్మార్గులను క్షమించడం చాలా గొప్ప గుణము, చేసిన పాపం వదల్చుకోవడానికి పుణ్యతీర్థాలు సేవించు" అని చెప్పాడు

(ఈ కథలో రుచీకుడు మంత్రాలతో తయారు చేసిన చరువుకు ఏ ప్రత్యేకత లేదని ఒప్పుకోవాలి. బ్రాహ్మణ మంత్రముతో తయారు చేసిన చరువు త్రాగినవారికి, క్షాత్ర మంత్రముతో తయారు చేసిన చరువు తాగినవారికి-ఇరువురికి-బ్రాహ్మణులే పుట్టారు. రుచీకుని

మాటకు కూడా విలువ లేదు. అతడు భార్యతో అన్నాడు "నీకు క్షత్రియుడు పుడుతాడు" అని. కాని భార్య బ్రతిమిలాడగానే నీ మనుమడు క్షత్రియగుణం కలవాడవుతాడని మార్చి చెప్పాడు. ఈ కథలో సాంఘిక అసమానతను ప్రచారం చేయడం జరిగింది.

రావణుడు రాజ్యవిస్తరణ కొఱకు దండయాత్రలు చేసేవాడు. అతడు తనకన్న బలహీనులపై దండెత్తి జయించి రాజ్యవిస్తరణ గావించి సుఖాలనుభవించేవాడు.

రావణునికన్న కార్తవీర్యుడు బలవంతుడు కనుక అతడు రావణున్ని బంధించి శిక్షించగలిగాడు.

కార్తవీర్యుడు కామధేనువును దొంగిలించాడు. పరశురాముడు మహాబలవంతుడు కనుక కార్తవీర్యుణ్ణి చంపివేశాడు.

కార్తవీర్యుడు కామధేనువును దొంగిలించడం తప్పుఅనే మాట అంగీకరిస్తే పరశురాముడు కార్తవీర్యుణ్ణి చంపడం తప్పు కాదు.

దుర్మార్గులను చంపుట పాపమా? దుర్మార్గులను క్షమించడమే గొప్ప ధర్మమా? రాజు దుర్మార్గుడైననూ క్షమించాలి అని ఈ కథలోని నీతి, దోపిడీదారులకు; సాంఘిక ఔన్నత్యం కలవారికి; అధికారం, ధనంకలవారికి ఉపయోగపడే నీతి ఇది.

* రేణుక ఒకనాడు స్నానానికి గంగానదికి వెళ్లింది, గంగానదిలో చిత్రరథుడనే గంధర్వుడు అప్సరసలతో కలసి స్నానం చేస్తున్నాడు. చిత్రరథుని అందాన్ని చూస్తూ నిలబడిపోయింది రేణుక.

హోమ సమయం దాటిపోయిన తర్వాత భయపడుతూనే ఆశ్రమానికి వచ్చింది. భర్త ముందు దోషిలా చేతులు జోడించి నిలబడింది.

గంగానదిలో చిత్రరథుడు అప్సరసలతో కలసి స్నానం చేస్తుండగా రేణుక చూస్తూ నిలబడిపోయిందా ఏమిటి? అని అనుమానం వచ్చింది జమదగ్నికి. చిత్రరథుడు అప్సరసలు కలసి స్నానం చేస్తుండగా జమదగ్ని అనేకసార్లు చూశాడు. అతడు అప్సరసల నగ్నసౌందర్యం చూస్తూ అనేకసార్లు మైమరచిపోయాడు.

"ఈ దుర్మార్గురాలు గంగానదిలో స్నానం చేస్తున్న చిత్ర

రథుణ్ని చూచి కామవికారం పొందింది. ఈమెను వెంటనే చంపె య్యండి" అంటూ కుమారులకు చెప్పాడు

"చిత్రరథుడు అనేకమంది స్త్రీలతో కామ సుఖాలనుభవిస్తు న్నాడు. తమ తండ్రి కూడా చాలాసార్లు అప్సరసల నగ్న సౌందర్యం చూచి కామకోరికలకు లోనైనవాడే, స్త్రీ పురుషులకు ఒకేధర్మం వర్తించాలి. శిక్షిస్తే తల్లిని, తండ్రిని శిక్షించాలి క్షమిస్తే ఇరువురిని క్షమించాలి." ఇలాఅనుకొన్న కుమారులు తండ్రి ఆజ్ఞ పాటించలేదు.

నక్కవినయాలు ప్రదర్శించే పరశురాముడు తండ్రి మెప్పు సంపాదించడం కోసం తండ్రి చెప్పినట్లు తల్లిని, అన్నలను గండ్ర గొడ్డలితో నరికేశాడు.

జమదగ్ని సంతోషపడి "ఏం వరం కావాలో కోరుకో" అన్నాడు

"అమ్మను, అన్నలను బ్రతికించు అన్నాడు పరశురాముడు. తన కోరిక నెరవేరదని పరశురామునికి తెలుసు. తల్లిపై అన్నలపై ప్రేమ వుండికూడా తండ్రి ఆజ్ఞనమసరించి చంపాడని అందరూ అను కోవాలలి, తాను పితృవాక్య పరిపాలకుడని అందరూ అనుకోవాలని, తన పేరు ప్రతిష్ఠలు ఇనుమడించాలని—అలా అడిగాడు.

"తలలు నరికిన తర్వాత బ్రతికించడమెలా సాధ్యమవుతుంది నాయనా! నేను కోపంలో ఇవ్వకూడని ఆజ్ఞ ఇచ్చాను నేను ఆజ్ఞ ఇచ్చానే అనుకో, నువ్వు ఏమాత్రం ఆలోచించకుండా కన్నతల్లిని, తోబుట్టువులను చంపెయ్యాలా......నువ్వు కసాయివాడవురా..." అంటూ ఏడ్చాడు జమదగ్ని.

కొన్నాళ్ల తర్వాత జమదగ్ని—వేణుమహర్షి కూతురు—వేణు కను పెండ్లాడాడు.

వేణుకను అందరూ రేణుక అనే పిలిచేవారు.

కార్తవీర్యార్జునుని కుమారులు పరశురామునిపై పగసాధించా లనుకున్నారు. పరశురాముడు కట్టెలు కొట్టుక రావడానికి గండ్ర గొడ్డలి పట్టుకొని అడవికివెళ్లిన సమయం కనిపెట్టి వాళ్లు ఆశ్రమానికి

వచ్చారు.

ఆ సమయంలో జమదగ్ని కండ్లుమూసుకొని జపం చేస్తున్నాడు. కార్తవీర్యుడి కుమారులు అతనిని చంపబోయారు. రేణుక చంప వద్దని బ్రతిమాలింది. అయినా వారు ఆమె మాట వినలేదు. జమదగ్ని తలను నరికి వెళ్లిపోయారు.

కార్తవీర్యుని కుమారులు తన తండ్రిని చంపివేశారని పరశు రామునికి తెలిసింది. వెంటనే అతడు మాహిష్మతి రాజ్యానికి వెళ్ళి కార్తవీర్యార్జునుని కుమారులను చంపివేశాడు. అంతటితో అతని కోపం చల్లారలేదు. రాజులందరినీ చంపేశాడు.

తండ్రిపేరిట యజ్ఞం చేసి దానధర్మాలు చేశాడు.

"పరశురాముడు అన్యాయంగా రాజులందరినీ చంపేశాడు." అని అన్నవారుకూడా దానాలు స్వీకరించి పరశురాముడు మహావీరు డని పొగిడారు. వారే నక్షత్రాలలో ఒకదానికి 'జమదగ్ని నక్షత్రం' అని పేరు పెట్టారు.

* గాదిరాజు కుమారుడు విశ్వామిత్రుడు. అతడు తపస్సు చేసి పదిమందిచేత బ్రహ్మఋషి అని పిలిపించుకొని సంతోష పడ్డాడు. అతనికి వందమంది కుమారులు.

అజీగర్తుడనే బ్రాహ్మణుని కుమారుడు దేవరాతుడు. దేవరా తుణ్ణి విశ్వామిత్రుడు కొడుకుగా స్వీకరించాడు.

విశ్వామిత్రుని 49 మంది కుమారులు దేవరాతుణ్ణి అన్నగా స్వీకరించలేదు. విశ్వామిత్రుడు కోపించి వారిని శపించాడు. మిగిలిన 51 మంది దేవరాతుణ్ణి అన్నగా స్వీకరించారు. విశ్వామిత్రుడు సంతో షించి వారిని ఆశీర్వదించాడు.

(విశ్వామిత్రునికి బ్రాహ్మణత్వం మీద చాలా ఉన్నతమైన భావం వుంది. కారణం—ఆనాడు బ్రాహ్మణులకు సంఘములో చాలా గౌరవం వుండడమే—బ్రాహ్మణ బాలుణ్ని తన కుమారునిగా స్వీకరిస్తే తన గౌరవం పెరుగుతుందని, విశ్వామిత్రుని అభిప్రాయం. తన అభిప్రాయానికి వ్యతిరేకంగా ప్రవర్తించిన కుమారులను హీనంగా

చూశాడు. తన అభిప్రాయాన్ని గౌరవించిన కుమారులను ఆదరిం చాడు.

మిశ్వామిత్రుడు తన వ్యక్తిత్వాన్ని కాపాడుకోవడం కోసం చాలా పాటుబడ్డాడు. అంతేకాని సమతకోసం పాటుబడలేదు.)

*   నహుషమహారాజుకు 6 గురు కొడుకులు.

నహుషుడు శచీదేవిని కాంక్షించడంవల్ల మునులతణ్ణి స్వర్గం నుండి తరిమేశారు. అతడు కొండచిలువగా మారిపోయాడు (కొండ చిలువగా మారడం హేతువాద విరుద్ధం. కాని పరస్త్రీని కాంక్షించిన నహుషుణ్ణి మునులు శపించారని గ్రహించాలి.)

నహుషుని కుమారుడు యయాతి. అతడు బ్రాహ్మణ స్త్రీయైన దేవయానిని వివాహమాడాడు. (వర్ణాంతర వివాహం—దేవయాని శుక్రాచార్యుని కూతురు) మరియు రాక్షసరాజు (వృషపర్వుడు) కూతురైన శర్మిష్ఠను వివాహమాడాడు. అతడు వీరిద్దరినీ పెళ్లి చేసుకోవడానికి ఒక కథవుంది.

ఒకనాడు శర్మిష్ఠ దేవయానితోనూ, వెయ్యి మంది చెలికత్తెలతోనూ ఉద్యానవనం వెళ్లింది ఆ ఉద్యానవనం మధ్య పద్మాలచెరు వుంది. వాళ్లందరూ ఒడ్డున తమతమ చీరెలు విప్పేసి చెరువులో స్నానం చేస్తుండగా అచ్చటికి శివుడు పార్వతి అకస్మాత్తుగా వచ్చారు.

స్నానం చేస్తున్న వాళ్లందరూ గబగబా ఒడ్డుకు వచ్చి చీరలు కట్టుకొన్నారు. ఆ తొందరలో తన చీరె అనుకొని దేవయాని చీరెను కట్టుకొంది శర్మిష్ఠ.

దేవయానికి కోపం వచ్చింది. "నేను బ్రాహ్మణస్త్రీని, ఉన్నతురాలను, నా చీరెకట్టుకునే అర్హత నీకు లేదు" అంది. ఇంకా అనేక విధాల శర్మిష్ఠను అవమానించింది.

శర్మిష్ఠకు కోపం వచ్చి ది. "కుక్కలు, కాకులు ఎంగిలి మెతుకుల కోసం ఆశపడినట్టు. మీ బ్రాహ్మణులు మా దయాభిక్ష కోసం చేతులు చాచికూసుంటారు. అలాంటి నువ్వా నన్ను నిందించేది" అంది. అంతటితో ఆమెకోపం ఆగలేదు. దేవయానిని ఆ పక్కనే

వున్న నూతిలో పడద్రోసి వెళ్ళిపోయింది.

యయాతి వేటాడుతూ ఆ ప్రాంతానికి వచ్చాడు. నీరు త్రాగడానికి నూతి దగ్గరకు వచ్చాడు. నగ్నంగా వున్న దేవయానిని నూతిలో చూచి జాలివేసింది. చేయూతనిచ్చి నూతిలో నుండి ఆమెను బయటకు లాగాడు. తర్వాత తన ధోవతిని రెండు ముక్కలు చేసి ఒక ముక్క దేవయానికిచ్చాడు. దేవయాని ఆ బట్టను మొలకు చుట్టుకొని యయాతిని ప్రేమగా చూచి అంది "మహారాజా! నువ్వే నా చెయ్యిని ముందుగా పట్టుకున్నావు నువ్వే నా భర్తవు"

యయాతి దేవయానికి భర్త కావడానికి అంగీకరించి ఆమె ఆజ్ఞ స్వీకరించి రాజధానికి వెళ్ళిపోయాడు.

దేవయాని తండ్రి దగ్గరకు వెళ్ళి జరిగిన విషయం చెప్పింది. శుక్రాచార్యుడు దేవయానిని వెంటబెట్టుకొని నగరం వదిలి వెళ్ళిపోవడానికి బయలుదేరాడు. ఈ విషయం వృషపర్వునికి తెలిసింది. (శుక్రాచార్యుడు వృషపర్వుని పురోహితుడు) "శుక్రాచార్యుణ్ని బ్రతిమిలాడకపోతే వెళ్ళిపోతాడు, దేవతల పక్షం చేరుతాడు. తనకు ఓటమి తప్పదు" వృషపర్వుడిలా అనుకొని శుక్రాచార్యుణ్ణి వెళ్ళవద్దని బ్రతిమిలాడాడు దేవయాని ఇష్టమేతన ఇష్టమన్నాడు శుక్రుడు.

చివరికి దేవయాని ఇష్టానుసారంగా శర్మిష్ఠను దేవయానికి దాసిగా వుంచుటకు వృషపర్వుడు ఒప్పుకున్నాడు.

శుక్రాచార్యుడు దేవయానిని యయాతికిచ్చి పెళ్ళి చేశాడు.

దేవయానికి సంతానం కలిగింది. శర్మిష్ఠకు కూడా సంతానం కావాలన్న కోరిక కలిగింది. శర్మిష్ఠ యయాతి దగ్గరకు వెళ్ళి నాకు సంతానం కావాలిఅనికోరింది. యయాతి శర్మిష్ఠతో సంభోగించాడు.

శర్మిష్ఠకు తన భర్తవల్లనే గర్భం వచ్చిందని తెలియగానే దేవయాని కోపంతో పుట్టింటికి వెళ్ళిపోయింది. యయాతి ఆమెను బ్రతిమిలాడుతూ ఆమెవెంట వెళ్లాడు. జరిగిన విషయం తెలుసుకొని శుక్రాచార్యుడు యయాతిని—ముసలివాడవు కమ్మని శపించాడు.

యయాతి శుక్రాచార్యుణ్ణి బ్రతిమిలాడాడు.

"ఎవరైనా తన యవ్వనం నీకు ఇచ్చి, నీ ముసలితనం స్వీకరించడానికి వీలుకలిగిస్తున్నాను." అని శాపానికి విరుగుడు చెప్పాడు శుక్రుడు.

"మీ యవ్వనం నాచిక్చి, నా ముసలితనం మీరు స్వీకరించండి" అని సిగ్గులేని యయాతి తన కుమారులనడిగాడు. నలుగురు కుమారులు అంగీకరించలేదు. చిన్న కుమారుడు తండ్రి ముసలితనం స్వీకరించి-తన యవ్వనం తండ్రికిచ్చాడు.

కొడుకు ఇచ్చిన యవ్వనంతో యయాతి తన భార్యతో కామ కోరికలు అనుభవించాడు. ( ఇది హేతు వాద విరుద్ధమే కాని యయాతి తన కొడుకు యవ్వనంతో భార్యతో కామ సుఖాలనుభవించాడన్న విషయం చాలా జుగుప్సాకరంగా వుంది. ) కొన్నాళ్ళ తర్వాత యయాతికి కామసుఖాల మీద వైరాగ్యభావం ఏర్పడింది. అప్పుడు యయాతి దేవయానితో ఇలా అన్నాడు. "నీ మాయలోపడి నన్ను నేను మరిచిపోయాను. కామసుఖాలు అనుభవిస్తూ వెయ్యేళ్లు గడిపాను. ఇక నా మనస్సు దేవునిమీదికి మళ్లిస్తాను, అహంకారం మానుకుంటాను, అడవికి పోతాను, అక్కడ జంతువులతో కలసి జీవిస్తాను."

యయాతి తన కొడుకు యవ్వనం కొడుక్కు ఇచ్చి తన ముసలితనం తాను స్వీకరించాడు. ఇహలోకసుఖాలకు స్వస్తిచెప్పిన యయాతి రాజ్యాన్ని కొడుకులకు పంచిఇచ్చాడు.

యయాతి అడవికివెళ్ళి ముసలితనంలో చచ్చిపోయాడు. దేవయాని కూడా చచ్చిపోయింది.

(ఈ కథలో సాంఘిక ఔన్నత్యంకల దేవయానికి, రాజకీయ ఔన్నత్యంకల శర్మిష్ఠకు జరిగిన సంఘర్షణ చూడవచ్చు. దేవయాని తాను బ్రాహ్మణ జాతికనన్న అహంకారంతో శర్మిష్ఠను ఇష్టమున్నట్లు తిట్టింది---శర్మిష్ఠ తాను రాజు కూతురునన్న అహంకారంతో దేవయానిని నూతిలో పడద్రోసింది.

యవ్వనంలో భార్యతో సుఖాలనుభవించి, భార్య అవసరం

తీరిపోయిన తర్వాత ఆమె కష్టసుఖాలను విచారించకుండా చేతగాని దద్దమ్మలాగా అడవికి వెళ్లి చచ్చిపోయాడు యయాతి. యయాతి లాంటి స్వార్థబుద్ధి ఏ భర్తకూ వుండకూడదు.

* దుష్యంత మహారాజు అడవికి వేటకు వెళ్ళాడు. వేటాడుతూ వేటాడుతూ కణ్వముని ఆశ్రమం వెళ్ళాడు. అచ్చట శకుంతల వుంది

శకుంతల దేవవేశ్య అయిన మేనక కూతురు. మేనక విశ్వామిత్రులు జతకట్టగా పుట్టిన బిడ్డ ఆమె మేనక బిడ్డను కని అడవిలో విడిచి పెట్టి వెళ్లిపోయింది ఆమెను కణ్వమహర్షి పెంచి పెద్దచేశాడు.

దుష్యంతుడు ఆనాటి రాత్రి శకుంతలతో కామ సుఖాలు అనుభవించి వెళ్లిపోయాడు.

నెలలు నిండిన తర్వాత ఆమెకు భరతుడు పుట్టాడు.

శకుంతల కొడుకును తీసుకొని దుష్యంతుని దగ్గఱకు వెళ్ళింది. ఆమె వేశ్యకూతురన్న అభిప్రాయంతో దుష్యంతుడు మొదట ఆమెను భార్యగా స్వీకరించలేదు. కాని శకుంతల తనను హృదయ పూర్వకంగా ప్రేమించిన తర్వాతనే కామసుఖానికి ఇష్టపడిందని గ్రహించి ఆమెను స్వీకరించాడు.

దుష్యంతుని తర్వాత భరతుడు రాజ్యానికి వచ్చాడు. అతడు గంగఒడ్డున 50 అశ్వమేధ యాగాలు చేశాడు. ధనము, పాడి ఆవులు దానం చేశాడు. ప్రక్కరాజ్యాల రాజులను చంపివేసి రాజ్య విస్తరణ చేశాడు. సర్వ సౌఖ్యాలు అనుభవించాడు.

భరతునికి ముగ్గురు భార్యలు. వాళ్లు కుమారులను కని చంపేశారు. భరతుడు యజ్ఞం చేశాడు. మరుత్తులు అతని వద్దకు వచ్చి భరద్వాజుణ్ణి కుమారునిగా ప్రసాదించారు.

(భరతుడు సామాన్య ప్రజలకు చేసిన మేలేమీలేదు. రాజ్య విస్తరణ కాంక్షతో పరదేశాలపై దండయాత్ర చేశాడు. ఇరుగు పొరుగు రాజ్యాలను జయించాడు. యుద్ధరంగములో అనేక మంది సైనికులు చనిపోయారు. భరతుడు పెద్దరాజ్యానికి రాజయ్యాడు.

యజ్ఞాలు చేసినప్పుడు ప్రజల నుండి పన్నులు ఎక్కువగా వసూలు చేసి, ఆ డబ్బును తిరుగుబాటు దార్లకు, మేధావులకు బహుమతుల రూపమున పంచిపెట్టి, వారిని సంతోషపరచి తన రాజరికాన్ని కాపాడుకున్నాడు.)

* రంతిదేవుడు గొప్పరాజు. అతనికి శిస్తు రూపంగా లెక్కలేనంత ధనం వచ్చేది. అలా వచ్చిన డబ్బును పేదవారికి దానం చేసేవాడు.

ఒక సందర్భములో 88 దినములు రంతిదేవుడు ఆహారం తినలేదు. 89వ నాడు పాయసము తినడానికి సిద్ధపడ్డాడు. అదే సమయానికి ఆకలితో బ్రాహ్మణుడు వచ్చాడు. అతడు బ్రాహ్మణునికి పాయసం పెట్టాడు.

బ్రాహ్మణుడు పాయసం తిని వెళ్లిపోయాడు. రంతిదేవుడు మిగిలిన ఆహారం తినడానికి సిద్ధపడగా ఆకలితో శూద్రుడు వచ్చాడు. రంతిదేవుడు శూద్రునికి ఆహారం పెట్టాడు. శూద్రుడు ఆహారం తిని వెళ్ళిపోయాడు.

రంతిదేవుని దగ్గఱ మన్న ఆహారమంతా అయిపోయింది. నీళ్ళు మిగిలాయి. రంతిదేవుడు నీళ్ళు త్రాగడానికి సిద్ధపడగా చండాలుడు వచ్చి 'దాహం వేస్తుంది' నీళ్లిచ్చి పుణ్యం కట్టుకోండి, అన్నాడు.

రంతిదేవుడు చండాలునికి నీళ్ళిచ్చాడు.

చండాలుడు నీళ్ళు త్రాగి వెళ్ళిపోయిన తర్వాత రంతిదేవునికి బ్రహ్మ, విష్ణువు, శివుడు ప్రత్యక్షమై 'ఏం కావాలో కోరుకో' అన్నాడు.

రంతిదేవుడు ఏ కోరికా కోరలేదు.

(ఈ కథలో రంతిదేవునికి దానం చేసే గుణం తప్ప మరే ఉన్నత గుణమూ లేదు.

రంతిదేవుని రాజ్యములో బ్రాహ్మణులు, శూద్రులు, చండాలురు అనే సాంఘిక అసమానతలున్నాయి ఈ సాంఘిక అసమానతలను రూపుమాపుటకు రంతిదేవుడు చేసిన ప్రయత్నం ఏమీ లేదు.

రాజ్యములో కొందరు శిష్టులు కట్టే స్థితిలో వుంచే కొందరు బిచ్చ మెత్తుకొని బ్రతికే స్థితిలోనే వున్నారు. ఇలాంటి ఆర్థిక అసమానతలను తొలగించుటకు రంతిదేవుడు చేసిన ప్రయత్నం ఏమీలేదు.

త్రిమూర్తులు కనిపించి నీకేమి కావాలో కోరుకొమ్మంటే రంతిదేవుడు ఏకోరికాకోర లేదు. రంతిదేవునికి దానం చేయాలన్న కోరిక వుందికదా? "దానం చేయడానికి నావద్ద ఎప్పుడూ ధనధాన్యాలుండాలి" అని అతడు త్రిమూర్తులనడిగితే బాగుండేదికదా! "నా రాజ్యములోనున్న ప్రజలందరూ కూడు, గూడు, గుడ్డలతో సుఖసంతోషాలతో జీవించేలా చేయండి." అని రంతిదేవుడు త్రిమూర్తులను అడిగితే ఇంకా బాగుండేదికదా!

ప్రజలందరికీ సుఖసంతోషాలు ప్రసాదించే శక్తిసామర్థ్యాలు త్రిమూర్తుల కున్నాయని నా ఉద్దేశం కాదు.— త్రిమూర్తులు సర్వశక్తి సంపన్నులని కవిగారికో అభిప్రాయం వుంది కనుక రంతిదేవుని కథలో రంతిదేవుడు త్రిమూర్తులనలా అడిగినట్టు ప్రజలందరూ సుఖసంతోషాలతో జీవితాలు గడిపినట్టు వ్రాస్తే బాగుండేది.

రంతిదేవుడు తన రాజ్యములోనున్న సాంఘిక, ఆర్థిక అసమానతలను తొలగించి ప్రజలందరూ సుఖసంతోషాలతో జీవించే అవకాశం కల్పించాడని వ్రాస్తే చాలా బాగుండేది.

కథల్లో అలా వ్రాస్తే పాఠకులకు-శ్రోతలకు-సాంఘిక, ఆర్థిక అసమానతలను తొలగించుకోవాలన్న అభిప్రాయం కలుగుతుంది. సమాజానికి మేలు జరుగుతుంది.

88 దినములు ఉపవాసముండి 89వ నాడు ఆహారం తినడానికి రంతిదేవుడు సిద్ధమయ్యాడని, ఆ సమయానికి బిచ్చగాడు వచ్చాడని, రంతిదేవుడు ఆకలితో వుండికూడా ఆహారం బిచ్చగానికి దానం చేశాడనీ వ్రాస్తే దోపిడీ చేయబడేవారికి కలిగే ప్రయోజనమేమిటి? ఏమీ లేదు. ఈ కథ చదివి దోపిడీదారులు దానం చేయడానికి పూనుకుంటారనీ, పేదల కష్టాలు నిర్మూలమవుతాయనీ అనుకోవడం శాస్త్రీయ దృక్పథం కాదు. రంతిదేవునిలాగా దానం చేసేవారు అసలుండరు.

ఈ కథ దోపిడీదారులకు అనుకూలంగా వుంది.)

* బృహద్రధుడి భార్య గర్భములో ఒక శిశువు రెండు చెక్కలై పుట్టాడు. అతని తల్లి ఆ చెక్కలను పెంటపైపార వేయించింది, జర అనే రాక్షసి ఆ రెండు చెక్కలను అతికి బ్రతుకమంది. ఆ పిల్లవాడు బ్రతికి పెద్దవాడయ్యాడు. అతడే జరాసంధుడు (హేతువాద విరుద్ధమైన ఇలాంటికథలను సృష్టించడంలో కవిగారు ఘనులు)

* ప్రతీపునికి ముగ్గురు కుమారులు.

పెద్దవాడు దేవాపి అడవికిపోయాడు. రెండవవాడు శంతనుడు రాజయ్యాడు.

శంతనుని రాజ్యంలో 12 సంవత్సరాలు వానలు కురియలేదు.

"నువ్వు నీ అన్న కన్నముందు వివాహం చేసుకున్నావు. రాజ్యము స్వీకరించావు కనుకనే వానలు కురియడం లేదు. వెంటనే వెళ్ళి మీ అన్నను తీసుకరా" అన్నారు బ్రాహ్మణులు.

శంతనుడు తన అన్నను తీసుకరావడానికి అడవికి వెళ్లాడు. అతనివెంట బ్రాహ్మణులు కూడా వెళ్ళారు.

బ్రాహ్మణులు దేవాపిని రాజ్యానికి తిరిగి రమ్మన్నారు.

దేవాపి కొన్ని షరతులు పెట్టారు.

"బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్ర వర్ణాలు సాంఘిక అసమానతలకు పునాదులుగా వున్నాయి. కనుక నేను వాటిని చట్టబద్ధంగా తొలగిస్తాను దానికి మీరు వ్యతిరేకించ కూడదు.

ఆర్థిక అసమానతలు తొలగించడానికి ఉత్పత్తి సాధనాలను సమాజపరం చేస్తాను దీనికి మీరు అడ్డు చెప్పకూడదు.

వేదాలలో దోపిడీ విధానానికి అనుకూలమైన ధర్మాలు కొన్ని వున్నాయి. వాటిని నేను తొలగిస్తాను, మీరు వ్యతిరేకించకూడదు.

ఈ నా షరతులు మీరు అంగీకరిస్తే రాజ్యానికి వచ్చి పరిపాలన చేస్తాను"

"పెద్ద కుమారుడు రాజ్యపాలన చేయడం ధర్మమని భావించి నిన్ను రాజ్యపాలన చేయడానికి రమ్మంటున్నాము. నువ్వేమో

ధర్మ శాస్త్రాలకు విరుద్ధంగా మాట్లాడుతున్నావు" అన్నారు బ్రాహ్మణులు.

"అన్నయ్యా! బ్రాహ్మణులు చెప్పినట్లు వినడం మన ధర్మం" అన్నాడు శంతనుడు.

"అధర్మాలు ఎవరు చెప్పినా అంగీకరించను—అధర్మాణ్ని ధర్మంగా భావించడం నాకు చేతకాదు" అన్నాడు దేవాపి.

"దేవాపీ! నువ్విలా వేదవిరుద్ధంగా మాట్లాడుతావని ముందే తెలిస్తే నీ దగ్గరకే వచ్చేవాళ్లం కాదు" అన్నారు బ్రాహ్మణులు. వారికి దేవాపిపై చాలా కోపం వచ్చింది.

బ్రాహ్మణుల ఇష్టానుసారంగా శంతనుడు రాజ్యపాలన స్వీకరించాడు.

దేవతలు సంతోషించి అతని రాజ్యములో వానలు కురిపించారు.

(పెద్దవాడు రాజ్యార్హుడనియూ, వేదాలను నిందిస్తే పెద్దవాడైననూ రాజ్యానికి అర్హుడు కాడనియూ ఈ కథలోని నీతి.

ప్రజలందరినీ సుఖపెట్టే సమర్థుడే రాజార్హుడు. వేదాలలో వున్న అసమానతలను సమర్థించే నీతులను నిందించవచ్చు.)

శంతనునికి గంగాదేవి (గంగానది) గర్భములో భీష్ముడు పుట్టాడు. సత్యవతి గర్భములో చిత్రాంగదుడు, విచిత్రవీర్యుడు పుట్టారు.

విచిత్రవీర్యుడు అంబా, అంబాలికలను పెళ్లిచేసుకొని కొన్నాళ్ల తర్వాత రోగంతో చచ్చిపోయాడు.

వ్యాసుడు సత్యవతి కోరికననుసరించి అంబా అంబాలికల గర్భాలలో ధృతరాష్ట్రుణ్ణి పాండురాజును కన్నాడు. (సత్యవతికి వివాహం కాకపూర్వం పరాశరుని వల్ల వ్యాసుడు పుట్టాడు.)

ధృతరాష్ట్రునికి గాంధారి గర్భములో నూరుగురు కుమారులు, ఒక కూతురు జన్మించారు.

పాండురాజు శాపంవల్ల చనిపోయాడు. ఆయన పెద్ద భార్య

కుంతి. ఆమె యమధర్మరాజుతో సంభోగించి ధర్మరాజును, వాయు దేవుని (గాలి)తో సంభోగించి భీముణ్ణి, ఇంద్రునితో సంభోగించి అర్జునుణ్ణి కంది. ఈమె వివాహం కాక పూర్వమే సూర్యునితో కామ సుఖాలనుభవించి కర్ణుణ్ణి కన్నది.

పాండురాజు రెండవ భార్య మాద్రి. ఆమె అశ్వినీ దేవతలతో సంభోగించి నకుల సహదేవులను కన్నది.

పంచపాండవులందరికీ భార్య ద్రౌపది

(సత్యవతిని, కుంతిని గౌరవించే వ్యక్తులు—ఈనాడు మన సమాజంలో పెళ్లి కాక పూర్వం పరపురుషులతో సంబంధం పెట్టుకొని పిల్లలను కన్న స్త్రీలను గౌరవించడం లేదెందుకు? హీనంగా చూస్తున్నా రెందుకు?)

లక్షలాది రాక్షసులు రాజుల రూపంలో భూమండలం ఆక్రమించి విర్రవీగుతూ వుండేవారు. (రాజులందరూ రాక్షసులే నన్న మాట) వాళ్ల బరువు భరించలేక భూదేవి (భూగోళం) ఆవుగా మారి బ్రహ్మ దగ్గఱకు వెళ్ళింది. (భూగోళం ఆవుగా మారినప్పుడు భూమి మీద మనుష్యులు, జంతువులు మొదలగునవి ఎచ్చట వున్నట్టు?) బ్రహ్మ, శివుడు, ఆవు పాలసముద్రములో పడుకున్న విష్ణువు దగ్గఱకు వెళ్ళి స్తోత్రం చేశాయి. తర్వాత బ్రహ్మ దేవతలతో "భగవంతుడు భూగోళం మీద జన్మిస్తాడు. భూమి బరువు తగ్గిస్తాడు. మీరుకూడా భూగోళం మీద గొల్లవంశంలో జన్మించి భగవంతునికి సాయం చెయ్యండి" అని చెప్పి తన లోకానికి వెళ్ళిపోయాడు

పూర్వం యాదవ వంశంలో శూరసేనుడు రాజుగా వుండేవాడు. అతని రాజధాని మధురాపట్నం.

ఒకనాడు శూరసేనుని కుమారుడు—వసుదేవుడు—దేవకీదేవిని వివాహం చేసుకొని పెళ్ళికూతురుతో రథంమీద ఇంటికి బయలుదేరాడు. ఉగ్రసేనుని కుమారుడు కంసుడు, చెల్లెలు దేవకిని సంతోష పెట్టడం కోసం సారథివలె రథం నడుపుతున్నాడు

దేవకి తండ్రి దేవకుడు. అతడు కూతురును అత్తవారింటికి

పంపినప్పుడు బంగారు హారాలతో అలంకరించిన 400 ఏనుగులు, 15 వేల గుర్రాలు, 18 వందల రథాలు, బట్టలు, నగలు, 200 మంది అందమైన పరిచారికలు అరణమిచ్చాడు (ఆనాడు కూడా స్త్రీకి అన్నదమ్ములతో సమాన హక్కులు లేవు. తండ్రి ప్రేమతో హోదాను బట్టి జంతువులను, ధనమును, ఆభరణాలను ఇచ్చే ఆచారమది. రాజులు తమ సుఖం కోసం అనేకమందిని దాసీలుగా వాడుకునే వారు. సాంఘికంగా, ఆర్థికంగా అనేక అసమానతలను ఈ కథ ద్వారా గుర్తించవచ్చు.)

దారిలో ఆకాశవాణి కంసుణ్ణి సంబోధిస్తూ ఇలా అంది. "కంసా! దేవకి ఎనిమిదవ గర్భములో పుట్టినవాడు నిన్ను చంపుతాడు" (భవిష్యత్తును తెలుసుకోవడం ఎప్పుడూ ఎవరికీ సాధ్యం కాలేదు. ఇది కవిగారి అద్భుతమైన కల్పన మాత్రమే.)

ఆకాశవాణి విని కంసుడు కత్తి తీసి దేవకి జుట్టు పట్టుకొని ఆమె తల నరకబోయాడు. వసుదేవుడు అడ్డుకొని కంసుణ్ణి బ్రతిమిలాడాడు.

"ఆకాశవాణి మాటలను బట్టి దేవకి వల్ల నీకు భయంలేదు కదా! ఈమెకు పుట్టిన కుమారులను నీకు తెచ్చిఇస్తాను" అన్నాడు వసుదేవుడు.

దేవకిని చంపాలన్న సంకల్పం మార్చుకున్నాడు కంసుడు.

సత్యవంతుడైన వసుదేవుడు తనకు కొడుకు పుట్టగానే తెచ్చి కంసునికిచ్చాడు. (భార్య ప్రాణాలను రక్షించడం కోసం కన్నకొడుకును చంపడానికిచ్చిన వసుదేవుడు చేతకాని దద్దమ్మ కాదా?) "వీని వలన నాకు భయంలేదు. తీసుకపో. ఎనిదవ వాణ్ణి మాత్రం తెచ్చి ఇవ్వు చంపేస్తాను" అన్నాడు కంసుడు. (కంసుడు ఇచ్చట కొంత న్యాయంగా ప్రవర్తించినట్లే కనిపిస్తుంది.)

ఓనాడు నారదుడు కంసుని దగ్గరకు వచ్చాడు, "కంసా! వ్రేపల్లెలో వుండే గొల్లలందరూ దేవతలే. వాళ్ళు రాక్షసులను చంపే ప్రయత్నంలో వున్నారు" అని చెప్పాడు. (రాక్షసులు

చేసిన తప్పేమిటి? కవిగారు చెప్పలేదు.)

కంసుడు వెంటనే దేవకినీ, వసుదేవుణ్ణి చెరసాలలో పెట్టించాడు వాళ్ళకు పుట్టిన పిల్లలను చంపివేశాడు. (కంసా! నువ్వు గతములో ప్రదర్శించిన న్యాయబుద్ధి ఏమైనదోయీ! ఆ పసిబాలురు నీకేం అపకారం చేశారని చంపావు,) తండ్రిని జైలులోవేసి సింహాసన మాక్రమించాడు. (రాజ్యం కోసం, అధికారం కోసం కన్న తండ్రులను జైల్లో వేసిన సంఘటనలు, కన్నతండ్రులను చంపివేసిన సంఘటనలు చరిత్రలో అనేకం కనిపిస్తాయి.)

కంసునికి మగధరాజగు జరాసంధుడు, ప్రలంబాసురుడూ, బకాసురుడూ, బాణాసురుడూ, తృణావర్తుడూ అఘాసురుడూ, ముష్టికుడూ, అరిష్టాసురుడూ............ పూతనా మొదలగువాళ్లు మిత్రులు. బలవంతుడైన కంసునికి భయపడి చాలామంది యాదవులు (దేవతలు) రహస్యంగా నివసిస్తున్నారు.

శేషుడు దేవకి ఏడవ గర్భములో పడ్డాడు. అప్పుడు శ్రీహరి యోగమాయతో ఇలా అన్నాడు. "శేషుడు దేవకి గర్భములో శిశువుగా వున్నాడు. అతణ్ణి దేవకి గర్భములోంచి తీసుకపోయి రోహిణి (వసుదేవుని ఇంకో భార్య) గర్భములో ప్రవేశపెట్టు."

యోగమాయ భూలోకానికి వచ్చి భగవంతుడు ఆదేశించిన ప్రకారం చేసింది. దేవకికి గర్భపాతమై పోయిందనుకున్నారు పౌరులు.

దేవకి అష్టమ గర్భము ధరించింది. దేవకి గర్భవతిగా వున్నప్పుడే ఆమెను చంపివేసి తన శత్రువు పుట్టకుండా చేసుకోవచ్చు కంసుడు. కాని అతడలా చేయలేదు. దేవకిని చంపనని బావకు మాట ఇచ్చి తప్పలేనతడు

శివుడు, బ్రహ్మ, దేవతలు చెరసాలకువచ్చి దేవకి గర్భములో నున్న పిండాణ్ణి స్తోత్రం చేశారు. తర్వాత దేవకికి ధైర్యం చెప్పి వెళ్ళిపోయారు.

చీకటిరాత్రి వానకురుస్తుండగా శ్రీకృష్ణుడు అనేక ఆభర

రాలు పెట్టుకొని, ఆయుధాలు చేతపట్టుకొని, పట్టు బట్టలు కట్టుకొని పుట్టాడు. (చాలా గొప్పసత్యాం చెప్పారు కవిగారూ! అజ్ఞానులందరూ మీ మాటలు నమ్మేందుకు సిద్ధంగానే వున్నారు.) వసుదేవుడు కొడుకు కాళ్ళమీదపడి స్తోత్రం చేశాడు. దేవకికి కొడుకు కాళ్ళమీద పడాలన్న ధ్యాసే రాలేదు. ఆమె కొడుకును చూస్తూ నవ్వుతూ స్తోత్రం చేసింది.

కాళ్లూ, చేతులూ ఆడించడం కూడా చేతగాని ఆ పసివాడు లేచి నిలబడి తల్లితో ఇలా అన్నాడు. "స్వాయంభువ మన్వంతరంలో నువ్వు పృశ్నిగాను, వసుదేవుడు సుతపుడన్న పేర ప్రజాపతిగా వుండేవాడు. మీరు తపస్సు చేశారు. నన్ను ఆరాధించారు. నేను మీ గర్భములో జన్మించాను. అప్పుడు నాపేరు పృశ్నిగర్భుడు రెండో జన్మలో నువ్వు అదితివై పుట్టావు. వసుదేవుడు కశ్యపుడై పుట్టాడు. అప్పుడు నాపేరు ఉపేంద్రుడు (వామనుడు) ఈ మూడో జన్మలో కూడా మీ కుమారుణ్ణయి పుట్టాను." (అప్పుడే పుట్టిన శిశువు మాట్లాడడం అసంభవమే అయినా వ్యాసుడు చాలా గొప్పకవి కనుక అలా వ్రాశాడు. కవిగారికి పూర్వజన్మల మీద నమ్మకముంది. దేవకీ వసుదేవులు పూర్వజన్మలలో తపస్సులు చేశారనీ, భగవంతుణ్ణి ఆరాధించారనీ కవిగారు వ్రాశారు. భగవంతుణ్ణి ఆరాధించిన వారికి పుణ్యాం వస్తుందనీ, సుఖపడుతారనీ, కవిగారు అనేకచోట్ల వ్రాశారు. ఎంతో పుణ్యాం చేసుకున్న దేవకీ వసుదేవుల 6 గురు కొడుకులు చని పోవడానికి వాళ్లు ఏడ్వడానికి కారణమేమిటి? కర్మ సిద్ధాంతము ప్రకారం దుర్మార్గులకే దుఃఖం సంభవించాలిగానీ దైవభక్తిగల సుగుణవంతులకు కష్టాలు రాకూడదు కదా! జీవితం సుఖంగా గడ వాలి కదా! కానీ దేవకీవసుదేవుల విషయంలో జరిగిందేమిటి? కవి గారు సమర్థించిన కర్మ సిద్ధాంతం అబద్ధం. మానవుని సుఖదుఃఖాలకు పుణ్యపాపాలు కారణంకాదు. దుర్మార్గుల వలన, స్వార్థపరుల వలన అమాయకులు కష్టాలకు గురి అవుతారన్నది సత్యం.)

వసుదేవుడు కుమారుణ్ణి బయడకు తీసుకవెళ్ళడానికి నిశ్చ

యించు కున్నాడు. ఆనాడే నందుని భార్యయైన యశోద గర్భములో యోగమాయ జన్మించింది. అర్ధరాత్రి కావడం వలన నగరం నిశ్శబ్దంగా వుంది. వసుదేవుడు కొడుకునెత్తుకొని ద్వారము దగ్గరకు వచ్చాడు. ద్వారాలు వాటికవే తెరచుకున్నాయి. వసుదేవుడు జైలు బయట కాలుపెట్టగానే వర్షం ప్రారంభమైంది. ఆదిశేషుడు పడగలు గొడుగులా పట్టి ఆ పసివానివెంట నడిచాడు నురుగులు కక్కుతూ పారుతున్న యమునానది రెండుపాయలై దారి ఇచ్చింది. ఆనాడే నందుని భార్య ప్రసవించిందని వసుదేవునికి తెలియడంతో అతడు గోకులం చేరాడు యశోద మొదలగు వారందరూ గాఢ నిద్రలో వున్నారు, యశోద ప్రక్కలో తన కుమారుణ్ణి పడుకోబెట్టి ఆమె ప్రక్కలోనున్న ఆడశిశువును తీసుకొని మధురాపట్నం చేరుకొని చెరసాలలోనికి వచ్చేశాడు. శిశువు ఏడుపు విని ద్వారపాలకులు మేలుకున్నారు. కంసుని దగ్గరకు పరుగెత్తి దేవకి బిడ్డను కన్నదని తెలియజేశారు. కంసుడు దేవకి వద్దకు వచ్చాడు.

"అల్లుడు కాదు, కోడలు ఇది. నిన్నేమీ చెయ్యదు" అని చెప్పింది దేవకి.

కంసుడు చెల్లెలి మాట విన్పించుకోకుండా కళ్లు మూసుకొని పడుకొన్న ఆ పసికందు కాళ్లు పట్టుకొని రాతిమీద కొట్టాడు. ఆ శిశువు క్రింద పడకుండా ఆకాశంలోకి ఎగిరింది. ఆమె అప్పటి కప్పుడు పెరిగి పెద్దదయింది, ఆమెకు ఆరుచేతులు అదనంగా మొలిచాయి, రెండు స్తనాలు అప్పటికప్పుడు పెరిగాయి. "నీ పూర్వజన్మ శత్రువు నిన్ను చంపడానికి ఒకచోట పుట్టనే పుట్టాడు" అని చెప్పి ఆమె వెళ్లిపోయింది. (చెరసాల ద్వారాలు వాటికవే తెరచుకోవడం గానీ, మూసుకోవడంగానీ సాధ్యంకాదు. వసుదేవుడు తన కొడుకును రక్షించుకోవాలన్న ఉద్దేశంతో ద్వారపాలకులకు లంచం ఇచ్చి తలుపులు తెరపించుకొన్నాడు వర్షం కురుస్తున్నా లెక్కచెయ్యక శిశువు పై బట్టకప్పి భుజముపై ఎత్తుకొని యమునానది దగ్గరకు వెళ్లాడు. యమునా నది నురుగులు కక్కుతూ ప్రవహిస్తూ వుంది.

ఒడ్డుకున్న చెట్లకు పడవలు కట్టివున్నాయి. ఓ పడవను తీసుకొని నది దాటాడు. యశోద ఆనాడే ప్రసవించిందని వసుదేవునికి అంతకు ముందే తెలిసింది. అప్పుడు అర్ధరాత్రి కావడం వలన అందరూ గాఢ నిద్రలో వున్నారు. వసుదేవుడు తనకొడుకును రక్షించుకోవాలన్న స్వార్థబుద్ధితో యశోద ప్రక్కన పడుకోబెట్టి ఆమె ప్రక్కలో పడుకొనియున్న ఆడపిల్లను తీసుకొని చెరసాలకు వచ్చాడు. లంచం పుచ్చుకున్న ద్వారపాలకులు అప్పుడు కంసుని దగ్గరకు పరుగెత్తి దేవకి ప్రసవించిందని చెప్పారు కంసుడు ఆ పసిపిల్లను నిర్దాక్షిణ్యంగా చంపివేశాడు—ఈకథలో అనేక హేతువాద విరుద్ధమైన విషయాలు ఉన్నప్పటికీ సారాంశం మాత్రం ఇంతే )

కంసుడు దేవకీవసుదేవులను చెరసాల నుండి వదిలేసి "నన్ను క్షమించండి" అని వాళ్ల కాళ్లు పట్టుకున్నాడు. (కంసునికి దేవకీవసుదేవుల మీద కోపంలేదని దీనివల్ల గుర్తించవచ్చు, కంసుణ్ణి చంపేవాడు దేవకి గర్భములో పుడుతాడని ఆకాశవాణి చెప్పింది. ఆకాశవాణి అనేది దొంగమాట. కంసుని శత్రుపక్షం వారు చాలాయుక్తితో చెప్పిందంతా, కంసుడు వసుదేవుడు, ఆకాశవాణి చెప్పిందనే అనుకున్నారు —ఆకాశవాణి అనేమాట అంతకుపూర్వమే ప్రచారంలో వుంది—కంసుడు దేవకీవసుదేవులను బంధించడం, వారికి పుట్టిన పిల్లలను చంపడం జరిగింది. కంసునికి వసుదేవునికి మధ్య కలహాలను సృష్టించి కంసుని శత్రుపక్షంవారు లాభం పొందడానికి వేసిన ఎత్తు ఇది.)

కంసుడు మరునాడు మంత్రులను రప్పించుకొని యోగమాయ చెప్పిందంతా చెప్పాడు.

అప్పుడు మంత్రులిలా అన్నారు "రాజా! అయితే దేశములోనున్న పిల్లలందరినీ చంపివేద్దాం. ఆ పనికి ఈరోజే పూనుకుందాం. దేవతలు నవతికుమారులని ఉపేక్షచెయ్యకూడదు. పిరికి దేవతలు యుద్ధమంటే పారిపోతారనుకో అయినా వాళ్లకు మాయదారి విష్ణువు గొప్ప ఆధారం. వేదాలను, బ్రాహ్మణులను, తపస్సు చేసే

వారిని, యజ్ఞాలు చేసేవారిని రక్షిస్తాడతడు, అందుచేత మేమంతా వెళ్లి వేదవాదుల్ని (దోపిడీ సాహిత్యం గొప్పదని చెప్పే వారిని), బ్రాహ్మణులను (యజ్ఞాలు చేయాలని ప్రోత్సహిస్తూ, దానాలు స్వీకరిస్తూ కూర్చుండి తినడానికి అలవాటు పడ్డవారిని), తాపసుల్ని (ముక్కు మూసుకొని కూర్చుండి సమాజ శ్రేయస్సుకు ఉపయోగపడని వ్యర్థజీవులను) కాల్చి చంపేస్తాం.

కంసుని ఆజ్ఞతో రాక్షసులు నలువైపులా బయలుదేరారు. (కవిగారు రాక్షసులను చాలా హీనంగానూ, దేవతలను చాలా ఉన్నతంగానూ సృష్టించారు ఇందులో దేవతలూ స్వార్థపరులే, రాక్షసులూ స్వార్థపరులే. కాని దేవతలు పూర్వసంస్కృతికి భంగం కలుగకుండా దోపిడీ చేశారు. రాక్షసులు దానికి వ్యతిరేకంగా ప్రవర్తించారు. కవిగారు దేవతల దోపిడీవిధానాన్ని సమర్థించి దేవతలు ఉన్నతులు అన్న అభిప్రాయాన్ని పలుచోట్ల వ్యక్తీకరించారు )

నందగోపుడు తనకు కుమారుడు కలిగినందుకు (అనుకున్నాడలా) సంతోషపడ్డాడు. వేదాలు తెలిసిన బ్రాహ్మణులను పిలిచి వస్త్రాలు, నగలూ పెట్టి 2 లక్షల పాడిఆవులు బ్రాహ్మణులకు దానం చేశాడు. బ్రాహ్మణులు ఆశీర్వాదాలు చేశారు, వందిమాగధులు మంగళగానాలు చేశారు. గాయకులు గానం చేశారు. వ్రేపల్లె గొల్లలందరూ విలువైన బట్టలు కట్టుకొని విలువైన కానుకలు పట్టుకొని నందుని ఇంటికి వచ్చారు.

నందుడు గొల్లలందరికీ నగలూ, ఆవులు పంచిపెట్టాడు. వందిమాగధులకు, విద్యలవల్ల బ్రతికేవారికి దానాలు ఇచ్చాడు. రోహిణిదేవి నందుని ఇంట్లోనే వుండేది (ఎందుకో?)

(ఆనాటి సమాజంలో గొల్లవారు గొప్ప ధనవంతులుగానూ, నాగరీకులుగానూ ఉండేవారు. గొల్లవారుకూడా బ్రాహ్మణులకే దానధర్మాలు ఇచ్చేవారు. ధనికులు తమ కొడుకుల నామకరణమును చాలా ఆడంబరంగా జరుపుకునేవారు )

నందుడు గోకులాన్ని రక్షించేభారం సమర్థులకు అప్పగించి

కంసునికి కట్టవలసిన ఏడాది కప్పం కట్టడానికి మధురాపట్నం వచ్చాడు. కంసుని పన్ను చెల్లించాడు (బలంకల రాజులు బలహీనులైన రాజుల వద్ద డబ్బు తీసుకునే విధానం. ఇదొక రకమైన దోపిడీ విధానం. అయితే బలంలేని రాజు తన ప్రజల వద్ద శిస్తురూపంలో డబ్బు వసూలు చేసి కొంత కప్పం చెల్లించి తన పదవిని కాపాడుకుంటూ సుఖపడుతూ వుంటాడు )

నందుడు వసుదేవుణ్ణి కలుసుకున్నాడు. అప్పుడు వసుదేవుడు "అన్నా! వయసుమళ్ళి సంతానం కలుగుతుందన్న ఆశేలేకపోయింది. అయినా కుమారుణ్ణి కన్నావు. అదృష్టవంతుడవు. నా కొడుకు తన తల్లి రోహిణి కులాసాగా వున్నారా?" అన్నాడు.

"తమ్ముడూ! కంసుడు దేవకి కుమారులను చంపేశాడు. చివరికి ఆడపిల్లను కూడా చంపేశాడు" అంటూ అడిగిన ప్రశ్నకు సమాధానం చెప్పకుండా సానుభూతి వాక్యాలు మాట్లాడాడు నందుడు.

"అన్నా! కంసునికి కట్టవలసిన కప్పం కట్టేశావుకదా! గోకులంలో ఉత్పాతాలు పుడుతాయి వేగంగా ఇంటికి వెళ్ళిపో" అన్నాడు వసుదేవుడు.

నందుడూ మొదలైనవాళ్ళు ఎడ్లబండ్ల మీద కూర్చుండి గోకులానికి బయలుదేరారు.

కంసుని ఆజ్ఞమీద పూతన అను యువతి పసిపిల్లలను చంపుతూ వుండేది. (నిజమేనా ఈమాట) ఓనాడు పూతన చాలా అందంగా అలంకరించుకొని ఆకాశమార్గాన వ్రేపల్లెకు వచ్చింది. (ఎలాంటి వాహనం మీద వచ్చిందో కవిగారు చెప్పలేదు.) బాలకులను గాలిస్తూ నందగోపుని ఇంట్లో ప్రవేశించింది. ('పూతన చిన్న పిల్లలను చంపుతూ వుండేది, అని కవిగారు చెప్పినమాట అసత్యమని తేలిపోయింది. చిన్న వాళ్ళందరినీ చంపడం పూతన ఉద్దేశం కానట్లుంది. అలా అయితే కనబడిన పిల్లలందరినీ చంపక కృష్ణుని కొఱకు వెదకడమెందుకు? కృష్ణుణ్ణి చంపాలన్న ఉద్దేశముతోనే వచ్చింది పూతన. కంసుడు,

పూతన రాక్షసుల ప్రయోజనం కోసం పాటుబడిన వారు.) యశోద ప్రక్కన పడుకున్న కృష్ణుణ్ని చూచింది పూతన. పూతన సౌంద ర్యాన్ని చూచి దేవకి, రోహిణి మొదలగువారు ఆశ్చర్యపోయారు.

పూతన కృష్ణుణ్ని ఒళ్ళోకి తీసుకొని విషం పట్టించిన చన్ను అతని నోట్లో పెట్టింది. (దేవకి మొద్దులా నిలబడి చూచింది. నోరు పడిపోయిన దానివలె మాట్లాడలేదు. అంతేనా కవిగారూ!) కృష్ణుడు పాలతోపాటు ఆమె ప్రాణాలు పీల్చడం మొదలు పెట్టాడు. స్తనా లకు కలిగిన బాధ భరించలేక పూతన నిజస్వరూపం మరుగు పరచ లేక పోయింది. రాక్షసి రూపం బయట పడింది. ఇంటి బయటకువచ్చి ప్రాణాలు వదిలింది. (కృష్ణుడు పూతన చన్ను కొరకాడు. అంత లోనే కృష్ణుడు వాంతి చేసుకున్నాడు, పూతన చన్నుకున్న విషం కృష్ణుని నోటిలోకి వెళ్ళలేదు. చన్నుకైన గాయం నుండి విషం రక్తంలో కలియడంవలన పూతన కొన్ని క్షణాలలోనే చనిపోయింది.) పూతన కళేబరం పడి ఆరుకోసుల మేర చెట్టూచేమా పిండి అయిపో యాయి. (కవిగారూ! నా అనుమానం తీర్చండి. పూతన చచ్చిపోయి క్రింద పడినప్పుడు చెట్టూచేమా పిండి అయిందన్నారు కదా! వ్రేపల్లె లోని ఇండ్లన్నీ పిండిపిండి కాలేదా? వ్రేపల్లెలోని జనులందరూ పిండి పిండి కాలేదా? ఆరుకోసుల మేర ఎన్ని గ్రామాలున్నాయో అవన్నీ పిండి కాలేదా?) దాని కోరలు నాగేటి కోరల్లా వున్నాయి. ముక్కు పుటాలు కొండగుహల్లా వున్నాయి. (ఇలా కవిగారు పూతన శరీ రాన్ని చాలా ఘోరంగా వర్ణించారు. ఏ కాస్త బుద్ధున్నవాడైనా కవి గారి వర్ణనను అంగీకరించడు.)

కృష్ణుడు పూతన చన్నులతో ఆడుకొంటున్నాడు. పూతన కళేబరం చూచి మొదట గోపికలు పిరికిపందల్లా భయపడ్డారు. కాని తర్వాత చాలా ధైర్యం చేసి పూతన శవం మీద ఆడుకొంటున్న కృష్ణుణ్ని తీసుకొని వెళ్ళి యశోదకిచ్చారు. (కొడుకు మీద ఏమాత్రం బాధ్యత చూపని తల్లి యశోద.)

యశోద ఆవు ఉచ్చతో కృష్ణునికి స్నానం చేయించింది

శరీరం నిండా పెండరాసింది. (ఆవు ఉచ్చుతో స్నానం చేయించబడిన వాడు మన దేవుడా? మహాఘోరం. ఇలాంటి దేవన్ని చేత రక్షించ బడే కంటే చావడమే మేలు.)

గోపికలు "కృష్ణా! అజుడు నీ పాదాలు రక్షించాలి......... కేశవుడు నీ హృదయం రక్షించాలి.........నీ కన్ను......... నీ ముక్కు......నీ వెంట్రుకలు......నీ గోళ్ళు రక్షించాలి" అంటూ అనేక మంది దేవుళ్ళను ప్రార్థించారు.

వ్రేపల్లెలోని మగ మహారాజులు గొడ్డళ్ళతో పూతన శరీరాన్ని నరికి ఊరి బయటకుతెచ్చి చితిపెట్టి తగుల బెట్టారు. (ఆరుకోసుల మేరగల పూతన శరీరాన్ని ఎన్ని వేలమంది నరికారు? ఎన్ని వేల మంది చితి దగ్గఱకు ఎత్తుకపోయారు? ఆమెను కాల్చివేయడానికి ఎన్ని కట్టెలు కావలసి వచ్చాయి? అన్నే ప్రశ్నలకు ఎవరు సమాధాన మిస్తారు?) ఆమె చితినుండి లేచినపొగ ఘుమ ఘుమ లాడింది. (శవాన్ని కాల్చినప్పుడు కంపు వాసన వస్తుంది గాని పరిమళం వీచడం సాధ్యమా?)

నందుడు వ్రేపల్లె చేరుకోగానే జరిగినదంతా పూసగుచ్చినట్టు చెప్పారు గోపికలు. చావు నుండి బయటపడిన కొడుకునెత్తుకొని ముద్దాడాడు నందుడు.

ఓనాడు కృష్ణుని పుట్టిన రోజు పండుగ, నందునింట అమ్మలక్కలు గుమిగూడి వున్నారు, ఆటలు, పాటలు, దానాలు జరిగాయి. కృష్ణునికి నిద్రరాగానే పడుకోబెట్టింది యశోద.

కొంతసేపైన తర్వాత పిల్లలు యశోద వద్దకు వచ్చి "కృష్ణుడు కళ్ళు తెరచి ఏడ్చి పాదాల దగ్గర వున్న బండిని తన్నాడు. అది ఎగిరి క్రిందపడి పోయింది" అని చెప్పారు. (అది చొప్పబెండుతో తయారు చేసిన బండికాబోలు) అక్కడ వున్న యావన్మంది చాలా ఆశ్చర్యపోయారు.

బండి ఎగిరి క్రింద పడ్డందుకు బ్రాహ్మణులను పిలిచి శాంతి చేయించింది యశోద (యశోదకు వేపకాయంత వెర్రి వున్నట్టుంది.)

హోమం, పూజ జరిగాయి. యశోద పెట్టిన భోజనం తిని, నందుడు ఇచ్చిన బంగారం, బట్టలు, పూలదండలు, పాడిఆవులు స్వీకరించి ప్రతి ఫలంగా నందుణ్ణి, యశోదను. కృష్ణుణ్ని అనేకసార్లు దీవించారు బ్రాహ్మణులు. (బ్రాహ్మణుల ఆశీర్వాదాలు పొందడానికి నందుడు ఇంత ధన వ్యయము, కాలవ్యయం చేశాడు.)

ఓనాడు యశోద కృష్ణుణ్ణి ఒళ్లో పెట్టుకొని ముద్దాడుతోంది. కృష్ణుడు చాలా బరువనిపించాడు. (కృష్ణుడు పొట్టనిండా మెక్కడం వలన యశోదకు బరువనిపించాడేమో!) యశోద కృష్ణుణ్ని క్రిందికి దింపి పనిలో నిమగ్నమైంది

తృణావర్తుడు కంసుని ప్రేరణ వల్ల సుడిగాలి రూపంలో ద్రేపల్లెకు వచ్చాడు. ఆ ఇసుక తుఫానులో కొడుకును కానక యశోద ఏడ్చింది. ఆమెకు సాయంగా గోపికలందరూ వచ్చి ఏడ్చారు.

తృణావర్తుడు సుడిగాలిలా వచ్చి కృష్ణుణ్ని ఆకాశం మీదికి ఎతుక పోయాడు. కాని అతని బరువు మొయ్యలేక పోయాడు. కృష్ణుడు తృణావర్తుని కంఠం బిగ్గరగా పట్టుకున్నాడు. శ్వాసఆడక తృణావర్తుడు చచ్చి బండరాతి మీద పడ్డాడు. తృణావర్తుడి అవయవాలు విరిగి పోయాయి. తృణావర్తుని కంఠం బిగ్గరగా పట్టుకోవడం వలన కృష్ణునికి దెబ్బలు తగల లేదు. కాళ్లు చేతులు విరుగ లేదు. ఏ ప్రమాదం జరుగకుండా, చావకుండా మిగిలిపోయాడు )

'ఏ బ్రాహ్మణులను సుఖపెట్టామో రాక్షసుడు ఎత్తుకపోయి నప్పటికీ కృష్ణుడు చావకుండా మిగిలిపోయాడు, అని సంతోషపడ్డారు గోపికలు. (కవిగారి మాటలను నమ్మేవారు—బ్రాహ్మణులకు దానాలు ఇచ్చి వారిని సుఖపెట్టేవారు—కవిగారి మాటలను పరీక్షించడం కోసం పెద్ద కొండెక్కి క్రింద దూకండి ఒక్కసారి.. కృష్ణుని కథలోని సత్యాసత్యాలు తెలిసిపోతాయి. బ్రాహ్మణులకు దానం చేస్తే కలిగే ఫలితం ఇది అని కవిగారు ఎందుకు చెప్పారో పాఠకులు గ్రహించారనుకుంటాను.

ఓనాడు కృష్ణుడు యశోద చనుబాలు కడుపునిండా త్రాగి

ఆవులించాడు. ఆ పిల్లవాని నోట్లో సూర్యుడూ, చంద్రుడూ, సము ద్రాలూ కొండలూ ఇంకా చాలాచాలా కనిపించాయట యశోదకు. వెంటనే కళ్లు మూసుకొందట (ఇంత ఘోరమైన అసత్యాన్ని కూడా కొందరు ఈనాటికీ నమ్మేతున్నారు.)

వసుదేవుడు పంపగా ఓనాడు గర్గాచార్యుడు నందుని ఇంటికి వచ్చాడు. నందుడు ఆ బ్రాహ్మణ్ణి పూజించాడు (వీనికి బ్రాహ్మణు లను పూజించే మానసికరోగం వుంది.)

"మా ఇద్దరి కుమారులకు పేర్లు పెట్టు" అన్నాడు నందుడు.

"ఇప్పుడు నేను నీ కుమారులకు నామకరణం చేస్తే ఇతడు దేవకి కొడుకే అనుకొని చంపెయ్యవచ్చు కంసుడు" అన్నాడు గర్గుడు.

"గోవ్రజం వాళ్ళకు కూడా ఆచూకీ తెలియకుండా స్వస్తి వచన పూర్వకంగా నా కుమారులకు ద్విజ సంస్కారం జరిపించు" అంటూ ప్రార్థించాడు నందుడు.

రోహిణి కుమారుని పేర్లు బలుడు, రాముడు అని, యశోద కుమారుని పేరు కృష్ణుడని నామకరణము చేశాడు గర్గుడు.

'కృష్ణుడు నీ కుమారుడే అయినా మొదట వసుదేవుని కొడుకు కనుక ఈ రహస్యం తెలిసినవాళ్లు అతణ్ణి వాసుదేవుడంటారు, అని కూడా చెప్పాడు గర్గుడు (కృష్ణుడు దేవకి కుమారుడన్న రహస్యం నందునికి తెలుసా? ఈ విషయం కవిగారు. స్పష్టంగా వ్రాయలేదు. ఈ విషయాన్ని కవిగారు స్పష్టంగా వ్రాయకపోవడంలో కూడా ఏదో రహస్యం వున్నట్టుంది) ఇంకా నీ కుమారునికి అనేక పేర్లు న్నాయి. అవినాకు తెలుసు. సామాన్య జనులకు తెలియదు. పూర్వ యుగంలో దొంగల బారినుండి సాధుజనులను రక్షించాడు నీ కుమా రుడు.........ఇతణ్ణి పెంచి ప్రయోజకుణ్ణి చెయ్యి. (గర్గాచార్యా! ఏమిటి నీ అతి తెలివి. వినేవాడు బుద్ధితక్కువ వాడైతే నువ్వు లేని పోని అబద్ధాలు బాగానే చెప్పేటట్టున్నావే వెళ్లిపో తొందరగా) గర్గాచార్యుడు వెళ్లిపోయాడు.

రాముడు, కృష్ణుడు చాలా చిన్నతనంలో మన్ను పూసు కొంటూ తప్పటడుగులు వేస్తూ వీరులయ్యారు. ఓనాడు కొంతదూరం వెళ్ళి భయపడి తల్లుల దగ్గరకు పరుగెత్తి వచ్చి శూరులయ్యారు. కొంత పెరిగిన తర్వాత దూడ పెయ్యలతోకలు పట్టుక వెళ్లాడి సాహస వంతులనిపించుకున్నారు. ఆటలు ఆడి ఆటగాళ్ళనిపించు కున్నారు, ఆవులను చూచి, పాములను చూచి భయపడక వీరాధి వీరులనిపించుకున్నారు. అగ్గినాని, ముళ్లనాని లెక్క చేసేవాళ్ళు కాదు. నీళ్ళతో అగ్గిని చల్లార్చి వీరులనిపించుకున్నారు. ముళ్ళను రెండు ముక్కలు చేసి ధీరులని పించుకున్నారు. మరికొంత పెరిగి పిచ్చి వెధపల్లాగా దుడుకు పనులు చేసి రణధీరులనిపించుకున్నారు.

కృష్ణుడు మరి కొంచెం పెరిగి మరికొన్ని చెడ్డ బుద్ధులు నేర్చు కున్నాడు పరాయి ఇండ్లల్లోకి వెళ్లి పాలు పెరుగు దొంగతనం చేసి త్రాగేవాడు, కోతులకు త్రాగించేవాడు. పాలు పెరుగు కడవలలో మిగిలితే ఆ కడవలను పగుల గొట్టేవాడు. ఉట్లమీద పెట్టిన కడవలను తీయడానికి పీటలతో ఎత్తు తయారు చేసుకునేవాడు. అలా అందక పోతే కడవకు చిల్లిపెట్టి నోరు తెరచి త్రాగేవాడు. ఇంతే కాకుండా గోపికాస్త్రీలు అలికి ముగ్గుపెట్టుకున్న ప్రాంతములో ఉచ్చపోసే వాడు. (ఇలాంటి పిచ్చి పనులు చేసే పిచ్చి వెధవ మన దేవుడా?)

గోపికాస్త్రీలు యశోద దగ్గరకు వచ్చి కృష్ణుని నీచపు పనులను ఏకరువు పెట్టేవారు. యశోద కృష్ణుణ్ని మందలించేది కాదు. (కృష్ణుణ్ని పట్టుకొని వాని కాళ్ళు విరగ గొట్టే శక్తి గోపికలకు వున్నా, నందుడు ధనవంతుడు కనుక, ధనవంతుని కుమారుణ్ణి తంతే ఫలితం దారుణంగా వుంటుంది కనుక గోపికలకు ఎంత కష్టంగా వున్నా, కృష్ణుని మీద ఎంత కోపం వున్నా అవన్నీ మనసులో వుంచుకొని నవ్వుతూ కృష్ణుణ్ని, యశోదను మందలించి వెళ్ళిపోయే వారు.)

ఓనాడు కృష్ణుడు మన్ను తిన్నాడు. బలరాముడు "తమ్ముడు మన్ను తిన్నాడ"ని యశోదకు చెప్పాడు. యశోద కృష్ణుని దగ్గరకు

వచ్చి నోరు విప్పమంది. కృష్ణుడు నోరు విప్పాడు. కృష్ణుని నోరు నిండా మన్ను వుంది. ఆ మన్నునే భూమి, ఆకాశం, సూర్యుడూ చంద్రుడూ సర్వజగత్తూ అనుకుంది పిచ్చి యశోద.

ఓనాడు యశోద దాసీలకు వేరువేరు పనులు చెప్పి తాను స్వయంగా పెరుగు చిలకడం మొదలు పెట్టింది. కృష్ణుడు ఆమె దగ్గరకు వచ్చాడు. యశోద కృష్ణునికి పాలు కుడుపుతుండగా పొయ్యి మీది పాలు పొంగాయి. యశోద కృష్ణుణ్ని క్రిందికి దింపి వెళ్ళి పోయింది. కడుపునిండా పాలు ఇవ్వకుండా వెళ్ళినందుకు కృష్ణునికి యశోద మీద కోపం వచ్చింది. ఏడ్చాడు. పెరుగు కడవ పగులగొట్టి చాటుకు వెళ్లి వెన్న తిన్నాడు.

యశోదకు పగిలిపోయిన కుండను చూడగానే కృష్ణుని మీద కోపం వచ్చింది, బెత్తం పట్టుకొని కొడుతానని బెదిరించింది. త్రాడు తెచ్చి కృష్ణుని నడుముకు కట్టి ఇంకో చివర రోలుకు కట్టేసింది.

నలకూబరుడూ, మణిగ్రీవుడు ధనవంతుడైన కుబేరుని కుమారులు. వారొకనాడు స్త్రీలతో కలసి కల్లుత్రాగి పూలతోటలో విహరించారు. బట్టలు విప్పేసి గంగానదిలో విహరించారు. అప్పుడే నారదుడక్కడకు వచ్చాడు. స్త్రీలు సిగ్గుపడ్డారు. శాపం పెడుతాడని (తిడుతాడని) భయపడ్డారు. బట్టలు కట్టుకున్నారు. నలకూబరుడు, మణిగ్రీవుడు నారదుణ్ని లక్ష్యపెట్టలేదు వాళ్ళు కల్లుత్రాగి కైపెక్కి వున్నారు. ధనమదంతో అంధులైవున్నారు. నారదుడు వాళ్ళను మద్దిచెట్లయి పుట్టాలని శపించాడు నారదుని శాపం ప్రకారం వారు చెట్లయి పుట్టారు. (స్త్రీలు పురుషులు నగ్నంగా తిరిగిన రోజులున్నాయి. కాని తర్వాత కాలంలో అందరూ శరీర రక్షణ కోసం ఆకులు కట్టుకోవడం నేర్చుకున్నారు. బట్టలు నేయడం నేర్చుకున్న తొలిరోజుల్లో పాతఅలవాటు ప్రకారం నగ్నంగా తిరగడం కూడా జరుగుతూ వుండేది. అది అప్పుడు తప్పుగా భావించడం జరిగింది. ఈ కథలో నలకూబరుడూ, మణిగ్రీవుడూ ధనవంతుని కుమారులు. వారు డబ్బుతో కల్లు కొనుక్కొని త్రాగేవారు. వారితో ( వారి

డబ్బుతో) సుఖించడానికి అనేక మంది స్త్రీలు వాళ్ళను ఆశ్రయించే వారు. పురుషులు, స్త్రీలు కలసి నగ్నంగా స్నానాలు చేసిన రోజులున్నాయి ఆ పద్ధతి వలన కొన్ని అనర్థాలు కలకడం వలన స్త్రీలు, పురుషులు నగ్నంగా బహిరంగ ప్రదేశాలలో స్నానం చేయకూడదన్న ఆచారం వచ్చింది. ఏ ఆచారమైనా. చట్టమైనా పేదలు భయపడి తొందరగా ఆచరిస్తారు. కాని ధనవంతులు ధనమదంతో కొత్తగా అమలులోకి వచ్చిన ఆచారాలను, చట్టాలను లెక్కచేయకుండా ప్రవర్తిస్తారు అలాంటివారిని సమాజం మానసికంగానో, శారీరకంగానో బాధపెట్టడం జరుగుతుంది. మనుషులను శపిస్తే చెట్లుగా మారడం సంభవించదు. స్త్రీలు పురుషులు నగ్నంగా విచ్చలవిడిగా తిరిగితే శిక్షించబడేవారు. అనేది ఈ కథలోని అసలు రహస్యం )

కృష్ణుడు రెండు మద్దిచెట్ల మధ్యనుండి రోలు ఈడ్చుకుంటూ వెళ్ళాడు. చెట్లు కూలాయి. ఇద్దరు పురుషులు బయటకు వచ్చారు. (తప్పు చేసిన వారిని శిక్షించి విడుదల చెయ్యడం వంటిదని గ్రహించాలి ) ఆ పురుషులిద్దరు కృష్ణుని పాదాల మీదపడి అతనిని చాలా సేపు పొగడి వెళ్ళిపోయారు. నందగోపుడు వచ్చి కృష్ణుణ్ణి చూచి ఆశ్చర్యంతో సంతోషపడి అతని కట్టు విప్పేశాడు.

కృష్ణుడు చిన్నప్పుడు ధాన్యంతో పళ్ళు కొనుక్కొని తినేవాడు. తోటి పిల్లలతో కలసి యమునానది ఒడ్డుకు వెళ్లి ఆడుకునేవాడు. తల్లిచేత చాలా సేపు బ్రతిమాలించుకొని స్నానంచేసి బువ్వ తినేవాడు.

మహావనంలో ఉంటే కృష్ణునికి ఇంకా ఏదైన ఆపద రావచ్చునను కొని బృందావనానికి వెళ్లనిశ్చయించుకున్నాడు నందుడు. అతని వెంట ఊళ్ళోని కొంతమంది వెళ్లనిశ్చయించుకున్నారు. సామానంతా బండిలో ఎక్కించారు. గొల్లభామలు తమ ముఖాలను, చన్నులను, కాళ్లను, చేతులను చాలా అందంగా అలంకరించుకున్నారు. బృందావనం చేరుకున్నారు. అక్కడ రామకృష్ణులు తోటి పిల్లలతో కలసి ఆవుల్లాగా, ఆబోతుల్లాగా వేషాలు వేసి

కొట్లాడుకునేవారు. (పోకిరి వెధవలు)

ఓనాడు కృష్ణుడు అతని మిత్రులతో కలసి యమునా నది ఒడ్డున పశువులను మేపుతున్నాడు. వత్సాసురుడు అనునాయన దూడ వేషం వేసుకొని వచ్చాడు. వత్సాసురునిపై కృష్ణునికి ద్వేషం వుంది. వత్సాసురునిపై పగసాధించాలని ఎన్నాళ్ళ నుండో వుంది కృష్ణునికి. వత్సాసురుడు ఆవు వేషంలో వున్నప్పుడు పగతీర్చుకుంటే లోకులు తనను దుర్మార్గుడని భావించరనుకున్నాడు కృష్ణుడు. దూడ వేషంలో వెళ్ళి కృష్ణుణ్ని బాధపెట్టాలనుకున్నాడు వత్సాసురుడు కృష్ణుడు దూడవేషములో వున్న వత్సాసురుని తోక పట్టుకొని వెలగ చెట్టుపైన విసిరి కొట్టాడు. వత్సాసురుడు చనిపోయాడు. కృష్ణుడు నేరస్థుడని రుజువు చేసినవారు లేరు. అతనిని శిక్షించినవారు లేరు. (కృష్ణుడు ధనవంతుని కుమారుడు కనుక అతణ్ని ఎవరూ ఏమీ చేయలేక పోయారు. కథను ఇంకో కోణం నుండి చూచి నప్పుడు:— వత్సాసురుడు అంటే పాడిచే ఆవు దూడ అని అర్థం. కృష్ణుడు పాడిచే ఆవు దూడను చంపేసి వీరుడనిపించుకున్నాడు.)

పూతన తమ్ముడు కొంగ, అంటే బకాసురుడు. అతడు కృష్ణుణ్ని చంపాలన్న ఉద్దేశముతో కొంగరూపం ధరించి కృష్ణుని దగ్గరకు వచ్చాడు. కృష్ణుణ్ని మ్రింగాడు. కృష్ణుడు అతని నాలుకను కాల్చివేశాడు (ఎలా కాల్చాడు?) కొంగగారు కృష్ణుణ్ని కక్కేశాడు. (మనిషిని మ్రింగగలిగినంత పెద్దకొంగ లున్నాయా సృష్ట్యాదినుండి. ఇది కవిగారి కల్పితమే. కృష్ణుని శత్రువులు అతణ్ని చంపడానికి ఏవేవో వేషాలలో వచ్చేవారు అనేది హేతువాదం. పొడవ వచ్చిన కొంగను చీల్చివేశాడనేది ఇంకో రకమైన హేతువాదం.)

కృష్ణుడు కొంగను చంపగా చూచిన దేవతలు, మనుషులు, గాడిదలు, దున్నపోతులు, పిల్లులు, నల్లులు, బల్లులు ఆశ్చర్యపోవడం జరిగినది.

ఓనాడు గొల్లపిల్లలు ఆటపాటల్లో మునిగివుండగా అఘాసురుడు (పూతన తమ్ముడు) వచ్చాడు. అఘాసురుడంటే అమృతం త్రాగిన

దేవతలు కూడా భయపడేవారు. అఘాసురుడు ఆమడ పొడవుగల అజగరమై పోయాడు. గోపాలకులు, దూడలు అజగరం నోట్లోకి వెళ్ళిపోయారు. అయిదేళ్ళ కృష్ణుడు అజగరం నోట్లోకి వెళ్లి శరీరం పెంచాడు అఘాసురుడు చచ్చాడు. (శరీరం పెంచడం సాధ్యమా? అనేది ఒక ప్రశ్న. ఇందులో కవిగారు కృష్ణుణ్ని గొప్పచేసే ఉద్దేశముతో హేతువాద విరుద్ధంగా వ్రాశారు )

అఘాసురుణ్ని చంపి గోవులను గోపాలకులను రక్షించాడు కృష్ణుడు అప్పుడు పశువుల కాపర్లందరూ యమునానది ఇసకపర్రలో కూర్చుండి రాచ్చిప్పలలో తిన్నారు పశువుల విషయం మరచి పోయారు. పశువులు అడవిలో చాలా దూరం పోయాయి. ఆవులు కనబడక పోవడం వలన గొల్లపిల్లలు దిగులుతో తెల్లమొహం వేశారు. కృష్ణుడు మిత్రులకు ధైర్యం చెప్పి ఎంగిలి చేత్తోనే ఆవులను వెదకడానికి పరుగెత్తాడు.

ఆకాశం మీదినుండి చూస్తున్న బ్రహ్మదేవుడు కృష్ణుని లీలలు ఇంకా చూడాలని ఆవులను కనబడకుండా చేశాడు. కృష్ణుడు వెదకి వెదకి దూడలు కనబడక పోవడంతో యమున ఒడ్డుకు తిరిగి వచ్చాడు. అక్కడ గొల్లపిల్లలు కనబడలేదు.

బ్రహ్మదేవుణ్ని, గొల్లపిల్లల తల్లులను సంతోష పరచడం కోసం కృష్ణుడు స్వయంగా దూడలుగానూ, పిల్లలుగానూ మారిపోయాడు. (కవిగారి అభూత కల్పన ఇది) అతడు ప్రతి దినము ఉదయం అడవికి వెళ్ళి సాయంకాలం దూడల రూపంలోనూ, పిల్లల రూపంలోనూ గొల్లపల్లెకు తిరిగి వచ్చేవాడు. అలా ఓ సంవత్సరం గడిచింది.

బ్రహ్మ దేవుడు బ్రహ్మలోకం నుండి బృందావనం వచ్చాడు. నిజమైన గొల్లపిల్లలు, నిజమైన దూడలు మాయాశయ్య మీద నిద్ర పోతున్నాయి. కృష్ణుడు మాయతో తయారైన గొల్లపిల్లలు, దూడలు ఇంకోక చోట వున్నాయి. బ్రహ్మ నాలుగు నోళ్లు తెరచి ఆశ్చర్యపోయాడు. (ఇది అసాధ్యమే. అసాధ్యమైన విషయాలను కథగా వ్రాసి ఆనందించారు వ్యాసకవి ) హంస మీది నుండి క్రిందికి దుమికి

కృష్ణుని కాళ్ళు పట్టుకున్నాడు. తర్వాత సత్యలోకం వెళ్ళిపోయాడు. కృష్ణుడు దూడలను తోలుకొని యమున ఒడ్డుకు వచ్చాడు. దూడలను చూచి గొల్లపిల్లలు ఆనంద పడ్డారు.

"తాటిచెట్ల అడవిలో ధేనుకాసురుడనే గాడిద వున్నాడు. ఆ గాడిదగాడు తాటి పళ్ళన్నీ తినేస్తున్నాడు. వాడితో మరి కొంత మంది గాడిదరాక్షసులున్నారు. ఆ ధేనుకాసురుడు ఎంతో మందిని చంపాడు" అని బలరామకృష్ణులతో అతని మిత్రులు చెప్పారు.

కృష్ణుడు కొంగను చంపిన తర్వాత లోకులు అతణ్ని వీరుడని మెచ్చుకోగా అనేకసార్లు విన్నాడు బలరాముడు. ఆనాటి నుండి తను కూడా పదిమందితో వీరుడనిపించు కోవాలనుకుంటున్నాడు. మిత్రుల మాట విన్న తర్వాత ఈ గాడిదను చంపి బలరామ వీరుడని పేరు పొందాలని నిశ్చయించుకున్నాడు.

బలరామకృష్ణులు వాళ్ళమిత్రులు తాటివనానికి వెళ్లారు. బలరాముడు ధేనుకాసురుడను పేరుగల గాడిద దగ్గరకు వెళ్లాడు. అది వెనుక కాళ్లతో బలరాముని మూతి మీద తన్నింది. పెదవి లోపలిభాగం చిట్లిపోయి నోటి నుండి రక్తం కారసాగింది. బలరామునికి కోపం వచ్చింది. గాడిద వెనుకకు వెళ్ళి దాని రెండు కాళ్లు పట్టుకొని తాడిచెట్టుకు కొట్టాడు. తాడి చెట్టు కూలింది గాడిద చచ్చింది. ధేనుకాసురుడు చావగానే చాలా గాడిదలు అరుస్తూ ఏడుస్తూ బలరామునివైపు పరుగెత్తి వచ్చాయి, ఆ గాడిదలను చంపడంలో కృష్ణుడు కూడా పాల్గొన్నాడు. ఇరువురు అనేక గాడిదలను చంపి పిరికిపంద మిత్రులతో చాలా గొప్ప వీరులని పేరుపొందారు. గాడిదలను చంపినందుకు బలరామకృష్ణుల మీద దేవతలు పువ్వుల వాన కురిపించారు.

ఆనాటి నుండి జనులు తాటివనంలో తాటిపండ్లు తిన్నారు.

ఎండాకాలంలో ఓనాడు కృష్ణుడు అతని మిత్రులతో కలసి యమున ఒడ్డుకు వెళ్ళాడు. ఎండలో తిరగడం ఇష్టంలేక బలరాముడు ఇంటో వున్నాడు. ఎండలో తిరగడం వలన గొల్లపిల్లలకు దాహం

వేసింది. వారు యమున మడుగులో దిగి నీళ్ళు త్రాగి చచ్చి పోయారు. ఆ మడుగులోని నీళ్ళు విషంపు నీళ్లు. కృష్ణుడు వాళ్లందరి పైన ఒక చూపు విసిరి బ్రతికించాడు. (చచ్చిన వాళ్ళను బ్రతికించడం అసాధ్యం. కాని ఈ కథ వలన మనకు తెలిసేదేమిటంటే:- చచ్చిన వాళ్ళను చూపుతో బ్రతికించాలనుకోవడం, చావును. జయించాలన్న కోరిక మనిషికి అనాది కాలం నుండి వుంది—అని మరో విషయమేమిటంటే కృష్ణుణ్ని గొప్పచేసే ఉద్దేశముతో కవిగారి కథను సృష్టించారు.)

ఒకప్పుడు సౌభరీముని వద్దన్నా వినకుండా గరత్మంతుడు యమున మడుగులోని ఓ చేపరాజును తినేశాడు. చేపరాజు భార్యా పిల్లలు బంధు వర్గము కంటికి నీటికి ఏకధారగా ఏడ్చారు. వాటి దుఃఖం చూచి సౌభరిమునికి జాలికలిగింది. గరత్మంతుని మీద కోపం వచ్చింది, గరత్మంతుడు ఈ మడుగు వద్దకు వస్తే అతని ప్రాణం పోతుంది అని శపించాడు.

చేపలను తింటే చచ్చిపోతానన్న భయంతో గరత్మంతుడు నాగుపాములు నివసించే రమణ ద్వీపం చేరుకున్నాడు.

గరత్మంతునికి ఆకలి వేసినప్పుడల్లా ఓ నాగ సర్పమును తింటుండేది. పాములన్నింటిలో కద్రువ కుమారుడైన కాళియ నాగు మహా బలవంతుడు.

పాములు తమ్మెతాము రక్షించుకునే ఉద్దేశముతో గరత్మంతునికి ఏదో ఒక ఆహారం పడేసేవి,

కాళియనాగు తమ జాతిని చంపి తినివేసే గరత్మంతుణ్ణి సహితం లెక్కచేసేది కాదు,. దుర్మార్గుడైన గరత్మంతుణ్ని చంపి తమ జాతిని రక్షించు కోవాలని నిశ్చయించుకుంది.

పాములు గరత్మంతునికి పడేసే ఆహారాన్ని కూడా కాళియ నాగు తినసాగాడు. ఈ విషయం గరత్మంతున్కి తెలిసింది. కాళియ నాగును చంపెయ్యడానికి గరత్మంతుడు పరుగెత్తి వచ్చాడు. కాళియనాగు గరత్మంతుణ్ణి కాటువేయడానికి నోళ్ళు విప్పింది.

గరత్మంతుడు తనవాడియైన గోళ్ళతో బలమైన రెక్కలతో కాళియ నాగును బాధించాడు. కాళియనాగు గరత్మంతుని దెబ్బలను ఓర్వ లేక యమున మడుగులో దాక్కుంది. కాళియనాగు భార్యాపిల్లలు కూడా యమున మడుగులోకి వచ్చారు.

యమున మడుగులో స్నానం చేయడానికి, బట్టలు ఉతుకోవడానికి, కడవలతో నీరు తీసుకపోవడానికి సమీప గ్రామాలవారు వచ్చేవారు కాళియనాగు యమున మడుగులో తిరుగుతుండగా చాలా మంది చూశారు. వాళ్ళకు భయం వేసింది. కాళియనాగు విషం కక్కితే నీళ్ళు విషమయమవుతాయనీ, తాము మడుగులో ఈదుచుండగా కాటువేస్తుందేమోనని ప్రజల భయం. వాళ్లందరూ శ్రీకృష్ణుని దగ్గరకు వెళ్లి కాళియనాగును చంపి తమను కాపాడుమని ప్రార్థించారు,

శ్రీకృష్ణుడు అనేకసార్లు తేళ్లను, నీరుకట్టెలను, చీమలను, దోమలను చంపగా ప్రజలు చూశారు. ఒకసారి శ్రీకృష్ణుని మేనత్తతోడికోడలి మేనమామ ఇంట్లో నాగసర్పము కనిపించింది. ఆ ఇంటి ఇల్లాలు భయబడి కేకలు వేసింది. ఆ కేకలు శ్రీకృష్ణునికి వినిపించాయి. శ్రీకృష్ణుడు వెంటనే పాము దూరిన గదిలోకి వెళ్ళి పిల్లనగ్రోవి ఊదాడు ఆ ధ్వని విని పాము తన నోట్లోవున్న ఎలుకను గబుక్కున మింగి పడగ విప్పి నాట్యం చేసింది. శ్రీకృష్ణుడు అదే సమయములో నాగ సర్పమును పడగ వద్ద పట్టుకొని చాలా యుక్తిగా చంపేశాడు ఆనాటి నుండి శ్రీకృష్ణుడు చాలా శక్తివంతుడని, సాక్షాత్తు భగవంతుడని ప్రజలు పొగడసాగారు. ప్రజల పొగడ్తలు విని శ్రీకృష్ణుడు గర్వపడేవాడు.

శ్రీకృష్ణుడు ప్రజల ప్రార్థన విని ఆలోచనలో పడ్డాడు. "భూమి మీదున్న పామునైతే ఎలాగో యుక్తిగా పట్టి చంపెయ్య వచ్చు. కాని ఈనీటిలో తామరాకుల మీద తిరుగాడే కాళియనాగును ఎలా చంపేది?"

"మీ భక్తులమైన మమ్ములను రక్షించడానికి ఇంత ఆలోచ

నెందు కు ప్రభూ?" అన్నారు ప్రజలు దీనంగా.

శ్రీకృష్ణుడు మరో క్షణమాలోచించి "పదండి. ఆ కాళియ నా [illegible]ంచి దాని బారినుండి మిమ్మల్లను రక్షిస్తాను" అన్నాడు.

శ్రీకృష్ణుడు, అతని వెనుక ప్రజలు యమున మడుగు వద్దకు వచ్చారు.

కాళియనాగు దట్టంగా వున్న తామరాకుల మీద పడుకొని వుంది. శ్రీకృష్ణుడు యమున మడుగు ఒడ్డున వున్న కదంబ వృక్ష మెక్కాడు. పిల్లనగ్రోవి ఊదాడు. కాళియనాగు తామరాకుల మీద పాకుతూ కదంబ వృక్షము క్రిందికి వచ్చింది.

శ్రీకృష్ణుడు పిల్లనగ్రోవి ఊదడం ఆపి కాళియనాగు ప్రక్కన దుమికి యుక్తిగా దాని పడగ దగ్గర పట్టుకున్నాడు. కాళియనాగు తన తోకతో శ్రీకృష్ణుని శరీరాన్ని చుట్టుకుంది. శ్రీకృష్ణుడు కాళియనాగును చంపాలని ప్రయత్నించాడు. కాళియనాగు తన తోకతో కృష్ణుణ్ణి కదలకుండా బంధించింది. ఆ తర్వాత కృష్ణుడు నీళ్లలో ఈదలేక పోయాడు. అక్కడ తామరతీగ దట్టంగా వుంది. శ్రీకృష్ణుడు తామర తీగ మీద తల ఆన్చి అలసట తీర్చుకోసాగాడు. అది చూచి ప్రజలు శ్రీకృష్ణుడు చచ్చాడనుకున్నారు.

శ్రీకృష్ణుని వేశ్యలు ఏడ్చారు. మిత్రులు ఏడ్చారు. తమ భార్యలను కృష్ణుని దగ్గర రహస్యంగా పడుకోబెట్టే నపుంసకులు బాధపడ్డారు. బాలిగల తల్లులు కొంగుతో కళ్ళు తుడుచుకుంటూ ఏడ్చారు. ఇంతమంది ఏడుస్తుండగా ఆవులు, దూడలు బెదిరిబెదిరి చూశాయి.

శ్రీకృష్ణుని తల్లి, అతనితో రహస్య సంబంధం కల స్త్రీలు సేవకులు, మిత్రులు యమున దగ్గరకు వచ్చారు. శ్రీకృష్ణుడు అంతకు పూర్వము తేళ్లను ఏవిధంగా చంపేవాడో, దోమలను ఏవిధంగా చంపే వాడో ఎలుకలను, నల్లులను ఏవిధంగా చంపేవాడో కథలుగా చెప్పు కున్నారు.

అకస్మాత్తుగా శ్రీకృష్ణునికి ఓ చక్కని ఆలోచన వచ్చింది.

పాము తలను నీళ్ళలో ముంచుతూ పైకితీయసాగాడు.

ప్రజలు సంతోషం పట్టలేక చప్పట్లు చరిచారు, పాటలు పాడారు. శ్రీకృష్ణునికి మరింత ఉత్సాహం వచ్చేసింది. అతడు పాము పడగల మీద కాలితో తన్నుతూ, నీళ్ళలో ముంచుతూ కొంతసేపు గడిపాడు కాళీయనాగు భార్యలు శ్రీకృష్ణుని చేతిలో చిక్కిన తమ భర్తను చూశాయి. అవి తమ భర్తను రక్షించుకోవా లన్న అభిప్రాయంతో పిల్లల నెత్తుకొని తామరాకుల మీద పాకుతూ రాసాగాయి.

"అదిగో కాళియనాగు భార్యలు" అన్నారు కొందరు.

"తమ భర్తను వదలిపెట్టుమని మన శ్రీకృష్ణుణ్ని ప్రార్థిస్తూ వస్తున్నాయవి" అన్నారు కొందరు.

శ్రీకృష్ణుడు బంధు మిత్రుల అభినందనలు విన్నాడు. తనకో గుర్తింపు వచ్చినందుకు సంతోషించాడు. తామరాకుల మీద పాకి వస్తున్న పాములను చూచి ఒక్క క్షణం యోచించి అలసిపోయిన కాళియనాగును దూరంగా విసిరికొట్టి యమున మడుగులో నుండి బయటకు వచ్చాడు.

శ్రీకృష్ణుడు తడి బట్టలు విప్పి పొడిబట్టలు కట్టుకొన్నాడు. మిత్రులు అతని చుట్టూచేరి చాలా గొప్పగా పొగిడారు.

బ్రాహ్మణులు తమ భార్యలతో కూడా నందుడి దగ్గరకు వచ్చి "నందా! అదృష్టవంతుడివయ్యా నువ్వు. నీ కొడుకు పాముకాటు నుండి (చావునుండి) తప్పించుకున్నాడు. కనుక బ్రాహ్మణులకు దానం చెయ్యి" అన్నారు.

నందుడు దోపిడీచేసి సంపాదించిన బంగారము, ఆవులు బ్రాహ్మణులకు దానం చేశాడు.

ఆనాటి రాత్రి గొల్లలందరూ యమున ఒడ్డున పడుకున్నారు.

అది ఎండాకాలం కావడం వల్ల అడవి అంతా ఎండిపోయి వుంది. అర్ధరాత్రివేళ ఎవరో చుట్టతాగి పారేయడం వలన అడవి కాలసాగింది. నిద్రపోతున్న గొల్లవాళ్ళ చుట్టూ మంటలు వ్యాపిం

చాయి. హఠాత్తుగా కొందరికి మెలకువ వచ్చింది. గొల్లలు గావు కేకలు వేస్తూ కృష్ణుని దగ్గరకు వచ్చి "కృష్ణా! ఎలాగైనా ఈమంటల బారినుండి రక్షించు" అన్నారు.

కృష్ణుడు మంటలవైపు చూచి ఆలోచనలో పడ్డాడు. "ఆ మంటలను ఎలా ఆర్పాలి. ఈ ప్రజలను ఎలా రక్షించాలి. మంటలను ఆర్పడానికి నీళ్ళు కావాలి. నీళ్ళను సృష్టించే శక్తి తనకుంటే ఎంత బాగుండేది మంటలను ఆర్పి ఈ ప్రజలను రక్షిస్తే వీళ్లంతా తనను దేవునిలా చూస్తారు. కాని నీళ్ళను సృష్టించే శక్తి తనకు లేదే! ఎలా? ఇన్నాళ్లూ సంపాదించిన ఖ్యాతి గంగపాలు కావలసిందేనా? కృష్ణుడు కూడా మనలాంటి మామూలు మనిషే అని ఈ ప్రజలు అనుకోరా? వీళ్ళు రేపు తనను గౌరవిస్తారా? అయినా గౌరవించ డానికి ఈ ప్రజలు మంటల్లో కాలి చావకుండా వుంటే కదా! తను మాత్రం ఈ మంటల్లో కాలిచావకుండా వుంటాడా? ప్రజల గోల విని పామును చంపడానికి వస్తే తనకీ కష్టాలెందుకు దాపురించాలి? తను చచ్చిపోతే అంతఃపురంలో వున్న తన భార్యలందరూ అనాధ లవుతారు...............

"కృష్ణా! ఇంకా ఆలోచిస్తున్నావెందుకు? భక్తులను రక్షించ డమే నీ ధర్మమని బ్రాహ్మణులు నిన్ను పొగడుతారు కదా! మేము నీ భక్తులము కాదా?"

కృష్ణుడు తన ఆలోచనలకు స్వస్తి చెప్పి గంభీరంగా ఆకాశం కేసి చూశాడు. నల్లని మేఘాలు ఆకాశంలో తిరుగుతున్నాయి. వానవచ్చే సూచనలున్నాయి.

కృష్ణుడన్నాడు "వర్షం కురిపిస్తాను. మంటలను ఆర్పివేస్తాను. మిమ్మల్నను రక్షిస్తాను"

నాలుగు వైపులా మంటలు మండుతున్నాయి.

కృష్ణుడు ఆకాశం కేసి చూస్తూ ఎవరు పలకరించినా మాట్లాడ కుండా వుండిపోయాడు.

బ్రాహ్మణులు ప్రజలకు ధైర్యం చెప్తూ ఇలా అన్నాడు

"కృష్ణుడు మహాశక్తివంతుడు. కాళియనాగును తరిమి వేసిన పరాక్రమ వంతుడు. దోమలను, నల్లులను, తేళ్ళను సునాయాసంగా చంపగల సమర్థుడు. ఇప్పుడు వర్షం కురిపించి మంటలను ఆర్పి మనల్ని రక్షిస్తాడు. మీరు నిశ్శబ్దంగా వుండండి"

బ్రాహ్మణుల మాటలు నిజమని నమ్మి ప్రజలు మౌనం వహించారు.

కొన్ని ఘడియలు గడచిపోయాయి. కృష్ణుడు తన శక్తితో వర్షం కురిపించలేక పోయాడు. మంటలు మండుతూనే వున్నాయి. ప్రజలు మళ్ళీ హాహాకారాలు చేశారు.

"కృష్ణా! మమ్మల్ని రక్షించు" అని కొందరన్నారు.

"కృష్ణుడు మాత్రం మంటలను ఎలా ఆర్పుతాడు. మనలను ఎలా రక్షిస్తాడు. మనమే కృష్ణునికి అతీత శక్తులున్నాయని భ్రమ పడ్డాము" అని మరి కొందరన్నారు.

"కృష్ణుడు మహాశక్తి సంపన్నుడు. వర్షం కురిపిస్తాడు. భక్తులను రక్షిస్తాడు" అని బ్రాహ్మణులు తమ పాత ధోరణిలో మాట్లాడారు.

ఉరుములు మెరుపులతో మేఘాలు వర్షించడం ప్రారంభించాయి. మంటలు క్రమక్రమంగా ఆరిపోయాయి.

కృష్ణుడు కదలక మెదలక అలాగే కూర్చున్నాడు. వర్షం అలాగే కురుస్తూ వుంది. చాలామంది చెట్ల క్రిందికి వెళ్ళి కూర్చున్నారు. కృష్ణుని మహిమ వల్లే వర్షం కురిసిందని చాలా మంది అనుకున్నారు. కొందరు పైకి అన్నారు. బ్రాహ్మణులు కృష్ణుని దగ్గరకు వెళ్ళి "కృష్ణా! నువ్వు మహాశక్తి సంపన్నుడవు. సందేహం లేదు. వానలో తడుస్తావు, ఇలా వచ్చి చెట్టు క్రింద కూర్చో" అన్నారు.

"వర్షం కురిపించే నాకు ఈ వర్షం వలన ప్రమాదం జరుగుతుందని మీరు ఆందోళన చెందనక్కర లేదు" అని కృష్ణుడు గంభీరంగా చూశాడు. "అయినా భక్తులైన మీదగ్గర ఉండడమే నాకిష్టం. మీఇష్ట ప్రకారమే చెట్టు క్రింద కూర్చుంటాను పదండి" అన్నాడు.

కృష్ణుడు చెట్టు క్రిందికి వచ్చి కూర్చోగానే ప్రజలు అతని చుట్టూ గుమిగూడి పొగిడారు. కృష్ణుడు నవ్వుతూ గంభీరముద్ర వహించాడు.

(ఈ కాళియనాగు కథలో హేతువాద విరుద్ధమైన విషయాలు చాలావున్నాయి. ఈ కథ దృష్ట్యా చూచినా కాళియనాగు దోషం ఏమీ లేదు. శత్రువు బారినుండి తన్నుతాను రక్షించుకునే ఉద్దేశముతో కాళియనాగు యమున మడుగులో దాక్కుంది. కవి గరత్మంతుణ్ని సమర్థిస్తూ కాళియనాగు దుష్టుడని వర్ణిస్తూ కథ వ్రాశారు. పాఠకులు ఈ కథను చదివేటప్పుడు వ్యాసకవిగారి భాగవతం కూడా చదువుతూ ఉచితానుచితాలు గ్రహించాలి.)

ఓనాడు బలరాముడు, శ్రీకృష్ణుడు ఆవులను మేపుతూవుండగా ప్రలంబాసురుడను రాక్షసుడు గొల్లవేషం వేసుకొని రామకృష్ణుల దగ్గరకు వచ్చాడు, రామకృష్ణులను ఎత్తుకపోవాలని అతని సంకల్పం.

కృష్ణునికి ఆటలంటే ఎంతో ఇష్టం. అతడు మిత్రులతో కలసి భాండీరం అనే మర్రిచెట్టు దగ్గరకువచ్చి ఆటలాడుటకు సిద్ధమయ్యాడు.

పిల్లలంతా రెండు జట్లుగా విడిపోయారు. రాముడొక జట్టు నాయకుడు. కృష్ణుడొక జట్టు నాయకుడు, ప్రలంబాసురుడు కృష్ణుని పక్షమున వున్నాడు. ఆటలో గెలిచిన పక్షం వాళ్లను ఓడిన పక్షం వాళ్లు వీపు మీద అనుకున్న చోటుకు తీసుకపోవాలి. అది ఆటలోని నియమం.

ఒకసారి శ్రీకృష్ణుని పక్షంవాళ్ళు ఓడిపోయారు. ప్రలంబుడు బలరాముణ్ని వీపుమీద ఎత్తుకొని నడుస్తూ హద్దుగా ఏర్పరచిన చోట దించకుండా ముందుకు వెళ్ళి ఆకాశంలోకి ఎగిరాడు.

బలరాముడు చాలా యుక్తితో ప్రలంబాసురుని తలమీద బలమైన దెబ్బకొట్టాడు. ప్రలంబాసురుని తల పగిలిపోయింది. ప్రలంబుడు, బలరాముడు నేలమీద పడిపోయారు. పిల్లలంతా బలరాముణ్ని మెచ్చుకున్నారు. (ప్రలంబాసురుడు రామకృష్ణులను ఎత్తుకపోవాలని ఎందుకనుకున్నాడో కవిగారు కారణం చెప్పలేదు. ప్రలంబాసురుడు

బలరాముణ్ని ఎత్తుకొని ఆకాశ మార్గం పట్టాడట. ఇది కవిగారి అభూత కల్పన. ప్రలంబాసురుడు చేసిన పాపం ఏమిటో పేర్కొనకుండా—ప్రలంబాసురుడు పాపాత్ముడు కనుక బలరాముడు అతణ్ణి చంపాడని కవిగారు వ్రాశారు. అసమర్థుడైన కవి కల్పించిన కథలా వుందిది. ఇది ఒక పిచ్చి కథ.

కవిగారు కాలాలను వర్ణిస్తూ :— "చలికాలంలో వెచ్చని గదుల్లో పెళ్లాలను అలుముకొని పడుకునే కృష్ణుడు, వానకాలంలో ఆవులను మేపుతుండగా వర్షం పడితే గుహాలలోకి వెళ్లి వానబారి నుండి తప్పించుకునే కృష్ణుడు ఒక ఎండాకాలంలో అడవిలో పశువులను మేపుతుండగా చెట్లకు మంటలు అంటుకోగా ఆ మంటలను మింగేశాడు" అని వ్రాశారు.

కవిగారూ! మీ వర్ణనలు చాలా బాగున్నాయండీ.

ఒకనాడు కృష్ణుడు గొల్లపిల్లలతో కలసి అడవికి వెళ్లాడు. ఆయన అక్కడ మురళి వాయించాడు, పొయ్యిల కట్టెలు కొఱకు వచ్చిన గొల్లపడుచులు మురళి ధ్వని విన్నారు. కృష్ణుని దగ్గఱకు వచ్చారు. కృష్ణుని నోటినుండి ఊరేచొల్లును మురళి కూడా అనుభవిస్తుందని గొల్ల పడుచులు మురళి మీద ఈర్ష్యపడ్డారు.

కృష్ణుని మురళి ధ్వని విని నదులు, చెట్లు, పర్వతాలు, జంతువులు, పక్షులు, బృందావనం అన్నీ మనలాగే మన్మథవికారం పొందుతాయని గొల్లపడుచులు అనుకున్నారు.

స్వేచ్ఛగా కృష్ణునితో కామ సుఖాలనుభవించడానికి సమాజం ఒప్పుకోక పోవడం వలన మానసికంగా గొల్లపడుచులు కృష్ణునితో కామసుఖాలనుభవిస్తూ వుంటారు. కృష్ణునితో కామ సుఖాలనుభవించడం ఎప్పుడో కాని వీలుపడదు. కృష్ణుడు మురళి వాయిస్తూ పోతుంటే అతని అందం చూస్తూ శిలాప్రతిమల్లా నిలబడి పోతారు చాలా సందర్భాల్లో.

మార్గశిర మాసంలో గొల్లకన్యలందరూ కాత్యాయనీ దేవిని పూజించారు. 'కృష్ణుడే నా భర్త కావాలి, అని ప్రతి యువతి

అనుకుంది.

ఓనాడు గొల్ల కన్యలందరూ వేకువ జామున యిమునానదికి వెళ్ళారు. చీరెలు విప్పేసి నగ్నంగా యమునలో ఈదసాగారు.

ఆ గోప కన్యలందరితోనూ కృష్ణునికి రహస్య సంబంధంవుంది. కృష్ణుడు గోపికల చీరెలు పట్టుకొని యమునా నది ఒడ్డున వున్న కదంబ వృక్షమెక్కాడు, తర్వాత గోపికలను చూస్తూ "ఇదిగో అమ్మాయిలూ! మీకు ఇష్టమైతే ఇక్కడికి వచ్చి మీమీ చీరెలు తీసుకోండి" అన్నాడు.

నగ్నంగా కృష్ణుని ముందుకు వెళ్ళాలంటే ఎవరికీ ఇష్టం కలుగలేదు. "మమ్ముల్ని బాధపెట్టకు కృష్ణా! మేము నీ దాసీలం. మా చీరెలు మాకివ్వు, లేకపోతే మీ తండ్రిగారితో చెప్తాము" అన్నారు.

తండ్రితో చెప్తామన గానే కృష్ణునికి కాస్త జంకు కలిగింది. కృష్ణుడు యుక్తిగా అన్నాడు. "మీరు నా దాసీలని మీరే అన్నారు కదా! అయితే నేను చెప్పినట్టు వినండి. ఇలా వచ్చి మీ చీరెలు తీసుక వెళ్లండి."

కృష్ణుని దగ్గరకు నగ్నంగా వెళ్ళడం గోపికలకు కాస్త ఇష్టంగానూ కాస్త అయిష్టంగానూ వుంది. పైగా తెల్లవార వస్తోంది. ఎవరైనా చూస్తారేమోనని జంకు ఒకవైపు ఉండనే వుంది గోపికలందరూ రెండు క్షణాలు గుసగుసలాడి చేతులతో మర్మస్థానాలు కప్పుకొని ఒడ్డుకు వచ్చారు. అంతమంది నగ్నంగా తన దగ్గరకు రావడంతో కృష్ణునికి సంతోషం కలిగింది "బట్టలు విప్పి స్నానాలు చేసి దేవతలకు అపరాధం చేశారు కనుక ఈ దోషం శాంతించడం కోసం రెండు చేతులెత్తి నమస్కరించండి" అన్నాడు.

సూర్యోదయమయింది. ఎవరైనా వస్తారేమోనని గోపికలకు కాస్త జంకుగానే వుంది. కృష్ణుడు చెప్పినట్టు వినకపోతే ఇలా చాలా సేపు నగ్నంగా నిలబడవలసి వుంటుందని వాళ్లకు తెలుసు. అందుకే వాళ్ళు రెండు చేతులెత్తి నమస్కరించారు, గోపికల ఏయే అంగాలను

చూడాలన్న కోరికతో నమస్కరించండని కోరాడో ఆ కోరిక నెర వేరింది. అంతమంది గోపికల మర్మస్థానాలు చూడగానే కృష్ణునికి అసహ్యం లాంటిది కలిగింది. కనబడీ కనబడకుండా వున్నప్పుడే అందంగా వుంటుందనుకున్నాడు కృష్ణుడు స్త్రీలను నగ్నంగా ఇక ముందు చూడకూడదని నిర్ణయించుకున్నాడు. అసహ్యం వేసిన ఆ సమయంలో ఆ స్త్రీలలో ఎవరితోనూ కామ కోరికలు అనుభవించా లనిపించలేదు. కృష్ణుడు ఒక్కొక్క యువతిని చెట్టు చాటుకు పిలిచి ఎవరితో ఏ రహస్య ప్రదేశంలో ఏ సమయంలో కలిసేది చెప్పాడు.

ధనికుడు, అందగాడు అయిన కృష్ణుణ్ని తిరిగి తిరిగి చూస్తూ గోపికలు వెళ్ళిపోయారు.

ఒకనాడు కృష్ణుడు బలరామునితోనూ మరికొంత మంది మిత్రులతోనూ కలసి ఆవులను మేపడానికి యమున ఒడ్డుకువచ్చాడు.

ఆనాడు చద్ది అన్నమును కుక్క తినేసింది.

బలరామకృష్ణులకు చాలా ఆకలిగా వుంది. వాళ్లు గొప్ప ధని కులు కనుక ఎన్నడూ ఇతరుల దగ్గర అడుక్కతినలేదు. తమ గౌర వానికి భంగం కలుగకుండా ఆకలి తీరేదెలా? అని ఆలోచించారు రామకృష్ణులు. అక్కడికి సమీపములో బ్రాహ్మణులు స్వర్గం కోసం అంగిరస యజ్ఞం చేస్తున్నారని కృష్ణునికి అంతకు ముందే తెలిసింది.

కృష్ణుడు బీద మిత్రులను పిలిచి "యజ్ఞం చేసే బ్రాహ్మణుల దగ్గరకు వెళ్లి నాపేరు చెప్పి భోజనం కావాలని అడిగి తీసుకరండి" అని చెప్పాడు.

గొల్లపిల్లలు యజ్ఞశాలకు వెళ్ళారు.

బ్రాహ్మణులు స్వర్గం కోసం దీక్షగా యజ్ఞం చేస్తున్నారు.

"బ్రాహ్మణులారా! కృష్ణుడు కొంత దూరంలో ఆవులను కాస్తున్నాడు. అతనికి ఆకలిగా వుందట, అన్నం అడిగి తీసుక రమ్మ న్నాడు" అన్నారు గొల్లపిల్లలు.

బ్రాహ్మణులు గొల్లపిల్లల మాటలు వినే స్థితిలో లేరు. గొల్ల పిల్లలు నిరాశచెంది కృష్ణుని దగ్గరకు తిరిగి వచ్చారు.

కృష్ణుడు గొల్లపిల్లలను మళ్ళీ వెళ్ళి ఆహారం అడుక్కురమ్మ న్నాడు. గొల్లపిల్లలు మళ్ళీ యజ్ఞశాలకు వెళ్ళి "నందుని కుమారుడు కృష్ణుడు చాలా ఆకలితో వున్నాడు. అన్నం పెట్టండి" అని బిగ్గరగా అరిచాడు.

అందులో పదిమంది బ్రాహ్మణ వనితలు గొల్లపిల్లల మాటలు విని యజ్ఞం చేయడం ఆపివేశారు. ఆ పదిమందిలో ఇద్దరు పలుకుబడి గల స్త్రీలు. వాళ్ళు ఇంతకు ముందే కృష్ణుని సాహసకార్యాలు విన్నారు. అందగాడన్ని వాళ్ళకు ముందే తెలుసు. గొప్ప ధనవంతు డని కూడా తెలుసు. వాళ్ల భర్తలు అంద విహీనులు.

అన్నం తీసుక వెళ్ళి కృష్ణునికి పెట్టి ఆయన దయ సంపాదించి శారీరక సుఖాలు అనుభవించాలనుకున్నారు. మంచి మంచి పాత్రల్లో రుచికరమైన ఆహార పదార్థాలు తీసుకొని కృష్ణుని దగ్గరకు వెళ్లారు. అందులో కొందరు కృష్ణుని అందం చూడడానికైతే కొందరు,కృష్ణుని ఆవులను చూడడానికి. మరికొందరు యమునా నది అందాలను చూడడానికి.

బ్రాహ్మణ స్త్రీలు ఎవరెవరు ఏయే ఉద్దేశాలతో వచ్చారో కృష్ణుడు కొద్ది క్షణాల్లోనే గ్రహించాడు. ఇతర కులాల పురుషులు బ్రాహ్మణ స్త్రీలతో సంగమించిన యెడల నరకానికి పోతారని చాలా మంది బ్రాహ్మణశ్రేష్ఠులు చెప్పగా కృష్ణుడు లోగడ విన్నాడు.

కృష్ణుడు బ్రాహ్మణ స్త్రీలతో అన్నాడు. "భాగ్యవతులారా! మీరు మీ భర్తల దగ్గరకు వెళ్ళండి. యజ్ఞం పూర్తిచేసి స్వర్గం పొందండి"

బ్రాహ్మణ స్త్రీలలో స్వేచ్ఛా గుణం, ధైర్యం గల ఒక స్త్రీ కృష్ణునితో అంది. "కృష్ణా! నువ్వే మా భర్తవు. మేము ఏ ఉద్దేశ ముతో నీ దగ్గరకు వచ్చామో మా భర్తలకు తెలుసు. ఇక మాభర్తలు మాతో సంసారం చెయ్యరు. నీవే మాకు దిక్కు. నీ అందం చూచిన తర్వాత అందవిహీనులైన మా భర్తలతో దాంపత్య సుఖం ఎలా అనుభవించగలం. యజ్ఞాల పేరిట, జపాల పేరిట, స్నానాల పేరిట

కాలం వ్యర్థం చేస్తారు మా భర్తలు. ఉపవాసాలతో శరీరాలను శుష్కింప జేసుకొని కామ కోరికలను జయించామని విర్రవీగుతారు. మా భర్తలు, మాతో ప్రేమగా మాట్లాడిన రోజులు, మాతో దాంపత్య జీవితం అనుభవించిన సమయాలు చాలా తక్కువ. ఇంకా అలాంటి అసమర్థులైన భర్తల దగ్గరకు వెళ్ళి ప్రయోజనమేముంది ప్రభూ! నువ్వు మహాశక్తి వంతుడవని, దేవుడవని చాలా మంది చెప్పగా విన్నాం. మాకు నిన్ను పతిగా పొందే అదృష్టం లేదా దేవా!"

కృష్ణుడు ఆలోచనలో పడ్డాడు కోరివచ్చిన ఆడవాళ్లను కాదనడమెలా? వాళ్ల ముఖాలు చూస్తే ఆలింగనం చేసుకోవాలన్న కోరిక కలుగుతుందే!......కాని బ్రాహ్మణ స్త్రీలు......బ్రాహ్మణస్త్రీతో సంగమం చేసిన అన్యకులస్థుడు నరకం పోతాడన్న వేదసూక్తి జ్ఞప్తికి వచ్చింది. క్షణం సేపు కంగారు పడ్డాడు. దీర్ఘంగా ఆలోచించి చివరికి బ్రాహ్మణ స్త్రీలతో "మీ భర్తలు మిమ్ముల్ని కాదనరు. లోకమంతా మిమ్ముల్ని గౌరవిస్తుంది. శారీరకంగా మీతో నేను కలియకపోయినా నేను మీ వాడనే మీ మనస్సు నామీద, లగ్నం చెయ్యండి. మీరు త్వరలోనే నన్ను చేరుకుంటారు" అన్నాడు.

బ్రాహ్మణ స్త్రీలు యజ్ఞశాలకు వెళ్ళి కృష్ణుని ప్రతిభను పొగిడారు. కృష్ణుని దగ్గరకు వెళ్ళిన తమ భార్యలు తిరిగి రావడమే గొప్పగా భావించారు బ్రాహ్మణ పురుషులు. వాళ్లు తప్పుపట్టకుండా తమ భార్యలను స్వీకరించారు. ఒక్క బ్రాహ్మణుడు మాత్రం తప్పుపట్టి తన భార్యను వెళ్లగొట్టాడు.

బ్రాహ్మణ స్త్రీలు తమ భర్తలను కృష్ణుని సాహస కార్యాలను గూర్చి చెప్పారు. మగ బ్రాహ్మణులు శ్రీకృష్ణుడు సాక్షాత్తు దేవుడని భావించారు. విష్ణుదేవుడే యదువంశంలో కృష్ణుడుగా జన్మించాడని చాలా మంది అనగా విన్న వాళ్లకు అదినిజమే అనిపించింది.

ఎంతో అదృష్టవంతులం కనుకనే ఇలాంటి పతివ్రతా భార్యలను పొందగలిగామని మానసిక వ్యభిచారం చేసే భార్యలను చూచు

కొని మగ బ్రాహ్మణులు మురిసిపోయారు.

కృష్ణుణ్ని అనేక విధాల శ్లాఘించారు.

* గొల్లవారు ఓనాడు ఇంద్ర యజ్ఞం చేయ సిద్ధపడ్డారు. కృష్ణుడు తన తండ్రి దగ్గరకు వచ్చి "నాన్నగారూ! ఏదైనా ఉత్సవం తలపెట్టారా?'' అని అడిగాడు.

నందుడు "మేఘాల ప్రభువు ఇంద్రుడు. సర్వఫలాలూ ఇచ్చే ప్రభువు అతడు. అతణ్ని యజ్ఞం చేసి పూజించదలచాము'' అన్నాడు.

"నాన్న గారూ! ప్రతి ప్రాణీ కర్మానుసారమే ఫలమనుభవిస్తాడు కదా! ఇక ఈ దేవేంద్రునితో పనేముంది. దేనివల్ల మనిషి జీవితం సుఖంగా సాగుతుందో అదే తన దేవుడు. గోపాలనమే మనం మొదటి నుండి చేస్తున్నాము. కావున ఇంద్రున్ని యజ్ఞం కోసం తయారు చేసిన సామగ్రితో గోవులకోసం, బ్రాహ్మణుల కోసం, కొండల కోసం యజ్ఞం చేద్దాం'' అన్నాడు.

ఇంద్రుని పలుకుబడి పెరిగిపోతే తన గౌరవానికి భంగం కలుగుతుందని కృష్ణుని భావన.

గొల్లలు ఆవులను తోలుకొని గోవర్ధన పర్వతం దగ్గరకు వెళ్ళారు. బ్రాహ్మణులకు మొక్కారు. ఆవులకు మంచి పచ్చిగడ్డి వేశారు.

కృష్ణుడు గోవర్ధన పర్వతం ఎక్కికూర్చున్నాడు "జనులారా! ఈ పర్వతానికి ప్రదక్షిణలు చేసి మొక్కండి'' అని కేకవేశాడు. వెర్రి గొల్లలంతా పర్వతానికి ప్రదక్షిణలు చేసి మొక్కారు. కృష్ణుడు అందమైన అమ్మాయిలను చూస్తూ కూర్చున్నాడక్కడ. పలుకుబడిగల కృష్ణునికి కూడా జనులు మొక్కారు.

మానవజాతి నాయకుడు కృష్ణుడైనట్టే, దేవతాజాతి నాయకుడు ఇంద్రుడు. మానవులకన్న దేవతలు కాస్త తెలివి కలవాళ్ళని పేరు పొందారు. మానవులలో తెలివికల వారున్నారు. దేవతలలో కూడా తెలివి తక్కువ దద్దమ్మలున్నారు. అనేక సంవత్సరాల నుండి మానవులు మేఘాల ప్రభువుగా ఇంద్రుణ్ణి యజ్ఞంచేసి పూజిస్తున్నారు.

కృష్ణుని ప్రోత్సాహం వల్ల ఇంద్రుణ్ని ధిక్కరించి పాలిచ్చే ఆవులను, పనిచేయని బ్రాహ్మణులను, కదలని పర్వతాణ్ని యజ్ఞం చేసి పూజించారు గొల్లలు. ఈ విషయం ఇంద్రునికి తెలిసింది. తన ఆధిక్యతను ధిక్కరించిన మానవుల మీద కోపం వచ్చింది. వదురుబోతు కృష్ణుని మీద కోపం మరీ ఎక్కువగా వచ్చింది.

ఇంద్రుడు మేఘాలను పిలిచాడు, కాళ్లు, చేతులు, ముక్కు, నోరు లేని మేఘాలు ఇంద్రుని వద్దకు వచ్చి వినయంగా నిలబడ్డాయి. "మేఘాల్లారా! వ్రేపల్లె మీద విరుచుక పడండి. వడగళ్ళు కురిపించండి. పిడుగులు కురిపించండి. వ్రేపల్లె అంతా జల ప్రళయం చేసెయ్యండి" అన్నాడు.

బుద్ధిలేని మేఘాలు ఇంద్రుడు చెప్పినట్టు చేశాయి.

వ్రేపల్లె ప్రజలంతా కృష్ణుని దగ్గరకు వచ్చి "నీ మాటలు సమ్మకొని ఇంద్ర యజ్ఞం మానుకోవడం వలన మాకిన్ని ఇబ్బందులు ప్రారంభమయ్యాయి" అన్నారు. మా ఆవుమీద పిడుగుపడి చచ్చిపోయిందని ఒకరు, నా కూతురు మీద వడగళ్ళు పడి చచ్చిపోయిందని ఒకరు, మా ఇల్లు కూలిపోయిందని ఒకరు, ఇలా ఎవరి కష్టాలు వారు చెప్పుకున్నారు. చివరికి "ఇప్పుడు నువ్వే మమ్మలకు రక్షించాలి, అన్నారు.

కృష్ణుడు ఆలోచనలో పడ్డాడు:— "ఇంద్రుని యజ్ఞం కాకుండా చేశాను. ఇంద్రునికి కోపం వచ్చి వ్రేపల్లె నాశనం చేయడానికి రాళ్ల వాన కురిపిస్తున్నాడు. ఈ ఆపదనుండి ప్రజలను రక్షిస్తే వాళ్ళు నన్ను దేవునిలా కొలుస్తారు. నా పలుకుబడి ఇంకా పెరుగుతుంది............"

"కృష్ణా! ఆలస్యం చేయకు. దీనులమ రక్షించు" అని కొందరు కేకలు వేశారు.

కృష్ణుడు ఆలోచనల నుండి బయటపడి ప్రజల నుద్దేశించి "నా వెంట రండి. మిమ్ముల్లను కాపాడుతాను" అన్నాడు.

కృష్ణుడు ప్రజలను, ఆలమందలను గోవర్ధన పర్వతం పైమన్న

ఒక విశాలమైన గుహలోనికి తీసుకపోయాడు.

"ఈ గుహ కూలిపోతుందని భయపడకండి. హాయిగా కూర్చోండి. రాళ్లవాన మిమ్మల్ని ఏమీచేయలేదు, ఇంద్రుడు వచ్చినా ఇంద్రుని తాత వచ్చినా ఇప్పుడు మిమ్మల్ని ఏమీ చేయలేడు." అని కృష్ణుడు గుహలో ఒంటరిగా పడివున్న బండరాయి మీదికెక్కి నిలబడి చేయిని గుహ పైకప్పుకానించాడు.

అక్కడ చేరినవారిలో కొందరు కూలబడ్డారు. కొందరు బట్టలు విప్పి పిండి తొడుక్కుంటున్నారు.

"ఆ దృశ్యం చూడండి. కృష్ణుడు గోవర్ధన గిరిని ఎత్తిపట్టుకున్నట్టుంది" అన్నాడు కృష్ణునితో హాస్యమాడే ఓ మిత్రుడు.

ప్రజలందరూ కృష్ణుని వైపు చూశారు.

కృష్ణుని చిటకెనవ్రేలు గుహ పైభాగమును ఆనివుంది. కృష్ణుడే గోవర్ధన పర్వతాన్ని చిటకెన వ్రేలితో మోస్తున్నట్లుగా వుంది దృశ్యం,

ప్రజలు కృష్ణుని సాహస కార్యాలను పొగడుతూ పాటలు పాడారు.

పూతనను చంపిన విషయం, గాడిదను చంపిన విషయం, పామును చంపిన విషయం పాటగా పాడి చివరకు "గోవర్ధనగిరి ధారీ—నీకివే మా వందనాలు" అని పాట ముగించారు.

(కవిగారి కథను హేతువాద విరుద్ధంగా వ్రాశారు. దానిని నేను సవరించి వ్రాశాను. కృష్ణుడు గోవర్ధన పర్వతాన్ని ఎత్తినప్పుడు ఏడేళ్ల కుర్రాడని కవి వ్రాశాడు. కృష్ణుడు అంతకు ముందే తన దగ్గరకు వచ్చిన బ్రాహ్మణ స్త్రీతో "నామీద ప్రేమ చూపడానికి శారీరకంగా నాతో కలియనక్కరలేదు." అన్నాడు. ఈ మాటలకు అర్థమేమిటి? ఈ మాటలను ఏ వయస్సు వాళ్లు అంటారో పాఠకులే కాస్త ఆలోచించి నిర్ణయించాలి. గోపికలు యమునా నదిలో స్నానం చేస్తుండగా కృష్ణుడు బట్టలు దొంగిలించి చెట్టెక్కి ఒక్కొక్కరు వచ్చి బట్టలు తీసుకోండని అనడంలోనూ, గోపికలు మర్మస్థానాలు చేతులతో

కప్పుకొని సిగ్గుపడుతుంటే చేతులెత్తి నమస్కరిస్తే బట్టలిస్తాననడం లోనూ వున్న అర్థమేమిటి? అలాంటి భావాలు ఏ వయస్సు వాళ్ళకు కలుగుతాయి. ఉచితానుచితాలు, సందర్భశుద్ధి పాటించని కవి గొప్ప వాడేనా? కవిగారు హేతువాద విరుద్ధంగా వ్రాయడంలో సిద్ధహస్తులే. దీనిని మనం అంగీకరించి తీరాలి.)

ప్రజలు నందుని దగ్గరకు వచ్చి కృష్ణుని గొప్పతనాన్ని వర్ణించారు.

అప్పుడు నందుడిలా అన్నాడు "గర్గముని మా ఇంటికి వచ్చి నప్పుడు అన్నాడు 'నీ కొడుకు ప్రతి యుగంలోనూ పుడుతాడు. పూర్వం దొంగల బెడద ఎక్కువైనప్పుడు నీ కొడుకు పుట్టి వాళ్ళను చంపాడు. నీ కొడుకు భగవంతుని అంశ, అని. అప్పటినుండి నేను కృష్ణుణ్ని దేవుడనే భావిస్తున్నాను."

"మనమేదో పొగడ్తకంటే ఈ నందుడు తన కొడుకు నిజంగానే దేవుడని చెప్తున్నాడే. పైగా గర్గముని చెప్పాడంటున్నాడు. ఈ మునులకు పనేముంది. ధనవంతులను పొగడి తమ ఆధిక్యత కూడా చెప్పుకొని సమయానుకూల ధర్మాలు చెప్తూ ఏ పని చేయకుండా దోపిడీ చేసి జీవించడమేగా వీళ్ళపని." అన్నాడొక పెద్దమనిషి మరో పెద్దమనిషితో.

"ఆ మాటకొస్తే మనం చేస్తున్న పనేమిటి కృష్ణుణ్ని పొగడి నందుని దయ సంపాదించాలనే కదా మన తాపత్రయం కూడానూ"

వాళ్ల మాటలు వింటున్న నలుగురైదుగురు శ్రోతలు కిసుక్కున నవ్వారు.

"నందుడు వాళ్ళతో మరేదో చెప్తున్నాడు. కృష్ణుని గొప్ప తనం గురించే కాబోలు. మనమూ విందాం పదండి" అన్నాడు బుర్ర మీసాలాయన.

* కృష్ణుడు గోవర్ధన పర్వతమెత్తి ఆవులను ప్రజలను కాపా డాడని సామాన్య ప్రజలు చెప్పుకొంటుండగా ఇంద్రుని గూఢచారులు విన్నారు. తాము విన్నమాటలే ఇంద్రునికి చెప్పారు. ఇంద్రుడు

ఆశ్చర్యపోయాడు. కృష్ణుని లాంటి బలవంతునితో విరోధం పెట్టుకుంటే లాభం లేదని భావించాడు. ఎలాగైనా కృష్ణుని దయ సంపాదించి దేవతలలో తన ఆధిక్యత తగ్గిపోకుండా కాపాడుకోవాలని నిర్ణయించుకున్నాడు. ఇంద్రుడు వెంటనే కృష్ణుని ఇంటికి వచ్చి ఏకాంత ప్రదేశములో కలుసుకొని కృష్ణుని పాదాలు పట్టుకొని క్షమార్పణ కోరుకొని స్నేహ భిక్ష పెట్టుమని అర్థించాడు. కృష్ణుడు విజయ గర్వంతో తీవిగా చూచి ఇంద్రుణ్ణి లేవనెత్తి "ఇంద్రా! నేను ఎవణ్ని అనుగ్రహిస్తానో వాని ఐశ్వర్యం నాశనం చేస్తాను. నీకు శుభమగు గాక ఇక అమరావతికి వెళ్లు" అన్నాడు.

(ఐశ్వర్యం నాశనమై బాధపడేవానికి శుభమెలా కలుగుతుందో?)

* కృష్ణునితో స్నేహం చేసి పలుకుబడి పెంచుకోవాలన్న అభిప్రాయం వరుణుడికి కలిగింది. పరిచయమేలేని వ్యక్తితో స్నేహం చేయడమెలా? ఆలోచించాడు వరుణుడు. అతనికో ఉపాయం తట్టింది. వెంటనే సేవకుణ్ని పిలిచి "ఈ రాత్రివేళ నందుడు యమునా నదిలో స్నానం చేయిడానికి ఒంటరిగా వస్తాడని తెలిసింది. నువ్వు వెళ్లి అతణ్ని ఎత్తుకరా" అన్నాడు.

"అలాగే ప్రభూ" అని చెప్పి వెళ్లిన సేవకుడు అదే రాత్రి నందుణ్ని ఎత్తుక వచ్చాడు.

వరుణుని సేవకుడు తన తండ్రిని ఎత్తుకపోయాడని కృష్ణునికి తెలిసింది. అతడు వెంటనే వరుణుని తగ్గరకు వెళ్లాడు. వరుణుడు కృష్ణుణ్ని చాలా గౌరవించాడు, ఆదరించాడు. "నా సేవకుడు మూఢుడు వానికి ఉచితానుచితాలు తెలియవు. నీ తండ్రిని తీసుకపో మన స్నేహం అభివృద్ధి చెందనీ'' అన్నాడు.

నందుడు, కృష్ణుడు స్వగ్రామం చేరుకున్నారు.

వరుణలోకంతో (రాజ్యంలో) తనకు తన కొడుకుకు జరిగిన మర్యాదలను తన రాజ్యంలోని ప్రజలకు చెప్పాడు నందుడు. వరుణ లోకంలోని ప్రజలు కృష్ణుణ్ని దేవుడని భావించి పూజించారని

కూడా చెప్పాడు. ప్రజలకు నందుని మీద కృష్ణుని మీద మరింత గౌరవం పెరిగింది.

* కృష్ణునికి గోపికలతో విహరించాలనే కోరిక కలిగింది. వాళ్ల మనస్సు హరించే పిల్లనగ్రోవి పెదవులకానించి వాళ్ల హృదయాలలో కామం కలిగించే "క్లీం" బీజాక్షరం పిల్లనగ్రోవి రంధ్రాలలో పూరించాడు. కామం కలిగించే మురళి పాట గొల్లపడుచులు విన్నారు. తండ్రి చెప్పినా వినకుండా కొందరు పెళ్లికాని ఆడపిల్లలు, భర్తలు అడ్డుకున్నా వినకుండా కొందరు పడుచులు కృష్ణుని దగ్గరకు బయలు దేరారు. కృష్ణుని లాంటి అందగానితో ఒళ్లు కలపాలన్న ఉద్దేశముగల కొందరు స్త్రీలు తెగింపులేక ఇళ్లల్లో వుండి కళ్లు మూసుకొని కృష్ణునితో మానసికంగా కామకోరికలు అనుభవిస్తున్నారు.

తన వద్దకు వచ్చిన గోపికలను కొంటెగా చూస్తూ కృష్ణుడిలా అన్నాడు. "ఈ రాత్రివేళ ఈ అడవిలోకి ఎందుకు వచ్చారు. మీరు కనబడకపోతే మీ అన్నదమ్ములు, భర్తలు వెదకరా? మంచి కులంలో పుట్టిన మీరు మీమీ భర్తలను సేవించి పతివ్రతలని పేరు పొందలేరా? బలహీనుడైనా, దరిద్రుడైనా, దుర్మార్గుడైనా, ముసలివాడైనా, రోగి అయినా పతిని సేవించడమే కదా స్త్రీల ధర్మం." అని ఆగాడు.

(బలహీనుని భార్య, దుర్మార్గుని భార్య, దరిద్రుని భార్య, ముసలి వాని భార్య, రోగిభార్య కృష్ణుని దగ్గరకు వచ్చారన్నమాట. అలాంటివారి భార్యలు భర్తలతో సుఖించలేరు. కనుక అందగాడైన కృష్ణునితో కామ సుఖాలనుభవించడానికి భర్తలను ధిక్కరించి వచ్చారన్న గ్రహించాలి.)

గోపికలు ఓరచూపులు చూస్తూ మౌనంగా ఉండిపోయారు.

"పరపురుషునితో కామ సుఖాలనుభవిస్తే స్వర్గానికి వెళ్లరని శాస్త్రాలు చెప్పడం లేదా?" అన్నాడు కృష్ణుడు మళ్లీ.

"మాకు కావలసిన స్వర్గం నీ దగ్గరనే వుంది. బ్రతికుండగా నానా కష్టాలు అనుభవించి చచ్చిన తర్వాత స్వర్గం కావాలనుకునే మూర్ఖులము కాదు మేము. మా భర్తలు బలహీనులు, బుద్ధిహీనులు

వాళ్లను సేవించి పతివ్రతలుగా వుండేకన్నా నీలాంటి అందగానితో ఒక్కసారి కామసుఖము ననుభవించి చావడం మేలు. నీకోసం భర్తలను సమాజ ధర్మాలను ధిక్కరించి వచ్చాం. నీ అధరామృతం (సొల్లు)తో మా ప్రేమాగ్ని చల్లార్చు. నీ చేతులు మా స్తనాల మీద పెట్టు.........నీ............మీద పెట్టు.'' అని క్షణమాగి కృష్ణుని వైపు చూశారు. "మా భర్తలు మా అన్నదమ్ములు వచ్చి నిన్ను చంపుతారేమోనని భయపడుతున్నావా? ఈ రాత్రివేళ ఈ అడవిలోకి వచ్చేంత సాహసమా వాళ్ళకు. పైగా నీలాంటి ధనవంతుని ఎదుట వాళ్లు పెదవి విప్పగలరా? వట్టి పిరికి వెధవలు. ఏ కోరికా నెరవేర్చని భర్తలను—అన్నదమ్ములను, తల్లిదండ్రులను సమాజ ధర్మాలను ధిక్కరించి నీవద్దకు వచ్చాం కృష్ణా! నువ్వు మా కోరిక నెరవేరుస్తావన్న విశ్వాసంతో వచ్చాం. నువ్వు దేవుడవని చాలా మంది అనగా విన్నాం. మా కోరికలు తీర్చేశక్తి నీకులేదా కృష్ణా! నీ శరీరాణ్ని మా శరీరాలతో కలిపి మా మన్మథబాధ నివారించలేవా?'' అన్నారు.

శ్రీకృష్ణుడు కొన్ని క్షణాలు ఆలోచించాడు. నలువైపులా చూశాడు. తెల్లని వెన్నెల్లో చెట్లు మెరుస్తున్నాయి. పైరగాలి వీస్తూ వుంది. పూల వాసన మత్తెక్కిస్తూవుంది. గోపికల వైపు చూశాడు. వాళ్ళందరూ అందంగా అలంకరించుకొని వున్నారు. చూస్తే తాకి చూడాలనీ. తాకిచూస్తే ఇంకేదో చేయాలనీ కోరిక కలిగించే విధంగా వున్నారు, వాళ్ళు. వాళ్ళందరూ భర్తల చేత అనాదరింపబడిన వాళ్లే. కామబాధ అనుభవిస్తున్న వాళ్లే పురుష స్పర్శకోసం ముఖం వాచి వున్నవాళ్లే వాళ్ళందరినీ తన శక్తిమేరకు సంతృప్తి పరచాలనుకున్నాడు కృష్ణుడు. వెంటనే చేతులు చాచి గొల్లపడుచులను ఒకరి తర్వాత ఒకరిని కౌగిలించు కున్నాడు. అప్పుడు కృష్ణునికి మరో కొంటె ఆలోచన వచ్చింది. అతడు గోపికల చీరెలు విడిచి వాళ్ళ తొడలు తాకాడు. స్తనాలు పట్టుకున్నాడు. అక్కడ వున్న గోపికలందరూ నగ్నంగా వున్నా ఎవరూ ఎవరికీ సిగ్గుపడడం గానీ, భయపడడం గానీ జరుగలేదు. అందరూ సంతృప్తిగా కామబాధ తీర్చుకోవ

డానికి ప్రయత్నిస్తున్నారు.

వెన్నెల వెలుగులో గోపికల నగ్నసౌందర్యం అస్పష్టంగా కనిపిస్తూ వుంది. కృష్ణునికి ఆనందంగా, గర్వంగా వుంది. కాని ఇంత మంది కామకోరికలు తీర్చగలనా? అని కాస్త జంకులాంటిది కలిగింది. కృష్ణుడు వెంటనే తన కండరాలను చూచుకున్నాడు. కండరాలు బలిష్టంగా వున్నాయి. "చెంబుడుకోలది పాలు త్రాగినవాణ్ణి, వెన్న ముద్దలు మ్రింగినవాణ్ణి, అనేకమంది చేత దేవుడని పేరుపొందిన వాణ్ణి ఈ బలహీన స్త్రీల కామకోరికలు తీర్చలేనా" అని తనమనసుకు తానే సమాధానం చెప్పుకున్నాడు.

ఇంతమంది స్త్రీలు నా వైపు చూస్తూవుండగా ఒక స్త్రీతో కామకోరికలు అనుభవించడం ఏం బాగుంటుంది, అనే ఆలోచన కూడా కృష్ణునికి కలిగింది. వెంటనే కృష్ణుడు గోపికలతో "మీరంతా కళ్లు మూసుకోండి" అన్నాడు.

గోపికలు కృష్ణుడు చెప్పినట్టు కళ్లు మూసుకున్నారు.

కృష్ణుడు అక్కడ వున్నవారిలో చాలా అందమైన అమ్మాయిని ఎత్తుకొని పొదల చాటుకు వెళ్లిపోయాడు.

కొన్ని క్షణాల తర్వాత గోపికలు కళ్లు తెరచి చూశారు. వాళ్లందరికీ 'కృష్ణప్రియ' అనే అమ్మాయి కనిపించలేదు.

కృష్ణప్రియను కృష్ణుడెత్తుక పోయాడని, ఆమె కృష్ణునితో కామకోరికలు తీర్చుకొంటూ వుండవచ్చునని, ఆమె అదృష్టవంతురాలని మిగతా గోపికలు అనుకున్నారు. వారికి కృష్ణప్రియ మీద కాస్త ఈర్ష్యలాంటిది కలిగింది. గోపికలు కృష్ణుణ్ని వెదకసాగారు కృష్ణుని పాదాల గుర్తులననుసరించి నడవసాగారు.

కృష్ణునితో కామ కోరికలనుభవించిన కృష్ణప్రియకు కాస్త గర్వం కలిగింది, కృష్ణుని కొఱకు వచ్చిన గోపికలందరిలో తనే అందకత్తెననీ, కృష్ణుడు తననే ఎక్కువగా ప్రేమించాడనీ (కామించాడనీ) అనుకుంది

"కృష్ణా! అలసిపోయాను. నన్ను నీభుజాల మీద కూర్చోబెట్టు

కొని తీసుకపో" అంది కృష్ణప్రియ.

కృష్ణుడు కొంటెగా నవ్వి "సరే కళ్లు మూసుకో" అని చెప్పి అక్కడినుండి బయలుదేరి తనను వెదకుతున్న గోపికలను కలుసుకు న్నాడు.

కృష్ణుడు కనబడగానే గోపికల ముఖాలు వికసించాయి. "వెల కోరని దాసీలం మేము. మా మన్మథతాపం చల్లార్చు, నీ అధరామృతం మాకు ప్రసాదించు. మా పతులు బ్రతికివున్న శవాలు. వాళ్ళం టేనే మాకు ఒళ్లుమంట. నువ్వంటే మాత్రం మాకు చాలా ప్రేమ. నువ్వు పగటివేళ అడవికి వెళ్లినప్పుడు క్షణమొక యుగంగా వుంటుంది మాకు. కృష్ణా! కామం రగిలించే నీ చూపులు చూచి నీ మీద మనసు పడ్డాం. మా మన్మథతాపం చల్లార్చు కృష్ణా!" అన్నారు.

కృష్ణుడు గోపికలందరి వైపు ప్రేమగా చూశాడు.

గొల్లభామలు తమ వోణీలను పరిచారు. కృష్ణుడు కూర్చు న్నాడు.

ఒక గోపిక కృష్ణుని పాదాలు తీసుకొని తొడల మీద పెట్టు కుంది. ఇంకొక గోపిక కృష్ణుని చేతులు తీసుకొని స్తనాల మీద పెట్టు కుంది.

'వీళ్ళకు సిగ్గులేదేం' అనుకున్నాడు కృష్ణుడు మనస్సులో. కాని పైకి "నన్ను సేవించిన నా వాళ్ళకు దొరికీ దొరకనట్టు నటిస్తాను. మీరుతప్పుగా భావించకూడదు. మన సంయోగం నిర్మలమైంది. మీ త్యాగం సాటిలేనిది. ఎన్ని జన్మలెత్తినా బదులు తీర్చలేను" (అంత మంది కామకోరికలు తీర్చడానికి తను అశక్తుణ్ణని సూటిగా చెప్ప లేక ఇలా చెప్పడమా ఏమిటి?)

శ్రీకృష్ణుని శరీరంతో శరీరం కలిపి బ్రహ్మానందం అనుభవించ సాగారు గోపికలు. నలుగురైదుగురు గోపికలతో కామసుఖమనుభవించి కృష్ణుడు పూర్తిగా అలసిపోయాడు. ఇంకా కొంత మంది గోపికలు తమ వంతు కోసం ఎదురు చూస్తున్నారు. శ్రీకృష్ణుడు తన అశక్తత గోపికలకు తెలియజేయకుండా--"మీరంతా నాతోరండి. ఆ యమునా

నదిలో మీకు సంతృప్తి కలిగిస్తాను" అన్నాడు. గోపికలు కృష్ణుని వెంట యమునా నదిలో ప్రవేశించారు. నీరు చాలా చల్లగా వుంది. నీటిలో దిగగానే గోపికల శరీరాలు చల్లబడిపోయాయి. కృష్ణుడు గోపికల ముఖాలపై నీళ్లు చల్లుతూ వాళ్ళ స్తనాలను పట్టుకుంటూ తొడలను ముట్టుకుంటూ వారికి సంతృప్తి కలిగించాడు (కృష్ణుడు యోగమాయ నాశ్రయించి గోపికలతో విహరించాడని కవిగారు ఒకచోట సెలవిచ్చారు. యోగమాయ అనేది దొంగమాట. కవిగారు ఇంకొకచోట "కృష్ణుడు ధర్మవిరుద్ధంగా పరస్త్రీలతో ఎలా క్రీడించాడు." అని ఒక పాత్రచేత ప్రశ్నించారు. మరొక పాత్రచేత "మానవ సంబంధమైన మంచిచెడ్డలు అతనికి అంటవు" అని సమాధానం చెప్పించారు. 'పరస్త్రీలతో సంభోగించడం తప్పు' అని మానవుడు కల్పించుకున్న ధర్మం. ఆ ధర్మం చాలాకాలం నుండి అమలులోవుంది. శ్రీకృష్ణుడు భగవంతుడు (ధనవంతుడు) కనుక మానవ సంబంధమైన మంచి చెడ్డలు అతనికంటవని చెప్పి వ్యాసకవి శ్రీకృష్ణుణ్ని సమర్థించారు. శ్రీకృష్ణుడు మాత్రం మానవుడు కాదా? కుక్కనా? గాడిదనా? ఈ కథ పదే పదే విన్నవారికి, వివరించిన వారికి హృద్రోగం వుండదు" అని కవిగారు సెలవిచ్చారు. హృద్రోగవైద్యులూ! మీ కాలం చెల్లింబోయిూ! వ్యాసకవిగారు హృద్రోగానికి మందు తయారు చేసిచ్చారు. ఇక మీరు డబ్బెలా సంపాదిస్తారో ఆలోచించుకోండి.)

* ఓనాడు వ్రేపల్లె జనులు ఎడ్ల బళ్లమీద అంబికావనం వెళ్లారు. సరస్వతీ నదిలో స్నానాలు చేసి శివపార్వతులను పూజించారు.

నందుణ్ని అజగరం పట్టుకుంది నందుడు "కృష్ణా! నన్ను రక్షించు" అని చావుకేక వేశాడు. కృష్ణుడు వచ్చి అజగరాన్ని తన్నాడు. అజగరం వెంటనే అందమైన పురుషునిగా మారిపోయింది.

"ఎవరు నువ్వు?" అడిగాడు కృష్ణుడు. (అతడెవరో ఇతనికి తెలియదన్నమాట. పైగా దేవుడట )

"నన్ను సుదర్శనుడంటారు ఓనాడు కురూపులైన ఋషులను చూచి హేళన చేశాను, వారు శపించారు. నేను అజగరమై పుట్టాను

నువ్వు తన్నావు. నేను మనిషినై పోయాను." అనిచెప్పి అతడు వెళ్ళి పోయాడు. (ఈ కథ హేతువాద విరుద్ధంగా వుంది. ఇందులోని నీతి ఏమిటంటే 'అందవిహీనులను హేళన చేయకూడదు' అని)

ఒకనాడు రామకృష్ణులు రాత్రివేళ గొల్లభామలతో అడవిలో విహరిస్తున్నారు అప్పుడక్కడికొక యక్షుడు వచ్చి గొల్లభామలను ఎత్తుకపోసాగాడు. శ్రీకృష్ణుడు యక్షుని వెంట పరుగెత్తి పట్టుకొని చంపాడు, యక్షుని తలనుండి మణి బయటకు వచ్చింది. కృష్ణుడు దానిని బలరామునికిచ్చాడు.

* అరిష్టాసురుడను రాక్షసుడు ఎద్దు రూపం ధరించి వ్రేపల్లెలో చొరబడ్డాడు. డెక్కలతో నేల తవ్వుతూ కొమ్ములతో మన్ను ఎగజిమ్ముతూ రంకె వేసింది. ఎద్దు రంకె విని పాడిఆవులకు, గర్భవతులైన గొల్లభామలకు అకాలంలో గర్భపాతమైపోయింది. ఆ ఎద్దు తోక తగిలి మేఘాలు చెదరిపోయాయి. అలాంటి వృషభాసురుణ్ని కృష్ణుడు ఒడుపు చూచి కొమ్ములు పట్టుకొని 18 అడుగులు వెనక్కి తోసుక వెళ్లి చంపేశాడు. (రాక్షసుడు ఎద్దురూపం ధరించడమెలా సాధ్యం? పోనివ్వండి అది వదిలేద్దాం. ఎద్దుతోక తగిలి మేఘాలు చెదరి పోయినవట. నమ్మేద్దామా? ఎద్దును చంపడం కూడా గొప్పేనట. మా వూళ్లోవున్న కసాయివాడు ఎంత పొగరుబోతు ఆ బోతునైనా క్షణాల్లో చంపేస్తాడు. కృష్ణునికి కసాయివానికి పోలికలు భేదములు తెలుపుడు? పాఠకులకిదొక ప్రశ్న. సమాధానానికి నిరీక్షిస్తాను.)

* నారదముని కంసుని దగ్గరకు వచ్చి "కంసా! కృష్ణుడే దేవకి కొడుకు. వసుదేవుడు నీకు భయపడి తన స్నేహితుడైన నందుని దగ్గర కుమారులను వదిలిపెట్టాడు." అని చెప్పాడు.

నారదుని మాటలు విని కంసుడు దేవకి వసుదేవులను చెరసాలలో పడేశాడు. కేశిని పిలిపించి కృష్ణుణ్ని చంపేసి రమ్మన్నాడు. కేశి వెళ్లిపోయాడు.

కేశి కంసుణ్ని చంపేస్తాడో లేదో అనే అనుమానం వచ్చింది కంసునికి. అతడు వెంటనే అక్రూరుణ్ని పిలిపించి చెప్పాడు "అక్రూరా!

విష్ణువు సాయంతో బ్రతుకుతున్న దేవతలు బలరామకృష్ణులిద్దరినీ నా చావుకోసం నియమించారు. ధనుర్యాగం చూడ్డానికని చెప్పి రామకృష్ణులను ఇక్కడకు తీసుకురా. కృష్ణుణ్ని చంపడానికి కేశిని పంపానుకో. అతడే కృష్ణుణ్ని చంపితే పీడేపోతుంది. చంపకపోతే రామకృష్ణులిక్కడకు రాగానే కువలయాపీడంతో చంపిస్తాను. అలా చావకపోతే చాణూర ముష్టికులతో చంపిస్తాను. నా ముసలి పీనుగ తండ్రిని నేనంటే ఈర్ష్యపడే రాజులను హతమార్చి నా స్నేహితులైన జరాసంధుడు, నరకాసురుడు, బాణాసురుడు మొదలగువారి సాయంతో దేవతలను జయించి విశాల రాజ్యం పాలిస్తాను. నా రాజ్యపాలనలో నువ్వు అన్ని సుఖాలూ అనుభవించవచ్చు." అని చెప్పాడు. (దేవతలు రాజ్యసంపాదన కోసం కంసుణ్ని చంపాలనుకోగా, కంసుడు కూడా రాజ్యసంపాదన కోసం తన శత్రువులను చంపాలనుకుంటున్నాడు )

కంసుడు పంపిన కేశి గుర్రం రూపం ధరించి కృష్ణుణ్ని చంపడానికి వచ్చాడు. కృష్ణుడు గుర్రం వెనుక కాళ్లు పట్టుకొని గిరగిర త్రిప్పి దూరం విసిరేశాడు. గుర్రం మళ్ళీ కృష్ణుని వద్దకు పరుగెత్తి వచ్చింది. కృష్ణుడు గుర్రం నోట్లో చెయ్యి పెట్టాడు. చెయ్యి పెరిగింది. గుర్రం ఊపిరాడక చచ్చిపోయింది.

నారదుడు కృష్ణుని దగ్గరకు వచ్చి "కొద్ది రోజులలో చాణూర ముష్టికులు నీ చేతిలో చస్తారు. మహాగజం కువలాయపీడం చస్తుంది... అర్జునుని సారధివవుతావు.'' అని భవిష్యత్తును గూర్చి చెప్పాడు. (ఇది కవిగారి అతితెలివి)

కృష్ణుడు "దొంగాట" ఆడుతూ వ్యోమాసురుణ్ణి చంపేశాడు. (ఆటాడుతుండగా శత్రువును చంపవచ్చునా?)

అక్రూరుడు రథమెక్కి వ్రేపల్లెకు బయులుదేరాడు. మార్గములో అతడిలా ఆలోచించాడు. "కంసుడు నా ప్రాణమిత్రుడు. నిజమేకాని శ్రీకృష్ణుడు కంసుని కంటె బలవంతుడు, యుక్తిపరుడు. కృష్ణుడు దేవతల పక్షపాతి. కంసుడు పంపిన వీరులందరినీ చంపేసి

వీరుడతడు. ఈ సమయంలో కనుక కృష్ణుని స్నేహం చేస్తే నాకెన్నో యినా లాభాలుంటాయి. కంసుని దూతగా వెళ్ళిన నన్ను శత్రువుగా భావిస్తాడా కృష్ణుడు? రథం దిగగానే కృష్ణునికి నమస్కరిస్తాను నా వంటి అధమునికి అతని దర్శనం లభిస్తుందంటే కాలప్రభావమే కాని వేరు కాదు."

అక్రూరుడు వ్రేపల్లె చేరుకున్నాడు. రథాన్ని, రథం మీది జండాను రథంలో నుండి దిగిన అక్రూరుణ్ణి చూచి కంసుని దూత అని గ్రహించాడు శ్రీకృష్ణుడు.

అక్రూరుడు రథం దిగిన వెంటనే రామకృష్ణుల పాదాల మీద పడ్డాడు.

కంసుని రాజ్యంలోని ఒక ప్రముఖ వ్యక్తి నాకు మిత్రుడైతే కంసుణ్ని సులభంగా చంపవచ్చు ననుకున్నాడు కృష్ణుడు. వెంటనే అక్రూరునికి ఆసనం వేసి పాదాలు కడిగి పాడిఆవులు దానం చేశాడు. (లంచం ఇచ్చాడన్నమాట.)

కృష్ణుడు అక్రూరునితో ఇలాఅన్నాడు "కంసుడు బ్రతికివున్నంత వరకు మన కులానికి క్షేమం లేదు. నా మూలంగానే మా అమ్మా నాన్న చెరసాలలో వుండ వలసి వచ్చింది. మీలో ఎవరైనా కనబడితే బాగుండునని ఎన్నాళ్ళ నుండో అనుకుంటున్నాను. అదృష్టవశాత్తు నువ్వు కనిపించావు ఇంతకూ నువ్వు వచ్చిన పనేమిటో చెప్పు"

అక్రూరుడు చెప్పడం ప్రారంభించాడు.

"నువ్వు వసుదేవుని కుమారుడవని నారదుడు మా రాజుకు చెప్పాడు. అతడు మళ్లీ నీ తల్లిదండ్రులను చెరసాలలో పెట్టాడు. నిన్ను బలరాముణ్ని పిలుచుక రమ్మని నన్ను దూతగా పంపాడు"

కంసుడు తనవెందుకు రమ్మన్నాడో కృష్ణునికి తెలిసిపోయింది.

రామకృష్ణులు నందుని వద్దకు వెళ్లి కంసుని సందేశం వినిపించారు

కంసునికి కానుకలిచ్చి అతని అనుగ్రహం సంపాదించి రామకృష్ణులపై శత్రుభావం విడిచి పెట్టుమని వేడుకోవాలను కున్నాడు.

నందుడు. అతడు ఆనాడే వ్రేపల్లె ప్రజలందరినీ రప్పించి ఇలా చెప్పాడు." పాలు పెరుగు నెయ్యి వెన్న సమకూర్చండి. కానుకలు తయారు చేయండి. కంసరాజుకు బహుమతులిచ్చి అతని అనుగ్రహం సంపాదించుకుందాం."

కంసరాజు రామకృష్ణులను రమ్మన్నాడని తెలిసి గొల్లభామలు విచారంతో కుంగిపోయారు.

గోపికలు ఒక్కచోట గుమిగూడారు.

కృష్ణప్రియ గోపికలతో ఇలా చెప్పింది. "కంసుణ్ని చంపడానికి కృష్ణుడు, కృష్ణుణ్ని చంపడానికి కంసుడు కుట్రలు పన్నుతున్నారు. కంసుడు ఎంతైనా రాజు కదా! చతురంగ బలాలు కలవాడు కదా! మన కృష్ణమూర్తిని చంపేస్తాడో ఏమో!"

"కంసునికి కృష్ణునిపైన, కృష్ణునికి కంసునిపైన అంత విరోధం ఎలా ఏర్పడింది" అంది ఒక గోపిక.

"కృష్ణుడు పుట్టకముందే కృష్ణుని మీద కంసునికి ద్వేషభావం కల్పించారు దొంగవెధవ దేవతలు (ఆకాశవాణి ద్వారా) కంసునికి అతని బావ అయిన వసుదేవునికి విరోధం కల్పించి లాభం పొందాలని దేవతలు పన్నిన కుట్ర ఇది. దేవతలు పన్నిన కుట్ర తెలుకోకుండా వీరిద్దరు ఒకరినొకరు చంపుకోవాలని చూస్తున్నారు" అంది కృష్ణప్రియ.

మురళీప్రియ అనే గోపిక బాధతోనూ, ధైర్యంతోనూ అంది. "తల్లిదండ్రులను, అన్నదమ్ములను, భర్తలను ధిక్కరించి అందగాడని మురళి వాయించుటలో నిపుణుడని యుక్తిపరుడన్న, ధనవంతుడన్న కృష్ణుణ్ని నమ్ముకొని బ్రతుకుతున్న మనగతి ఏమవుతుందో? ఎలాగైనా అతణ్ని మధురానగరం వెళ్లకుండా మనం అడ్డుకుందాం. ఈ ముసలి కుల పెద్దలు మనలను ఏం చేస్తారు"

మురళీప్రియ మాటలు విని గోపికలు ఏడ్వడం తప్ప ఏమీ సమాధానం చెప్పలేకపోయారు.

మరునాడు అక్రూరుడు రామకృష్ణులను రథముపై ఎక్కించు

కొని బయలుదేరాడు. పాలు పెరుగు నెయ్యి వెన్న ఇంకా ఇతర కానుకలు గలబళ్లు రథం వెంట బయలుదేరాయి.

గోపికలు రామకృష్ణులు వెళ్తున్న రథం దగ్గరకు వచ్చారు. తాను మధురకు వెళ్తున్నందుకు గోపికలు బాధపడుతున్నారని కృష్ణుడు గ్రహించాడు. నేను మళ్ళీవస్తాను. అని కళ్లతోనే గోపికలకు సమాధానం చెప్పాడు.

తన రథములో వస్తున్న రామకృష్ణులు దేవతలవలె కనిపించారు అక్రూరునికి.

రథం మధురానగరం సమీపానికి వచ్చింది.

"అక్రూరా! నువ్వు రథం తీసుకొని ముందు పద. మేము ఇచ్చటి నుండి నడచి వస్తాము'' అన్నాడు కృష్ణుడు.

"కృష్ణప్రభూ! నువ్వూ మీ ప్రేపల్లె ప్రముఖులూ ముందు మా ఇంటికి రావాలని నా ప్రార్థన." అన్నాడు అక్రూరుడు చేతులు జోడించి.

కృష్ణుడు అక్రూరుని చేతులు పట్టుకొని చిరునవ్వు నవ్వుతూ "అక్రూరా! నీ భక్తికి మెచ్చాను. నీ ఇంటికి తప్పకుండా వస్తాను. కాని ఇప్పుడు కాదు. కంసుణ్ని చంపిన తర్వాత'' అన్నాడు.

రథములో అక్రూరుడు వెళ్లిపోయాడు.

కృష్ణుడు నడుస్తూ మధురానగరంలో ప్రవేశించాడు. కంసుని క్రింద పనిచేసే ఉన్నతోద్యోగుల ఇళ్లకువెళ్లి చాలా రహస్యాలు తెలుసుకున్నాడు. కంసుణ్ణి చంపడానికి కృష్ణునికి వాళ్లు చాలా రహస్యాలు చెప్పారు.

కృష్ణుణ్ని చూడడం కోసం కొందరు స్త్రీలు బయటకు వచ్చారు. అతడు వాళ్లను ఆదరంగా నవ్వుతూ చూశాడు. దారిలో కొందరు రామకృష్ణులకు కానుకలిచ్చారు.

బట్టల మూటను భుజానవేసుకొని వీధిలో వెళ్తున్న చాకలిని పిలిచి అన్నాడు కృష్ణుడు. "చాకలీ! మాకు మంచి మంచి బట్టలు ఇవ్వు. ఈ బట్టలు కట్టుకునేందుకు మాకు అధికారముంది''

చాకలివానికి కృష్ణుని మీద చాలా కోపం వచ్చింది "ఓరి గొల్ల వాడా! నీకు బట్టలు కావాలా! ఇతరుల బట్టలు అధికార యుతంగా అడిగి తీసుకొని కట్టుకుంటావా సిగ్గులేదా నీకు" అన్నాడు.

కృష్ణుడు చాకలివాని తల తెగనరికాడు వీధిలో వెళ్తున్న చాకలి వాళ్ళు భయపడి బట్టల మూటలు క్రిందపడేసి పారిపోయారు. నిరపరాధిని చంపివేసిన దుష్టుడైన కృష్ణుణ్ని పట్టుకొని రాజు ఎదుట పెట్టుటకు అక్కడ గుమిగూడిన ప్రజలలో ఎవరూ సాహసించలేక పోయారు. శ్రీకృష్ణుడు మంచిమంచి బట్టలు తీసుకొని కట్టుకున్నాడు. మిగిలిన గొల్లవాళ్ళు కూడా కట్టుకున్నారు. తర్వాత వాళ్ళందరూ మళ్ళీ ముందుకు నడవసాగారు. కొంతదూరం వెళ్లాక కుట్టుపనివాడు ఎదురయాడు—కృష్ణుడు చాకలివాణ్ని అన్యాయంగా చంపాడని ఆనోట ఈనోట కుట్టుపనివానికి తెలిసింది. కృష్ణుడు తననేదైనా పని చేయుమని కోరితే అతని ఆగ్రహానికి గురికాకుండా ఉండేందుకు ఉచితంగానైనా పనిచేసి పెట్టాలనుకున్నాడు—అతడు ఏదో పని మీద వీధిలో వెళ్తుండగా కృష్ణుడు చూచి దగ్గరకు పిలిచి అడిగాడు. "ఎవరు నువ్వు?"

"కుట్టు పనివాణ్ని" అతడు సమాధానం చెప్పాడు.

"అయితే ఈ బట్టలు చక్కగా కుట్టి ఇవ్వు" అన్నాడు.

అతడు బలవంతంగా నవ్వు తెచ్చుకొని "అలాగే ప్రభూ!" అన్నాడు.

కృష్ణాదులు అక్కడి నుండి సదాముడనే మాలాకారుడి ఇంటికి వెళ్ళారు.

సదాముడు బీదవాడు. కృష్ణుని చేతిలో చాకలివాడు అన్యాయంగా చచ్చాడని అతనికింతకు ముందే తెలిసింది.

కృష్ణుణ్ని చూడగానే సుదాముడు లేచివచ్చి కుర్చీలు వేసి కూర్చుండుమన్నాడు. "ఏం సేవ చెయ్యాలి నేను" అని దీనంగా అడిగాడు.

"పూలమాలలు కావాలి" అన్నాడు కృష్ణుడు.

సుదాముడు గుబాళిస్తున్న మంచి మంచి పూలమాలలతో రామకృష్ణులను అలంకరించాడు.

కృష్ణుడు కొంతదూరం వెళ్ళేసరికి ఓ పడుచు కనబడింది. ఆమె చేతిలో గంధం, అంగరాగాలున్నాయి. ఆమె ముఖం అందంగా వుంది. కాని కాస్త గూని వుంది. ఆ వూళ్లో వాళ్ళందరూ ఆమెను "కుబ్జ" అని పిలుస్తారు. ఆమె అసలు పేరు త్రివక్ర.

అడ్డమైన ఆడదాన్ని చూచి నవ్వే కృష్ణుడు కుబ్జను చూచి కూడా నవ్వాడు.

కుబ్జకు పెళ్ళయింది. కాని ఆమెకు గూని వుందని ఆమె భర్త ఆమెను విడిచిపెట్టాడు. ఆనాటి నుండి ఆమె కంసుని వద్ద సేవకురాలుగా పన్ని చేస్తూవుంది.

కృష్ణుడు నవ్వగానే కుబ్జకు కాస్త ధైర్యం కలిగింది. ఇన్నాళ్లూ ఆమెను చూచి ఆవిధంగా నవ్విన మగాడెవ్వడూ లేడు.

"సుందరీ! ఎవరు నువ్వు? గంధం ఎవరికోసం పట్టుక పోతున్నావు" అన్నాడు వేశ్యాలోలుడు

"సుందరుడా! నేను కంసుని దాసీని. నేనుతీసిన గంధమన్నా, నేను తయారు చేసిన అంగరాగాలన్నా రాజుకు మహా యిష్టం. ఇవి రాజు కోసం తీసుకపోతున్నాను" అంది.

కృష్ణుని అందము, ఆయన చూపులు కుబ్జను ఆకర్షించాయి. కంసుని కోసం పట్టుక పోతున్న గంధం, అంగరాగాలు కృష్ణునికిచ్చింది.

ఆమె గూని సరిచేయగలిగే శక్తి తనకుంటే ఎంత బాగుండేది అనుకున్నాడు కృష్ణుడు.

"త్రివక్రా! ఇలారా నీ గూని సరిచేస్తాను" అన్నాడు. ఆమె కృష్ణుని దగ్గరకు వచ్చింది.

కృష్ణుడు ఆమె నడుము వద్ద చేతులు వేసి ఆమె గూని సరిచెయ్యాలని చూశాడు. కాని సాధ్యపడలేదు.

కృష్ణుని చేతుల స్పర్శ సుఖం అనుభవిస్తూ ఆనందపడుతూ

వుందామె.

కృష్ణుడు త్రివక్ర చెంపలను తాకి చూశాడు. స్తనాలను కూడా ముట్టి చూడాలనుకున్నాడు. కాని పర పురుషులముందు తాను ప్రేమించిన (కామించిన) స్త్రీ స్తనాలు ముట్టుకోవడం బాగుండదని విరమించుకున్నాడు. అయినా మనసు ఆగలేదు. స్తనాలు ముట్టుకోవడానికి బదులుగా ఆమె కొంగు పట్టుకున్నాడు.

"కృష్ణా! కొంగుపట్టి లాగుతావెందుకు? మాయింటికిరా నా అందమంతా చూపిస్తాను. నా శరీరంతో నీ శరీరం........" అని టక్కున ఆగి నవ్వింది.

"సాయంత్రం తప్పకుండా వస్తాను. నీ కోరిక నెరవేరుస్తాను. భక్తులు ఏది కోరితే అది ఇచ్చే దేవుణ్ని నేను." అని గర్వంగా చూశాడు.

కుబ్జ వెళ్లిపోయింది.

కృష్ణుడు ముందుకు కదిలాడు. వ్యాపారస్థులు భవిష్యత్తును దృష్టియందుంచుకొని కృష్ణునికి కానుకలిచ్చారు.

కంసుడు ధనుర్యాగం చేస్తున్న చోటుకు వెళ్లాడు కృష్ణుడు. యిజ్ఞశాలలో ఎంతో ధనం వెచ్చించి చేయించిన అద్భుతమైన ధనుస్సుంది. కావలివాళ్లు వద్దన్నా వినకుండా ఆ ధనుస్సును ముక్కలు చేశాడు. ధనుస్సును కాపాడుతున్న భటులు కత్తులు పట్టుకొని కృష్ణుని పైకి వచ్చారు. ధనుస్సు ముక్కలు రామకృష్ణులు చెరొకటి పట్టుకొని భటులను ఎదిరించి చంపేశారు.

కంసుడు ఏమి చెయ్యదలచుకున్నాడో ఆ రాత్రి కంసుని క్రింది ఉద్యోగుల ద్వారా తెలుసుకున్నాడు. కంసుణ్ని చంపెయ్యడానికి తానేమి చెయ్యాలో ఆలోచించుకుంటూ నిద్రపోయాడు.

కృష్ణుడు మధురానగరంలో ప్రవేశించిన తర్వాత చాకలివాణ్ని చంపడం మొదలుకొని ధనుస్సు విరిచి భటులను చంపడం వరకు అంతా తెలుసుకున్నాడు కంసుడు చారులద్వారా.

మరునాడు ఉదయం మల్లక్రీడా మహోత్సవం జరగాలని

ఆజ్ఞాపించాడు కంసుడు.

కంసుడు ఉన్నతాసనం మీద కూర్చున్నాడు. అతని ప్రక్కన వినయ విధేయతలు నటించే మంత్రులు కూర్చున్నారు. ఆలోచనా జ్ఞానం లేని, ఏనుగుల్లాగా బలసిన, మల్లులు వచ్చి రంగస్థలములో కూర్చున్నారు.

నందుడు మొదలగు వారిని వచ్చి కూర్చుండుమని కబురంపాడు కంసుడు. వాళ్లందరూ వచ్చి రకరకాల బహుమతులు కంసునికిచ్చి ఆసనాల మీద కూర్చున్నారు.

రామకృష్ణులు కావాలనే కాస్త ఆలస్యంగా రంగస్థలానికి బయలుదేరారు. ద్వారము కడ్డముగా కువలయాపీడం అనే పెద్ద ఏనుగువుంది. దాని మీద త్రాగిన మైకంలో మావటివాడున్నాడు.

"ఇదిగో మావత్తు ఏనుగును కాస్త పక్కకితియ్యి" అన్నాడు కృష్ణుడు.

"మా రాజుగారు చెప్పినట్టు వినకపోయినా, నువ్వు చెప్పినట్టు విన్నా మారాజు ముందు నన్ను చంపేస్తారు తెలిసిందా. నిన్ను ఈ ఏనుగుతో తొక్కించి చంపుమని మారాజు నాతో చెప్పాడు.... ఇలారా!....." అని త్రాగిన మైకంలో ఆ మావత్తు నిజంచెప్పేశాడు.

కృష్ణుడు మావటి వానిపై కత్తి విసిరాడు. కత్తి వాని కంఠములో దిగింది. మరుక్షణమే అతడు ఏనుగు మీది నుండి క్రింద కూలాడు. తర్వాత కృష్ణుడు యుక్తితో ఏనుగును చంపేసి ఆయుధాలు పట్టుకొని రంగస్థలములో ప్రవేశించాడు. అతని వెనుక బలరాముడు.

కువలయాపీడాన్ని కృష్ణుడు చంపాడని కంసునికి తెలిసింది. అతడు కాస్త జంకాడు.

చాణూర మల్లుడు బలరామకృష్ణుల ముందుకు వచ్చి "బలరామకృష్ణులారా! మల్ల విద్యలో మీకు మంచి నైపుణ్యం వుందని మా మహారాజుగారు చెప్పారు. మాతో మీరు మల్లయుద్ధం చేస్తే మహారాజుగారు సంతోషపడుతారు" అన్నాడు.

బలరామకృష్ణులు అంగీకరించారు.

కృష్ణుడు చాణూరుడితో, బలరాముడు ముష్టికుడితో తల పడ్డారు.

కృష్ణుడు చాలా యుక్తితో యుద్ధం చేశాడు. చాణూరుడి రెండు చేతులు పట్టుకొని గిరగిర త్రిప్పి నేల మీదికి విసిరికొట్టాడు. చాణూరుడు చచ్చాడు బలరాముడు ముష్టికుణ్ని దెబ్బకొట్టాడు. అతడు నెత్తురు కక్కుకొని చచ్చిపోయాడు. తర్వాత బలరాముడు కూటుణ్ని చంపాడు. శలుణ్ని, తోశలుణ్ని కృష్ణుడు చంపాడు. కిరాయి మల్లులు కొందరు బ్రతికితే బలుసాకు తినవచ్చునని పారి పోయారు.

కంసుడు కోపంతో మండిపడుతూ సైనికులతో అన్నాడు. "బలరామకృష్ణులను ఈ పట్నం నుండి తరిమెయ్యండి, గొల్లవాళ్ల డబ్బు, నగలు దోచుకోండి. పగవాళ్ళతో లాలూచీపడ్డ నా తండ్రిని నరికెయ్యండి"

కృష్ణునితో లాలూచీపడ్డ సైనికులు కంసునిమాట పెడచెవిన పెట్టారు. సమయం కనిపెట్టి కృష్ణుడు ముందుకు వచ్చాడు. కంసునితో యుద్ధం చేస్తూ యుక్తితో అతణ్ని చంపేశాడు తర్వాత అతని 8 మంది తమ్ముళ్లను చంపేశాడు. కంసుని భార్యలూ అతని తమ్ముళ్ల భార్యలు భర్తల శవాలమీద పడి ఏడ్చారు. కపట కృష్ణుడు ఆ స్త్రీలను ఓదార్చాడు. తర్వాత చెరసాలవద్దకు వెళ్లి తల్లిదండ్రు లను విడిపించాడు.

"అమ్మా! నాన్నా! ఇన్నాళ్లూ మమ్ముల్ని దైవం మీదగ్గర వుండకుండా చేశాడు. కంసుడి భయంతో ఇన్నాళ్లు మీసేవ చెయ్యకుండా వ్యర్థంగా గడచిపోయాయి దినాలు. మా అపరాధం మన్నించండి" అన్నాడు కృష్ణుడు.

దేవకీవసుదేవులు బలరామకృష్ణులను గుండెలకద్దుకున్నారు.

ఉగ్రసేనుణ్ని (తాత) రాజ్యానికి రాజుగా ప్రతిష్ఠించాడు కృష్ణుడు. "మహారాజా! మా యదుకులంవాళ్లు యయాతిశాపం వల్ల

సింహాసనం ఎక్కలేరు. కనుక నువ్వు మమ్మేలను పాలించు" అన్నాడు.

కంసునికి భయపడి పారిపోయిన కొన్ని కుటుంబాలవారిని రప్పించి ఎవరి ఇళ్లల్లో వాళ్ళను వుండుమన్నాడు.

రామకృష్ణులు నందుని దగ్గరకు వచ్చి "పెంచిన నాన్నగారూ! ఇక మీరు వ్రేపల్లెకు వెళ్ళండి. కొన్నాళ్ళపాటు నేను, అన్నయ్య ఇక్కడనే వుంటాం" అన్నాడు.

మరునాడు వసుదేవుడు కులపురోహితుడైన గర్గాచార్యుణ్ని ఇతర బ్రాహ్మణులను నియోగించి కృష్ణునికి ద్విజ సంస్కారం జరిపించాడు. బ్రాహ్మణులకు బట్టలు, బంగారం. దానం చేశాడు. (తన కుమారుడు చేసిన అన్యాయాలను ప్రచారం చేయవద్దని బ్రాహ్మణులకు ఇచ్చిన లంచమన్నమాట. కృష్ణుడు చేసిన అన్యాయం ఉదా॥ చాకలివాణ్ని చంపడం.) ఇన్నాళ్లూ ఆవులను కాయడం; గుర్రాలను, గాడిదలను, ఎద్దులను, పాములను, ఎలుకలను తేళ్ళను, నల్లులను చంపడం తప్ప వేరే ఏ విద్యా నేర్వని కుమారులను చూచి వసుదేవుడు బాధపడ్డాడు. ఇప్పటికైనా మించిపోయింది లేదని భావించి అవంతీపురంలోవున్న సాందీపనముని, దగ్గరకు విద్యనిమిత్తం రామకృష్ణులను పంపించాడు.

కొన్నాళ్ళకు విద్యాభ్యాసం పూర్తయింది. గురుదక్షిణ కోరుమని ప్రార్థించారు రామకృష్ణులు.

"ప్రభాస తీర్థంలో సముద్రంలో మునిగి నా కుమారుడు చచ్చి పోయాడు. వాణ్ని తెచ్చిపెట్టండి'' అని గురుదక్షిణ అడిగాడు సాందీపనుడు.

కృష్ణుడు సముద్రము దగ్గరకు వచ్చి నీళ్ళకేసి చూస్తూ "మా గురువుగారి కుమారుణ్ని నీ కెరటాలు లాక్కుపోయాయట. అతణ్ని తెచ్చిపెట్టు'' అన్నాడు.

వాసుదేవా! నేను మీ గురుపుత్రుణ్ణి మింగలేదు. నా నీళ్ళ లోపల పంచజన్యుడనే రాక్షసుడున్నాడు. వాడే మీ గురుపుత్రుణ్ని

మింగి యుండవచ్చు అంది సముద్రము (సముద్రం మాట్లాడిందట చూశారా కవిగారి.............)

కృష్ణుడు సముద్రములో దూకాడు. పంచజన్యుణ్ని చంపాడు. గురుపుత్రుడు అతని పొట్టలో లేడు. కాని పాంచజన్యం వుంది. దానిని తీసుకున్నాడు. తర్వాత అతడు యముని దగ్గరకువెళ్లి "నా గురు పుత్రుణ్ని ఇవ్వు" అన్నాడు.

యముడు సాందీపుని కుమారుణ్ని తెచ్చి ఇచ్చాడు. (ఈ యముడు గాడు ఎక్కడ వున్నాడు కవిగారూ! నాకు కాస్త చూపెడుతారా? నేను యముణ్ని మా తాత కావాలని అడుగుతాను. మా తాతను చూడాలని వుంది నాకు.)

రామకృష్ణులు గురుపుత్రుణ్ని గురువుకిచ్చి అతని వద్ద సెలవు తీసుకొని మధురాపురం చేరుకున్నారు.

శ్రీకృష్ణుడు ఉద్ధవునితో "మిత్రమా! నువ్వు వ్రేపల్లెకు వెళ్లి మా అమ్మా నాన్నలను చూచిరావాలి. నాకోసం భర్తలను వదులుకున్న గోపికలు నాకోసం నిరీక్షిస్తూ విచారిస్తూ వుంటారక్కడ. నేను త్వరలోనే వస్తానని వాళ్లతో చెప్పు" అన్నాడు.

ఉద్ధవుడు వ్రేపల్లెకు వెళ్లాడు. నందుడు సంతోషంతో ఉద్ధవుణ్ని కౌగలించుకొని కృష్ణుని క్షేమ సమాచారాలడిగాడు.

కృష్ణుడు త్వరలోనే ఇక్కడకు వస్తాడన్ని ఉద్ధవుడు చెప్పాడు.

గోపికలు ఉద్ధవుని దగ్గరకు వచ్చి బాధతోనూ, విచారంతోనూ అన్నారు. "ఉద్ధవా! కృష్ణుని కోసం భర్తలను తల్లిదండ్రులను వదులుకున్నాం. అతని కపటపు నవ్వులు చూచి అతని వలలోపడ్డాం ఆ కుటిలుడి తియ్యని మాటలు నిజమని నమ్మాం. అతడు చపలచిత్తుడని ఇప్పుడు గుర్తించాం. స్వార్థం కోసం మా దగ్గరికిచేరిన దగాకోరు కృష్ణుడు రతిముగిశాక వదిలిపోయాడు మమ్మల్నను. నమ్మిన వాళ్ళను నయవంచన చేయకుమని కృష్ణునితో చెప్పు"

ఉద్ధవుడు గోపికలను ఓదార్చి "కృష్ణుడు మీకు చెప్పమని చెప్పిన సందేశం వినిపిస్తాను వినండి" అంటూ ఇలా చెప్పాడు.

"మీ ప్రియుణ్ని నేను, మీ నుండి దూరంగా వున్నానంటే మనసా మీరు నా సాన్నిధ్యం అనుభవించాలనే—నామీద మనస్సు నిల్పి ధ్యానిస్తే త్వరలో మీకు నేను లభిస్తాను"

కృష్ణుడు పంపిన సందేశం విని కృష్ణుని కొంచెం మనస్తత్వం తెలుసుకోగలిగారు గోపికలు.

గోపికలు ఉద్ధవునితో "ఉద్ధవా! మమ్ములను ప్రేమించినట్టే కృష్ణుడు మధురాపట్నం స్త్రీలను కూడా ప్రేమిస్తున్నాడా? రతి విశేషం తెలిసిన రసికుడతడు. స్త్రీలను లోబరచుకోవడంలో చాలా నైపుణ్యం కలవాడతడు. పట్నవాసపు నెరజాణల వలలో పడితే, అడవిలోవుండి వ్యభిచారభావంతో తిరిగే మమ్ముల్ని జ్ఞాపకముంచు కుంటాడో లేదో. పగవాళ్లను చంపి రాజ్యం సంపాదించిన కృష్ణుని స్నేహం కోసం అనేకమంది పాకులాడుతూ వుండవచ్చు. కొద్ది రోజుల్లో రాజకుమార్తెలను పెళ్లాడి సుఖంగా కాపురం చేస్తాడు. అప్పుడు మేము అతనికి జ్ఞాపక ముంటామా!" అంటూ నిష్ఠూరంగా మాట్లాడారు.

నందుడు మొదలయిన గోపకులు ఇచ్చిన కానుకలు స్వీకరించి కృష్ణుడు పాలిస్తున్న మధురా నగరం వచ్చేశాడు ఉద్ధవుడు. (మధురా నగరం కృష్ణుడే పాలిస్తున్నాడా? కంసుణ్ని చంపిన తర్వాత కృష్ణుడు ఉగ్రసేనునితో అన్న మాటలు చూడండి. "మేమంతా నీ ప్రజలం మమ్మల్ని పాలించు.........నేను నీ సేవకుణ్ణయివుంటాను" కవి గారు రాసిన ఈ రెండు విషయాలు పరస్పర విరుద్ధంగా వున్నాయి.)

కుబ్జ ముఖసౌందర్యం చూచిన నాటినుండి ఆమెను చూడాలనీ ఆమెతో రతిసౌఖ్యం అనుభవించాల్న కలలు కంటున్నాడు కృష్ణుడు.

ప్రజల దృష్టిలో ఉగ్రసేనుడు రాజైనప్పటికీ రాచ కార్యా లన్నీ కృష్ణుడే చూస్తున్నాడు. అతనికి కొన్నాళ్లనుండి తీరిక దొర కడం లేదు.

ఓనాడు తీరిక చేసుకొని ఉద్ధవునితో కలసి కుబ్జ ఇంటికివెళ్లాడు కృష్ణుడు. అతణ్ని చూడగానే చెలికత్తెలతో ఎదురువెళ్ళి ఆహ్వా

నించింది కుబ్జ కృష్ణునికి, ఉద్ధవునికి మంచి విలువైన ఆసనాలు వేసి కూర్చుండు మంది.

కృష్ణుడు ఆసనం మీద కూర్చున్నాడు. ఉద్ధవుడు ఆసనం మీద కూర్చుండలేదు. కిందకూర్చున్నాడు. (ఇది అసమానత్వాన్ని సూచిస్తుంది. కృష్ణుడు రాజు కాకపోయినా అతని చేతిలో ఎన్నో అధికారాలు వున్నాయి. కనుక ఉద్ధవుడు కృష్ణునితో సమానంగా కూర్చుండలేదు. సమాన స్థాయిలో కూర్చుంటే కృష్ణుడు ఓర్వలేడని ఉద్ధవునికి తెలుసు——అసమానతలున్న సమాజంలో పుట్టిపెరిగిన వ్యక్తి ఉద్ధవుడు)

కుబ్జ స్నానం చేసి శుభ్రమైన చీరకట్టుకొని అంగరాగాలు పూసుకొని వాసన ద్రవ్యాలు రాసుకొని తాంబూలం వేసుకొని కృష్ణుని వద్దకు వచ్చింది.

ఉద్ధవుడు ఇంటిముందుకు వెళ్లి గద్దెమీద కూర్చున్నాడు.

కామ వేదనతో వేగిపోతున్న కుబ్జ స్తనాలమీద కృష్ణుడు చేతులు వేసి, చెంపలకు చెంపలు ఆనించి.........ఆమె దీర్ఘతాపం చల్లార్చాడు.

"కృష్ణా! కొన్నాళ్లు నావద్దనేవుండు. నాతో రమించు నిన్ను వదలలేను ప్రభూ!" అంటూ కృష్ణుణ్ని మళ్లీమళ్లీ గాఢంగా కౌగలించు కుంది కుబ్జ.

" మళ్లీ వస్తాను ప్రియా" అని చెప్పి కృష్ణుడు తన దివ్య భవనానికి తిరిగి వచ్చాడు.

అక్రూరుని ఆహ్వానాన్ని పురస్కరించుకొని కృష్ణుడు బలరాముణ్ని ఉద్ధవుణ్ని తీసుకొని అక్రూరుని ఇంటికి వెళ్లాడు.

అక్రూరుడు "కృష్ణా! నువ్వే ఈ విశ్వం సృష్టించావు. (విశ్వ సృష్టి జరిగిన తర్వాత కోట్ల సంవత్సరాలు గడచిన తర్వాతనే కృష్ణుడు—పాత్ర—పుట్టాడు.) నీకుచావు పుట్టుకలు లేవు [కృష్ణునికి పుట్టుకవుంది. దేవకి కడుపులో పుట్టాడు. కొన్నాళ్ల తర్వాత చచ్చిపోతా(యా)డు.] వేదమార్గాన్ని అవలంభించావు నువ్వు" (అసమాన

తలను సమర్థించే మార్గం) అంటూ పొగిడాడు.

కృష్ణుడు నవ్వి "అక్రూరా! దేవతలకైనా స్వార్థం వుంటుంది. కాని నీకులేదు నువ్వు మామేలు కోరేవాడవు. హస్తినాపురం వెళ్లి పాండవుల యోగక్షేమం తెలుసుకొనిరా. తర్వాత పాండవులకు ఎలా మేలు కలుగుతుందో ఉపాయం ఆలోచిస్తాను." అన్నాడు. (కృష్ణుడు యుక్తిగా ఎలా మాట్లాడు చున్నాడో గమనించండి.)

అక్రూరుడు హస్తినాపురం వెళ్లాడు

ధృతరాష్ట్రుడు పాండవుల నెలా చూస్తున్నాడో తెలుసు కొంటున్నాడు.

ఓనాడు అక్రూరుడు కుంతి దగ్గరకు వెళ్లాడు. కుంతి కొన్ని నిమిషాలు ఏడ్చి "మా కృష్ణుడు నన్నూ నా బిడ్డలను కాపాడు తాడా?" అంది.

అక్రూరుడు నవ్వి "బలేదానవమ్మా! మన కృష్ణుడు మనకు సహాయం చేయక ఇంకెవరికి చేస్తాడు? కౌరవులకు సహాయం చేస్తా డని నీ అనుమానమా ఏమిటి?" అన్నాడు.

"అనుమానాలు రావడం సహజమేకదా అక్రూరా! రాజకీయా లలో ఆప్తులు కూడా అనుకోకుండా శత్రువులవుతారు. అది నీకు మాత్రం తెలియదా" అంది కుంతి.

అక్రూరుడు కుంతిని ఓదార్చాడు.

ఓనాడు అక్రూరుడు ధృతరాష్ట్రుని దగ్గరకు వెళ్లాడు. అక్రూ రుడు ధృతరాష్ట్రునితో "ధృతరాష్ట్ర మహారాజా! పాండురాజు చచ్చి పోయాక నువ్వే రాజ్యాన్ని పాలిస్తున్నావు. పాండురాజు లాగా నువ్వు కూడా ధర్మంగా రాజ్యం పాలించు. కొడుకులమీద పక్షపాతం మానుకో. సమతా భావంతో పాలించు'' అన్నాడు.

ధృతరాష్ట్రునికి కాస్త కోపం వచ్చింది. "పాండురాజులాగ నేను కూడా ధర్మంగానే పాలిస్తున్నాను అధర్మంగా పాలిస్తున్నా నని నువ్వెలా అనుకొంటున్నావు?" అంటూ ప్రశ్నించాడు ధృత రాష్ట్రుడు.

"నేను......నేను......నేనన్నదేమిటంటే పక్షపాత బుద్ధి.... తర్వాత ఏం చెప్పాలో తోచక అక్రూరుడు తికమక పడిపోయాడు.

అక్రూరుని అభిప్రాయం గ్రహించిన ధృతరాష్ట్రుడు "పక్షపాతం లేకుండా పాలించిన ఒక్క రాజు పేరు చెప్పు చూద్దాం. ఏరాజైనా తన కొడుకులు సుఖపడాలనే చూచుకుంటాడు. తనవారు సుఖపడాలనే ఉద్దేశమే లేకపోతే సింహాసనం ఎక్కాలన్న కోరికెందుకుంటుంది? అధికారం హస్తగతం చేసుకోవడానికి ఆరాటమెందుకుంటుంది? పోరాటమెందుకుంటుంది? సమతా భావంతో పాలించుమని నాకు చెప్తున్నావు కానీ మీ ఉగ్రసేనుని రాజ్యంలో ప్రజలందరూ సమానత్వంతో జీవిస్తున్నారా?" అని ప్రశ్నల వర్షం కురిపించాడు ధృతరాష్ట్రుడు.

ధృతరాష్ట్రుని ప్రశ్నలకు సమాధానాలు చెప్పక అక్రూరుడు నోరు మూసుకున్నాడు.

ధృతరాష్ట్రుని అభిప్రాయాలు పూర్తిగా తెలుసుకున్న తర్వాత అక్రూరుడు కుంతి దగ్గర ఇతర బంధువుల వద్ద సెలవు తీసుకొని ద్వారకకు వచ్చి ధృతరాష్ట్రుని అభిప్రాయాలు కృష్ణునికి చెప్పాడు.

* ఆస్తి, పాస్తి అనేవారు కంసుని భార్యలు, జరాసంధుని కూమార్తెలు వాళ్ళు. భర్త చచ్చిపోయాక తండ్రి ఇంటికి వెళ్ళి తమ భర్త చావడానికి కారణం వివరిస్తూ ఏడ్చారు.

జరాసంధునికి రామకృష్ణుల మీద అగ్గిలాంటి కోపం వచ్చింది. వెంటనే 23 అక్షౌహిణీల సేనతో మధురానగరం ముట్టడించాడు. శ్రీకృష్ణునికి విషయం తెలియగానే కాస్త భయపడ్డాడు. కాని తన భయం తనలోనే అణచుకొని బలరాముని వద్దకు వచ్చి "అన్నయ్యా! యాదవులందరూ నిన్నే ప్రభువుగా భావిస్తున్నారు. వాళ్లకిప్పుడు ఆపద వచ్చింది. వాళ్ళను నువ్వు రక్షించాలి. దుష్టసంహారం కోసం మనమిద్దరమూ అవతరించామని బ్రాహ్మణులు కీర్తిస్తారు కదా! ఆ మాట నిజం చెయ్యాలి" అన్నాడు.

బలరాముడు సరేనన్నాడు. ఇద్దరూ కవచాలు వేసుకున్నారు.

సైన్యంతో పట్నం బయటకు వచ్చారు.

మేనమామను చంపిన కృష్ణుణ్ని అసహ్యంగా చూశాడు జరాసంధుడు "కృష్ణా! మేనమామను చంపిన నీచుడవు నువ్వు. నీతో యుద్ధం చేయడం కూడా అవమానమే తప్పకో. బలరామా! చచ్చి స్వర్గం వెళ్ళాలని వచ్చావా! అయితేరా. నీతలకాయను నా బాణంతో ఎగురగొడుతాను" అన్నాడు.

జరాసంధుడు కోపంతో చూస్తుంటే కృష్ణునికి భయం వేసినా భయాన్ని ఎలాగో అణచుకొని "ముసలి వాడవు. నీకి యుద్ధ మెందుకు? కాలో చెయ్యో విరిగితే నీకి ముసలికాలంలో సేవలు చేయడానికి కూడా ఎవరూ ముందుకు రారు" అన్నాడు.

జరాసంధునికి చాలా కోపం వచ్చింది. రామకృష్ణుల మీద, యాదవ సేనమీద బాణాలు కుమ్మరించాడు. మధురానగరంలో మేడల మీది నుండి చూస్తున్న స్త్రీలు (తమ కొడుకులను, భర్తలను యుద్ధానికి పంపిన స్త్రీలు) కొందరు మూర్ఛపోయారు. కొందరు రాగం పెట్టి ఏడ్చారు.

శ్రీకృష్ణుడు మగధ సేన మీద బాణాలు వేశాడు. కాళ్లు తెగి కొందరు, తలకాయలు తెగి కొందరు చచ్చిపోయారు. బలరాముడు చంపిన మగధ వీరుల రక్తం నదులై ప్రవహించింది. ఆ రక్త ప్రవాహంలో కాళ్ళు, చేతులు, తలకాయలు కొట్టుకపోయాయి. (యుద్ధం చేసినపుడు ఇరుపక్షాలవారు చనిపోతుంటారు సాధారణంగా. అయితే కవి పక్షపాత బుద్ధితో—జరాసంధుడు బాణాలు వేసినపుడు ఎవరూ చచ్చినట్టు వ్రాయలేదు.)

తన సైన్యంలో చాలామంది చనిపోవడం చూచిన జరాసంధునికి బాధకలిగింది. యుద్ధం చేయకూడదనీ, స్వార్థం జయించడం కోసం తపస్సు చేయాలనీ నిశ్చయించుకున్నాడు. కాని జరాసంధుని పక్షం రాజులు "యుద్ధం చేయడం వీరుల లక్షణం. నిరపరాధులను సహితం యుక్తితో చంపే ఆ కృష్ణుణ్ని చంపకపోతే భూమి మీద ధర్మమే వుండదు" అన్నారు.

జరాసంధుడు తపస్సు చేసే ప్రయత్నం మానుకున్నాడు. తాత్కాలికంగా యుద్ధం ఆపి చావగా మిగిలిన సేనతో రాజధానికి వెళ్ళిపోయాడు.

శ్రీకృష్ణుడు విజయిగర్వంతో రాజధ్ధానికి తిరిగి వచ్చాడు. వ్యాపారస్థులు, ఉన్నతోద్యోగులు అతని దయ సంపాదించడం కోసం ఆడంబరంగా ఆహ్వానించారు. రణభూమి నుండి తెచ్చిన ధనరాసులు, నగలు ఉగ్రసేనునికప్పగించాడు.

జరాసంధుడు 17 సార్లు మధురానగరంపై దండయాత్ర చేసి ఓడిపోయాడు.

18వ సారి దండయాత్ర చేయడానికి జరాసంధుడు సిద్ధపడ్డాడు.

* శ్రీకృష్ణుడు మేనమామను, చాకలి వాణ్ని, ఎద్దును, గుర్రాన్ని, కాకిని, గద్దను చంపడం నారదునికి నచ్చలేదు. జరాసంధునికి కృష్ణుణ్ని చంపే శక్తి లేదని కూడా నిర్ణయించుకున్నాడు. కృష్ణుణ్ని చంపడానికి తగిన శక్తికలవాడు కాలయవనుడని గ్రహించి, కృష్ణుడు చేసిన చెడ్డపనులు అతనికి చెప్పి, మధురపై దండెత్తుమని అతణ్ణి ప్రోత్సహించాడు.

కాలయవనుడు మూడుకోట్ల మ్లేచ్ఛ సైన్యంతో మధురను ముట్టడించాడు. (కృష్ణుడు అగ్రవర్ణాలవారి ఆధిక్యతను కాపాడడం కోసం పోరాడితే కాలయవనుడు దానిని ప్రతిఘటించడం కోసం పోరాడాడు )

శత్రువుల సంఖ్య పెరిగిపోవడం చూచి శ్రీకృష్ణుడు కలవరపడ్డాడు. కాస్త యోచించి సముద్రములో 12 చదరపు యోజనాల దుర్గం నిర్మించాడు. దాని మధ్య అద్భుతమైన నగరం నిర్మించాడు. అదే ద్వారకానగరం. నాలుగు వర్ణాలవారు నివసించడానికి వసతి గృహాలు నిర్మించారందులో.

శ్రీకృష్ణుని కోసం స్వర్గం నుండి సుధర్మ సభా భవనం, పారిజాతవృక్షం పంపాడు దేవేంద్రుడు. వరుణుడు వెయ్యి గుర్రాలు

పంపాడు. కుబేరుడు అష్టనిధులు పంపాడు. లోకపాలకులు ఎన్నో కానుకలు పంపారు (వీళ్లందరూ యుద్ధానికి ఈ విధంగా సహాయం చేశారన్నమాట ధనిక వర్గ రక్షణ కోసం ధనికులందరూ కృష్ణునికి సహాయపడడం ఇక్కడ గమనించాలి.

కాలయవనునితో యుద్ధం చేసి జయించడం అసాధ్యమనుకున్నాడు కృష్ణుడు. యుక్తితో కాలయవనుణ్ని చంపాలని నిర్ణయించుకున్నాడు

ఏ ఆయుధం ధరించకుండా శ్రీకృష్ణుడు పురద్వారం నుండి బయటకు వచ్చాడు

కాలయవనుడు, ఆయుధాలు లేకుండా వచ్చిన కృష్ణుణ్ని చూచి తన చేతిలోనున్న ఆయుధాలను క్రింద పడేశాడు. కృష్ణుని పై కలబడాలనుకున్నాడు కాలయవనుడు. అదిగ్రహించి కృష్ణుడు పారిపోసాగాడు. కాలయవనుడు వెంబడించాడు "కృష్ణా! ఎందుకు నీకి పిరికితనం. రా!యుద్ధానికి" అన్నాడు.

కృష్ణుడు వినబడనట్లు నటిస్తూ ముందుకు వెళ్లి కొండెక్కి చీకటి గుహలో దూరాడు. కాలయవనుడు గుహలో దూరి పడుకొని వున్న వ్యక్తిని కృష్ణుడని భావించి తన్నాడు. అతడు కృష్ణుడు కాదు ముచికుందుడు. తనను తన్నగానే ముచికుందునికి కోపం వచ్చింది. కాలయవనుని కంఠం నొక్కి చంపాడు. (ముచికుందుడు చూడగానే కాలయవనుడు కాలిబూడిద అయ్యాడని కవిగారు వ్రాశారు.)

ముచికుందుడు ఆ గుహలో పడుకోవడానికి మరో కథ వుంది.

ముచికుందుడు మాంధాత కొడుకు దేవతలు రాక్షసులకు భయపడి తమను రక్షించుమని ముచికుంద మహారాజును ప్రార్థించారు. చాలా కాలం ముచికుందుడు దేవతలను కాపాడాడు. కుమారస్వామి సేనాపతి అయ్యాక ముచికుందుడు విశ్రాంతి తీసుకోవడానికి వీలు చిక్కింది. అతని భార్యా పిల్లలందరూ అంతకుముందే చచ్చిపోయారు.

ముచికుందుడు కొండ గుహలో కొంచెంసేపు తపస్సు చేస్తూ, కొంచెంసేపు బయటకు వచ్చి ఆహారం సంపాదించుకొని తింటూ

కాలాన్ని గడుపుతున్నాడు. కాలయవనుడు గుహలోకి వచ్చేసరికి ముచికుందుడు నిద్రలో వున్నాడు. కాలయవనుడు తన్నుగానే ముచికుందునికి నిద్రాభంగమైంది. కోపం వచ్చింది. అకస్మాత్తుగా కాలయవనుని కంఠం నొక్కి చంపాడు. (కుమారస్వామి సేనాపతి అయ్యాక ముచికుందుణ్ని విశ్రాంతి తీసుకొమ్మని, ఏదైనా వరం కోరుకొమ్మని దేవతలు అడిగారట. నాకు నిద్రకావాలని ముచికుందుడు అన్నాడట. నీవు కోరినట్లే నీకు నిద్ర ప్రసాదిస్తున్నాం, ఎవరైనా నీ నిద్రను భంగం చేస్తే నీ చూపుకు అతడు చస్తాడని ముచికుందునికి వరమిచ్చారట దేవతలు. కాలయవనుడు తన్నడం, ముచికుందుడు చూడడం, కాలయవనుడు చావడం........ఇదంతా కవిగారు వ్రాసిన కథలో వుంది.)

కాలయవనుడు చచ్చాక కృష్ణుడు ముచికుందుని వద్దకు వచ్చాడు. "ఎవరు నువ్వు?" అడిగాడు ముచికుందుడు.

"నాపేరు శ్రీకృష్ణుడు" శ్రీకృష్ణుని సమాధానం.

"ధనిక వర్గ ప్రయోజనాలను కాపాడే మహానుభావుడవని పేరు పొందిన నిన్ను ఎన్నాళ్లనుండో చూడాలను కొంటున్నాను. నువ్వు సాహసవంతుడవని, దేవుడవని మునులు పొగడగా విన్నాను. నిన్ను చూచి ధన్యుడనయ్యాను" అన్నాడు ముచికుందుడు.

కృష్ణుడడిగాడు "ఎవరునువ్వు?"

ముచికుందుడు తన వివరాలు కృష్ణునకు చెప్పాడు.

శ్రీకృష్ణుడు మధురకు తిరిగి వచ్చాడు. కాలయవనుడు చావడం వలన మ్లేచ్ఛ సేనకు సరియైన నాయకుడు లేకుండా పోయాడు. కాలయవనుడు చచ్చిన తర్వాత కొందరు సైనికులు భయపడి పారిపోయారు. కొందరు శ్రీకృష్ణుని దాసులై అతని సైన్యంలో కలసిపోయారు. తమ ఆశయాలను సాధించాలని పట్టుదలతోవున్న కొద్దిమంది మ్లేచ్ఛ సైనికులు కృష్ణునితో యుద్ధం చేశారు. కాని మహాయుక్తిపరుడైన కృష్ణుడు మ్లేచ్ఛ సైనికులందరినీ సంహారించాడు.

జరాసంధుడు తిరిగి మధురాపట్నం పై దాడి జరిపాడు. జరాసంధున్ని అంతులేన్ని సేనను చూడడంతోనే రామకృష్ణులు పారిపోయి ప్రవర్షణ పర్వతమెక్కారు. జరాసంధుని సైనికులు రామకృష్ణులను వెంబడించారు. రామకృష్ణులు యుక్తితో—సైనికులకు కనబడకుండా—పర్వతం అవతలి వైపుకు వెళ్ళి సముద్రములో నిర్మించిన ద్వారకకు చేరి ప్రాణాలు కాపాడుకున్నారు.

పిరికిపందలను వెన్నంటి చంపడం వీరుల లక్షణం కాదని భావించి జరాసంధుడు తిరిగి మగధకు వచ్చాడు.

* విదర్భమహారాజు భీష్మకుడు. అతని కూతురు రుక్మిణి. ఆమె అందకత్తె అని బ్రాహ్మణులు చెప్పగా విన్నాడు కృష్ణుడు.

జరాసంధుని సైన్యమును చూచి భయపడి పారిపోయి వచ్చిన తర్వాత కృష్ణునికి ఓ ఆలోచన వచ్చింది. రుక్మిణిని పెళ్ళి చేసుకుంటే రాజకీయంగా బలం పొందడానికి తనకు ఎక్కువ అవకాశాలున్నాయని.

శ్రీకృష్ణుడు గుర్రాన్ని, గాడిదను, వెర్రికుక్కలను, విషపు పాములను, తేళ్లను, గండు చీమలను చంపిన మహా సమర్థుడని రుక్మిణి బ్రాహ్మణుల నోటవింది. గ్రాంధిక భాషలో అలంకారాలు వుపయోగించి బ్రాహ్మణులు చెప్పగా విన్న రుక్మిణికి కృష్ణుడంటే అభిమానం, ప్రేమ ఏర్పడ్డాయి.

రుక్మిణి చిన్నన్నలు, బంధువులు కూడా ఆమెను కృష్ణునికిచ్చి పెళ్ళి చేయాలనే అభిప్రాయమే వెలిబుచ్చారు. రుక్మిణి అభిప్రాయాన్ని చాలామంది సమర్థించారు. పెద్దన్న రుక్మి మాత్రం వ్యతిరేకించాడు. అయినా రుక్మిణి పెద్దన్నను లెక్కచేయలేదు.

రుక్మిణి తనకు ఆప్తుడైన బ్రాహ్మణిని శ్రీకృష్ణుని దగ్గరకు పంపింది.

రుక్మిణి పంపిన బ్రాహ్మణ్ణి శ్రీకృష్ణుడు చాలా ఆదరించాడు. గౌరవించాడు, అభిమానించాడు, పూజించాడు. దగ్గర కూర్చుండి అతని పాదాలు ఒత్తాడు. రుక్మిణి క్షేమంగా వుందా? అని పదే పదే

అడిగాడు. ఆమెను పెళ్లాడే పురుషుడు అదృష్టవంతుడని నాలుగైదు సార్లయినా అన్నాడు.

ఆ బ్రాహ్మణుడు తన వద్దకు ఎందుకు వచ్చాడో కృష్ణుడు ఊహించాడు. అతని దయ సంపాదిస్తే రుక్మిణిని పొందడం మరింత సులభమని కృష్ణుడు భావించాడు.

"బ్రాహ్మణోత్తమా! నువ్వు వచ్చిన పనిచెప్పు" అన్నాడు.

"కృష్ణా! మా రుక్మిణి నిన్ను ప్రేమించింది రుక్మిణిని నువ్వు ప్రేమించినట్టు నీ మాటలవల్ల నేనిప్పుడే గ్రహించాను. మీరిద్దరూ ఒకరినొకరు ప్రేమించుకున్నారు నాకు చాలా సంతోషంగా వుంది. ఒకరి ఇష్టాయిష్టాలతో నిమిత్తం లేకుండా స్వేచ్ఛగా నిన్ను పెళ్ళి చేసుకోవాలని నిర్ణయించుకుంది రుక్మిణి. రుక్మిణి అన్న 'రుక్మి' అనేవాడున్నాడు. అతడు ఛేదిరాజు కుమారుడైన శిశుపాలునకు రుక్మిణినిచ్చి పెళ్లి చేయాలని చూస్తున్నాడు. రుక్మి కాబోయే మహారాజు కనుక తండ్రికూడా అతని మాట మన్నించి శిశుపాలునకే రుక్మిణిని ఇవ్వాలనుకుంటున్నాడు. శిశుపాలునకు సాళ్వుడు, జరాసంధుడు, దంతవక్త్రుడు, విదూరథుడు పౌండ్రకుడు అనేవారు మిత్రులు. రుక్మిణిని పెళ్లాడాలంటే వీళ్ళందరినీ ఎదిరించి జయించక తప్పదు. అది నీకు ఇప్పట్లో సాధ్యం కాకపోవచ్చు. అయితే నీకో ఉపాయం చెప్తానువిను. వివాహానికి ముందురోజు కన్య కుల దేవత గౌరీదేవిని పూజించడం వాళ్ల ఇంటి ఆచారం. రుక్మిణీ కూడా గౌరీ దేవిని పూజించడానికి వూరిబయటకు వస్తుంది. అదే రోజున నువ్వు సైన్యంతో సహా అక్కడికి రావాలి. సైన్యాన్ని అక్కడికి సమీప మున వున్న అడవిలోవుంచి నువ్వొక్కడివే వచ్చి రుక్మిణిని ఎత్తుకపోయి రాక్షస వివాహం చేసుకో. ఆ సమయంలో రుక్మిగానీ అతని మిత్రులుగానీ యుద్ధానికి సిద్ధంగా వుండరు. ఒకవేళ వాళ్ళు కయ్యానికి కాలు దువ్వినా ఆయుధాలతో అడవిలో సిద్ధంగా వుండే నీసైన్యం వారిని ఎదిరిస్తుంది ఓడిస్తుంది. రుక్మిణిని నీ స్వంతం చేసుకోవడానికి నీవే పద్ధతి అనుసరిస్తావో అది నీయిష్టమనుకో.........

అని ముగించాడు బ్రాహ్మణుడు.

కృష్ణుని ముఖం సంతోషంతో వెలిగిపోతూవుంది. "బ్రాహ్మణోత్తమా! నా మనసు కూడా రుక్మిణిమీదే వుంది. యుద్ధంలో రాజులందరినీ జయించి రుక్మిణిని ఎత్తుక వచ్చి వివాహం చేసుకుంటాను" అని పౌరుషం వెల్లడించాడు కృష్ణుడు.

రుక్మిణి పెళ్లిదినం రానే వచ్చింది. రాజధాని నగరం (కుండిన నగరం) అనేక అలంకారాలతో అందంగా వుంది.

పరిచారికలు రుక్మిణికి స్నానం చేయించారు. కొత్తబట్టలు కట్టించారు. నగలు ముస్తాబుచ్చేశారు.

వెండి, బంగారము, వస్త్రాలు, ఆవులు బ్రాహ్మణులకు దానమిచ్చారు.

తండ్రిచే, అన్నచే నిర్ణయించబడిన పెళ్లికొడుకు శిశుపాలుడు కుండిన నగరం తర్లి వచ్చాడు.

కృష్ణుని కోసం లక్ష కాదు కోటి కళ్లతో ఎదిరిచూస్తూ వుంది రుక్మిణి.

ద్వారక వెళ్ళిన బ్రాహ్మణుడు వచ్చి "కృష్ణుడు నిన్ను పరిగ్రహిస్తానని ప్రతిజ్ఞ చేశాడు" అని చెప్పాడు.

వివాహ మహోత్సవం చూడడానికి ద్వారక నుండి రామ కృష్ణులు వచ్చారని భీష్మకునికి తెలిసింది. భీష్మకుడు వాళ్ళను ఆదరించి పెళ్లి పందిట్లో కూర్చుండబెట్టాడు.

రుక్మిణి గౌరీ మందిరానికి బయలుదేరింది. తన చెల్లెలి అందం చూచి ఎవరైనా ఎత్తుకపోతారేమోనని, ఎందుకైనా మంచిదని చెల్లెలి వెంట కొంత మంది సైనికులను రమ్మన్నాడు రుక్మి.

గౌరీదేవి మందిరానికి చేరింది రుక్మిణి. "అమ్మా గౌరీ! నీకు నా నమస్కారం, నీమగనికి నా నమస్కారం. నీకొడుక్కు నా నమస్కారం. నీ మేనత్తకు నా నమస్కారం............నమస్కారం" అని గౌరీదేవికి మొక్కింది. "శ్రీకృష్ణుడే నా భర్త కావాలి" అని మరీమరీ మ్రొక్కింది.

ఆమె ముఖం పూర్ణిమనాటి చంద్రునిలా వెలిగిపోతూవుంది. ముఖంపై పడిన ముంగురులు నల్లని మేఘాల్లా గోచరిస్తున్నాయి. ఉన్నతంగా గుండ్రంగా బిగువుగా వున్నాయి స్తనాలు. ఆమె అందాన్ని చూస్తుంటే యువకులకు కామ కోరికలు పుట్టాయి. కొందరు ఆమె వద్దకు ఏదో సాకుతో వెళ్లి మాట్లాడించారు. కొందరికి అప్పటి కప్పుడు గౌరీదేవి మీద భక్తి కలిగింది. "గౌరీ తల్లీ! ఈ రుక్మిణి నన్ను పెళ్లాడునట్లు ఈమె మనస్సులో కోరిక కలిగించు. నీకు నరబలి సమర్పిస్తానమ్మా" అని కొందరు రాజులు గౌరీదేవికి మొక్కులు మొక్కారు. శిశుపాలుడదృష్టవంతుడను కున్నారు కొందరు. శిశుపాలుని మీద ఈర్ష్య కలిగింది కొందరికి. (కవిగారి పైత్యం:— రుక్మిణి అందాన్ని చూచి రాజులు మూర్ఛపోయారు. రథాల మీది నుండి, గుర్రాల మీదినుండి, ఏనుగుల మీది నుండి క్రింద పడిపోయారు.)

కృష్ణుడు కూర్చుండి వెళ్తున్న రథం దగ్గరకు రుక్మిణి కాస్త గబగబా నడచి వచ్చింది. కృష్ణుడు అకస్మాత్తుగా రుక్మిణి చేతులందుకొని పైకి లాక్కున్నాడు. సారథి గుర్రాలను అదిలించాడు. రథం పరుగెత్తింది. సైనికులు, రాజులు పరుగెత్తి వెళ్తున్న రథాన్ని చూస్తూ తెల్లబోయారు. తేరుకున్న తర్వాత ఆయుధాలు ధరించి వాహనాలెక్కి కృష్ణుణ్ని వెంబడించారు.

రుక్మిణి భయపడుతూ కృష్ణుని ముఖం చూచింది.

"భయపడకు మన సేన ఇప్పుడే శత్రుసైన్యాన్ని చీల్చి చెండాడుతుంది" అన్నాడు కృష్ణుడు.

"ఏది సేన?" అన్నట్టు రుక్మిణి అటు ఇటు చూచింది.

ఎక్కడెక్కడో దాక్కున్న కృష్ణుని సైనికులు శత్రువుల ముందుకు వచ్చారు.

వేలకొలది సైనికులు అకస్మాత్తుగా తమ ముందుకు రావడం చూచిన రుక్మి మొదలగు వాళ్ళు వెనుకడుగు వేశాడు.

తనకు నిశ్చయమైన రుక్మిణిని కృష్ణుడు ఎత్తుకపోవడం చూచి శిశుపాలుడు సహించలేక పోయాడు. కాని ఏమీ చేయలేక పోయాడు.

అవమానంతో క్రుంగిపోయాడు.

జరాసంధుడు శిశుపాలుని దగ్గరకు వచ్చి "శిశుపాలా! విచారించకు. కపట కృష్ణుడు యుక్తితో రుక్మిణిని దొంగిలించాడు. యుద్ధానికి సిద్ధంగా లేని మనం ఓడిపోయాం. ఊరడిల్లు మిత్రమా!" అన్నాడు.

శిశుపాలుడు రాజధానికి వెళ్ళిపోయాడు.

రుక్మిణిని తీసుకరాకపోతే కుండిన నగరంలో అడుగు పెట్టనని ప్రతిజ్ఞ చేసి రుక్మి ఒక్కడే కృష్ణుణ్ని ఎదిరించాడు.

కృష్ణునికి రుక్మికి యుద్ధం ప్రారంభమయింది. యుద్ధము చేయడంలో కృష్ణుడు రుక్మికంటే నిపుణుడు. కృష్ణుడు తన అన్నను చంపుతాడేమోనని రుక్మిణికి అనుమానం వేసింది. వెంటనే కృష్ణుని పాదాల మీదపడి "నా అన్నను రక్షించు" అంది.

కృష్ణుడు రుక్మి చేతులు కట్టేశాడు మీసాలు, గడ్డాలు అక్కడక్కడ కొరిగేశాడు. (కృష్ణుడు కొంటె మంగలి వాడుసుమా!)

బలరాముడు కృష్ణునితో "తమ్ముడా! ఇతణ్ని ఇలా అవమానం చేయడం బాగా లేదు. బంధువు చంపతగిన తప్పు చేసినా చంపకూడదు. దుర్మార్గులు కొందరు రాజ్యం కోసం, ధనం కోసం, భూమి కోసం, ఆడదాని కోసం బంధువులనే అవమానిస్తారు" అన్నాడు. (బలరాముడు పరోక్షంగా తమ్ముణ్ని దుర్మార్గుడా అని తిడుతున్నాడిక్కడ.)

వికార రూపంతో వున్న రుక్మిని చూచి కట్లు విప్పి వదిలేశాడు బలరాముడు.

రుక్మిణిని ద్వారకకు తెచ్చుకొని విధిపూర్వకంగా వివాహం చేసుకున్నాడు కృష్ణుడు.

* పూర్వం శివుని కంటి మంటల్లో కాలి మాడిపోయి బూడిద అయిన మన్మథుడు తిరిగి కృష్ణునికి కుమారుడై జన్మించాడు. అతడే ప్రద్యుమ్నుడు. (పునర్జన్మ-పిచ్చి ఊహా)

శంబరాసురుడనే వాడు పురిటి గదిలోకి వచ్చి ప్రద్యుమ్నుణ్ణి

ఎత్తుకపోయి సముద్రములో పారేశాడు. (దుర్మార్గుడు.) చేప ప్రద్యుమ్నుణ్ని మింగింది. అదే చేప జాలార్ల వలలో పడింది. జాలార్లు ఆ చేపను శంబరాసురునికి కానుకగా ఇచ్చారు.

శంబరాసురుని వంటవాళ్ళు చేపను తరుగగా శిశువు కనిపించాడు. వాళ్ళు ఆశ్చర్యపోయారు. శంబరాసురుని వద్ద పనిచేసే దాసి-మాయావతి- ఆ శిశువును తీసుకొంది. అదే సమయములో నారదుడక్కడకు వచ్చి "మాయావతీ! ఈ బాలుడే నీ భర్త మన్మథుడు. రుక్మిణి గర్భములో జన్మించాడు. శంబరాసురుడు ఈ బాలుణ్ని దొంగిలించి సముద్రములో పారేశాడు. చేపమింగింది... ........." అని చెప్పి వెళ్ళి పోయాడు.

మాయావతి (రతీదేవి) ఆ పిల్లవాన్ని పెంచి పెద్ద చేసింది. అప్పుడామె ప్రేమ ఒలకబోస్తూ రతిభావం వ్యక్తం చేస్తూ ప్రద్యుమ్నుణ్ని చూచేది.

"దేవీ! తల్లివంటిదానవు. నాతో కామినిలా ప్రవర్తిస్తున్నావేమిటి?" అన్నాడు ప్రద్యుమ్నుడు ఓనాడు.

"నువ్వు కృష్ణుని కుమారుడవు. నిన్ను శంబరాసురుడు దొంగిలించి సముద్రములో పారేశాడు. నిన్ను చేప మింగింది......"ఇలా ప్రారంభించి నారదుడు చెప్పగా విన్న విషయాలు,తనకు తెలిసిన విషయాలు కలిపి కథలా చెప్పింది మాయావతి. చివరికి అంది "నిన్ను నేను పెంచి పెద్దచేశాను. నీకంటే నేను చాలా సంవత్సరాలు పెద్దదాన్ని. అయినా నువ్వే నా భర్తవు. పూర్వజన్మలో మనమే రతీ మన్మథులం. నిన్ను పోగొట్టుకొని మీ అమ్మ ఏడుస్తూవుంది." చెప్పడం ఆపి ప్రద్యుమ్నుని ముఖంలోకి పరిశీలనగా చూచింది మాయాదేవి.

ప్రద్యుమ్నుని ముఖం కోపంతో ఎర్రబారింది. అతడన్నాడు. "అయితే ఇప్పుడే శంబారాసురుణ్ని చంపేసి వస్తాను"

"శంబారాసురుణ్ని చంపాలంటే మహామాయ విద్య తెలిసి వుండాలి" అని చెప్పి, మహామాయ విద్య ప్రద్యుమ్నునికి నేర్పింది మాయాదేవి.

తనను చిన్ననాడే చంప యత్నించిన శంబారాసురుణ్ని చంపి వెయ్యాలని అతని వద్దకు వెళ్లాడు ప్రద్యుమ్నుడు. శంబరాసురుడు ఆకాశం మీదికి ఎగిరిపోయాడు. ప్రద్యుమ్నుడు కత్తితో శంబరాసురుని తల నరికేశాడు. తర్వాత మాయాదేవి ఆకాశ మార్గంలో ప్రద్యుమ్నుణ్ని తీసుకొని ద్వారకానగరం వచ్చింది. (ప్రద్యుమ్నుణ్ని చూడగానే రుక్మిణి చన్నులలోకి పాలు వచ్చాయని కవిగారు వ్రాశారు)

నారదుడు కృష్ణుని దగ్గరకు వచ్చి గతం వివరించాడు. దొంగిలింపబడ్డ కొడుకు తిరిగి దొరికినందుకు రుక్మిణి, కృష్ణుడు చాలా సంతోషించారు. (బ్రాహ్మణులు కృష్ణుణ్ని దేవుడని, సర్వ సృష్టికర్త అని, భక్తులకే దర్శనమిస్తాడని, భక్తుల దుఃఖం నివారిస్తాడని, అతని భక్తులకు అసలు దుఃఖమే కలుగదనీ పొగడడమే కానీ కృష్ణునికి మానవాతీత శక్తులేమీ లేవు. అతడు కూడా సాధారణ మానవునిలాగే ఆలోచిస్తాడు, తింటాడు, తాగుతాడు, తిరుగుతాడు, ఆడవారితో సుఖిస్తాడు డబ్బుకోసం, సుఖం కోసం ప్రాకులాడుతాడు. యుద్ధాలు చేస్తాడు. గెలుస్తాడు, ఓడుతాడు. నవ్వుతాడు, ఏడుస్తాడు—కొడుకును ఎవరో ఎత్తుకపోయారని రుక్మిణి ఏడ్చినప్పుడు, కొడుకును తెచ్చి ఇచ్చి ఆమె దుఃఖాన్ని పోగొట్టలేక పోయాడు కృష్ణుడు. భార్య దుఃఖాన్ని నివారించే శక్తి లేనివాడేనా దేవుడు?)

* సత్రాజిత్తు సూర్యుని భక్తుడు. అతని భక్తికి మెచ్చి శమంతకమణి ఇచ్చాడు సూర్యుడు. సత్రాజిత్తు మణి మెడలో వేసుకొని నగరానికి వచ్చాడు. (శమంతకమణి ప్రతిదినం 8 బారువల బంగారం ఇస్తుందని కవిగారు వ్రాశారు. శమంతకమణి అంటే అదేం జంతువా? పక్షా? కీటకమా?—ఆవు పాలు ఇస్తుంది, దున్నపోతు పెండ విసర్జిస్తుంది. శమంతకమణి, ఆవు పాలు ఇచ్చినట్లు, బంగారం పాలు ఇస్తుందా? దున్నపోతులాగా బంగారాన్ని విసర్జిస్తుందా? శమంతకమణి బంగారాన్ని ఎలా ఇస్తుంది? ఎవరైనా దీనికి సమాధానం చెప్పగలరా?)

ఓనాడు కృష్ణుడు సత్రాజిత్తు వద్దకు వెళ్ళి శమంతకమణిని ఉగ్ర సేనుని కిమ్మన్నాడు. సత్రాజిత్తు దానిని కష్టపడి సంపాదించుకోవడం వలన ఇవ్వనిరాకరించాడు.

కొన్నాళ్ల తర్వాత ఓనాడు సత్రాజిత్తు తమ్ముడు ప్రసేనజిత్తు శమంతకమణి మెడలో వేసుకొని గుర్రం మీద అడవికి వేటకు వెళ్లాడు. అడవిలో ఓసింహం గుర్రాన్ని, ప్రసేనజిత్తును చంపి శమంతకమణిని తీసుకొంది. ఆ సింహాన్ని జాంబవంతుడు చంపేసి మణిని తీసుకొని గుహాలోకి వెళ్లిపోయాడు.

తన తమ్ముడు అడవి నుండి తిరిగి రానందున సత్రాజిత్తుకు కృష్ణుని మీద అనుమానం వేసింది. కృష్ణుడు నా తమ్ముణ్ణి చంపి మణిని తీసుకున్నాడేమో అనే అనుమానం వెలిబుచ్చాడు సత్రాజిత్తు. ఈ మాట ఈనోటా. ఆనోటా కృష్ణుని చెవిలో పడింది.

మణిని ఉగ్రసేనుని కివ్వమని కోరడమే తనది మొదటి తప్పు అని గ్రహించాడు కృష్ణుడు. అతడు వెంటనే ప్రసేనజిత్తును వెదకడానికి కొంత మందిని తీసుకొని బయలుదేరాడు.

అడవిలో ప్రసేనజిత్తును, గుర్రాన్ని సింహం చంపడం—సింహాన్ని జాంబవంతుడు చంపడం కాలి గుర్తులనుబట్టి తెలుసుకోగలిగాడు కృష్ణుడు.

జాంబవంతుని కాలిగుర్తుల ననుసరించి కృష్ణుడు ఒంటరిగా గుహాలోకి వెళ్లాడు. అచ్చట జాంబవంతునికి కృష్ణునికి 18 దినాలు యుద్ధం జరిగింది.

"కృష్ణా! నువ్వు నాకంటే గొప్పవీరునివి. శ్రీరామ చంద్రు నంతటి వాడివి నువ్వు. శ్రీరామచంద్రుని కాలం నుండి నేను చావకుండా మిగిలివున్నాను. నీలాంటి వీరునికే నా కుమార్తెనివ్వాలనుకుంటున్నాను. నా కూతురును, మణిని తీసుకో" అన్నాడు జాంబవంతుడు.

కృష్ణుడు జాంబవతినీ, శమంతకమణినీ తీసుకున్నాడు.

కృష్ణుడు శమంతకమణ్ని సత్రాజిత్తు కిచ్చాడు. కృష్ణుడు బల

వంతుడని, అతనితో స్నేహం చెయ్యడం మంచిదన్న భావించాడు సత్రాజిత్తు.

"కృష్ణా! నా కూతురుసత్యభామను, మణిని నీకిస్తున్నాను స్వీకరించు" అన్నాడు సత్రాజిత్తు.

కృష్ణుడు సత్యభామను స్వీకరించి, మణిని మామకే తిరిగి ఇచ్చాడు. (తనవద్ద వున్నా, తన మామ వద్ద వున్నా ఒక్కటే అని కృష్ణుడు భావించి వుంటాడు.)

* పాండవులు, కుంతీ లక్క ఇంట్లో కాలిపోయారన్న వార్త విని కృష్ణుడు హస్తినాపురం వెళ్లిపోయాడు.

అక్రూరుడు, కృతవర్మా వీరిరువురు సత్రాజిత్తును చంపుమని శతధన్వునితో చెప్పారు. శతధన్వుడు సత్రాజిత్తును చంపేసి శమంతక మణిని తీసుకపోయాడు.

మరణించిన తండ్రిని చూచి సత్యభామ బిగ్గరగానే ఏడ్చింది. తండ్రి శవాన్ని నూనె బానలో భద్రపరిచి హస్తినాపురం వెళ్లి భర్తతో తండ్రి హత్యగూర్చి చెప్పింది.

కృష్ణుడు, సత్యభామ, బలరాముడు ద్వారకకు వచ్చారు.

కృష్ణుడు తనపైకి యుద్ధానికి వస్తే సహాయం చేయుమని కృతవర్మను, అక్రూరుణ్ని కోరాడు శతధన్వుడు. వారు నిరాకరించారు. (సత్రాజిత్తును చంపుమని పురికొల్పిన ఈ నీచులు శతధన్వునికి సహాయం చేయుటకు నిరాకరిస్తున్నారు.)

శతధన్వుడు శమంతకమణిని అక్రూరుని వద్ద పెట్టి గుర్రం మీదెక్కి పారిపోసాగాడు కృష్ణుడు పారిపోతున్న పిరికి వెధవను వెన్నంటి చంపేవాడు. సత్యభామ సంతోషించింది.

శతధన్వుడి చావు కబురు విని కృతవర్మా, అక్రూరుడు భయపడి ద్వారక నుండి పారిపోయాడు.

అక్రూరుడు ప్రజల దృష్టిలో చాలా మంచివాడు, అక్రూరుడున్న చోట వానలు కురుస్తాయని ప్రజలకో విశ్వాసం కూడా ఏర్పడింది. అక్రూరుడు ద్వారక నుండి వెళ్లిపోయాడని తెలియగానే ప్రజలు

కృష్ణుని వద్దకు వెళ్ళి అక్రూరుడెక్కడున్నా తీసుకరమ్మని చెప్పారు.

కృష్ణుడు అక్రూరుణ్ని వెదికి ద్వారకకు రప్పించాడు.

అక్రూరుడే తన మామను చంపించాడని కృష్ణునికి తెలియదు. అక్రూరుడు ద్వారక నుండి పారిపోవడానికి మణి తప్ప మరో కారణం లేదని కృష్ణుడు ఊహించాడు, కృష్ణుడు అక్రూరునితో "అక్రూరా! నువ్వు దానపతివి. శతధన్వుడు శమంతకమణిని నీ దగ్గర దాచాడని నాకు ముందే తెలుసు సత్రాజిత్తుకు కుమారులు లేరు. మనుమలే ఉత్తరాధికారులు కనుక న్యాయంగా ఆ మణి నా కుమారులదే. కానీ నీ దగ్గరే వుండనీ, ఈ మణి విషయంలో మా అన్నయ్య నన్ను నమ్మలేదు. నీ దగ్గర వున్నట్టు చూపించి మా అన్నయ్య అనుమానం నివృత్తి చెయ్యి" అన్నాడు.

అక్రూరుడు శమంతకమణి తెచ్చి అందరికీ చూపించాడు.

కృష్ణుడు యుక్తిగా మాట్లాడి మణి అక్రూరుని దగ్గర వుందని చివరికి బయటపెట్ట గలిగాడు.)

* పాండవులు లక్కఇంట్లో కాలిపోలేదన్న వార్త వెల్లడయ్యాక కృష్ణుడు ఇంద్రప్రస్థం వెళ్ళాడు.

ఓనాడు కృష్ణార్జునులు వేటకై అడవికి వెళ్లారు. వేటాడి వేటాడి అలసిపోయారు. ఇరువురూ యమునానదిలో దిగి నీరు త్రాగారు. వారికి అప్పుడే నది ఒడ్డున ఒక సుందరి కనిపించింది.

ఆమె వివరాలు కనుక్కొని రమ్మని శ్రీకృష్ణుడు అర్జునుణ్ని పంపాడు.

అర్జునుడామె వద్దకు వచ్చి "అమ్మాయీ ఎవరు నువ్వు?" అని అడిగాడు.

"నేను సూర్యుని కూతురును. నా పేరు కాళింది. శ్రీకృష్ణుడు అందగాడని, సాహసగాడని, యుక్తిపరుడని విన్నాను. అతణ్ని భర్తగా పొందాలని ఆశతో వున్నాను" అందామె.

అర్జునుడు ఆమె వివరాలు కృష్ణునికి తెలియజేశాడు.

కృష్ణుడామెను తీసుకొని ఇంద్రప్రస్థం వచ్చేశాడు.

అర్జునుడు ఖాండవ వనాన్ని కాల్చివేశాడు. అగ్ని దేవుడు సంతసించి గాండీవం, రథము, కవచాలు ఇచ్చాడు. ఖాండవవనంలో కాలిపోకుండా తనను కాపాడినందుకు మయుడు సభా భవనం తయారు చేసి అర్జునునకిచ్చాడు.

కృష్ణుడు కాళిందిని వివాహం చేసుకున్నాడు.

* శ్రీకృష్ణుని మేనత్త రాజాదేవి కూతురు మిత్రవింద. ఆమె కృష్ణుణ్ని పెళ్ళాడలని నిశ్చయించుకుంది. ఆమె అన్నలు విందుడూ, అనువిందుడూ ఆమెను నిరోధించారు. స్వయంవరంలో రాజసభలోంచి బలవంతంగా ఆమెను ఎత్తుకొని వచ్చాడు శ్రీకృష్ణుడు,

* కోసల దేశరాజు నగ్నజిత్తు. అతని కూతురు నాగ్నజిత్తి నగ్నజిత్తు తన వద్దనున్న ఏడుగిత్తలను లొంగదీసినవారికి తన కూతురు నిస్తానని వీర్యశుల్కం ఏర్పరచాడు.

శ్రీకృష్ణుడు పెద్ద సేనతో కోసల దేశం వెళ్ళాడు. నాగ్నజిత్తి కృష్ణుణ్ని చూచి అతడు నా భర్త అయితే ఎంత బాగుండును అనుకొంది.

కృష్ణుడు నగ్నజిత్తు వద్దకు వచ్చి 'నీ కూతురును నాకివ్వు' అన్నాడు.

"నావద్ద నున్న ఏడుగిత్తలను లొంగదీస్తే నా కూతురు నిస్తాను" అన్నాడు నగ్నజిత్తు

కృష్ణుడు గిత్తలను లొంగదీశాడు.

కృష్ణునికి నాగ్నజిత్తుకు కళ్యాణం జరిగింది.

నగ్నజిత్తు 9 కోట్ల గుర్రాలనూ, 900 కోట్ల సేవకులను అల్లునకు అరుణమిచ్చాడు.

(కృష్ణుని (పాత్ర) కాలం నాటికి ఈ భారతదేశంలోనే ఎన్నో రాజ్యాలున్నాయి. రాజు తన అల్లునికే 900 కోట్ల సేవకులనిస్తే, ఇంకా అతని రాజ్యములో ఎన్ని కోట్ల మంది జనులున్నారు? దేశంలోని అన్ని రాజ్యాలలో ఎన్ని కోట్ల మంది వున్నారు? ఈ విధంగా ఆలోచిస్తూపోతే ఈ కథ పచ్చి అబద్ధపు కథ పాఠకులకు ఇట్టే తెలిసి

పోతుంది.)

* శ్రీకృష్ణుడు మేనత్త శ్రుతకీర్తి. ఆమె కేకయ దేశపు రాజమహిషి. ఆమె కూతురు భద్ర. శ్రీకృష్ణుడు భద్రను పెళ్లాడాడు.

* మద్రదేశపు రాజ కూతురు లక్ష్మణ. స్వయంవరంలో ఆమెను ఎత్తుక వచ్చి పెళ్లి చేసుకున్నాడు కృష్ణుడు. (ఇప్పటికి 8 మందిని పెళ్ళి చేసుకున్నాడు కృష్ణుడు. బహు భార్యాత్వపు రోజులను గుర్తుకు తెచ్చే కథ ఇది )

* దేవతల వస్తువులను కొన్నింటిని నరకాసురుడు లాక్కున్నాడు. శత్రువు నెదిరించే శక్తి లేని చవట దేవేంద్రుడు శ్రీకృష్ణుని సాయంకోరాడు. కృష్ణుడు సత్యభామతో కలసి గరత్మంతుని మీదెక్కి నరకాసురుని రాజధాని అయిన ప్రాగ్జోతిషపురం వెళ్ళాడు. తన వద్దనున్న ఆయుధాలతో నరకాసురుని దుర్గాలను, ప్రాకారాలను పడగొట్టాడు. పాంచజన్యం పూరించాడు. అది విని నీటిలో నిద్ర పోతున్న అయిదు తలల మురాసురుడు (అయిదు తలల వ్యక్తిని మీరు చూశారా కవిగారూ?) లేచివచ్చి కృష్ణుని మీద తన వద్దనున్న ఆయుధాలు విసిరాడు. కృష్ణుడు మురాసురుని అయిదు తలలు నరికేశాడు తర్వాత మురాసురుని 7 గురు కొడుకులు పీఠుడనే రాక్షసుణ్ణి సేనాపతిగా చేసుకొని పెద్ద సేనతో వచ్చి కృష్ణునితో యుద్ధం చేసి చచ్చిపోయారు.

చాలా మంది రాక్షసులు చచ్చారని విని నరకాసురుడు కృష్ణునితో యుద్ధం చేయడానికి వచ్చాడు. కృష్ణుడు నరకాసురుని సైనికుల చేతులను, కాళ్లను, తలలను, వెంద్రుకలను, గోళ్లను తెగనరికాడు.

గరత్మంతుడు సైనికులను, ఏనుగులను చంపేసింది. ("ఒక చీమ ఒక మనిషిని ఒకే ఒక్క క్షణంలో మింగేసింది. ఒక ఏనుగును ఒకే ఒక్క దెబ్బతో చంపేసింది." అని వ్రాస్తే ఎలా వుంటుంది? వ్రాసిన వాడు బుద్ధి తక్కువ వాడు అని పాఠకులకు తెలిసిపోతుంది. ఈ నరకాసుర కృష్ణాసుర యుద్ధములో కూడా గరత్మంతుని ఉదంతం అలాగే వుంది.)

నరకాసురుని సైనికులందరూ పారిపోయారు. ఒంటరిగా యుద్ధ రంగములో మిగిలిపోయిన నరకాసురుణ్ని కృష్ణుడు చక్రం వేసి తల నరికి చంపాడు.

తన కుమారుడు చచ్చిపోయాక భూదేవి (ఈ భూగోళం) కృష్ణుడు వద్దకు వచ్చి కృష్ణుణ్ని పొగిడి (తిట్టడం మరిచి పొగిడిందా ఏమిటి?) తన మనుమణ్ని చూపించి "వీని తలను నీ పాదాలతో తొక్కి వీణ్ని రక్షించు" అని ప్రార్థించింది.

కృష్ణుడు రక్షిస్తానన్నట్టు తల వూపాడు. తర్వాత నరకాసురుని భవనంలో ప్రవేశించాడు. నరకాసురుని చెరలో వున్న స్త్రీలను విడిపించి తన అంతఃపురానికి తరలించాడు. (ఆ స్త్రీలు ఎక్కడికి వెళ్ళకుండా, ఏ మగానితో మాట్లాడకుండా తగిన కట్టుదిట్టాలు చేశాడు. రోజుకొక స్త్రీతో సుఖించినా 16 వేల దినాలు గడిచిపోతాయని భావించాడు. ఆ 16 వేల రాజ కన్యలలో కొందరు కృష్ణునితో కామసుఖాలను అనుభవించడానికి ఇష్టపడ్డారు. కొందరు ఇష్టం లేకపోయినా కృష్ణుని దౌర్జన్యంతో అతని అంతఃపురానికి వెళ్లారు) తర్వాత కృష్ణుడు అమరావతి వెళ్లాడు. నందన వనంలో వున్న పారిజాత వృక్షాణ్ని పెల్లగించి గరత్మంతుని మీద పెట్టాడు. ఇంతలో ఇంద్రుడు అక్కడకు వచ్చి వద్దని చెప్పాడు. కృష్ణుడు ఇంద్రుణ్ని జయించి, పారిజాత వృక్షం తెచ్చి తన తోటలో నాటాడు. (కృష్ణుడు ఎంత స్వార్థపరుడో చూశారా! ఇంద్రుని అధీనంలో వున్న చెట్టును సంపాదించడం కోసం ఇంద్రునితో యుద్ధం చేశాడు. కవిగారికి కృష్ణుని మీద పక్షపాత బుద్ధి వుంది కనుక కృష్ణుణ్ని దుర్మార్గునిగా చిత్రించలేదు. అదే ఏ నరకాసురుడో అయితే—నరకాసురుడు నందనవనంలో వున్న పారిజాత వృక్షాణ్ని తీసుకవచ్చి తన తోటలో నాటుకోవాలనుకున్నాడు. ఇంద్రుడు నరకాసురుని దుష్టబుద్ధి గ్రహించి, అతణ్ని సంహరించి పారిజాత వృక్షాణ్ని కాపాడి దేవతలకు మేలు చేశాడు—అని వ్రాసేవాడే.)

ఓనాడు రుక్మిణి కృష్ణుని పాదాలు ఒత్తుతూ వుంది. అప్పుడు కృష్ణుడు రుక్మిణిని కొంటెగా చూస్తూ అన్నాడు "రాజపుత్రీ!

బలవంతులైన రాజులెందరో నిన్ను కోరారు. అలాంటి వాళ్ళకే ఇచ్చి పెళ్లి చెయ్యాలని నీ తండ్రి, అన్నయ్యా ప్రయత్నించారు. వారి మాట కాదని ఎందునా నీతో సమానం కాని నా వంటివాణ్ని భర్తగా ఎందుకు వరించావు?......రాజులకు భయపడి నేను సముద్రములో ద్వారక నిర్మించుకొని నివసిస్తున్నాను అస్థిరమైన పదవి నాది. నా వంటి వాణ్ని భర్తగాపొందిన స్త్రీ కష్టాలే అనుభవిస్తుంది. నా వంటి గుణహీనుణ్ని, బిచ్చగాళ్ళు మెచ్చుకునే నన్ను ఎందుకు వరించావు? ఇప్పటికైనా మించి పోయింది లేదు. ఉత్తమ క్షత్రియుణ్ణి ఎవరినైనా పెళ్ళిచేసుకో. పెళ్లాం, బిడ్డలంటే ఆసక్తి లేదు నాకు"

కృష్ణుని మాటలు విని గతుక్కుమంది రుక్మిణి. తను ప్రేమించిన వ్యక్తి దేవుడని, ఉన్నతుడని భావించింది రుక్మిణి. ఆమెకు దుఃఖం ముంచుక వచ్చింది. హఠాత్తుగా కింద పడిపోయింది.

కృష్ణుడు పానుపు మీది నుండి లేచి రుక్మిణిని ఎత్తిపట్టుకున్నాడు. సేద తీర్చాడు. కన్నీళ్ళు తుడిచాడు. కౌగలించుకున్నాడు. "ఈమాత్రానికే ఏడుస్తారా. ఛా! పిచ్చిపిల్లా! నా దానివి నువ్వు నా పెళ్లానివి నువ్వు నా ప్రాణానివి నువ్వు" అంటూ ప్రేమ ఒలక బోశాడు.

"కృష్ణా! సకల గుణ సంపన్నుడివి నువ్వు" అంది రుక్మిణి. ("నేను గుణహీనుణ్ని" అని కృష్ణుడంటే, "నువ్వు సకలగుణ సంపన్నుడవు" అని రుక్మిణి అంటుంది. ఇందులో ఎవరు మాట్లాడింది సత్యం. కృష్ణుణ్ని గురించి కృష్ణునికి తెలిసినంతగా రుక్మిణికి తెలియదు కదా! కనుక కృష్ణుడు చెప్పుకొన్నట్టుగా కృష్ణుడు గుణహీనుడనే అంగీకరిద్దాం.—జారుడు, చోరుడు అయిన కృష్ణుణ్ని పట్టుకొని 'సకల గుణ సంపన్నుడివి నువ్వు' అని బుద్దిలేని రుక్మిణి అనగలిగింది. కాని నువ్వూ నేను అనగలమా?)

"రుక్మిణీ! నువ్వు గొప్ప పతివ్రతవు" అని కృష్ణుడు రుక్మిణికి బిరుదిచ్చాడు. రుక్మిణి చాలా సంతోషించింది.

* కృష్ణుని పెళ్ళాలను ఒక్కొక్కరికి పదేసిమంది కుమా

రులు కలిగారు.

ప్రద్యుమ్నుడు మాయావతి రతినే కాక మేనమామ కూతురు రుక్మవతిన్ని కూడా పెళ్ళి చేసుకున్నాడు.

ప్రద్యుమ్నుని కుమారుడు అనిరుద్ధుడు.

రుక్మితన మనమరాలు రోచనని రుక్మిణి మనుమడగు అనిరుద్ధునికిచ్చి పెళ్లిచేశాడు. (రుక్మి కృష్ణుడు పాతపగలు మరిచిపోయి వియ్యమందారన్నమాట. కృష్ణుడు తన మీసాలు, గడ్డాలు కొరిగేసి అవమానించాడని మరచి పోయినట్టున్నాడు రుక్మి. అభిమాన హీనుడు రుక్మిణిని తనకిచ్చుటకు నిరాకరించిన రుక్మితో వియ్యమందాడు కృష్ణుడు. అభిమానహీనుడు, ఇద్దరు అభిమానహీనులు వియ్యమందారు. సరిపోయింది.) ఈ వివాహ సమయంలో రుక్మిణీ శ్రీకృష్ణుడూ ద్వారక నుంచి భోజకటకం వచ్చారు. ఆ సమయంలోనే కొందరు రాజులు రుక్మిని బలరామునితో జూదమాడుమని రెచ్చగొట్టారు. రుక్మి, బలరాముడు జూదమాడారు మొదటిసారి బలరాముడు పందెంలో ఓడిపోయాడు మళ్ళీ ఆడారు. రుక్మి పందెంలో ఓడిపోయాడు. నేనే గెలిచానని బూకరించాడు. బలరామునికి కోపం వచ్చి రుక్మిని హత్య చేశాడు. రుక్మి మిత్రులను కొందరిని చంపాడు. తర్వాత శ్రీకృష్ణుడు బంధు మిత్రులతో ద్వారకకు వచ్చాడు. (పేకాట మిత్రులూ! మీరు ఆటలో గెలిచినా ఓడినా ఎవరు హేళన చేసినా నోరు మూసుకొని పేకాట గదినుండి బయటకు వచ్చెయ్యండి. బలరాముణ్ని ఆదర్శంగా తీసుకొని మిమ్మల్ని హేళన చేసిన వారిని, మీతో అబద్ధాలాడిన వారిని హత్య చేస్తే పోలీసు వాళ్లు మీ చేతులకు బేడీలు వేసి జయిల్లో పడెస్తారు. బలరాముణ్ని మెచ్చుకునే మన పోలీసు వాళ్ళు, మన న్యాయవాదులు, మన ప్రభుత్వాధికారులు మిమ్ముల్నలను రక్షించలేరు. జాగత్త)

* బలి చక్రవర్తికి 100 మంది కుమారులు. పెద్దవాడు బాణాసురుడు. అతడు శివభక్తుడు వెయ్యి చేతులు కలవాడు. సత్యసంధుడు. అతని రాజధాని శోకితపురం. దేవేంద్రుడు మొదలైన

దేవతలతణ్ని కొలుస్తుండేవారు. శివుడు తాండవనృత్యం చేసినప్పుడు బాణాసురుడు తన వెయ్యి చేతులతో రకరకాల వాద్యాలు వాయించాడు. శివుడు సంతోషించి వరం కోరుకొమ్మన్నాడు.

"నా పట్నం కాపాడుతూ వుండు" అన్నాడు బాణాసురుడు.

బాణాసురుని కూతురు పేరు ఉష. కలలో ఓ అందగానితో రతి సౌఖ్యమనుభవించిందామె

బాణాసురుని మంత్రి కుంభాండుడు. ఆతని కూతురు చిత్రలేఖ. ఉష, చిత్రలేఖ ప్రాణమిత్రులు.

ఉష కలగన్ననాటి నుండి 'ఈ సుందరాంగుడు నాకు లభ్యమవుతాడా' అని విచారించసాగింది. అదే విషయం చిత్రలేఖతో చెప్పింది చిత్రలేఖ. కృష్ణుని మనుమడగు అనిరుద్ధుణ్ని కూడా చిత్రించింది. అనిరుద్ధుని చిత్రాన్ని చూచి ఉష సంతోషించింది. 'నాకీ సుందరాంగుణ్ని తెచ్చిపెట్టవే' అని చిత్రలేఖతో అంది ఉష.

చిత్రలేఖ రాత్రివేళ ద్వారకకు వెళ్లి నిద్రిస్తున్న అనిరుద్ధుణ్ని ఎత్తుక వచ్చి ఉష పక్కలో పడుకోబెట్టింది.

ఉష అనిరుద్ధునితో జతకడుతూ సుఖిస్తూవుంది. ఇలా కొంత కాలం గడిచింది.

ఉష గర్భం పెరుగుతూ వుంటే అంతఃపుర కావలివాళ్లకు అనుమానం వేసింది. వాళ్లు బాణాసురుని వద్దకు వెళ్ళి "మహారాజా! అమ్మాయిగారి ప్రవర్తన సరిగాలేదు. ప్రభువుల కులానికి మచ్చ తెచ్చింది. మాకు తెలియకుండా ఏ మగానితోనో.........అమ్మాయిగారు........." అంటూ నసిగారు.

బాణాసురుడు తక్షణమే అంతఃపురానికి వెళ్లాడు. అప్పుడు అన్నిరుద్ధుడు ఉష పాచికలాడుతున్నారు.

బాణాసురుడు అనిరుద్ధుణ్ని బంధించడానికి వీరభటులను పంపాడు అన్నిరుద్ధుడు వీరభటులను చంపాడు. చివరికి బాణాసురుడు అన్నిరుద్ధుణ్ని బంధించాడు.

నాలుగు నెలలు గడచిపోయాయి. అనిరుద్ధుడు బాణాసురుని

రాజ్యంలో బంధించ బడ్డాడన్ని నారదముని చెప్పగా శ్రీకృష్ణుడు విన్నాడు. అతడు వెంటనే బంధుమిత్రులతో, పెద్ద సైన్యంతో శోణితపురం పై దండెత్తాడు బాణాసురుడు ఎదుర్కొన్నాడు. బాణాసురునికి సాయంగా శివుడు సైన్యంతో సహా వచ్చాడు.

శ్రీకృష్ణుడు శివుడు కలబడ్డారు. యుద్ధములో శివుడు ఓడిపోయాడు

ప్రద్యుమ్నునికి కుమారస్వామికి యుద్ధం జరిగింది. కుమారస్వామి యుద్ధరంగం నుండి పారిపోయాడు. (ఈ పిరికి వెధవనేనా దేవసేనకు నాయకత్వం వహించింది.)

బాణాసురుడు కొంతసేపు సాత్యకితోనూ, కొంతసేపు కృష్ణునితోనూ యుద్ధం చేశాడు. కృష్ణునితో యుద్ధం చేస్తూ పారిపోయాడు. తర్వాత మళ్ళీ శివునికి కృష్ణునికి యుద్ధం జరిగింది (శివజ్వరం--విష్ణుజ్వరం యుద్ధం చేశాయని కవిగారు రాశారు.) శివుడు ఓడిపోయాడు.

బాణాసురుడు మళ్ళీ యుద్ధరంగానికి వచ్చాడు. శ్రీకృష్ణుడు బాణాసురుని 996 చేతులు నరికేశాడు. శివుడు కృష్ణుణ్ని స్తుతించాడు. కృష్ణుడు చివరకు బాణాసురుణ్ని ప్రాణాలతో వదిలి పెట్టాడు. బాణాసురుడు ఉషా అనిరుద్ధుల ప్రేమను అంగీకరించాడు. కృష్ణుడు ఉషా అనిరుద్ధులను రథం మీద కూర్చుండ బెట్టుకొని ద్వారకకు వెళ్లాడు.

* యాదవ బాలురు ఆటలాడి అలసిపోయి నీళ్ళు త్రాగడానికి బావివద్దకు వెళ్ళారు. బావిలో వాళ్లు ఒక తొండను చూశారు. దానిని బయటకు తీయడానికి ప్రయత్నించి విఫలులయ్యారు. ఆ పిల్లలంతా కృష్ణుని దగ్గరకు వచ్చి బావిలో తొండ వుందని చెప్పారు. కృష్ణుడు తొండ తోకను పట్టుకొని పైకి విసిరివేయబోయాడు. ఆ తొండ హఠాత్తుగా దివ్య పురుషునిగా మారింది.

"ఎవరు నువ్వు? తొండ జన్మ ఎత్తడానికి కారణమేమిటి" అడిగాడు కృష్ణుడు.

"ఇక్ష్వాకు మహారాజు కొడుకును. నా పేరు నృగుడు. లెక్క

లేవన్ని ఆవులు దానం చేశాను. ఓసారి ఓమంచి బ్రాహ్మణునికి ఆవు దానం చేశాను. ఆ ఆవు ఎలాగో వచ్చి మా మందలో కలిసిపోయింది. అదే ఆవును మరో బ్రాహ్మణునికి దానం చేశాను. మొదటి బ్రాహ్మణుడు వచ్చి 'ఈ ఆవు నాది' అన్నాడు. రెండో బ్రాహ్మణుడు కూడా 'ఈ ఆవు నాది' అన్నాడు. ఇద్దరూ విరోధపడి నా దగ్గరకు వచ్చారు. నేను ఇద్దరినీ బ్రతిమిలాడి ఈ ఆవును ఇచ్చెయ్యండి. లక్ష ఆవు లిస్తాను" అన్నాను. ఈ ఆవుకు బదులుగా ఏమిచ్చినా తీసుకోమని ఇద్దరు బ్రాహ్మణులూ వెళ్ళిపోయారు. నేను చచ్చిపోయాను. యమ దూతలు నన్ను పట్టుకపోయి "ముందు పాప ఫలం అనుభవిస్తావా? పుణ్యాఫలం అనుభవిస్తావా?" అని అడిగారు—పాప ఫలమే అనుభ విస్తానని చెప్పాను. వెంటనే తొండగా మారిపోయాను "అని చెప్పాడు. తర్వాత కృష్ణుణ్ని పొగడి విమానమెక్కి వెళ్లిపోయాడు.

కృష్ణుడు తన వద్ద నున్న జనులతో ఇలా అన్నాడు "బ్రాహ్మణుని ధనం అపహరిస్తే మూడు కాదు పది కాదు పాతిక తరాలనీ నాశనం చేస్తుంది. బ్రాహ్మణుడు తప్పు చేసినా ద్వేషించకండి. అతడు కొట్టినా, తిట్టినా నమస్కారం చేయండి. నా ఆజ్ఞ మన్నించని వాళ్లను క్షమించను. దండిస్తాను" (ఈ కథ ఒకవర్గ ప్రయోజనం కోసం వ్రాయబడింది. ఈ కథలోని బ్రాహ్మణులిద్దరూ మూర్ఖులే. రాజు మహా మూర్ఖుడు. శ్రీకృష్ణుడు చాలా గొప్ప పెద్ద మూర్ఖుడు. శ్రీకృష్ణుణ్ని పూజించే భక్తులారా! కృష్ణుని మాటలు విన్నారు కదా! బ్రాహ్మణుడు తప్పు చేసినా క్షమిస్తారా? కృష్ణుని మాటలు మన్నిస్తారా? ఏ బ్రాహ్మణుడో వచ్చి బలవంతంగా మీ భార్య దగ్గర పడుకుంటాడనుకోండి—క్షమిస్తారా? వ్యాసకవీ! బ్రాహ్మణ పక్షపాత బుద్ధితో ఎంత పిచ్చి కథ వ్రాశావోయీ)

* బలరాముడు వ్రేపల్లెకు వచ్చాడు. పెద్దలకు నమస్కరించాడు. చిన్నవాళ్లను దీవించాడు. మంచీచెడూ మాట్లాడుకున్నారు.

బలరాముడు ఒంటరిగా వున్నప్పుడు గోపికలు అతని దగ్గరకు వచ్చి "బలరామా! కృష్ణుని కోసం మేము తల్లిదండ్రులను భర్తలను

వదిలిపెట్టాం. ఆ కృతఘ్నుడేమో మమ్ములను వదిలి పెట్టి వెళ్ళిపోయాడు. పట్నవాసపు పడచులవద్ద అతని ఆటలు సాగవులే!" అని ఓరఓరగా బలరాముని వైపు చూశారు వాళ్లు. ఆ చూపులకు అర్థం బలరామునికి కూడా బాగానే తెలుసు. అతడు ఈత కల్లు తెప్పించి తాను త్రాగుతూ గోపికల చేత త్రాగించాడు. కల్లు త్రాగి మత్తెక్కివున్న గోపికలతో రమించాడు బలరాముడు. అతనికప్పుడు యమునానదిలో గోపికలతో నగ్నంగా విహరించాలన్న కోరిక కలిగింది. "యమునా ఇటురా!" అన్నాడు. యమునానది బలరాముని దగ్గరకు రాలేదు. బలరామునికి కోపం వచ్చింది. "యమునా! పాపాత్మురాలా! నేను పిలిస్తే రావూ? నిన్ను నా నాగలితో వంద చీలికలు చేస్తాను" అన్నాడు.

యమునానది భయపడి తన పాదాల మీద పడి వేడుకొన్నట్టు బలరాముడు త్రాగిన మత్తులో భ్రమపడ్డాడు.

బలరాముడు గోపికలను తీసుకొని వెళ్లి యమునానదిలో జలక్రీడలాడాడు. (కృష్ణునితో రమించిన గోపికలు బలరామునితో కూడా రమించారు. ఇందులో కృష్ణుని ఔన్నత్యం ఏమీలేదు. మీలో ఎవరైనా గోపికల వద్దకు వెళ్తే డబ్బు ఇస్తే వాళ్లు మీ దగ్గర కూడా పంటారు. గోపికలకు-ఈనాడు వూరు ప్రక్కన గుడిసెల్లో నివసిస్తూ వేశ్యావృత్తి చేసుకొని బ్రతికే దొమ్మరి వాళ్లకు భేదమేముంది? కృష్ణుడు, బలరాముడు ధనవంతులు కనుక వాళ్ల దగ్గర పండి డబ్బు సంపాదించి పొట్టలు నింపుకునే వారు గోపికలు. కృష్ణునిలాంటి ధనవంతులు ఏ సమాజంలో వుంటారో, స్త్రీకి పురుషునితో సమాన ఆస్తి హక్కులు ఏ సమాజంలో వుండవో ఆ సమాజంలో గోపికల లాంటి వేశ్యలు కూడా వుంటారు. స్త్రీకి పురుషునితో సమానమైన ఆస్తి హక్కులు వచ్చిననాడు, ఉత్పత్తి సాధనాలన్నీ సమాజపరం అయిననాడు స్త్రీలు వేశ్యావృత్తితో జీవించే దుర్గతే వుండదు.)

* కరూష దేశం రాజు పౌండ్రకుడు. కొందరు అతని దయ సంపాదించడం కోసం "నువ్వే దేవుడవు. వాసుదేవుడవు. లోకాన్ని

రక్షించడానికి అవతరించావు" అని పొగిడారు.

పౌండ్రకునికి కాస్త గర్వం పెరిగింది. "నేను దేవుడను" అని తన రాజ్యములో ప్రకటించుకున్నాడు.

కృష్ణుని వద్దకు దూతతో ఇలా సందేశం పంపాడు. "కృష్ణా! నీ ఆయుధాలు విడిచిపెట్టి నా శరణువేడుకో. లేదా నాతో యుద్ధం చెయ్యి"

పౌండ్రకుడు పంపిన సందేశం దూత చదువగా విని సహించలేక పోయాడు కృష్ణుడు అతడు పౌండ్రకుని మిత్రరాజ్యమైన కాశీ రాజ్యం పై అకస్మాత్తుగా దాడి చేశాడు. కాశీరాజు, పౌండ్రకుడు ఏకమై కృష్ణుణ్ని ఎదిరించారు. కాని యుద్ధములో మరణించారు.

కాశీరాజు తలకాయ కోటలో పడిపోయింది, రాణులూ, రాజకుమారులూ ఏడ్చారు. కాశీరాజు కుమారుడు సుదక్షిణుడు తండ్రిని కాలబెట్టి పితృహంతకుణ్ని చంపాలన్న ఉద్దేశముతో శివుణ్ని ఆరాధించాడు. శివుడు కనబడి వరం కోరుకొమ్మన్నాడు.

నా పితృహంతకుణ్ని వధించే ఉపాయం చెప్పమన్నాడు సుదక్షిణుడు. ఉపాయం చెప్పాడు శివుడు.

సుదక్షిణుడు అభిచార విధి పూర్తి చేశాడు. యజ్ఞ కుండంలోంచి "అగ్ని మూర్తి" నగ్నంగా ప్రత్యక్షమయ్యాడు. మంటలతో దిశదిశలూ మండిస్తూ ద్వారక వైపు పరుగెత్తాడు. అగ్నిమూర్తిని చూచి ద్వారక పౌరులు భయంతో కృష్ణుని వద్దకు పరుగెత్తారు. శ్రీకృష్ణుడు సుదర్శన చక్రం ప్రయోగించాడు. సుదర్శన చక్రం అగ్నిమూర్తిని వెనుకకు త్రిప్పింది అగ్నిమూర్తి కాశీ మీదపడి సుదక్షిణుణ్ని భస్మం చేసింది. (ఆధిక్యత కోసం ఇద్దరు వ్యక్తుల మధ్య జరిగిన పోరాటం ఇది )

* ద్వివిదుడను వానరుడు సుగ్రీవుని మంత్రి పది వేల ఏనుగులంత బలశాలి అతడు. (ఇది కవిగారి తిక్క) అతడు గ్రామాలు తగుల బెట్టేవాడు కొండలను గ్రామాల మీద విసిరేసేవాడు. యజ్ఞ కుండాల్లో మలమూత్రాలు విసర్జించేవాడు.

ఓనాడు రైవతక పర్వతం మీద త్రాగి ఆడవాళ్ళతో ఆడు కొంటున్నాడు బలరాముడు. అది చూచి ద్వివిదుడు నవ్వాడు. వాళ్ళను భయపెట్టాడు. ఆ స్త్రీల బట్టలు చింపేశాడు. బలరామునికి కోపం వచ్చింది. "నేను త్రాగుతాను, వేశ్యలతో తిరుగుతాను. నవ్వడానికి, కాదనడానికి నువ్వెవడవు?" అని బలరాముడు ద్వివిదుని తల మీద కొట్టి చంపేశాడు. ద్వారక పౌరులు కోతిని చంపిన బల రాముణ్ని చాలా మెచ్చుకున్నారు. (బలరాముడు. ఎంత బుద్ధి తక్కువ వాడో, ఆ ప్రజలు కూడా అంత బుద్ధి తక్కువ వాళ్ళు అని గ్రహించాలి )

* శ్రీకృష్ణుని కుమారుడు సాంబుడు. అతడు దుర్యోధనుని కూతురు లక్షణని స్వయంవరంలో ఎత్తుక వచ్చాడు.

"మన దయాభిక్ష మీద—మన మిచ్చిన భూమితో—బ్రతికే యాదవులలో ఒకడైన సాంబుడా నా కూతురు నెత్తుకపోయేది. వాణ్ణి తక్షణమే బంధించండి" అన్నాడు దుర్యోధనుడు.

కౌరవవీరులు సాంబుణ్ణి బంధించి హస్తినాపురం పట్టుకపో యారు. యాదవులు ఉగ్రసేనుని ఆదేశంతో కౌరవుల మీద దండ యాత్ర చాటించారు. బలరామునికి కౌరవులూ యాదవులూ కయ్య మాడడం నచ్చలేదు. అతడు దండయాత్ర మాన్పించి కౌరవుల దగ్గరకు వెళ్లాడు బలరాముడు తమ మేలుకోరే వాడని భావించి కౌరవులు చాలా గౌరవించారు.

బలరాముడు కౌరవులతో "మీలో కొంత మంది ఏకమై సాంబుణ్ణి ఓడించి బంధించారని విని మీ దగ్గరకు వచ్చాను. మీరు బంధు వులు కావడం వల్ల సహిస్తున్నాము. మనలోమనం కయ్యమాడకూ దదు. కనుక సాంబుణ్ని వదిలిపెట్టండి." అన్నాడు.

కౌరవులు కోపంతో కస్సుమన్నారు "మేము బంధుత్వం పాటించి మీకు రాజ్యం కల్పించాం, అయినా మీరు మాతో సమానులు కాదు మేమిచ్చిన రాజ్యం పుచ్చుకొని, మావల్లే పెద్దరికం సంపాదించి మామీదే అధికారం చలాయిస్తున్నారా? సిగ్గులేదా మీకు" అన్నారు.

బలరాముడు కోపంతో "మీరు ధనగర్వంతో విఱ్ఱవీగుతున్నారు. త్వరలోనే మీ హాస్తినాపురాన్ని గంగలో కలిపేస్తాను" అన్నాడు.

బలరాముడు ద్వారకకు తిరిగి వచ్చాడు. యాదవ ప్రముఖులను పిలిచి "మన సాంబుడు లక్షణ స్వయంవరానికి వెళ్ళి లక్షణను ఎత్తుకొని వస్తుండగా కౌరవులు వానిని అడ్డగించి బంధించిన విషయం మీ అందరికీ తెలుసు. సాంబుడు లక్షణను పెళ్ళి చేసుకోవడానికి అర్హుడుకాడా! కౌరవులకంటే మనం ఎందులో తక్కువ. యాదవులకు రాజైన ఉగ్రసేనుడు రాజు కాడా? పారిజాతం తెచ్చిన కృష్ణుడు రాజలాంఛనాలకు అర్హుడు కాడా? యాదవులు కౌరవులకంటే ఎందులోనూ తక్కువ కాదని మనం రుజువు చెయ్యాలి ధనగర్వంతో విఱ్ఱవీగుతున్న కౌరవుల గర్వం అణచాలి. పదండి యుద్ధానికి" అన్నాడు

కృష్ణుడు మొదలైన యాదవులు యుద్ధానికి బయలుదేరారు.

బలరామకృష్ణులు పెద్దసేనతో యుద్ధానికి వస్తున్నారని విని యాదవులకు కూడా పౌరుషం వుందని గ్రహించాడు సుయోధనుడు.

కౌరవులు సాంబుణ్ని, లక్షణను తెచ్చి బలరామునికిచ్చి "పరాక్రమవంతులైన మీరు మాతో వియ్యమందుటకు అర్హులే" అని చెప్పారు.

దుర్యోధనుడు వెయ్యి మంది దాసీలను అరణమిచ్చాడు. నూతన దంపతులతో ద్వారకకు తిరిగి వచ్చారు బలరామకృష్ణులు (బలవంతులైన యాదవులకూ, ధనవంతులైన కౌరవులకు వియ్యం.)

* వేలాది రాజకుమార్తెలను వివాహమాడి వాళ్లతో ఎలా కాపురం చేస్తున్నాడో చూసివద్దామని బుద్ధిపుట్టి నారదుడొకనాడు కృష్ణుని ఇంటికి వచ్చాడు. ఆ సమయములో కృష్ణుడు పానుపుమీద కూచున్నాడు. రుక్మిణి చామరం పట్టుకొని వీస్తోంది. (కృష్ణుడు చామరం పట్టుకొని రుక్మిణికి వీస్తున్నాడని ఎక్కడా వ్రాయదేం.) నారదుణ్ని చూడగానే కృష్ణుడు పానుపు మీదినుండి దిగి నారదుని

పాదాలమీద పడ్డాడు. (కృష్ణునికి కొంచెం దాస్యబుద్ధి కూడా వుంది ) కృష్ణుడు తన పాదాలు పట్టుకొన్నందుకు ప్రతిఫలంగా నారదుడు కృష్ణుణ్ని ప్రార్థించి వెళ్ళిపోయాడు. (గౌరవం ఇచ్చి పుచ్చుకోవడమంటే ఇదేనేమో!)

శ్రీకృష్ణుడు ప్రతిదినం ఉదయం లేచి కాలకృత్యాలు తీర్చుకొని స్నానం చేసి సూర్యునికి (సూర్యగోళానికి) నమస్కరించేవాడు. బ్రాహ్మణులను పూజించేవాడు. 13084 పాడిఆవులు (ఎంత ఖచ్చితమైన లెక్కో) బ్రాహ్మణులకు దానం చేసేవాడు. తర్వాత రథమెక్కి సుధర్మ సభకు వెళ్ళేవాడు అక్కడ బ్రాహ్మణులు వేదాలకు వ్యాఖ్యానాలు వివరించేవారు. పురాణకోవిదులు కథలు వినిపించేవారు. (ఎక్కడ చూచినా బ్రాహ్మణాధిక్యతే)

* జరాసంధుడు దిగ్విజయం చేసినప్పుడు బంధించబడిన రాజులు శ్రీకృష్ణుని దగ్గరకొక దూతను పంపారు. ఆ రాజులు పంపిన సందేశసారాంశమిది "జరాసంధుని చెరనుండి మమ్మల్ని విడిపించండి"

అదే సమయములో నారదుడక్కడకు వచ్చాడు.

కృష్ణుడడిగాడు "నారదా! అంతా కుశలమేనా?"

"నీ మేనత్త కొడుకు—ధర్మరాజు—బ్రహ్మలోక భోగాలనుభవిస్తున్నాడు. రాజసూయ యజ్ఞం చేసి నీ అనుగ్రహం సంపాదించాలని చూస్తున్నాడు." చెప్పాడు నారదుడు.

జరాసంధుణ్ని చంపేసిన తర్వాతనే రాజసూయ యాగానికి వెళ్లుమని యాదవులు కృష్ణునకు చెప్పారు.

ఉద్ధవా! నీ అభిప్రాయం కూడా చెప్పు?" అన్నాడు కృష్ణుడు.

"దిగ్విజయం చేసి రాజులందరినీ జయించినవాడే రాజసూయం చెయ్యగలడు. కనుక ముందు జరాసంధుణ్ని జయించాలి. అతడు పదివేల ఏనుగుల బలశాలి (వెయ్యి ఏనుగుల బలశాలి అని మరొక చోట వ్రాశారు కవిగారు.) అతణ్ని గెలువాలంటే ఒక్క భీమునికే సాధ్యం. అదైనా ద్వంద్వ యుద్ధంలో మాత్రమే అతడు ద్వంద్వ యుద్ధానికి

ఒప్పుకోవడం మరొక విషయం. జరాసంధుడు బ్రాహ్మణ భక్తుడు. భీముణ్ని బ్రాహ్మణ వేషంలో జరాసంధుని వద్దకు పొమ్మనాలి. యుద్ధభిక్ష కోరుమనాలి. జరాసంధుడు ఒప్పుకుంటాడు. యుక్తిగా అతణ్ని చంపెయ్యాలి.

ఉద్ధవుని మాటలను అక్కడ వున్న వారందరూ సమర్థించారు.

"జరాసంధుణ్ని సంహరించి రాజులను కాపాడుతానని చెప్పు" అని చెప్పి బందీరాజుల దూతను సాగనంపాడు. నారదుడు కూడా వెళ్ళి పోయాడు.

శ్రీకృష్ణుడు ఉగ్రసేనుని అనుమతి పొంది ఇంద్రప్రస్థం వెళ్ళాడు. ధర్మరాజు శ్రీకృష్ణుణ్ని ఆదరించి కౌగలించుకున్నాడు. మిగిలిన పాండవులు ఆనందం పట్టలేక పడ్డారు. తర్వాత కృష్ణుడు రాజమందిరంలో ప్రవేశించాడు కుంతీదేవి కృష్ణుణ్ని కుచ్చి కౌగలించుకుంది.

ఓనాడు కొలువు తీర్చి శ్రీకృష్ణునితో ధర్మరాజు ఇలా అన్నాడు. "రాజసూయం చేసి నిన్ను ఆరాధించాలని సంకల్పించాను. నా సంకల్పం నెరవేర్చాలి నువ్వు"

కృష్ణుడు "శత్రుసంహారుడివి నువ్వు. నీ సంకల్పం నాకూ ఇష్టమే. ఈ యజ్ఞం ఆరంభించే ముందు రాజులందరినీ జయించాలి" అన్నాడు.

ధర్మరాజు అంగీకరించాడు

పాండవులు దిగ్విజయం చేసి చాలా మంది రాజులను జయించారు. రాజసూయం కోసం బలహీనులను బెదిరించి కొల్లగొట్టి ధనరాసులు తెచ్చి ధర్మరాజు కిచ్చారు అతని సోదరులు. (దిగ్విజయం అంటే బలహీనులైన రాజులను బలవంతులైన రాజులు ఓడించి లేదా చంపి వారివద్దనున్న డబ్బు కొల్లగొట్టడం—మన భారతీయులు ఆదర్శంగా తీసుకునే పాండవులు ఎలాంటివారు? బలహీనులను జయించి లేదా బెదిరించి లేదా చంపి డబ్బు కొల్లగొట్టి తమ సౌఖ్యం కోసం, తమ రాజ్యాధికారం కోసం పాటుబడిన స్వార్థపరులు.

జరాసంధుణ్ని చంపడానికి ఉద్ధవుడు తనతో చెప్పిన ఉపాయం శ్రీకృష్ణుడు పాండవులకు చెప్పాడు.

కృష్ణుడు భీమార్జునులు బ్రాహ్మణ వేషం వేసుకొని గిరివ్రజం వెళ్లారు. వాళ్ళు జరాసంధునితో "మా యాచన మన్నించాలి" అన్నారు.

"పిరికి వెధవల్లాగా బ్రాహ్మణ వేషం వేసుకొని వచ్చిన క్షత్రియులు వీళ్ళు" అని మనసులో అనుకున్నాడు జరాసంధుడు. "ఏం కావాలో అడగండి. నా శిరస్సు కోరినా సరే ఇస్తాను" అన్నాడు పైకి

"మేము క్షత్రియులం. ద్వంద్వ యుద్ధభిక్ష పెట్టు" అన్నాడు కృష్ణుడు.

జరాసంధుడు నవ్వి "కృష్ణా! నువ్వు పిరికివాడవు. అర్జునుడు ద్వంద్వ యుద్ధానికి పనికిరాడు. అందుచేత భీమునితో ద్వంద్వ యుద్ధం చేయడానికి నేను అంగీకరిస్తున్నాను" అన్నాడు. (ఇచ్చట జరాసంధుని న్యాయ బుద్ధి గమనించతగినది )

భీమునికో గద ఇచ్చి తానొక గద పట్టుకొని ద్వంద్వయుద్ధానికి పూనుకున్నాడు జరాసంధుడు.

27 దినాలు భీమ జరాసంధులు యుద్ధం చేశారు

28 వ నాడు భీముడు కృష్ణునితో "యుద్ధములో జరాసంధుణ్ణి గెలవలేను" అన్నాడు. కృష్ణుడు ఓ కిటుకు చెప్పాడు.

కృష్ణుడు చెప్పినట్టు భీముడు జరాసంధుణ్ని చీల్చి చంపేశాడు. (జరాసంధుణ్ని చంపేశక్తి కృష్ణునికి లేనందున వచ్చిన అవకాశాన్ని వినియోగించుకొని యుక్తిగా భీమునితో జరాసంధుణ్ని చంపించాడు. శ్రీకృష్ణుడు జరాసంధుణ్ని వంచనతో చంపించ గలిగాడే కానీ పరాక్రమంతో కాదు.)

20800 మంది రాజులను జయించి కొండకోనల్లో బంధించి వుంచాడు జరాసంధుడు. అలాంటి రాజులను కృష్ణుడు విడిపించాడు. (ఈ రాజులు ఎలాంటివాళ్లో వాళ్లే కృష్ణునితో చెప్పగా విందాం )

వాళ్లు మురికి గుడ్డలతో బయటకు వచ్చారు. (వీళ్ళందరినీ జరాసంధుడు చంపెయ్యవచ్చుకదా! చంపలేదెందుకు? ఏదైనా కారణం వుండివుండవచ్చు. అది మనకు ముందుముందు తెలుస్తుంది.) వాళ్ళు కృష్ణుణ్ని చాలా సేపు (నోళ్ళు నొప్పి పెట్టే వరకు) పొగిడారు.

"కృష్ణా! మేము సిరిసంపదల మదంతో విర్రవీగాం. రాజ్యాలు గెలవాలన్న కాంక్షతో జననాశనం చేశాం. క్రూరులవలె బ్రతికాం. మమ్మల్నను నువ్వు అనుగ్రహించావు నీకు మా నమస్కారం" అన్నారు. (ఈ మాటలన్నీ స్వయంగా జరాసంధునిచే బందీలై, కృష్ణునిచే విడుదలైన రాజులే చెప్తున్నారు. ఇలాంటి దుష్టరాజులను జరాసంధుడు బంధించడంలో తప్పేమైనా వుందా? దుష్టులను శిక్షించిన జరాసంధుడే దుష్టుడా? తప్పు చేసిన వారిని జయిల్లో వేయడం తప్పేనా? జరాసంధుణ్ని చంపిన భీముడు, అందుకు ప్రోత్సహించిన కృష్ణుడు మంచివారా? దుష్టులను శిక్షించడమే కృష్ణుని ధ్యేయమని రాసినకవి దుష్టులను రక్షించినట్టు ఎందుకు రాశాడు? కృష్ణుణ్ని గొప్ప చేసే పక్షపాత బుద్ధితో సందర్భశుద్ధి లేకుండా రాసిన దివాళాకోరు రచన ఇది.)

కృష్ణుడు "సర్వాత్ముణ్ని నేను. నన్ను ఆరాధించండి" అన్నాడు.

కృష్ణుడు ఆ దుష్టరాజులకు స్నానం చేయించడానికి చాలా మంది స్త్రీ పురుషులను నియమించాడు. (కృష్ణుడు మాత్రం ఒక్క రాజుకైనా స్నానం చేయించడానికి పూనుకోలేదు.) ఆ రాజులు స్నానం చేసిన తర్వాత బట్టలు, నగలు, ఆహార పదార్థాలు ఇచ్చి వాళ్లందరికీ రాజోచిత మర్యాదలన్నీ జరిపి రథాలిచ్చి వాళ్లందరినీ తమ తమ రాజ్యాలకు పంపించాడు.

ఆ దుష్టరాజులను అనుగ్రహించిన కృష్ణుణ్ని చూచి ధర్మరాజు నవ్వలేక ఏడ్చాడు.

* కృష్ణుని అనుమతిపొంది బ్రాహ్మణులను ఋత్విజులుగా వరించాడు ధర్మరాజు.

ధర్మరాజు చేసే రాజసూయ యాగం చూడడానికి కౌరవులు ఇంకా అనేక దేశరాజులు, బ్రాహ్మణులు, వైశ్యులు, శూద్రులు వచ్చారు బ్రహ్మ, శివుడు, ఇంద్రుడు ఇంకా గంధర్వులు, మునులు, యక్షులు, రాక్షసులు హాజరయ్యారు. పాములు, పశులు, బల్లులూ, తొండలు, నల్లులు, ఈగలు, దోమలు హాజరయ్యాయి.

యజ్ఞభూమిని బంగారు నాగలితో దున్నారు. ఆ యజ్ఞంలో ఉపయోగించిన పాత్రలన్నీ బంగారువే. (ఇరుగు పొరుగు రాజ్యాలను కొల్లగొట్టి సంపాదించిన బంగారం ఇందులో ఎంతవుందో! ఇంత బంగారం పాండవుల పరం కావడానికి ఎంత మంది అన్యాయంగా ప్రాణాలు విడిచారో సహృదయులే ఆలోచించాలి )

యాగం ప్రారంభమైంది. "ప్రథమంగా ఎవరిని పూజించాలి" అనే ప్రశ్న వచ్చింది.

"సదస్యులందరిలోకి కృష్ణుడే సర్వ శ్రేష్ఠుడు. అగ్రపూజకు అతడే అర్హుడు" అన్నాడు సహదేవుడు. సభలోని యావన్మందీ (గొర్రెలు) సహదేవుని మాటను సమర్థించారు.

ధర్మరాజు కృష్ణుణ్ని ప్రథమంగా పూజించాడు.

శిశుపాలునకది నచ్చలేదు. సభలో లేచినిలబడి "సదస్యులారా! ఉచితానుచితాలు తెలియని సహదేవుని మాట మీద ఆధారపడి కృష్ణుడు అగ్రపూజకు తగిన వాడని నిర్ణయించకండి. వ్యభిచారి, గుణహీనుడు, దొంగ అగ్రపూజకు ఎలా అర్హుడవుతాడో మీరే చెప్పండి? ఈ తార్పుడుబోతుకా ప్రథమ తాంబూలం ఇచ్చేది. దారి దోపిడీవాళ్ళ లాగా ప్రజలను బాధించుక తింటున్నాడు" అన్నాడు. (శిశుపాలుడు చెప్పిన దాంట్లో అసత్యం ఏమీలేదు. ఈ విషయం కృష్ణ భక్తులకు కూడా తెలుసు. ఇంత బుద్ధిహీనుణ్ని పూజించేవారు మరెంత బుద్ధి.............)

కృష్ణుడు సభికుల వైపు చూశాడు. తనను నిందించే ధైర్యం, ధిక్కరించే శక్తి ఎవరికీ లేదని క్షణంలో గ్రహించాడు. కొన్ని క్షణాలు మౌనంగా వుండి పోయాడు.

కృష్ణుని దయ సంపాదించాలనుకున్న వాళ్లు శిశుపాలుణ్ని నిందించారు. పాండవులు ఆయుధాలతో శిశుపాలుని పైకి వెళ్లారు. ఈ క్షణంలో శిశుపాలుణ్ని చంపడం తన శక్తికి మించిన పని కాదని గ్రహించిన కృష్ణుడు పాండవులను వారించి తన చేతిలో వున్న చక్రాణ్ని గురిచూచి శిశుపాలుని కంఠం వైపు విసిరాడు. శిశుపాలుని తల తెగి కృష్ణుని కాళ్ల వద్ద పడిపోయింది. శిశుపాలుని మిత్రులు మెల్లగా జారుకున్నారు. తర్వాత ధర్మరాజు ఎవరిని ఎలా పూజించాలో ఆలోచించి పూజించాడు.

శిశుపాలుణ్ని శ్రీకృష్ణుడు చంపినందుకు చాలా మంది ఆనందించారు. కాని కౌరవులు ఆనందించలేక పోయారు. నిజం చెప్పిన నిరపరాధిని శ్రీకృష్ణుడు చంపినందుకు కౌరవులకు కోపం వచ్చింది. కాని ఆ క్షణంలో ఏమీ చేయలేక పోయారు.

కృష్ణుడు కొన్ని నెలలు ఇంద్రప్రస్థంలో వుండి బంధు మిత్రులతో సుఖపడ్డాడు. తర్వాత ద్వారకకు వెళ్ళిపోయాడు.

ఓనాడు ధర్మరాజు తమ్ములతోనూ, బంధు మిత్రులతోనూ మయసభలో బంగారు సింహాసనం మీద కూర్చున్నాడు. అప్పుడు దుర్యోధనుడు అక్కడకు వచ్చాడు.

మయసభా భవన నిర్మాణంలోనే మోసం వుంది. నీళ్లులేని చోట వున్నట్టు, వున్నచోట లేనట్టు కనబడుతుంది.

దుర్యోధనుడు నీళ్ళులేనిచోట నీళ్ళున్నట్టు భ్రమపడి బట్టలు పైకిలాక్కొని నడిచాడు. నీళ్లున్నచోట నేల అనుకొని పడిపోయాడు. భీముడు, ద్రౌపతి మొదలగు వారు నవ్వారు. ధర్మరాజు వద్దన్నాడు. కాని కృష్ణుడు సైగచేసి నవ్విన వాళ్ళను ప్రోత్సహించాడు. దుర్యోధనునికి కోపం వచ్చింది. (నువ్వు రోడ్డు మీద వెళ్తుండగా ఏ అరటి తొక్క మీదో కాలుపడి జారిపడితే అది చూచి ఎవరైనా నవ్వితే నవ్వినవారి మీద నీకు కోపం వస్తుందో రాదో ఆలోచించు. ఈ విషయంలో ధర్మరాజు కాస్త సభ్యతగా ప్రవర్తించాడు. కాని కొంటె వెధవ కృష్ణుడు పూర్తిగా అసభ్యతగా ప్రవర్తించాడు.)

* సాల్వుడు శిశుపాలుని స్నేహితుడు. అతడు రుక్మిణి వివాహ సమయములో శిశుపాలునితో కలసి కుండిన నగరం వెళ్లాడు. అప్పుడు యాదవులు రాజులందరితోపాటు సాల్వుణ్ని కూడా ఓడించారు. యాదవుల మీద పగ తీర్చుకోవాలనుకున్నాడు సాల్వుడు. శివుణ్ని ఆరాధించాడు. శివుడు సంతోషించి వరం కోరుకొమ్మన్నాడు. వరం కోరాడు సాల్వుడు. శివుని ఆజ్ఞతో మయదానవుడు ఇనుముతో సౌభకమనే విమానం తయారు చేసి సాల్వున కిచ్చాడు.

సాల్వుడు ద్వారక మీద దండెత్తాడు. ప్రద్యుమ్నుడు ఎదుర్కొన్నాడు. సౌభకవిమానం చాలా వేగంగా పయనించడం వలన యాదవులెవరూ దాన్ని కూలగొట్ట లేకపోయారు.

సాల్వుని మంత్రి ద్యుమంతుడు ప్రద్యుమ్నుని మీద గద విసిరాడు. ప్రద్యుమ్నుడు రక్తం కక్కుకొని మూర్ఛపడి పోయాడు. (చచ్చి పోయాడని వ్రాయలేదు కవి.) ప్రద్యుమ్నుని సారథి రథాన్ని రణరంగం నుండి బయటకు తీసుకవచ్చాడు. కొన్ని ఘడియల తర్వాత ప్రద్యుమ్నుడు మూర్ఛ నుండి తేరుకున్నాడు. అప్పుడు ప్రద్యుమ్నుడు సారథిని చూచి ఇలా అన్నాడు "సారథీ! నువ్వు పిరికి పందవు, నపుంసకుడివి. మా యాదవులలో ఎవరైనా యుద్ధరంగం నుండి పారిపోయినట్టు విన్నావా? నన్ను యుద్ధరంగం నుండి బయటకు తెచ్చి పొరపాటు చేశావు. బలరామకృష్ణుల ఎదుట ఏ ముఖం పెట్టుకొని నిలబడేది నేను."

సారథికి చాలా కోపం వచ్చింది. అతడిలా అన్నాడు. "ప్రద్యుమ్నా! నోరు సంబాలించుకొని మాట్లాడు. శత్రువు విసిరిన గద నీపై పడకుండా చూచుకోవలసిన బాధ్యత నీది. నీకు ఆ సమర్థత లేనందున గద తగిలి పడిపోయావు. అలాంటి సమయంలో సారథిగా నా బాధ్యతను నేను నిర్వహించాను. నేనే గనుక రణరంగం నుండి రథాణ్ని బయటకు తీసుకరానట్లైతే శతృవులు నిన్ను ముక్కలు ముక్కలు చేసేవారు."

ప్రద్యుమ్నునికి సారథి మీద కోపం వచ్చినా అణచుకొని

ధనుస్సు పట్టుకొని "సారథీ! ద్యుమంతుని వద్దకు మన రథం పోనీ" అన్నాడు.

రథం ద్యుమంతుని వద్దకు వెళ్లింది. అప్పటికే ద్యుమంతుడు యుద్ధం చేసి చాలా అలసిపోయాడు. అలసట తీర్చుకొన్న ప్రద్యుమ్నుడు ద్యుమంతునితో కొంతసేపు యుద్ధం చేసి చివరికి వాడి బాణంతో అతని తల నరికేశాడు.

యాదవులకు సాల్వునికి 27 దినాలు యుద్ధం జరిగింది.

పాండవుల వద్దకు వెళ్ళి ద్వారకకు తిరిగి వచ్చిన శ్రీకృష్ణుడు వెంటనే సాల్వుణ్ని ఎదుర్కొనడానికి రణరంగానికి వెళ్లాడు.

సాల్వుడు "కృష్ణా! దుష్టులను శిక్షించడానికి పుట్టిన దేవుడవని పనికి మాలిన బ్రాహ్మణులు పొగడగా విని విని గర్వం పెరిగింది నీకు. నిండు సభలో ఏమరుపాటుగా వున్న నా ప్రియమిత్రుణ్ని శిశుపాలుణ్ని నరికి చంపిన దుష్టుడవు నువ్వు నీలాంటి దుర్మార్గుణ్ని చంపి వేయడానికే మా ఈ ప్రయత్నం" అన్నాడు.

కృష్ణుడు మాట్లాడకుండా చేతిలో నున్న గద విసిరాడు. అది సాల్వునికి తాకింది. సాల్వుడు కొన్ని క్షణాల్లోనే యుద్ధరంగం నుండి వెళ్ళిపోయాడు.

సాల్వుడు వెళ్ళిపోయిన తర్వాత కొన్ని క్షణాలకు కృష్ణుని వద్దకు ఓ వ్యక్తివచ్చి "స్వామీ! మీ తండ్రిని సాల్వుడు బంధించాడు. మీ అమ్మ నన్ను మీ వద్దకు పంపగా వచ్చాను" అన్నాడు.

కృష్ణుడు "అయ్యో తండ్రీ!" అని ఏడ్చాడు.

సాల్వుడు వసుదేవుణ్ని తన విమానానికి కట్టేసి యుద్ధరంగానికి-కృష్ణుని వద్దకు-వచ్చాడు. "నీ తండ్రి తల నరికేస్తాను" అని బెదిరించి మళ్ళీ యుద్ధ రంగం నుండి వెళ్ళిపోయాడు. సాల్వుడు వసుదేవుణ్ని జయిల్లో పడేసి మళ్ళీ కృష్ణుని వద్దకు వచ్చాడు. కృష్ణుడు గద విసిరాడు. అది విమాన చోదకునికి తగిలింది. అతడు చచ్చిపోయాడు. విమానం క్రింద పడిపోయింది. సాల్వునికి ఏ ప్రమాదమూ జరుగలేదు. అతడు మళ్ళీ కృష్ణుని ఎదుటకు వచ్చాడు.

శ్రీకృష్ణుడు సాల్వుని తల నరికేశాడు.

అంతలోనే దంతవక్త్రుడు కృష్ణుని ఎదుటకు వచ్చి "కృష్ణా! నా మేన మామ కొడుకువే అయినా నా మిత్రుణ్ని చంపావు కనుక నిన్ను చంపదలచుకొని వచ్చాను" అన్నాడు.

కృష్ణుడు గద విసిరి దంతవక్త్రుణ్ని చంపేశాడు.

దంతవక్త్రుడు చావగానే అతని తమ్ముడు విదూరథుడు కోపంతో కృష్ణుని ఎదుటకు వచ్చాడు. కృష్ణుడు కత్తితో అతని తల నరికేశాడు.

తర్వాత కృష్ణుడు ద్వారకా నగరంలో ప్రవేశించాడు. పౌరులు స్వాగతం చెప్పారు.

* కౌరవులూ పాండవులూ యుద్ధం కోసం ప్రయత్నిస్తున్నారని విన్న బలరాముడు ఎవరి పక్షానా యుద్ధం చేయుటకు ఇష్టపడక తీర్థయాత్రలకు వెళ్ళిపోయాడు. అతడు చాలా ప్రదేశాలు తిరిగి నైమిశారణ్యం వెళ్లాడు. నైమిశారణ్యంలో కొందరు సత్రయాగం చేస్తున్నారు. బలరాముడు కనబడగానే మునులు లేచి నిలబడి నమస్కరించారు. వ్యాస శిష్యుడయిన రోమహర్షణుడు లేవలేదు నమస్కారం చేయలేదు. బలరామునికి కోపం వచ్చి రోమహర్షణుని తల నరికేశాడు. (బలరాముడెంత దుర్మార్గుడో చూశారా?.........అన్యాయాన్ని ప్రతిఘటించే శక్తిలేని అసమర్థులైన మునులు హాహా కారాలు చేశారు.)

"బలరామప్రభూ! నువ్వు ఎంతో అధర్మం చేశావు." అని మాత్రం అనగలిగారు.

అహంకార ఆవేశాలతో తాను చేయకూడని పని చేసినట్లు గ్రహించాడు బలరాముడు. మునులంతా కలసి తనను తంతారేమోనని ఓ క్షణం భయపడ్డాడు. మునుల ముఖాలను చూశాడు. అన్యాయాన్ని ప్రతిఘటించే శక్తిలేని ఆ మునులకు పీనుగులకు భేదమేమీ లేదని మరుక్షణమే గ్రహించాడు. అందుకే గంభీరంగా మౌనం వహించాడు.

"ఈ హత్యాపాతకానికి నువ్వు ప్రాయశ్చిత్తం చేసుకుంటే లోకానుగ్రహం దొరుకుతుంది" అన్నారు మునులు. (మౌనంగా కూర్చున్న వ్యక్తి తల నరికిన దుష్ట బలరామునికి శిక్ష ఇది కాదు, అతణ్ని చిత్రవధ చెయ్యాలి.)

"లోకానుగ్రహ వాంఛతో ప్రాయశ్చిత్తం చేసుకుంటాను. అయితే ఏం ప్రాయశ్చిత్తం చేసుకోవాలో వివరించి చెప్పండి" అన్నాడు బుద్ధిహీనుడైన బలరాముడు.

బలరాముడు తమ మాట మన్నించి ప్రాయశ్చిత్తం చేసుకోవడానికి ఒప్పుకోగానే మునులు చాలా సంతోషించారు. కొంచెం సేపు ఆలోచించి ఇలా చెప్పారు" ఇల్వలుడి కుమారుడు వల్వలుడనేవాడు మా సత్రయాగం పాడుచేస్తున్నాడు. అతణ్ని చంపి తర్వాత ఓ ఏడాదిపాటు తీర్థాలు సేవిస్తూ దేశాటనం చెయ్యి. అదే ఉత్తమ ప్రాయశ్చిత్తం"

బలరాముడు వల్వలుణ్ని చంపేశాడు. మునులు బలరాముణ్ణి స్తుతించారు. (నిరపరాధిని చంపిన దుష్ట బలరాముణ్ని స్తుతించిన మునులు పరమ మూర్ఖులు.)

బలరాముడు చాలా ప్రదేశాలు తిరిగాడు. కురుపాండవ యుద్ధములో చాలామంది చనిపోయారని విని కురుక్షేత్రం వచ్చాడు.

ఆనాడు భీమసుయోధనుల యుద్ధం—భీముడు బలవంతుడు సుయోధనునికి గదా యుద్ధములో చాలా నైపుణ్యం వుంది. బలరాముడు వాళ్ళిద్దరికీ యుద్ధం చేయవద్దని చెప్పాడు. కాని వాళ్ళు వినలేదు. తర్వాత బలరాముడు ద్వారకకు వెళ్ళిపోయాడు.

* శ్రీకృష్ణునికి కుచేలుడను బ్రాహ్మణ మిత్రుడుండేవాడు. అతడు జితేంద్రియుడు, దరిద్రుడు, బహు కుటుంబీకుడు, ఎవరి దగ్గర ఏమీ తీసుకునేవాడు కాదు. దొరికినదాంతోనే తృప్తిపడేవాడు. ఆ దరిద్రుని భార్య ఓనాడు "కృష్ణుడు మీ చిన్ననాటి మిత్రుడన్నారు కదా! మనం కష్టాల్లో వున్నామని చెప్తే ఏదో ఇంత సహాయం చెయ్యకపోడు, అతని వద్దకు వెళ్ళిరండి" అంది.

"అతనికి ఏదైనా కానుక పట్టుక వెళ్లాలి. ఇంట్లో ఏమైనా వుందో చూడు".

కుచేలుని భార్య ఇల్లంతా తిరిగింది. దోమలు, ఈగలు తమకు పుట్టిన పిల్లలు తప్ప మరేమీ కనిపించలేదు. పొరుగింటికి వెళ్ళి అటుకులు బదులు తెచ్చి బట్టల్లోకట్టి భర్తకిచ్చింది.

కుచేలుడు కృష్ణుని దగ్గరకు వెళ్ళాడు. కృష్ణుడు పానుపు మీది నుండి లేచి (జబ్బు మనిషిలా ఎప్పుడూ పానుపు మీద పడటాడేమిటీయన.) కుచేలుని కెదురు వచ్చి కౌగలించుకున్నాడు. "రుక్మిణీ! ఇతడు నా ప్రియ మిత్రుడు చాలా మంచివాడు. నువ్వు కూడా ఇతణ్ని కౌగలించుకో" అందామనుకొని ఆగిపోయాడు కృష్ణుడు. కృష్ణుడు కుచేలుని పాదాలు కడిగి ఆ మురికి నీరును తలమీద చల్లుకున్నాడు. నోట్లో పోసుకున్నాడు.

"మురికి గుడ్డలతో అసహ్యాంగా వున్న శవంలాంటి ఈ బ్రాహ్మణ్ణి పూజిస్తున్నాడేమిటి కృష్ణుడు" అని అంతఃపుర స్త్రీలు ముక్కుమీద వేలేసుకున్నారు.

కుచేలుడు కృష్ణుడు గురుకులంలో వున్నప్పుడు పడ్డ కష్టాలను జ్ఞప్తికి తెచ్చుకొని బాధగా సంతోషపడ్డారు.

"మిత్రమా! నాకోసం ఏమైనా తెచ్చావా?" అడిగాడు కృష్ణుడు.

తాను తెచ్చిన అటుకులు అందివ్వలేక సిగ్గుతో సంకోచిస్తూ తల వంచుకున్నాడు కుచేలుడు.

కృష్ణుడు కుచేలుని చేతిలోనున్న అటుకుల మూటనులాక్కొని మూట విప్పి పిడికెడు అటుకులు నోట్లో వేసుకున్నాడు.

ఆ మురికి గుడ్డలోని అటుకులు తీసుకొని కృష్టుడు నోట్లో వేసుకోవడం చూచిన రుక్మిణి చప్పున వచ్చి వద్దని వారించింది

మరునాడు కుచేలుడు తన ఇంటికి వచ్చాడు—అప్పటికే కృష్ణుడు కుచేలుని ఇంటికి డబ్బు, నగలు, బట్టలు ధాసీజనాణ్ని పంపాడు. కుచేలునికి తెలియకుండా ఇవన్నీ పంపి కుచేలుణ్ని ఆశ్చర్య

చకితుణ్ని చేయాలని కృష్ణుని అభిలాష—కుచేలుని భార్య క్రొత్త దాసీలతో భర్తకు స్వాగతం చెప్పింది. ఇల్లంతా అందంగా అలంకరింప బడివుంది. ఇది తన ఇల్లేనా అని భ్రమ పడ్డాడు కుచేలుడు. కొన్ని క్షణాలు. "నా చిన్ననాటి దొంగ కొంటె కృష్ణుడు ఎంత అభిమానించాడు నన్ను. దరిద్రుడను, పాపిని నేనెక్కడ. కృష్ణుడెక్కడ" అని విచారంతో సంతోషించాడు కుచేలుడు. (తాను పాపినని కుచేలుడే స్వయంగా చెప్పుకున్నాడు. ఈతడు చేసిన పాపపు పనులేవో మనకు తెలియదు. కాని కృష్ణుడు ఆ పాపిని చంపకుండా సిరిసంపద లిచ్చాడు. దీనికి మన పండితులేమంటారో?)

* సూర్య గ్రహణం వచ్చింది. దేశంలోని చాలా మంది జనులు కురుక్షేత్రం వచ్చారు.

ధనికులు మేనాలలో కూర్చుండి (కాళ్ళు నొయ్యకుండా) కురుక్షేత్రం వెళ్ళారు. (బోయీల కాళ్ళు నొప్పెట్టినా, భుజాలు విరిగినా కవిగారు పట్టించుకోరు. అసమానతలను అంతమొందించడానికి కవిగారు కలం—ఘంటం—పట్టలేదు. అంతరాలను సమర్థించడమే కవిగారి ధ్యేయం.)

కురుక్షేత్రంలో బ్రాహ్మణులకు రాజులు, వైశ్యులు, శూద్రులు, చివరికి బిచ్చగాళ్లు కూడా దానం చేశారు.

వసుదేవుడు, కుంతి తమ బాధలు ఒకరికొకరు చెప్పుకున్నారు.

కృష్ణుని పలుకుబడి చాలా పెరిగిపోయింది కనుక అందరూ కృష్ణుణ్ని పొగిడారు.

దేవకి యశోదను కౌగలించుకొని "నా కృష్ణుణ్ని పెంచిన తల్లివి నువ్వు. నీ రుణం తీర్చుకోలేను" అంటూ ఏడ్చి రుణం తీరిందని ఊర్కుంది.

గోపికలు శ్రీకృష్ణుణ్ని ఏకాంతంగా కలుసుకున్నారు.

కృష్ణుడు గోపికలతో ఇలా అన్నాడు. "గోపికలారా! ప్రేయసుల్ని మిమ్మల్ని వదలి శత్రువులను సంహరిస్తూ వుండవలసి వచ్చింది. నేనెంతో ధనం సంపాదించాను. అయినా ధనసంపాదనే నా లక్ష్యం

కాదు. నేనెంతో మంది స్త్రీలతో తిరిగాను. అయినా మిమ్మల్ని మరచిపోలేదు. నేను కృతఘ్నుణ్ణి కాను చెడ్డవాడను అసలేకాదు. నిజానికి ప్రాణుల సంయోగ వియోగానికి దేవుడే కారణం" (తమ తప్పులను కప్పిపుచ్చుకోవడానికి అందరూ దేవుణ్ణి అడ్డుపెట్టుకొన్నట్టే కృష్ణుడు కూడా దేవుణ్ని అడ్డుపెట్టు కొంటున్నాడు.)

* ద్రౌపది "వదినలారా! మా అన్నయ్య కృష్ణుడు మిమ్మల్నందరినీ ఎలా వివాహం చేసుకున్నాడో చెప్పండి" అంది.

కృష్ణుని ఎనమండుగురు భార్యలు (కాదు బానిసలు) కృష్ణుడు తమను ఎలా వివాహం చేసుకున్నాడో చెప్పారు

* చాలా మంది మునులు రామకృష్ణులను చూడడానికి వచ్చారు. రామకృష్ణులు, ఇంకా అక్కడ వున్న పాండవులు మొదలగువారు లేచి మునులకు నమస్కరించారు.

"అందరికీ ప్రార్థించని మీ దర్శనం మాకు ప్రాప్తించడం మా అదృష్టం" అని మునులను ఆనందపెట్టాడు కృష్ణుడు.

మునులు చిరునవ్వు నవ్వి ఇలా అన్నారు "నువ్వు దేవుడవు. బ్రాహ్మణులను పూజించే నువ్వు ఉత్తముడవు. నీకు మా నమస్కారం" (కృష్ణుడు మునులను పొగడడం---మునులు కృష్ణుణ్ని పొగడడం--- ఇంకేం పనుంది వీళ్లకు.)

వసుదేవుడు మునుల పాదాలు పట్టుకొని నమస్కరించి "ఏ కర్మ చేస్తే కర్మమోక్షం కలుగుతుందో సెలవియ్యండి'' అన్నాడు.

మునులు ''దేవుడే మీ గర్భములో పుట్టాడు. యజ్ఞం చేసి బ్రాహ్మణులకు దానాలు చేసి దేవతల ఋణం తీర్చుకో—మోక్షం లభిస్తుంది'' అన్నారు.

అంగీకరించాడు వసుదేవుడు. మునులు యజ్ఞం చేయించారు.

వసుదేవుడు ఋత్విజులకు వస్త్రాలిచ్చాడు. తర్వాత ఆవులు, భూములు అందకత్తెలయిన కన్యలను ధారపోశాడు. బ్రాహ్మణులకు బిచ్చగాళ్లకు గాడిదలకు, పందులకు, కుక్కలకు, ఈగలకు భోజనాలు పెట్టించాడు.

బంధుమిత్రులు కడుపునిండా మెక్కి యజ్ఞాన్ని మెచ్చుకుంటూ వెళ్ళిపోయారు.

ఓనాడు వసుదేవుడు కృష్ణుణ్ని చూచి "కృష్ణా! నువ్వే దేవుడవని మునులు బ్రాహ్మణులు అంటున్నారు. నాకు కూడా అలాగే అనిపిస్తూ వుంది. నువ్వే భూమివి, నువ్వేగాలివి......నువ్వే అగ్గివి...... నువ్వే కుక్కవు, నువ్వే గాడిదవు......నువ్వే ఈగవు, నువ్వే దోమవు నువ్వే చెట్టువు......నువ్వే గుట్టవు......నువ్వే పాముపు......నువ్వే తేలువు......నువ్వే పెండవు......ఈ సర్వ ప్రపంచమూ నువ్వే" అంటూ చాలా సేపు పొగిడాడు. (సర్వ ప్రపంచమూ దేవుడే అయితే రేగులపాటి కిషన్‌రావు కూడా దేవునిలో కొంత భాగమే. పాఠక మహాశయా! మీరు కూడా దేవునిలో కొంత భాగమే. సింహము, పులి దేవునిలో కొంత భాగమే. మనిషి, ఆవు దేవునిలో కొంత భాగమే ఏనుగు, ఎలుక, గొర్రె, బర్రె, నక్క, కుక్క, నల్లి, బల్లి, దోమ, ఈగ ఈ ప్రపంచములోనున్న ప్రతి ప్రాణి దేవునిలో కొంత భాగమే అవుతుంది. అయినా జంతువుగానీ, పక్షిగానీ కీటకం గానీ మనిషికి హాని చేయ యత్నిస్తే మనిషి దాని మీద తిరుగుబాటు చేస్తాడు. తన్ను తాను రక్షించుకుంటాడు.

ఏనుగు, ఒంటె, గుర్రము, బర్రె, ఆవు మొదలగు జంతువులు మనిషికి మేలు చేస్తే మనిషి వాటికి మేలు చేస్తున్నాడు. ప్రగతి జరుగుతూవుంది

ప్రపంచములోని ప్రతి ప్రాణిని దేవుడే సృష్టించాడన్న భావన. దైవేచ్ఛ ననుసరించే అన్నీ జరుగుతాయన్న భావన మనిషికి వుంది. మనిషి అలా భావించి కూడా పులి తనను చంపడానికి వస్తే దైవేచ్ఛ ననుసరించే పులి తనను చంపడానికి వస్తుందని మనిషి అనుకుంటాడా? అనుకున్నా వూరుకుంటాడా? పులి మీద తిరుగుబాటు చేస్తాడు.

దేవుని దయ లేకపోతే మనిషి బాధలకు గురి అవుతాడన్న భావన మనిషికి వుంది మనిషి అలా భావించి కూడా దోమలు, నల్లులు

తనను కుడుతున్నప్పుడు దేవుని దయలేక పోవడం వల్లనే కుడుతున్నా యని అనుకుంటాడా? అనుకున్నా వూర్కుంటాడా?

వాటిపై దండయాత్ర చేస్తాడు.

పూర్వజన్మ కర్మఫలము ననుసరించే అన్నీ జరుగుతాయన్న భావన మనిషికి వుంది మనిషి అలా భావించి కూడా తాను పండిం చిన ధాన్యం ఎలుకలు తినివేస్తాయని భద్రంగా దాచుకుంటాడు. దాచుకున్న ధాన్యాన్ని ఎలుకలు దోచుకొని తింటే సహించలేడు మనిషి. పూర్వజన్మ కర్మఫలము ననుసరించి ఎలుకలు తన ధాన్యాన్ని దోచుకొని తింటున్నాయని మనిషి అనుకుంటాడా? అను కున్నా వూర్కుంటాడా? ఎలుకలపై దండయాత్ర చేస్తాడు.

సింహము, పులిలాంటి క్రూర జంతువుల మీద; పాము, తేలు లాంటి విషజీవుల మీద; ఎలుక, పంది కొక్కులాంటి క్షుద్ర జీవుల మీద; దోమలు, నల్లుల్లాంటి కీటకాల మీద తిరుగుబాటు చేసే ఓ మనిషీ! నీతోటి మనిషి నీకు అన్యాయం చేస్తుంటే, నీ శ్రమశక్తిని దోచు కొని తింటుంటే సహిస్తున్నావెందుకు? దారిద్ర్యం నీ పూర్వ జన్మ కర్మ ఫలమని వూర్కుంటున్నావెందుకు?

నువ్వు అంబలి తాగుతున్నావు. గంజి, గటుక మింగుతు న్నావు. బలహీనంగా, అభిమానహీనంగా బతుకుతున్నావు అతడు పాలు, పెరుగు తాగుతున్నాడు. పండ్లు, పలు కూరల ఆహారం మింగుతున్నాడు. బలముతో, అధికారబలముతో, ఆర్థిక బలముతో హుందాగా బతుకుతున్నాడు. కారణం ఊహించు, నిజం గ్రహించు. అతడు నీ శ్రమశక్తిని దోచుకొంటున్నాడు. నువ్వు తాటాకుల గుడి సెలో వుంటే అతడు మేడలో నివసించడానికి కారణం ఊహించు నిజం గ్రహించు అతడు నీ శ్రమశక్తిని దోచుకొంటున్నాడు. నీవు నాసిరకం గుడ్డలో చినిగిన గుడ్డలో ధరిస్తున్నావు. అవైనా నీకు చాలినన్ని లేవు. అతనికి రంగు రంగుల దుస్తులు ఖరీదైన అందమైన దుస్తులు శరీరం నిండా, పెట్టెలనిండా వున్నాయి. కారణం ఊహించు నిజం గ్రహించు. అతడు నీ శ్రమశక్తిని దోచుకొంటున్నాడు.

నువ్వు నీ చెయ్యితో, కాలుతో, కన్నుతో, మొండెముతో, శరీరంలోని ప్రతి అంగముతో పని చేయిస్తున్నావు, ఫలితం సాధిస్తున్నావు. అయినా నీ శరీరానికి తగిన ఆహారం దొరకదెందుకు? నీ శరీరంలోని ప్రతి అంగం పని చేస్తున్నది కాని వాటికి ఫలితం దక్కడం లేదు, ఆహారం చిక్కడం లేదు. అందుకే నీవు చిక్కిపోతున్నావు కారణమేమిటి? అతడు నీ శ్రమశక్తిని దోచుకొంటున్నాడు, దాచుకొంటున్నాడు. అతడు నిన్ను జలగలా పీల్చి పిప్పి చేస్తున్నాడు. అతడు నల్లివలె, దోమవలె నీకు పేదరికం అనే రోగం కలుగజేస్తున్నాడు.

దోపిడీకి గురవుతున్న ఓ మనిషీ! లే! దోపిడీదారుల దగ్గర..... తలవంచుకోకు.........సహనాన్ని వహించబోకు దోపిడీదారులను ప్రతిఘటించు. దోపిడీని అంతమొందించు. అప్పుడే నీ కష్టాలు తీరుతాయి. అప్పుడే నీ ఇష్టాలు నెరవేరుతాయి.)

దేవకి "నాయనా! చనిపోయిన మీ పుత్రుణ్ని నువ్వు యమలోకం నుండి తెచ్చావని విన్నాను. కంసుడు చంపివేసిన నీ అన్నలను కూడా నాకు తెచ్చి పెట్టు" అంది.

చచ్చిన వారిని సజీవంగా తిరిగి తేవడం అసాధ్యమని కృష్ణునికి తెలుసు. కాని తల్లికి ఏ మాటా చెప్పకుండా బలిచక్రవర్తి దగ్గరకు వెళ్లాడు.

బలిచక్రవర్తి కృష్ణుణ్ని (ఒక పేజీ నిండా) పొగిడాడు.

కృష్ణుడు "బలిరాజా! స్వాయంభువ మన్వంతరములో మరీచి ప్రజాపతి భార్య ఊర్ణ గర్భములో ఆరుగురు దేవ కుమారులు కలిగారు. బ్రహ్మ తన కూతురు సరస్వతితో సంగమం చెయ్యడం చూచి నవ్వారు వాళ్ళు. వాళ్లను బ్రహ్మ శపించాడు. అసురయోనిలో హిరణ్యకశిపుడి కుమారులుగా వాళ్లు జనిస్తించారు. యోగమాయ వాళ్ళను దేవకి గర్భములో ప్రవేశ పెట్టింది. వాళ్లు పుట్టగానే కంసుడు చంపేశాడు వాళ్ళకోసం మా అమ్మ ఏడుస్తూవుంది వాళ్లు నీ దగ్గర వున్నారిప్పుడు. మా అమ్మ ఏడుపు మాన్పించడానికి వాళ్లను

తీసుకపోవాలి నేను" అన్నాడు. (బలిచక్రవర్తిని నమిస్కరించి బలి దగ్గర వున్న అనాథ బాలురను తీసుకపోవడానికి కృష్ణుడు అల్లిన కట్టు కథ ఇది. కృష్ణుడు చెప్పిన విషయాలను హేతువాదంతో ఆలోచించి నప్పుడు—కవిగారి కల్పనలో వున్న లోపాలు గ్రహించ గలుగుతాం గణవ్యవస్థలో తండ్రీ బిడ్డలకు కామ సంబంధాలుండేవి. జంట పెళ్ళిళ్ళు అమలులోకి వచ్చిన తర్వాత తండ్రీ బిడ్డల కామ సంబంధాలను నిషేధించడం జరిగింది. బ్రహ్మ తన కూతురుతో సంగమం చేస్తుండగా మరీచి కుమారులు నవ్వారు. నలుగురు చూస్తుండగా అందులో కూతురుతో సంగమం చెయ్యడం బ్రహ్మ తప్పే కాని నవ్వినవారిది కాదు. కూతురుతో కామసంబంధాలుండడం తప్పని చెప్పే మనవాళ్ళు బ్రహ్మను పూజిస్తారెందుకు?)

బలిచక్రవర్తి ఆరుగురు అనాథ బాలురను కృష్ణునికి సమర్పించాడు. వాళ్ళను తీసుకవచ్చి దేవకికి చూపించాడు కృష్ణుడు. దేవకి చూస్తుండగానే వాళ్లు దేవలోకం వెళ్ళిపోయారు.

* సుభద్రను దుర్యోధనునకిచ్చి పెళ్ళి చెయ్యాలని బలరాముడు అనుకొంటున్నాడని, తీర్థయాత్రలు చేస్తున్న అర్జునునికి తెలిసింది. సుభద్రను తానే పెళ్లి చేసుకోవాలన్న ఉద్దేశముతో అర్జునుడు మునివేషం వేసుకొని ద్వారకకు వచ్చాడు. అతడు అర్జునుడని తెలియక బలరాముడు ఎంతో ఆదరించాడు. భోజనం పెట్టాడు భోజనం చేస్తుండగా సుభద్రను చూశాడు అర్జునుడు. అర్జునుణ్ని చూచింది. సుభద్ర అంతకుముందే ఒకరిపై ఒకరికి ఏర్పడిన ఇష్టం ఆసమయంలో బలపడింది సుభద్రను ఎత్తుకపోవాలని అనుకున్న అర్జునుడు అవకాశం కోసం ఎదురుచూస్తున్నాడు. ఓనాడు దేవునిదర్శనం కోసం వచ్చింది సుభద్ర. అదే సమయమని శ్రీకృష్ణుని ఇష్టానుసారంగా సుభద్రను అర్జునుడెత్తుకపోయాడు. బలరామునికి కోపం వచ్చింది· శ్రీకృష్ణుడు బలరాముని కాళ్ళుపట్టుకొని బ్రతిమిలాడి నచ్చచెప్పాడు· సుభద్ర తండ్రి సుభద్రకు రథాలు, గుర్రాలు, గాడిదలు, పందులు, కుక్కలు, ఎలుకలు, అరణ మిచ్చిపంపాడు.

* , మిథిలలో బహులాశ్వుడను రాజు, శ్రుత దేవుడను బ్రాహ్మణుడు ఇద్దరూ కృష్ణుడంటే అభిమానం కలవారుండేవారు.

ఒకసారి కృష్ణుడు మిథిలకు వచ్చాడు. కృష్ణునికి ఘనమైన స్వాగతం లభించిందక్కడ.

బహులాశ్వుడు, శ్రుతదేవుడు ఇద్దరూ కృష్ణుణ్ని తమ ఇంటికి రమ్మని ఆహ్వానించారు.

కృష్ణుడు రాగానే బహులాశ్వుడు అతని పాదాలు కడిగి ఆ మురికి నీరును నెత్తిమీద, చెవుల మీద, ముఖం మీద చల్లుకున్నాడు. తర్వాత కానుకలు కూడా ఇచ్చాడు.

కృష్ణుడు తన ఇంటికి రాగానే శ్రుతదేవుడు ఉత్తరీయం ఎగుర వేస్తూ నాట్యం చేశాడు. కృష్ణుని పాదాలు కడిగాడు. ఆ నీళ్ళు తల మీద చల్లుకున్నాడు.

(సంఘాన్ని శాసించే అంతస్థుగల కృష్ణుణ్ని పూజించడం వలన పూజించేవారికి ఎన్నో లాభాలున్నాయి. అందుకే వాళ్ళు కృష్ణుణ్ని దేవుడని పొగడుతారు. కానుకలిస్తారు. అతని దయ సంపాదించడానికి ప్రాకులాడుతారు.)

శ్రుతదేవునితో కృష్ణుడు "సర్వ ప్రాణులలోనూ బ్రాహ్మణుడు ఉత్తముడు. నా చేతులకంటే నాకు బ్రాహ్మణులంటే ఎక్కువ ఇష్టం. బుద్ధిలేని మనుషులు కేవలం విగ్రహాలను ఆరాధిస్తారు. నా స్వరూపులైన బ్రాహ్మణులను తిరస్కరిస్తారు. (ఇక్కడ విగ్రహారాధన చెయ్యకూడదని చెప్పడం కాదు. 'విగ్రహారాధన చేసినా, చెయ్యక పోయినా ఫర్వాలేదు. కాని బ్రాహ్మణ్ని మాత్రం ఆరాధించండి' అని చెప్పడమే.)

* శకుని కుమారుడు వృకాసురుడు. అతడొకనాడు దారిలో కనిపించిన నారదమునిని ఇలా అడిగాడు. "బ్రహ్మ, విష్ణువూ, శివుడూ ఈ ముగ్గురిలో తొందరగా వరమిచ్చే దెవరు?"

"శివుడు" అని చెప్పాడు నారదుడు.

వృకాసురుడు కేదారక్షేత్రం వెళ్ళి అగ్నిని శివుని ముఖంగా

భావించి తన శరీరం కోసి అగ్నిలో వేశాడు. చివరికి తలను గొడ్డలితో నరుక్కోబోయాడు. శివుడు వృకాసురుని వద్దకువచ్చి "ఏం వరం కావాలో కోరుకో" అన్నాడు.

"ఎవరి తల మీద చెయ్యివేస్తే వాళ్లు చచ్చిపోవాలి" వరమడిగాడు వృకాసురుడు.

శివుడు వరమిచ్చాడు

శివుడిచ్చిన వరమును పరీక్షించడానికి శివుని తల మీదే చేయి పెట్టబోయాడు వృకాసురుడు (తెలివికల ఘటమే)

తెలివి తక్కువ శివుడు పారిపోయి విష్ణువుకీ సంగతి చెప్పాడు. తెలివికల విష్ణువు బ్రహ్మచారి వేషం వేసుకొని వృకాసురుని వద్దకు వచ్చి "ఎక్కడి నుండి వస్తున్నావయ్యా, బాగా అలసి పోయినట్టున్నావు అలా కూర్చుండి అలసట తీర్చుకో" అన్నాడు.

వృకాసురుడు కూర్చున్నాడు.

"ఏమిటీ విశేషాలు" అడిగాడు విష్ణువు.

తను తపస్సు చెయ్యడం, శివుడు వరమివ్వడం మొదలగు వివరాలన్నీ వృకాసురుడు విష్ణువుకు చెప్పాడు.

విష్ణువు నవ్వి "శివునికీమధ్యనే పిచ్చిలేచింది. అతని మాటలను మేమిప్పుడు నమ్మడం లేదు. ఇంత గొప్పవాడవు నువ్వు అతని మాటలను ఎలా నమ్మావు? నీ చేతులను తల మీద పెట్టుకో. శివుని మాట అసత్యమని తేలిపోతుంది" అన్నాడు.

వృకాసురుడు విష్ణువు మాటనమ్మి తల మీద చెయ్యి పెట్టుకొని చచ్చిపోయాడు.

(ఈ కథ హేతువాదానికి నిలవదు—వృకాసురుని దుష్టబుద్ధి—శివుని తెలివి తక్కువతనం—విష్ణువు తెలివి తేటలు—శివుని కంటే విష్ణువు గొప్పవాడని తెలుపుట ఇందులోని విషయాలు.)

* సత్రయాగం చెయ్యడం కోసం మునులు సరస్వతీ నది ఒడ్డున సమావేశమయ్యారు పొట్టనిండా తిని కూర్చుండే మునులకు ఓ వెధవాలోచన వచ్చింది. "బ్రహ్మ, విష్ణువూ, శివుడూ ఈ ముగ్గురిలో

ఎవరు గొప్పవారు?" పరీక్షించి నిజం తేల్చుకోవాలనుకున్నారు మునులు.

త్రిమూర్తులను పరీక్షించడం కోసం భృగువును పంపారు మునులు. భృగువు మొట్టమొదట బ్రహ్మ వద్దకు వెళ్ళాడు. ఎప్పుడూ బ్రహ్మకు నమస్కరించే భృగువు ఈసారి నమస్కరించలేదు. బ్రహ్మకు కోపం వచ్చింది కాని అణచుకున్నాడు.

భృగువు శివుని వద్దకు వచ్చాడు. శివుడు సంతోషంతో "రా! సోదరా!" అని కౌగలించుకోబోయాడు. భృగువు కోపంతో "వేద మర్యాద తప్పిన వాడవు నన్ను ఆలింగనం చేసుకోవడానికి తగవు" అన్నాడు. శివునికి కోపం వచ్చింది. త్రిశూలంతో పొడవబోయాడు. భృగువు విష్ణువు వద్దకు పారిపోయి వచ్చాడు. విష్ణువు లక్ష్మి తొడ మీద తల పెట్టి పడుకున్నాడు. భృగువు విష్ణువును కాలితో తన్నాడు. విష్ణువు భృగువుకు నమస్కరించాడు. స్వాగతం చెప్పాడు. అలసట తీర్చుకొమ్మన్నాడు. చివరికి పాదాలు ఒత్తాడు. (ఆ తర్వాత పాదాలు నాకాడేమో)

భృగువు పరీక్ష ముగిసింది. అతడు మునుల వద్దకు వచ్చి జరిగినదంతా చెప్పాడు. ఆ మునులు విష్ణువే గొప్పవాడని తేల్చి చెప్పారు.

(ఈ కథలో బ్రహ్మ తనకు నమస్కరించని భృగువు మీద కోపం తెచ్చుకొని అణచుకొన్నాడు.—నమస్కారాల కోసం వేచి చూచే మూర్ఖుడు బ్రహ్మ.

శివుడు భృగువును ప్రేమతో చూశాడు మొదట. ఇది అతని నిర్మల స్వభావాన్ని తెలియ జేస్తుంది.—"నీ అభిప్రాయాలు, నా అభిప్రాయాలు కలియవు. కనుక మనకు స్నేహం కుదరదు" అన్న అభిప్రాయాన్ని వెలిబుచ్చిన భృగువును చంపబోయాడు కోపిష్ఠి మూర్ఖ శివుడు.

తన్నిన పాదాలకు నమస్కరించిన అభిమానహీనుడు విష్ణు మూర్ఖుడు. ముగ్గురు మూర్ఖులే.

ఈ ముగ్గురు మూర్ఖులను పరీక్షించడానికి వచ్చిన భృగువు మూర్ఖ ప్రముఖుడు.

ద్వారకా పురంలో ఒక బ్రాహ్మణుని 9 మంది కుమారులు పుట్టగానే చచ్చిపోయారు. బ్రాహ్మణుడు ప్రతి పర్యాయం చచ్చిన కుమారుణ్ని రాజద్వారము వద్దకు తెచ్చి "బ్రాహ్మణద్రోహి, లుబ్ధుడూ అయిన రాజు చేసిన కర్మదోషం వల్ల నా పసిపాప చచ్చి పోయాడు.—హింసాపరుడు, దుర్మార్గుడు, అయిన రాజును సేవించే ప్రజలు దరిద్రులవుతారు" అంటూ ఏడ్చాడు.

తొమ్మిదవసారి శవాన్ని తెచ్చి రాజద్వారము వద్ద పడేసి రాజును నిందిస్తూ ఏడ్చినప్పుడు శ్రీకృష్ణుని వద్దనున్న అర్జునుడు విని ఇలా అన్నాడు" ధనం కోసం, భార్యాబిడ్డల కోసం ఏ దేశంలో బ్రాహ్మణులు ఏడుస్తారో ఆ దేశపు క్షత్రియులు క్షత్రియులు కారు" అని "నేను మీ బిడ్డలను రక్షిస్తాను. రక్షించకపోతే అగ్గిలో పడి చస్తాను" అని ప్రతిజ్ఞ చేశాడు ('ఏ దేశములో బ్రాహ్మణులు ఏడుస్తారో ఆదేశపు క్షత్రియులు క్షత్రియులు కాదు, అనడం కవిగారి సంకుచిత దృక్పథానికి నిదర్శనం, 'ఏ దేశంలో కొందరు సుఖాలతో కొందరు కష్టాలతో జీవిస్తారో ఆ దేశపు రాజులు రాజ్యపాలనకు అర్హులు కాదు, అనాలి )

అర్జునుని మాటలువిని బ్రాహ్మణుడు "శ్రీకృష్ణుడే నా బిడ్డలను రక్షించలేక పోయాడు. నీవు మాత్రం ఎలా రక్షిస్తావు" అన్నాడు.

"నేను శ్రీకృష్ణుని వలె అసమర్థుడను కాను. విలు విద్యలో నాకు చాలా నైపుణ్యం వుంది. నా పరాక్రమంతో శివుణ్ని మెప్పించాను. కనుక నీ కుమారులను రక్షిస్తాను" అన్నాడు అర్జునుడు తేవిగా.

బ్రాహ్మణునికి మరో కుమారుడు పుట్టాడు. అర్జునుడా బాలుణ్ని రక్షించడానికి ప్రయత్నం చేశాడు. కాని ఆ బాలుడు ఆకాశం లోకి ఎగిరి పోయాడు.

బ్రాహ్మణుడు అర్జునుణ్ని నిందించాడు.

అర్జునుడు చాలా లోకాలు తిరిగాడు బ్రాహ్మణ పుత్రులు కనిపించలేదు చివరికి అతడు అగ్గిలో దూకబోతుండగా శ్రీకృష్ణుడు అడ్డుకున్నాడు. "బ్రాహ్మణ కుమారులను ఇప్పుడే నీకు చూపిస్తాను. నా వెంటరా" అన్నాడు బ్రహ్మాండమైన ఫోజుపెట్టి.

(బ్రాహ్మణుడు తన కుమారులు చచ్చిన ప్రతిసారీ రాజును నిందించడం బ్రాహ్మణుని బుద్ధితక్కువ తనానికి నిదర్శనం. పుట్టిన బాలుడు ఆకాశంలోకి ఎగిరిపోవడం హేతువాదవిరుద్ధం—చచ్చిపోయిన వారిని రక్షించే శక్తి అర్జునునికి నిజంగానే వున్నట్టయితే చచ్చిన తన తండ్రిని కూడా రక్షించుకునేవాడు. అంటే అర్జునునికా శక్తి లేదన్నమాట. అర్జునుడు అబద్ధాలకోరు.

బ్రాహ్మణ కుమారులను నీకు చూపిస్తానన్నాడు కృష్ణుడు. చివరికి చూపించాడు—కవి అలా వ్రాశాడు—ఇదంతా అసాధ్యం కనుక నేనిక్కడ కొంత మార్చి వ్రాశాను.)

బ్రాహ్మణ కుమారులను బ్రాహ్మణునికి ఇవ్వకపోతే అర్జునుడు నిజంగానే అగ్గిలో దూకి చచ్చిపోతే తన శక్తి కొంత తగ్గిపోతుందని భావించాడు శ్రీకృష్ణుడు. శత్రురాజులను జయించడానికి కృష్ణార్జునులు ఒకరికొకరు ఇన్నాళ్లూ సహాయంగా వున్నారు—శ్రీకృష్ణుడు ఆలోచించి ఆడిన నాటకం—బ్రాహ్మణ కుమారులను చూపిస్తానని శ్రీకృష్ణుడు అర్జునుణ్ని కొన్ని వేల మైళ్ళ దూరం తీసుకపోయాడు. అక్కడవున్న మహాపురుషుని వద్దకు వెళ్ళి కృష్ణుడు నమస్కరించాడు, తర్వాత అర్జునుడు నమస్కరించాడు.

"కృష్ణా! మీ ఇద్దరినీ ఇక్కడకు రప్పించుకోవడానికే బ్రాహ్మణ కుమారులను నా దగ్గరకు రప్పించుకున్నాను. అర్జునుడు బ్రాహ్మణునకిచ్చిన మాటేమిటో మాకు తెలుసు. ఈ బాలురను (బాలురను చూపిస్తూ) వాళ్ళ తల్లితండ్రులకు చూపించి తిరిగి పంపించండి" అన్నాడు.

"తిరిగి పంపించడమెందుకు?" అన్నాడు అర్జునుడు కృష్ణునితో

మెల్లగా.

"ఆ దేవదేవుడు చెప్పినట్లు చెయ్యాలి. ఎదురు ప్రశ్నించ కూడదు" అన్నాడు కృష్ణుడు.

అర్జునుడా బాలురను బ్రాహ్మణునికి అప్పగించాడు.

నాలుగు దినములు బ్రాహ్మణ దంపతులు ఆ పిల్లలను తమ పిల్లలేనని చాలా సంతోషించారు. తర్వాత కృష్ణుడు రహస్యంగా ఆ పిల్లలను ఆ మహాపురుషుని వద్దకు పంపించాడు

* శ్రీకృష్ణుడు తోటిరాజులపై దౌర్జన్యంచేసి సంపాదించిన ధనంతో అన్ని రకాల సౌఖ్యాలు అనుభవించేవాడు. అందమైన మేడలుండేవాయనకు, అందమైన భార్యలతో ఆమేడలలో సుఖిస్తూ వుండేవాడాయన. అందమైన ఉద్యాన వనాలుండేవాయనకు, బంగారు పాత్రలుండే వాయనకు, అతని కొడుకులకు విద్యనేర్పడానికి చాలా మంది ఉపాధ్యాయులుండేవారు.

అతని వద్ద చాలామంది సేవకులుండేవారు. వంటచేసేవారు, ఇల్లు ఊడ్చేవారు, స్నానం చేయించేవారు, ముఖం కడిగేవారు, కాళ్ళు ఒత్తేవారు, అన్నం తినిపించేవారు......ఇలా చాలా మంది అతని వద్ద బానిస బ్రతుకులు బ్రతుకుతూ వుండేవారు.

బ్రాహ్మణులు, మునులు అతణ్ని పొగడుతూ వుండేవారు. కృష్ణుడు బ్రాహ్మణ క్షేమం కోసం పక్షపాత బుద్ధితో చట్టాలు తయారు చేయించేవాడు. బ్రాహ్మణుల క్షేమంకోసం పాటుబడుతూ వుండేవాడు, రాజ్యవిస్తరణ కాంక్షతో, ధనదాహంతో రాజులను, ఆ రాజులను కాపాడే వీరులను దారుణంగా అణచివేశాడు. ఎదిరించిన వారిని సంహరించాడు

శ్రీకృష్ణుని దయ సంపాదించినవారు అన్నిరకాల సుఖాలు స్వేచ్ఛగా అనుభవించేవారు.

సంఘములో అధికృతగల బ్రాహ్మణుల దయ సంపాదించడానికి కృష్ణుడు వారి పాదాలు కడిగేవాడు. ఆ పాదాలు కడిగిన మురికి నీరును తలమీద చల్లుకునేవాడు, నోట్లో పోసుకునేవాడు.

బ్రాహ్మణులు, బ్రాహ్మణేతరులు కృష్ణుని దయ సంపాదించి ఏదైనా ఇంత సంపాదించుకొందామని కృష్ణుని పాదాలు కడిగేవారు. ఆయన వద్ద భక్తి ప్రదర్శించేవారు.

* కృష్ణుడు తన సుఖం కోసం దైత్యులను వధించాడు. కౌరవ పాండవులకు కలహం కల్పించాడు. పాండవులచేత కౌరవులను చంపించాడు. సైనికుల సహాయంతో అనేక మంది రాజులను చంపివేశాడు.

యాదవులలో తనకు ఎదురు తిరిగేవారిని కూడా చంపించడానికి కృష్ణుడు ఆలోచిస్తున్నాడు.

(కవిగారి పైత్య:— "కృష్ణుని అనుమతి మీద మహామునులు కొందరు పిండారక క్షేత్రానికి వెళ్ళారు కృష్ణుని కుమారుడు సాంబుడు ఆడవేషం వేసుకొని మునుల దగ్గరకు వచ్చాడు.

"ఈ పడుచుపిల్ల కడుపుతోవుంది—ఆడపిల్ల పుడుతుందా? మగ పిల్లాడు పుడుతాడా? చెప్పండి" అని మునులను అడిగారు కొంటె పిల్లలు.

యాదవ బాలుర పరిహాసానికి మండిపడిన మునులు "మీ కులం నాశనం చేసే ముసలం కంటుందిమె" అన్నారు.

యాదవ కుమారులు భయపడి కడుపుకు చుట్టిన గుడ్డలు విప్పారు. ఇనుప ముసలం కనబడిందందులో పిల్లలు ముసలం ఉగ్రసేన రాజుకిచ్చారు. ఉగ్రసేనుడు ఆ ముసలాన్ని పిండి చేయించి సముద్రములో పారబోయించాడు. ఓ ఇనుప ముక్కను చేప మ్రింగింది. నీటిలో కలసిన ముసలమే తుంగ గడ్డిగా తయారైంది. ఇనుప ముక్కను మ్రింగిన చేపను జాలారి పట్టాడు. అతడు చేప కడుపులో దొరికిన ఇనుప ముక్కను బాణానికి మొనగా చేసి పెట్టుకున్నాడు"—ఇదే బాణం కృష్ణుని ప్రాణం తీస్తుందేమో )

* కృష్ణావతారం తర్వాత దేవుడు బుద్ధావతారం ఎత్తాడట. బుద్ధుడు యజ్ఞాలు చేయకూడదన్నాడు: వేదవిరుద్ధంగా తర్కించాడు. అయినా బుద్ధుడు చాలా పలుకుబడిగల వ్యక్తి కనుక తమకు నచ్చని

విషయాలు చెప్పిరనూ సామాన్య మానవులను మోహపరచుటకు బుద్ధుడలా చెప్పాడని పండితులు వాదించి బుద్ధుణ్ని తమ వైపు లాక్కుంటారు. అనగా బుద్ధుని సిద్ధాంతాలు నమ్మిన వారందరినీ తమ వైపు లాక్కోవాలని ప్రయత్నిస్తారు. కొన్నాళ్ళ క్రిందట సామాన్య మానవుడైన బుద్ధుణ్ని దేవునిగా భావిస్తున్నారు. ఇంకా కొన్నాళ్ళకు గాంధీ దేవుడని, నెహ్రూ దేవుడనికూడా రాస్తారేమో? పలుకుబడిగల వ్యక్తులే దేవుళ్లా ఏమిటి?

దేవుడు కలియుగంలో కలికావతారమెత్తి శూద్ర రాజులను చంపేస్తాడు. (శూద్ర రాజులారా! భాగవతాన్ని ఆరాధ్యగ్రంథంగా భావిస్తున్నారా మీరు? శూద్రులంటే అనాది కవులలో చాలా మందికి చిన్న చూపే వున్నట్టుంది—ఏ వర్ణము వాడైతేనేమి. ఏ కులం వాడైతేన్నేమి పరిపాలన న్యాయ దృష్టితో జరిపే వాడు కావాలి. అసలు ఈ వర్ణాలు, కులాలు ఏమిటి? మానవ కల్పితాలు. మానవుల మధ్య అంతరాలు సృష్టించే వర్ణాలు కులాలు వుండకూడదు )

* "బ్రాహ్మణులకు, క్షత్రియులకు, వైశ్యులకు వేదాధ్యయనం చెయ్యడానికి పుట్టుకతోనే అధికారముంది శూద్రులకాఅధికారం లేదు."అని రాశారు కవిగారు. (బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య వర్గాల వారికి హానికలిగించేనీతులు వేదాలలో లేవు. వారికి అక్రమ లాభం చేకూర్చేవే వున్నాయి. కనుక పుట్టుకతోనే వేదాలు చదివే అవకాశముందని కవిగారు సెలవిచ్చారు. శూద్రులు వేదాలు చదివితే అందులో తమను అణచి వేసే నీతుల రహస్యం తెలుసుకుంటే వారు వేదాలను, వేదాలను సమర్థించే వారిని ప్రతిఘటిస్తారు కనుక శూద్రులు వేదాలు చదువకూడదని కవిగారు సెలవిచ్చారు.)

శ్రీహరికి అనుకూలంగా లేనివారు కష్టాలకు గురిఅవుతారు. (రేగులపాటి కిషన్‌రావూ! నిన్ను కవిగారెలా బెదిరిస్తున్నారో గ్రహించావా! హేతువాదులు కవిగారి మాటలకు బెదరరని కవిగారికి తెలియదు.)

శ్రీకృష్ణుని వద్దకు బ్రహ్మ, శివుడు, దేవేంద్రుడు ఇంకా

అనేక మంది వచ్చి అతనిని పొగిడారు. బ్రహ్మ అన్నాడు "నువ్వు పుట్టి 125 సంవత్సరాలైంది. ఇక వైకుంఠానికిరా"

"యాదవులందరినీ నాశనం చేసి నీ భవనానికి వస్తాను" అని బ్రహ్మకు చెప్పాడు కృష్ణుడు.

ఉద్ధవుడు కృష్ణునితో "యాదవులను నాశనం చేసి ఇక్కడ నుండి వెళ్ళిపోతావా?" అన్నాడు.

శ్రీకృష్ణుడు "అవును. యాదవులను సంహరించి వైకుంఠం వెళ్ళదలచాను" అన్నాడు,

ఉద్ధవుని కొకచోట కృష్ణుడిలాచెప్పాడు. అనుక్షణం ఏడ్వడం, అప్పుడప్పుడు నవ్వడం, సిగ్గు విడిచి పాడడం, ఒళ్లు మరిచి నాట్యం చేయడం చేసే నా భక్తులు విశ్వమంతా పావనం చేస్తారు" (అనుక్షణం ఎవడేడుస్తాడు? ఎవ్వడూ ఏడ్వడు. భరించరాని కష్టాలున్న వాడు అప్పుడప్పుడు ఏడుస్తాడేమో! కృష్ణ భక్తులారా! మీ దేవుడు చెప్పినట్టు పనులన్నీ మానుకొని అనుక్షణం ఏడుస్తారా? అప్పుడు మీ దేవునికి మీరు చాలా నచ్చుతారనుకుంటాను. కృష్ణునికి పిచ్చిలేచి ఇవన్నీ చెప్పాడని అంటారా?)

"ఆత్మవంతుడైన పురుషుడు, స్త్రీల సాంగత్యమూ, స్త్రీలను ప్రేమించేవారి సాంగత్యమూ మానుకోవాలి" అన్నాడు కృష్ణుడు ఒకచోట (అనేక మంది స్త్రీలతో తిరిగే ఈ జారుడు, కామాంధుడు ఉద్ధవునితో ఇలా చెప్తున్నాడేమిటి? ఈ వెధవ కృష్ణునికి నిజంగానే మతి చలించిందా ఏమిటి ?)

అవంతిలో ఒక బ్రాహ్మణుడుండేవాడు. అతడు వ్యవసాయం వర్తకమూ చేసి డబ్బు కూడబెట్టాడు. ఆ డబ్బును అతడు తన ఆలు బిడ్డలకు వినియోగించేవాడు కాదు. తన కొఱకు వినియోగించుకునే వాడు కాదు.

ఇతని వద్ద చాలా డబ్బుందని దేవతలకు తెలిసింది. వారా ధనాన్ని రహస్యంగా ఎత్తుకపోయారు. బ్రాహ్మణుడు బీద వాడయ్యాడు. అప్పుడికతని శక్తి సన్నగిల్లింది. పనిచేసే శక్తిలేక అడుక్క

తినసాగాడు. డబ్బున్నప్పుడు ఎవరికీ సహకరించని బ్రాహ్మణుడంటే అందరికీ అయిష్టంగానే వుండేది. భిక్షానికి వస్తే తిట్టేవారు, కొట్టేవారు, హేళన చేసేవారు. (కష్టాలలో వున్నవారికి సహకరిస్తే, తాను కష్టాలలో వున్నప్పుడు ఇతరులు సహకరిస్తారు—అవసరానికి మించిన డబ్బు సంపాదించి కూడబెట్టడం వలన అనేక అనర్థాలు జరుగుతాయి. కవిగారు కల్పించిన ఈ కథలోని నీతి చాలా బాగుంది ఏమాట కామాటే చెప్పుకోవాలి మరి.)

* కృష్ణుడు ఉద్ధవుని కిలాచెప్తున్నాడు.

ఊర్వశి పురూరవుణ్ని వదిలి వెళ్ళిపోయింది. పురూరవునికి అప్పుడు పిచ్చెక్కింది. అతడు "ఆగు ఊర్వశీ! ఆగు ఊర్వశీ!" అంటూ కేకలు వేశాడు.

ఊర్వశిని కౌగలించుకున్నందుకు, ఆమె పెదవులు నాకినందుకు పశ్చాత్తాపపడ్డాడు. "మలమూత్రాల పెంటకొంప ఈ శరీరం" అని తన శరీరాన్ని చూచుకొని అసహ్యపడ్డాడు. (అయినా తన శరీరాన్ని ఏ పెంటకుప్ప మీదనో పారవేయలేక పోయాడు)

"బుద్ధిమంతుడు ఆడవాళ్ళతో సంబంధం పెట్టుకోకూడదు, ఆడవాళ్ల దాసులైన వాళ్లతో స్నేహం చెయ్యకూడదు, స్త్రీలను గూర్చి ప్రసంగించ కూడదు" అనుకున్నాడు పురూరవుడు (అదంతా ఊర్వశి వెళ్ళిపోయిందని బాధ తప్పితే మరేమీ కాదు.)

"బుద్ధిమంతుడైనవాడు పరస్త్రీలతో తిరుగ కూడదు. తిరిగినా పురూరవుని వలె పశ్చాత్తాప పడి మానుకోవాలి" (శ్రీకృష్ణుడు అనేక మంది సానులతో తిరిగిన విషయం మరిచిపోయి మాట్లాడుతున్నాడా?)

* శ్రీకృష్ణుడు ఉద్ధవునికిలా చెప్తున్నాడు.

"దొంగనూ, దొరనూ, అహింసా పరుణ్ని, క్రూరుణ్ని సమానంగా చూచేవాడే జ్ఞానవంతుడు" (ఒక వ్యక్తి లేదా కొందరు వ్యక్తులు దొంగలుగా తయారు కావడానికి కారణాలు తెలుసుకొని దొంగలు లేకుండా సమాజాన్ని సంస్కరించుకోవాలి. అంతే కాని

దొంగనూ దొరనూ సమానంగా చూచినవాడే జ్ఞానవంతుడని చెప్పడమేమిటి?)

"కుక్కకు, ఆవుకు, గాడిదకు నమస్కరించాలి" (అనేక దుర్గుణాలుగల కృష్ణునికి నమస్కరించడం కంటే కుక్కకు, గాడిదకు, నల్లికి, బల్లికి నమస్కరించడమే ఉత్తమమేమో—అయినా నమస్కరించడం అనేది ఎందుకు?)

"కృష్ణా! నీకు నా నమస్కారం, నీ పాదాలు నాకే అదృష్టం నాకు కల్పించు" అన్నాడు ఉద్ధవుడు శ్రీకృష్ణుడు చెప్పిన చెత్తంతా విన్న తర్వాత.

"నువ్వు బదరికాశ్రమం వెళ్లిపో—గంగలో దూకు, పాపాలు పోగొట్టుకో—చాలా గొప్పవాణ్ని నేను. నాఅంతటి వాడు ఈ లోకంలో లేడు—నన్ను పొందడానికే తపన పడు" అంటూ చెప్పాడు కృష్ణుడు.

ఉద్ధవుడు శ్రీకృష్ణుని పాదాల మీద పడి ఆనందంగా ఏడ్చాడు. తర్వాత కృష్ణుని అనుమతి స్వీకరించి బదరికాశ్రమానికి వెళ్ళిపోయాడు. (పాపాత్ములకు దేవుడు కనబడడంటారే—శ్రీకృష్ణుడు దేవుడని నమ్మేవాళ్లకు ఒక ప్రశ్న—కృష్ణ దేవుడే స్వయంగా ఉద్ధవునితో 'పాపాలు పోగొట్టుకో' అని చెప్తున్నాడంటే—పాపం చేసిన వాళ్ళకు కూడా దేవుడు కనబడుతాడనే కదా అర్థం ఉద్ధవుడు పాపిష్టివాడు అని కదా అర్థం.

ఉద్ధవుడు బదరికాశ్రమానికి వెళ్ళి అచ్చట కొన్నాళ్ళు గడిపి మామూలుగా చచ్చిపోయాడు.

* శ్రీకృష్ణుడు "యాదవులారా! ద్వారకలో ఉత్పాతాలు కనిపిస్తున్నాయి. మన కులానికి అరిష్టం కలిగించే బ్రాహ్మణ శాపం వుంది. మనమంతా ప్రభాస క్షేత్రానికి వెళ్ళిపోదాం. అక్కడ నదిలో స్నానం చేసి, బ్రాహ్మణులను పూజించి ధన కనక వస్తు వాహనాలు వారికి సమర్పించి......ఈ విధి సర్వారిష్టాలూ నాశనం చేస్తుంది" అన్నాడు.

యాదవులు సముద్రం దాటి రథాలెక్కి ప్రభాస తీర్థానికి చేరారు. శ్రీకృష్ణుడు చెప్పినట్లు చేశారు. దైవం వారి బుద్ధిని పెడదారిన పెట్టాడు. వాళ్ళు కల్లు తాగి తమ వద్దనున్న ఆయుధాలతో కొట్టుకొని చచ్చారు. ఆయుధాలు విరిగి పోయిన తర్వాత చావకుండా మిగిలినవాళ్ళు సముద్రపు ఒడ్డున బలసిన తుంగగడ్డిని పెరికి ఒకరినొకరు బాదుకొని చచ్చారు. తుంగతో కొట్టుకోవద్దని కృష్ణుడు చెప్పినా వాళ్ళు వినలేదు.

బలరాముడు యోగమవలంభించి చచ్చిపోయాడు. అది చూచిన కృష్ణుడు రావిచెట్టు క్రింద పడిపోయాడు.

అడవిజంతువులను చంపి తిని బ్రతికే వేటగాడు శ్రీకృష్ణుని పాదాన్ని లేడిగా భ్రమించి బాణం వేశాడు. మరుక్షణమే రావి చెట్టు క్రిందికి పరుగెత్తి వచ్చి కృష్ణుణ్ని చూచి భయంతో వణికి పోయాడు. "కృష్ణా! తెలియక మహాపరాధం చేశాను. క్షమించు ప్రభూ" అన్నాడు. కాని వేటగాడు కూడా చచ్చిపోయాడు.

శ్రీకృష్ణుణ్ని వెతుక్కుంటూ అతని సారథి దారుకుడు వచ్చాడు. కృష్ణుణ్ని ఆస్థితిలో చూచి ఏడ్చాడు.

'నా అనంతరం ఈ ప్రాంతాన్ని సముద్రము ముంచేస్తుంది మా అమ్మను, నాన్నను ఇంకా అంతఃపుర స్త్రీలనూ ధనాణ్ని పట్టుకొని అర్జునుని వద్దకు వెళ్ళిపొమ్మను" అన్నాడు, కృష్ణుడు.

దారుకుడు వెళ్ళిపోయాడు,

శ్రీకృష్ణుడు చచ్చిపోయాడని తెలియగానే శివుడు, బ్రహ్మ ఇంద్రుడు మొదలగు వారంతా కృష్ణుని శవం వద్దకు వచ్చి వెళ్ళి పోయారు

దారుకుడు ద్వారక చేరి శ్రీకృష్ణుడు మొదలుకొని యాదవులందరూ చచ్చిపోయిన వివరాలు అంతఃపుర స్త్రీలకు తెలిపాడు.

అంతఃపుర స్త్రీలు కొందరు కట్టెలతో పెద్ద చితి పేర్చుకొని ఒక్కసారిగా అందులోపడి కాలి బూడిదై పోయారు.

ద్వారకానగరంలోని స్త్రీలు ఎంతో మంది భర్తల చితులలో

పడి చచ్చిపోయారు.

సముద్రం ఉప్పొంగింది. ద్వారకానగరం మునిగిపోయింది. శ్రీకృష్ణుని అంతఃపురం ఎత్తు ప్రదేశములో వుండడం వలన సముద్రము ఉప్పొంగినను మునగలేదు.

మంటల్లో పడి చచ్చిపోగా మిగిలిన అంతఃపుర స్త్రీలను అర్జునుడు ఇంద్రప్రస్థం తీసుక పోయాడు.

పాండవులు పరీక్షిత్తుకు రాజ్యమప్పగించి హిమాలయాలకు వెళ్లిపోయారు.

(బ్రా)హ్మణులు శపిస్తే చచ్చిపోతామన్న భయం కృష్ణునికి వుందా? కృష్ణుడు ప్రభాస క్షేత్రానికి తన తల్లి దండ్రులను, భార్యలను ఎందుకు తీసుకపోలేదు? తన అంతఃపురం సముద్ర మట్టానికి ఎత్తుగా వుండడం వలన అంతఃపుర వాసులు చావరనా? లేక సముద్రం ఉప్పొంగ నున్నదని కృష్ణునికి తెలియదా? లేక తనకు రక్త సంబంధం లేని యాదవులను దూర ప్రదేశాలకు తీసుక వెళ్ళి చంపి రావడానికి ఎత్తువేశాడా?

శ్రీకృష్ణుడు తన మాయతో యాదవులను చంపాడని కవి వాదన. ఇదొక దొంగమాట కల్లు త్రాగి ఒళ్లు మరిచి ఒకరి నొకరు చంపుకున్నారన్నదే సత్యం.

అసలు రహస్యం :— కృష్ణునికి బ్రాహ్మణ శాపం మీద కొంత నమ్మకం వుంది. దానికి తోడు సముద్రం ఉప్పొంగి ద్వారకా నగరాన్ని ముంచేసే సూచనలు కనిపించాయి. అతని అంతఃపురం ఎత్తు ప్రదేశములో వుంది. అతడు తన భార్యలు, ముసలి తల్లి దండ్రులు అంతఃపురములో భద్రంగా వుంటారని భావించాడు. ఒక వేళ సముద్రం ఎక్కువగా వుప్పొంగి అంతఃపురములోకి నీళ్ళు వచ్చి ముసలివాళ్లు చచ్చిపోతే చచ్చిపోనీ అనుకున్నాడు. ముసలాళ్ళను ముసలితనంలో పోషించే బాధ్యత కూడా తప్పిపోతుందను కున్నాడు. అందుకే వాళ్ళను తన వెంట తీసుక పోలేదు ఇక అంతఃపుర స్త్రీల విషయం— వాళ్లు ఎన్నడూ పరపురుషులను చూడలేదు. ఇన్నాళ్ళూ

వాళ్లను అంతఃపురంలో బంధించి వుంచాడు. వేలమంది స్త్రీలతో అతడు సంభోగించలేదు. వారిని బయటకు తీసుక వస్తే ఇష్టమున్న పురుషులతో వెళ్ళిపోతారు అది అతనికి ఇష్టంలేదు అందుకే వాళ్లను కూడా తన వెంట తీసుః పోలేదు. సముద్రము పొంగి వాళ్ళు చచ్చి పోతే మళ్ళీ పొరుగురాజులను జయించి రాజకుమార్తెలను తెచ్చి వివాహం చేసుకోవచ్చు.........కుమారులను మాత్రం తన వెంట తీసుకపోయాడు. ప్రభాస తీర్థం వెళ్లి నదిలో స్నానం చేసి బ్రాహ్మణులకు దానం చేస్తే అరిష్టాలు తొలగిపోతాయని చాలా మంది బ్రాహ్మణులు చెప్పగా విని నమ్మాడు.

యాదవులు కల్లు త్రాగారు మాటల మధ్య కలహం ప్రారంభమైంది. ఆయుధాలు విరిగి పోయాయి. కొందరు అప్పటికే చచ్చి పోయారు. మిగిలినవారు సముద్రపు ఒడ్డున వున్న తుంగను పీకి ఒకరినొకరు కొట్టుకొంటుండగా కృష్ణుడు వద్దని వారించాడు వారు వినలేదు. కొట్టుకొని చివరికి చచ్చిపోయారు. అది చూచి బలరాముడు ఆత్మహత్య చేసుకున్నాడు. అంతమంది చావు చూడగానే కృష్ణునికి కళ్లు తిరిగి రావిచెట్టు క్రింద పడిపోయాడు. వేటగాడు కృష్ణుని పాదాన్ని లేడి అని భ్రమపడి బాణం వేశాడు. వెంటనే రావిచెట్టు క్రిందికి పరుగెత్తి వచ్చాడు కిరీటం ధరించివున్న కృష్ణుణ్ని చూచి రాజును చంపానే అని భయపడి క్షమాపణ కోరాడు. కృష్ణుడు కోపం ఆపుకోలేక తన పాదములో దిగివున్న బాణపు ముల్లును లాగి వేటగానిపైకి విసిరాడు. వేటగాడు చచ్చాడు. (వేటగాడు స్వర్గం వెళ్ళాడని కవి వ్రాశాడు.) కృష్ణుణ్ని వెదకుతూ దారుకుడు వచ్చాడు చావడానికి సిద్ధంగా వున్న కృష్ణుణ్ని చూచి దారుకుడు ఏడ్చాడు. నా అంతఃపుర స్త్రీలను అర్జునుని వద్దకు పంపుమని కృష్ణుడు దారుకునికి చెప్పాడు.

(శ్రీకృష్ణుని అంతఃపుర స్త్రీలు అగ్నిలో దూకి చనిపోయారు)

* 'కలికాలంలో రాజులు దోపిడీ దార్లవుతారు. కలియుగంలో బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు అందరూ శూద్రులే

అవుతారు' అంటూ ఇలా కలికాలంలో జరిగేవి ఇవి అని చాలా యుక్తిగా చాలామంది కవులు చాలా విషయాలు వ్రాశారు. (జరిగి పోయిన విషయాలనే వ్రాశారు.)

రేగులపాటి కిషన్‌రావు భాగవతాన్ని ఇలా విమర్శిస్తూ వ్రాస్తా డని మాత్రం ఏకటీ వ్రాయలేదు.

* సంబల గ్రామంలో విష్ణుయశుడను బ్రాహ్మణుడు వుం టాడు. అతని ఇంట్లో శ్రీహరి కల్కి అయి జనిస్తాడు.

కల్కి గుర్రం మీద కూర్చుండి కత్తిపట్టుకొని ప్రపంచమంతా తిరిగి రాజ వేషధారులైన అనేక మంది దోపిడీదారులను తెగనరుకు తాడు. కల్కిని చూచి ప్రజలు తమ పాపాలు పోగొట్టుకుంటారు.

శ్రీకృష్ణుడు చచ్చిననాడు కలియుగం మొదలైంది. కలి ప్రవేశించడం వల్ల మనుషుల మనస్సు పాపాసక్తమయింది.

( కృష్ణుడు చావగానే కలిప్రవేశించిందట. అందువల్లనే మను షులు పాపాలు చేస్తున్నారట. అయితే అది కల్కి తప్పుగానీ మను షుల తప్పుకాదన్నమాట. శ్రీకృష్ణుని కాలంలో కల్కి లేదుకదా! మరి అప్పుడు కూడా మనుషులు పాపాలు చేశారే—సమాజంలో దోపిడీ విధానం వున్నంత కాలం మనుషులు పాపాలు చేయడం వుంటుంది. ఒకరినొకరు కొట్టుక చావడం వుంటుంది—పెట్టుబడి దారీ వ్యవస్థలో ప్రజలు అనేక కష్టాలు అనుభవించి చివరికి పెట్టుబడి దారులపై తిరుగుబాటు చేస్తారు. పెట్టుబడి దారీ విధానాన్ని కూల దోస్తారు. సమసమాజం నిర్మించుకొని సుఖపడుతారు – కల్కి గుర్రం మీదో గాడిద మీదో ఎక్కి వచ్చి రాజులను చంపే ప్రసక్తే వుండదు.)

* శ్రీశుకుడు పరీక్షిత్తుకిలా చెప్పాడు. "నేనే పరబ్రహ్మం. పరబ్రహ్మం నేనే, అంటూ మననం చెయ్యి. తక్షకుడు వచ్చి కాటు వేసినా నీకు బాధకలుగదు"

పరీక్షిత్తు శ్రీశుకునికి నమస్కరించి అన్నాడు. "తక్షకుడు వచ్చి కాటువేసినా భయపడను. అనుజ్ఞ ఇవ్వండి చస్తాను"

శ్రీశుకుడు వెళ్ళిపోయాడు.

తక్షకుడు వచ్చి పరీక్షిత్తును కాటువేశాడు.

పరీక్షిత్తు చచ్చి పోయాడు.

తండ్రి పాము కాటుకు చచ్చాడని విని జనమేజయుడు సర్ప యాగం ప్రారంభించాడు. పాములు అగ్నిలో పడి చావడం చూశాడు తక్షకుడు. వెంటనే అతడు ఇంద్రుణ్ని శరణు వేడాడు.

"తక్షకుడు చావడానికి రాడేం" అని అడిగాడు జనమేజయుడు.

"తక్షకుడు దేవేంద్రుని శరణువేడాడు అందువల్ల మా వెధవ మంత్రాలు పని చేయడం లేదు" అన్నారు బ్రాహ్మణులు.

"అయితే దేవేంద్రునితో సహా తక్షకుణ్ని అగ్నిగుండం లోకి ఆహ్వానించండి" అన్నాడు జనమేజయుడు

బ్రాహ్మణులు మంత్రాలు ఊది ఆహ్వానించారు. దేవ గురువు బృహస్పతి సర్పయాగం మానుకొమ్మని జనమేజయుణ్ని బ్రతిమిలాడాడు. జనమేజయుడు యాగం మానేశాడు. (తన తండ్రిని చంపింది తక్షకుడైతే జనమేజయుడు ఏ అపరాధం చెయ్యని అనేక పాములను చంపాడు. పలుకుబడి లేని పాములను ఎన్నింటినో చంపగా చూచికూడా బృహస్పతి మౌనం వహించాడు. కాని పలుకు బడిగల తక్షకుణ్ని చంపబూనుకుంటే వద్దని బ్రతిమిలాడాడు.—జనమే జయుడు ఎంత మూర్ఖుడో దేవగురువు అంత మూర్ఖుడు. నిరపరాధు లను చంపే జనమేజయుని లాంటి మూర్ఖ రాజులు, అపరాధులను చంప వద్దని చెప్పే బృహస్పతి లాంటి మూర్ఖ గురువులున్న ఏ సమాజ మైనా, దేశమైనా బాగుపడడం అబద్ధం)

* మృకండముని కుమారుడు మార్కండేయుడు. అతడొక సారి తపస్సు చేస్తుండగా చూచి ఇంద్రుడు భయపడ్డాడు. తన కింక రులైన అప్సరసలను, గంధర్వులను, మన్మధుణ్ని, వసంతుణ్ని, వాయువును దండయాత్రకు పంపాడు. వారు మార్కండేయుణ్ని ముట్టడించారు. కాని అతణ్ని జయించ లేక పోయారు.

మార్కండేయుని ఎదుట దేవ వేశ్య పుంజికస్థలి చీర విప్పి

స్తనాలు ఎగిరేస్తూ ఎగిరింది. మార్కండేయుడు కళ్లు తెరవలేదు. ఆ వేశ్యను చూడలేదు.

నరనారాయణులు మార్కండేయుని వద్దకు వచ్చారు. "ఏం వరం కావాలో కోరుకో" అన్నారు.

మార్కండేయుడు వరం అడిగాడు. నరనారాయణులు నవ్వి వెళ్ళిపోయారు



హఠాత్తుగా పెద్ద తుఫాన్ వచ్చింది. మార్కండేయుడు భయపడ్డాడు. సముద్రము పొంగింది. మార్కండేయుడు ఎక్కడికి వెళ్లినా నీరే కనిపించింది. తిమింగలాలు, మొసళ్లు అతణ్ని మ్రింగబోయాయి. గాలి, కెరటాలు, వర్షం వీటన్నిటి వల్ల మార్కండేయుడు చాలా బాధపడ్డాడు. తెలివి తప్పి పడిపోయాడు. ఇలా కోటి సంవత్సరాలు గడిచాయి (అని కవి వ్రాశాడు.)



ఓనాడు మార్కండేయునికి నేల కనిపించింది. మర్రిచెట్టు కొమ్మమీద చిన్న బాలుడు కనిపించాడు. (ఏ తల్లి కన్నదో ఆ బాలుణ్ణి? మర్రిచెట్టు కొమ్మకు బాలుణ్ని కట్టి ఆ స్త్రీ చచ్చిపోయిందా?) మార్కండేయుడు బాలుని వద్దకు వెళ్ళాడు. ("ఆ బాలుడు మార్కండేయుణ్ని మ్రింగాడు. అక్కడ విశ్వమంతా వుంది. మార్కండేయుడు కడుపులో నుండి బయటకు వచ్చాడు" అని కవి వ్రాశాడు.) తర్వాత భగవంతుణ్ని శరణు వేడాడు.

శివపార్వతులు మార్కండేయుని వద్దకు వచ్చారు. మార్కండేయుడు శివపార్వతులకు మొక్కాడు.



శివుడు "ఏం వరం కావాలి?" అని అడిగాడు.

"భగవద్భక్తుల మీద చలించని భక్తి నా హృదయంలో ఎల్లప్పుడూ వుండేట్టు వరం ప్రసాదించు" అన్నాడు మార్కండేయుడు. (మార్కండేయునికీ కానిస బుద్ధి ఎందుకో?)

మార్కండేయుడు ఈనాడు కూడా వున్నాడు. (ఎక్కడ వున్నాడు కవిగారూ?)

* భాగవత విషసర్పం చదివితే అజ్ఞానం తొలగిపోతుంది. ఉచితానుచితాలు తెలుసుకోగలుగుతారు. దోపిడీ విధానాన్ని అంత మొందించడానికి పూనుకుంటారు.

రేగులపాటి కిషన్‌రావు వ్రాసిన భాగవత విషసర్పం సర్వం సమాప్తం.

—⊙—

# ఈ పుస్తకం వ్రాయడం కోసం నేను చదివిన పుస్తకాలు

శ్రీమద్భాగవతం (3భాగాలు—12 స్కంధాలు) పురిపండా అప్పలస్వామి వ్యాసుని సంస్కృత భాగవతానికి సరైన తెలుగు అనువాదం.

పబ్లిషర్స్ : కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్స్-రాజమండ్రి

గోరాసాహిత్యం:—

దొరుకుచోటు : నాస్తిక కేంద్రం, పటమట, విజయవాడ-6

1. నాస్తికత్వం
2. ప్రజాస్వామ్యం పెరగాలంటే నాస్తికత్వం రావాలి.
3. సృష్టి రహస్యం
4. నేను నాస్తికుణ్ణి
5. దేవుని పుట్టు పూర్వోత్తరాలు
6. మూఢనమ్మకాలు-నాస్తికదృష్టి

రంగనాయకమ్మ సాహిత్యం :—

దొరుకుచోటు : అరుణా పబ్లిషింగ్ హౌస్, విజయవాడ-2

1. నాస్తికత్వం-ఒక పరిశీలన
2. రామాయణ విషవృక్షం-1వ భాగం.

ఏంగెల్స్ రచన :

కుటుంబము, వ్యక్తిగతఆస్తి, రాజ్యాంగాల పుట్టుక.

దొరుకుచోటు : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, విజయవాడ-2

ప్రగతి ప్రచురణాలయం : మాస్కో-వారివి

1. మార్క్స్ ఏంగెల్స్ లెనిన్-కమ్యూనిస్టు సమాజం గురించి
2. వి. ఐ. లెనిన్-సాహిత్యం మీద వ్యాసాలు.

మీ అభిప్రాయాలు

ఈ క్రింది అడ్రసుకు వ్రాసిపంపండి.

రేగులపాటి కిషన్‌రావు

" కవితా నిలయం. ".

చింతల్‌ఠాణం-505 302

కరీంనగర్ జిల్లా